

ఓం శ్రీ విశ్వనాథాయ నమః

# అంకితము.

తే॥ ఈశసుతుఁడైన దుంఠి విఘ్నేశుఁ గొలిచి
సాక్షిగణపతి సద్భక్తి సంస్మరించి
పార్వతీపతి మత్కృతి పతిగఁ జేసి
యఖిలలోకంబు లానంద మందుఁ దేల.

సీ॥ సర్వతీర్థాళిపై సార్వభౌమ పదంబు
కాశికాపురికిచ్చి కాచె నెవఁడొ
అఖిలలోకాధీశుఁడయ్యు సంతసముతో
పులితోలు మొలజుట్టి పొలచు నెవఁడొ
కస్తూరి కుంకుమాగరు గంధముల మాని
భూతిని నొడలెల్లఁ బూయు నెవఁడొ
శరణన్నమాత్రనే సకలాఘములఁ బాపి
భక్తులదయఁగను ప్రభు వెవండొ.

గీ॥ అట్టి కాశివిశ్వేశ్వరు నాజ్ఞచేత
నల "సహస్రయోగ" కృతిని నాంధ్రభాష
ననువదింపగఁ బూనితి నాంధ్రులెల్ల
రాయురారోగ్య భాగ్యంబు లనుభవింప.

సీ॥ త్రిపురుల నొకకోలఁ ద్రెళ్ళించి లీలమైఁ
గఱకు రక్కసిమూకఁ గాలరాచె
ఘనఘోర గంభీర కలశాబ్ధివిష మెల్ల
మృత్యుంజయుండయి మ్రింగివైచె

దివిజవాహినిఁజూచి దిగులొంద నీకేల
పడఁమని తలపైనిఁ బాదుకొల్పె
తనకున్న పెన్నిధు ల్దన భక్తుఁకొసంగి
ప్రియమునఁ గాశిని బిచ్చమెత్తె.

గీ॥ సకలలోక చరాచర జంతుకోటి
శాంతిమేదుర సత్కటాక్షాంచలమున
గాంచి రక్షించు సకలలోకాధినేత
మాకృతిస్వామియై మమ్ము మనుచుగాక.



మా తండ్రిగారు.　　మా తల్లిగారు.

గీ॥ శబ్ద మర్థమ్మునట్లు సంసక్తులైన
పార్వతీ పరమేశులవలె వెలుంగు
తల్లిదండ్రుల నధిక వాత్సల్యధనుల
మంగమను సంగమేశ్వరు మదిఁదలంతు. ౪

శ్లో॥ శ్రీ భరద్వాజ గోత్రీయః । శ్రీరంగం సంగమేశ్వరః
మంగాంబికా ప్రాణనాథః । ధీమాన్ వైద్యవిశారదః

శ్లో॥ యస్య నామైవ పర్యాప్తం । మహారోగ నివారణే
నువస్తం జనకంపూజ్యం । సంగమేశ్వర శాస్త్రిణం.

శ్లో॥ కుర్వ స్సహస్రయోగస్య । వ్యాఖ్యామాంధ్ర్యాం కృతశ్రమౌ
సుబ్బరాయ రామమూర్త్యా । వాం మంగా సంగమేశజౌ.

---

# తొలి పలుకు

ఆయుర్వేదము వేదాంగములలో నొకటి. అథర్వణ వేదాంతర్గతమై యున్నది. బ్రహ్మనుండి అశ్వినీ దేవతలు, వారినుండి ఇంద్రుడు, ఆయనకు శిష్యుడైన భరద్వాజుడు ఈ విద్యనభ్యసించిరనియు, లోక శ్రేయోభిలాషులై ఈ వైద్యమును వ్యాపింప చేసిరనియు పురాణము లలో చెప్పబడినది ఈ భరద్వాజ మహాఋషి ఆత్రేయాది ఋషి మండలికి ఉపదేశకుడయ్యెను. ఆత్రేయ, అగ్నివేశ, భేళ, హారీత, క్షారపాణి మహా మునీంద్రులు, క్షీరసముద్రమథన జనితులైన ధన్వంతరి, చరక సుశ్రుతాదులు కాలానుగతముగ పరిశోధనలు గావించి ఆయుర్వేదమును అత్యంతముగ వృద్ధిచేసినారు. ఔషధ చికిత్సా విధానము శస్త్ర చికిత్సా విధానము, ఈ రెండును ఈ మహాపురుషుల తపస్సై ఆయుర్వేదము ఉత్తమోత్తమ ఖ్యాతిని గడించి వేల సంవత్సరములు ఈ జాతి యొక్క ఆరోగ్యమును, వీర్యమును కాపాడినది. అంతేకాక ఇచ్చటినుండి ఈజిప్టుకును పిమ్మట అరబు దేశములకును, అరబు దేశములనుండి యూరపు ఖండమునకు వ్యాపించినది. గాని మన దేశములో ఆంగ్ల రాజ్య స్థాపనమైనప్పటి నుండి ఆంగ్లేయ ప్రభువులు తమ పరిపాలనా విధానములో భారతీయ సంస్కృతిని, దేశ భాషలను అణచివైచి ఆంగ్ల సంస్కృతిని, ఆంగ్ల భాషను దేశములో వ్యాపింప చేసినారు. అవ్విధముగనే ఆంగ్లవైద్య విధానమును సర్వతోముఖముగ దేశములో అభివృద్ధి చేసినకొలదియు ఆయుర్వేదము అభివృద్ధి కాకుండ నానాటికి హీనస్థితిలోనికి వచ్చినది. ఐనను దానియొక్క నిజమైన శక్తివల్లనే నిప్పటికిని గ్రామ గ్రామము లలో గృహవైద్యముగ కొంతవరకైనను నిలచి యున్నది. ఈ జాతీయ వైద్యమును పునరుద్ధరించుటకు ఇటీవలి కాలములో కొన్ని ప్రయత్నములు జరుగుచున్నవి. దేశములో స్వతంత్రమేర్పడిన తరువాత దీనిని బాగుగ పునరుద్ధరించుట జాతీయ ప్రభుత్వముల యొక్కయు, ప్రజల యొక్కయు విద్యుక్తధర్మమై యున్నది. ఇంతవరకు మన జాతీయ ప్రభుత్వములు ఆయుర్వేద పునరుద్ధరణకై తగినంత శ్రద్ధ చూపలేదని చెప్పుటకు విచారమగుచున్నది. ఆయుర్వేద విద్యాభ్యాసముగావించి చికిత్సానుభవము కలిగి, పేరుప్రతిష్ఠలు కలిగిన ఆయుర్వేద ప్రతిభాశాలురు దేశమందు అచ్చటచ్చట ప్రఖ్యాతవంతులై యున్నందుకు గర్వపడవలసి యున్నది. ఇట్టి విద్యా పారంగతులు, స్వానుభవజ్ఞులు, వంశానుగత

శిక్షితులు, ప్రభుత్వముతోబాటు పునరుద్ధరణ కార్యక్రమమునందు నిరంతరకృషి సలుపుటకవసరము. బహు శాస్త్ర గ్రంథ రూపమైన యీ విద్యను వివిధ రాష్ట్రములలో వివిధరీతుల స్వానుభవ ప్రయోగ ములతో నలరారుచున్న ఆధునిక వైద్య పరిజ్ఞానముతో సమన్వయింప జేసి ప్రజాసామాన్యమంతలో ప్రచారమగునట్టి కృషి సల్పుట వైద్య ప్రముఖుల కర్తవ్యము. ఇందులకు తేట తెనుగున చికిత్సావిధానమును గురించి, మందులను గురించి, మూలికలను గురించి, పుస్తకములను వ్రాసి ఆంధ్ర ప్రజానీకమున కందించుట వైద్య విద్వాంసుల ప్రథమధర్మము.

ఈ ధర్మ నిర్వహణకే శ్రీ శ్రీరంగం సుబ్బారావు సోదరులు పూను కొనుట ప్రశంసనీయము. శ్రీ సుబ్బారావు సోదరులు సంస్కృతాంధ్ర ఆంగ్లేయ భాషలలో ప్రశంసనీయమగు పరిచయము కలవారు. వీరు సికింద్రాబాదులో ఆంగ్లేయ ఉన్నత పాఠశాలలలో నుపాధ్యాయులుగా నుండి వానిని విసర్జించి అనువంశీకమగు ఆయుర్వేదమును వృత్తిగ పరిగ్రహించిన వారు. కీర్తిశే. శ్రీ రంగం సంగమేశ్వర శాస్త్రిగారు వీరి తండ్రిగారు. వీరును ఆంగ్లేయోన్నత పాఠశాలలో ప్రధానోపా ధ్యాయులుగ పనిచేసియు, ఆయుర్వేదమందు వీరికిగల ఆగాధాభిమాన ములచే బెజవాడలో శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాలలో నుపా ధ్యాయులుగ బనిచేసిరి. ఆ కాలముననే శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారి పరి చయ భాగ్యము నాకుకలిగినది. తండ్రిగారి మార్గముననే వారి కుమారు లగు శ్రీ సుబ్బారావు సోదరులిరువురు ఆయుర్వేద వృత్తిని స్వీకరించి విఖ్యాతవంతముగ ప్రజాసేవ చేయుచుండుట ప్రశంసనీయము. సికిందా్రబాదు యందు వీరుచిత ధర్మ వైద్యశాలను నిర్వహించుచున్నారు. ఈ ధర్మ వైద్యశాల ప్రభుత్వాదరణను కూడ పొందుచున్నది. ఇట్టి శాస్త్రజ్ఞులు అనుభవజ్ఞులు అగు వీరు సంస్కృత భాషలో మళయాళ లిపియందున్న "సహస్రయోగ" మను వైద్య గ్రంథమును "సహస్ర యోగ ప్రకాశిక" యను పేరున తెనిగించి కృతకృత్యులై ధన్యులైరి.

పుస్తక రచన యందెన్నియో ప్రతిబంధకములు గలవని అందరికిని తెలిసిన విషయమే. ఒక భాషలోనున్న పుస్తకమును మరియొక భాష లోనికి తర్జుమా చేయుటలో గల కష్ట నిష్ఠూరములపారములు. అందు ముఖ్యముగ నాయుర్వేదమువంటి శాస్త్ర గ్రంథమును తర్జుమా చేయుట కష్టతమమే. శాస్త్ర గ్రంథములను వ్రాయుటలో మూలమునకు సరి

యగు పారిభాషిక శబ్దముల నన్వేషించుటలో గల శ్రమ గ్రంథకర్తలకే తెలియును. ఈ శ్రమ ఆయుర్వేదమున మరింత హెచ్చు. సంస్కృతమున ఒకే మూలికకు, ఒకే వస్తువునకు వివిధ పర్యాయ పదము లున్నవి. వివిధ రాష్ట్రములలో నాయారాష్ట్ర భాషల ననుసరించి పేర్లున్నవి. ఆయా పేర్లనన్నిటిని పరిగ్రహించి వానిని సమన్వయించుకొని ఆ పేరుగల నిజమగు వస్తువును గుర్తించి దాని ప్రయోగోప యోగముల వ్రాయవలసి యున్న కష్ట మనుపమానమనుట నిశ్చయము. ఈ విషయ పరిగ్రహణము నందు తీర్ణులు కాగలవారు, వివిధ రాష్ట్ర భాషలతో బరిచయము కల వారుగా నుండుట తప్పనిసరి. శ్రీ సుబ్బారావు సోదరులు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషలలో గల పరిచయముతో బాటు, వంగ, ఓఢ్ర, హిందీ, ఉర్దూ, కర్నాటక, మళయాళ భాషలలో గూడ విశేష పరిచయము గలవారు. ఇట్లు వివిధ రాష్ట్ర భాషా పరిచయ సంపన్నులగుటవలననే మణిప్రవాళ శైలిలో కొన్ని తావుల కేవలము సంస్కృతము, సంస్కృతము మలయాళము కలిపి కొన్ని తావుల వ్రాయబడిన సహస్రయోగ గ్రంథమును తెనిగింప గలిగిరి. వీరి తర్జుమా తేట తెనుగున నున్నది. ఈ సహస్రయోగ పుస్తకమున వీరికి లభించిన యోగములు 322. ఇది 18 అధ్యాయముల గ్రంథము. 969 శ్లోకములు కలది. ఈ శ్లోకము లన్నియు మొదటినుండి తుదివరకు యెల్లరకర్థమగునటుల వ్రాసిరి. ఇది గాక యితర రాష్ట్ర భాషలలో గల అనవారిష్ట యోగములను కూడ వీరీ పుస్తకమున చేర్చిరి. ఇది ఆంధ్రలోకమునకు చాలా యుపయుక్తము కాగలదని విశ్వసించుచున్నాను. మరియు నిది ఆయుర్వేదవైద్యు లాదర ణాభిమానమును చూరగొనకలదని ఆశించుచున్నాను.

ఇట్లే శ్రీ సుబ్బారావు సోదరులు తమ ఆయుర్వేద విద్యాప్రావీణ్యతను, అనుభవమును దేశసేవాపరతంత్రులై వివిధ పుస్తకరూపమున గూడ ఆంధ్రులను సేవించుటకు భగవానుడు వీరికి ఆయురారోగ్యములు ప్రసాదించుగాక!

నాగార్జున విహార్,
హైదరాబాదు.
12—7—1959

అయ్యదేవర కాళేశ్వరరావు.
( ఆంధ్రప్రదేశ్ శాసనసభాధ్యక్షులు )

# పండితాభిప్రాయములు

# OPINIONS OF PANDITS

Ayurveda presents hundreds of recipes under each disease in the line of 'वहुकल्प बहुगुणं सम्पन्नं योग्य मौषधम्' The students and practitioners of Ayurveda are alike baffled when they go through the books vast collections of Ayurvedic recipes. Only long clinical observations and investigations will enable one to ascertain their actual indications and clinical values. But Sahasrayogam is a small collection of clinically proved Ayurvedic yogas by years of experience of the noble tradition of Ayurvedic master minds of Malabar. Some of the yogas are selections of Vagbhata while others are original contributions to Ayurveda. While some yogas are in Sanskrit, many are written in Malayalam the language of the land. Hence it has been published only in Malayalam script, though "Dharakalpam" was partly published in Nagari script by the efforts taken by the late lamented Jadavji Tricumji Acharya.

Vaidya Sri Subba Rao and his brother have done a commendable service by translating this book into Telugu language I have gone through the pages of their translation with interest. To my mind, they have spared no pains in doing justice to their chosen work. Language has its own limitations in giving accurate expression of one's own ideas. It is even more so when one takes himself to translation. The translators' sound knowledge of Ayurveda and long experience as Ayurvedic Physicians together with their knowledge of Sanskrit and various Indian languages have enabled them to achieve appreciable success in their attempt. They deserve to be congratulated in bringing out this translation of Sahasrayogam, i. e. Sahasra yoga prakasika.

I am sure that their book will be of great assistance to the Vaidyas and Ayurvedic students of Andhra Pradesh.

**C. K. DIVAKARAN, M. A.**

**6—9—59.**

**Principal Government Ayurvedic College, Hyderabad.**

"బహుకల్పం-బహుగుణం సంపన్నం యోగ్యమౌషధమ్" అనునది ఆయుర్వేదసూక్తి. ఈ సూక్తి ననుసరించియే ప్రతిరోగమునకును ఆయుర్వేదమున వందలకొలంది ఔషధయోగములు కలవు. ఆయుర్వేద విద్యార్థులు, వైద్యులుకూడ యీ బహుళయోగావళి గ్రంథములను చదువునప్పుడు నిర్విణ్ణులగుచుందురు. రోగపరీక్షలుకల దీర్ఘానుభవమును పరిశోధనలను మాత్రమే ఆయా యోగ ప్రయోగముల ఉపయోగములను నిర్ణయించగలవు. రోగపరీక్షానుభవ ఫలితములను నిరూపించగలవు.

కాని "ఈ సహస్రయోగము" మలయాళదేశమందలి వంశపరంపరానుగత ఆయుర్వేద వైద్యశిఖామణుల బహుసంవత్సర కాలానుభవ ఫలితములననుసరించి నిర్దేశింపబడిన కొన్ని యోగముల సంపుటి. ఇందలి కొన్ని యోగములు వాగ్భటమునుండి సంగ్రహింపబడినవి. మరికొన్ని యోగములు స్వీయానుభవముల ననుసరించి ఆయుర్వేద వైద్యవిధానమునకు సమకూర్చబడినవి. ఈ యోగములలో కొన్ని సంస్కృతమున వ్రాయబడినవి. విశేషముగా స్వీయరాష్ట్రభాషయగు మలయాళమున లిఖింపబడినవి. ఈ కారణమున యీ సహస్రయోగ గ్రంథము మలయాళ లిపిలో కలదు. ఇందలి ధారాకల్పము కొంతమాత్రము కీ. శే. యాదవజీ త్రికంజీ ఆచార్యవర్యుల ప్రయత్నఫలితముగ సంస్కృత లిపియందు ముద్రింపబడినది.

శ్రీ సుబ్బారావు సోదరులు ఈ పుస్తకమును తెనిగించి ఆయుర్వేదమున కపారసేవచేసిరి. వీరి యీ తర్జుమా గ్రంథమునెంతో ఆప్యాయముతో చదివితిని. వీరు సంకల్పించిన ఈ కృషిని అత్యంత శ్రద్ధా భక్తులతో నిర్వహించిరి.

ఏ భాషకైనను కొన్ని హద్దులుకలవు. సరియగు భావప్రకటనకు కొన్ని ప్రతిబంధకములును గలవు. ఒక భాషనుండి మరొకభాషకు యేవిషయమైనను తర్జుమాచేయుటయందీ కష్టమినుమడించును. వీరికి ఆయుర్వేదమందుగల చిరకాలానుభవము, వీరి సంస్కృతభాషా పరిజ్ఞానము, వివిధ రాష్ట్రభాషలలోగల పరిచయము తోడ్పడుటచే వీరీ పుస్తకరచనయందు కృతకృత్యులైరి. ఇందులకు వా రభివందనీయులు.

ఈ సహస్రయోగ ప్రకాశిక ఆయుర్వేద విద్యార్థులకును, వైద్యులకును గూడ చాల ఉపయుక్తముగ నుండగలదని విశ్వసించుచున్నాను.

(Sd) సి. కె. దివాకరన్, ఎం. ఎ.

Principal, Govt. Ayurvedic College, Hyderabad.

ఆంధ్రీకరణము.

---

౧

నం. ౨.

శ్రీ శ్రీరంగం సుబ్బారావుగారు నాకు పరమమిత్రులు. ఆంధ్ర ఆంగ్ల, సంస్కృతభాషలలో వీరు పండితులు. అరవము, మలయాళము, ఓఢ్రము-వంగము-హిందీ-ఉరుదు మొదలగు వివిధభాషా పరిచితులు- విద్వద్వైద్యులు. అనుభవవైద్యులు. సర్వతోముఖ సామరధ్యముగల వీరు వ్రాసిన “సహస్రయోగ ప్రకాశిక”కు నా స్వాగతము. దీని నామూలాగ్రముగఁ జదివితిని. ఆనందించితిని. ఎన్నడో-లోకశ్రేయముకై, దైవదత్తమైన - ఆయుర్వేద పునరుద్ధరణకు వీరు పూనుట ప్రశంసా పాత్రము. ఎందఱెందఱో - ఎంతెంతకాలమో, యోగీశ్వరుల పరిశోధనా ఫలితముగ నుత్తమ పరిణావీస్థలకాకరమైనది - విఖ్యాతివంతమైనది. కాలకర్మవశమున, పరపరిపాలనాఫలితముగ పసచెడినది, రూపారినది - నేటికిని చిరంజీవిగా నున్నను, పునరుద్ధరణ మపేక్షించుచున్నది.

ఇట్టి పునరుద్ధరణమునకు, భారతావని యందలి, వివిధ రాష్ట్ర భాషలలో గల వైద్యగ్రంధము లన్నియు ఏకోన్ముఖముగ సమన్వయ పరచుట అత్యవసరము వివిధప్రదేశములలో, ఆచరణయందున్న, అనేక విధ చికిత్సావిధానము లన్నియు ప్రచారముచేయుట ప్రధానకర్తవ్యము. ఈ అవసరమునే సహస్రయోగ ప్రకాశిక దీర్చుచున్నది. సంస్కృత వైద్యగ్రంధములలో లేని, మహాయోగము లెన్నియో, యీ సహస్ర యోగావళి గ్రంధమున, మణిప్రవాళ భాషయందున్నవి. పుస్తకమునం దుండుటయేకాదు. మలయాళ దేశమునందీ యోగములు, చికిత్సావిధానమున నిత్యముపయోగింప బడుచున్నవి. సంస్కృత భాషయందుకాని, మణిప్రవాళభాషలో వ్రాయబడిన యోగములన్నియు, మలయాళ దేశమునందలి ప్రత్యేక యోగములే. ఇవి ఆంధ్రావనియందు లేవని వైద్యుల నిర్ణయము. ఆయా ప్రాంతములలో ఉత్తమ పురుషులు, తమ

తమ స్వీయానుభవములతో, నూతన యోగముల నన్వేషించి, ఆచరణ యందుంచుట, ఆంధ్రులకు నూతన విషయముకాదు. సువర్ణ సూత్యావర్తి, వంటబాల సూర్యోదయము, మాదీఫల రసాయనము మొదలగు యోగము లాంధ్రులకు ప్రత్యేకములు. ఇవి ఆంధ్రుల అనుభవయోగములు. ఆంధ్రమున మాత్రమే ప్రచారమున నున్నవి. సనాతన వైద్య గ్రంథములలోనివికావు. ఇట్లే యితర రాష్ట్రములయందు గూడ, ప్రత్యేకానుభవ యోగములున్నవి. అందుకే గ్రంథమే ప్రబల తార్కాణము. కేరళ దేశమందలి ప్రత్యేకయోగము లమోఘములను ప్రతీతి నేటికిని గలదు. ఆచరణయోగ్యములు అత్యంత సులభసాధ్యములు. ఆంధ్రులకు నూతనములు నగు యోగము లెన్నియో, యీ సహస్ర యోగ ప్రకాశిక యందున్నవి. ధారాకల్పము, ఆరవారిష్ట యోగముల క్రోడీకరణము, యిందలి అనుబంధములు. ఇవి మిక్కిలియుపయుక్తములు.

ఆంధ్రులకందుబాటుగాని, మణిప్రవాళ భాషయందున్న యీ సహస్ర యోగ గ్రంథము నాంధ్రీకరించి, ఆంధ్రులచేతి కందిచ్చిన శ్రీ సుబ్బారావు సోదరులు ధన్యజీవులు. తర్జుమాగూడ సులభముగను, సరళముగను, సరిగను ఉన్నది.

ఆంధ్రవైద్యలోకమీ గ్రంథమందలి యోగముల నాచరణయందుంచి, ప్రజోపయోగ మొనరింతురుగాక! తమకృషిని విజయవంతముగ కొనసాగింపగలిగిన శ్రీ సుబ్బారావు సోదరులకు నా అభినందనములు. శ్రీ భద్రాచల సీతారాముడీ సోదరుల కాయురారోగ్య ఐశ్వర్యముల ప్రసాదించుగాక! ఈ సోదరు లిట్టి యుత్తమ గ్రంథము లనేకములు వ్రాసి, ప్రచురించి, ఆయుర్వేద పునరుద్ధరణమునకు దోహద మొసంగునట్లు సర్వేశ్వరు డనుగ్రహించుగాత!

ఆత్మకూరి గోవిందాచార్యులు,

మకాం॥ ఖయిరతాబాదు,

హైదరాబాదు, 13–1–60.

# PREFACE.

"Ayurveda" or "The Science of Life" was first brought into this mundane world and expounded by the Rishis of yore for ameliorating the sufferings of humanity. Long long ago, a congregation of Rishis, munis and Sages was held on the heights of the sacred Himalayas and Bharadwaja, the Veteran saint was deputed by the sages to approach Indra, the Lord of Heaven, with a view to know the Science of Life i. e., "Ayurveda". In due response to this, Bharadwaja flew to the celestial world and received inculcation on Ayurveda from Lord Indra and returned to this earth. The Rishis received him cordially and learnt "Ayurveda". Of these, Atreya and Punarvasu, who were the pioneers for propagation of this science, in their turn taught this to Agnivesa, Bhela, Ksharapani, Hareetha and others., who in their turn wrote various treatises on this ancient science. In due course, Charaka who was also a Rishi and a Physician, compiled a book known as "Charaka Samhita". Sushruta, another Rishi and a surgeon, belonging to the Dhanwantari school of medicinc compiled a book called "Sushruta Samhita". As years rolled on, eminent and erudite scholars like Vagbhata were born and wrote various treatises basing on the ancient works on medicine. Of these "Sahasra Yoga" is one. The name of the author of this book and his nativity are unknown. This unknown author, though quotes Atreya here and there in his work-one can deduce from his writings that his treatise is based on "Astanga Hridaya" and "Astanga Sangraha". This work which also advocates the five processes for eliminating the morbidity from the human system has been preserved in Kerala up till now, for which the physiciens of Kerala are to be congratulated.

It will be interesting to note that the eminent physicians of Kerala have founded some hospitals, where patients ailing from difficult maladies are being cured even today, and this fact is known to one and

many. The physicians of Malabar adopt the old five methods of expelling the morbidity from the human body of which "Dhara Kalpam" or dripping oils on the various parts of the body through a funnel-like vessel, medicinal fomentation and medicated poultices are of importance.

## DHARA KALPAM APPENDIX.

Dhara Kalpam as mentioned above is a part and parcel of the "Pancha Karmas" or the five processes, especially of the process for sweating. This is otherwise called "Parisheka Sweda". Again, this is divided into "Abhyanga", "Parisheka", 'Pichu' and Sirovasti', which are more and more effective in their descending order. In presenting this work to the suffering humanity and the brother physicians of Andhra Pradesh, I left no stone unturned in seeking the help of some Malayalee friends.

In addition to this, last year during my sojourn at Benares, I had an intuition to write a commentary on "Sahasrayoga" and to spread this static old Science which is in vogue in Malabar, among the Andhras also. In conclusion, I appeal to my brother physicians to advocate the five processes of elimination along with other treatments, with a view to redress the sufferings of the ailing masses. I shall be grateful to those who will be good enough to point out the errors of omission and commission which will be rectified in the next edition. It may not be out of place if I were to say that I have supplemented some recipes viz. "Arishtas" and Asavas", from various old books.

Lastly I am highly indebted to Sri Sridhar Bhat of Benares, Vyakarana Siromani Sri Parayatham Krishnamurthi Sastri, and Kavi Siromani Sri Chivukula Appayya Sastri (Author of Garga-Bhagavatham) and others for their kind support in presenting this book. In conclusion I owe my thanks to Padmabhushana, Andhra Bhishma, Desa Bandhu Honourable Sri Ayyadevara Kaleswararao B. A., B. L. Speaker Andhra

Pradesh Legislative Assembly and author of Books on United States of America, chinese national movement, Lessons on upanishads, Autobiography etc, Ayurveda Siromani, Ayurveda Vachaspathi C. K. Divakaran, M. A., Principal, Government Ayurvedic College, Hyderabad and Sri A. Govindacharyulu, Ex-M. L. C., and Author of Govinda Ramayana, Economics of Bharath, National History of Bharath, Biography on Gandhiji's life etc for hoving given their valuable opinions on my book and also I express my gratitude to Sri Pabba Sankarayya. Proprietor, Sri Rama Power Press Secunderabad for having taken keen interest in publishing this book.

Secunderabad.
28th February 1960.

S. Subbarao,
Regd. Ayurvedic Medical
Practitioner.

---

# ఉపోద్ఘాతము.

శ్రీమంతంబగు భారతభూమి అత్యంత పవిత్రమైనది. దక్షిణ భాగము భోగభూమియును, ఉత్తరము జ్ఞానభూమియును, పశ్చిమము త్యాగభూమియును, మఱియు మధ్యభాగము కర్మభూమియునై యలరారు చున్నది. అనాదినుండియు ఉత్తరమున పూర్వాపరసముద్రములకు, మధ్యనున్న భూమికి మహోన్నతములైన హిమవత్పర్వతములు మానదండము వలె నుండి జగత్ప్రసిద్ధము గాంచినవి. అట్టి హిమాలయములందు ముల్లోకములను బవిత్రము చేయు గంగానదియు, మఱియు తదితర పుణ్యనదులు బుట్టి అచ్చటినుండి సమతల ప్రదేశములలో సర్వదా ప్రవహించుచు చుట్టుప్రక్కలనున్న భూమిని ఫలవంతముగాను, మఱియు సస్యశ్యామల సమృద్ధిగాను జేయుచుండును. లోకకల్యాణమూర్తియైన పరమశివుని కైలాసమిచటకలదు. దేవతలు మఱియు గంధర్వాదులు నిత్యము విహారించుభూమి యిదియే. వేయేల ? తపోనిష్ఠాగరిష్ఠులగు ఋషులు, యోగులు పవిత్రములగు ఆశ్రమములు, మఱియు నాశ్చర్యకరములగు ఓషధులచే విశిష్టతగాంచినది. ఇందుచేతనే యీదేశము వసుమతి, రత్నగర్భము, ఆర్యావర్తము; కర్మభూమి; మఱియు పుణ్యభూమి అనెడు నామములతో గీర్తింపబడుచున్నది.

ఇట్టి పవిత్రలక్షణ లక్షితంబైన యీ భారతదేశ మందనేక మహాత్ములు జన్మించి మానవాభ్యుదయమునకును, లోకకల్యాణమునకును, మఱియు నైహికాముష్మిక సుఖములను సాధించుటకును, అఖండ వేద వేదాంగముల నవతరింపజేసిరి. అట్టి వేదములలో నంతర్భూతమైనదీ యాయుర్వేదము. తొలుత బ్రహ్మచే స్మరింపబడి, పిదప వరుసగా ప్రజాపతి, అశ్వినీదేవతలు, మఱియు ఇంద్రునిచే దెలుసుకొనబడిన యీ యాయుర్వేదమును, భూలోకమం దవతరింపజేయుటకు గాను ఋషులందరిచే భరద్వాజుడు ఇంద్రలోకమునకు పనుపబడెను. ఇంద్రునిచే నాయుర్వేదమును సంపూర్ణముగా దెలుసుకొని తిరిగివచ్చి ఋషిమండలికి బోధించెను. వారిలో ముఖ్యులగు ఆత్రేయులు, వారిశిష్యులైన పునర్వసులు అగ్నివేశ, భేళ,క్షారపాణి, హారీతాదుల కుపదేశింప వారు ప్రత్యేక తంత్రములను రచియించిరి. వీనిలో అగ్నివేశసంహిత నాధారముగ జేసికొని

చరకులోక సంహితను రచించిరి. ఇది యిట్లుండ ధన్వంతరి గురుకులమునకు చెందిన సుశ్రుతులు శారీరశాస్త్రమునకు హెచ్చు ప్రాముఖ్యము నిచ్చుచు సుశ్రుతసంహిత యనే గ్రంథమును వ్రాసిరి. పిదప వాగ్భటాది మహాపురుషులు జన్మించి పై గ్రంథముల నాధారముగ జేసికొని వివిధ తంత్రములను లిఖించిరి. ఈ తంత్రములు దేశదేశాంతరములకు వ్యాపించి యీ భారతావనికి అఖండకీర్తిని సంపాదించినవి. పిమ్మట అనేక వైద్య విద్వాంసులు పుట్టి వివిధములగు గ్రంథములను వ్రాసిరి. అట్టి గ్రంథములలో నీ సహస్రయోగ మొకటి. ఈ గ్రంథము కేరళదేశమందు చాలా ప్రచారములో నున్నది. అచ్చటి వైద్యులు విశేషముగా దీని ననుసరించి చికిత్సలను జేయుచుందురు. కాని యీ గ్రంధకర్తయొక్క పేరు, అతని జన్మస్థలము మఱియు నేకాలమునాటివాడో తెలియుట లేదు. అయిన నీతడచ్చటచ్చట ఆత్రేయాది మునులను బేర్కొనుచుండినను, విశేషముగా అష్టాంగహృదయము, మఱియు అష్టాంగ సంగ్రహముల నాధారముగ జేసుకొని వ్రాసినట్లు గోచరించును. ఇందు అనగా అనుబంధముగా జేర్చబడిన ధారాకల్పము, అంగమర్దను మఱియు శిరోవస్తి మొదలగు పంచకర్మాంతర్గతమైన చికిత్సలు నేటికిని కేరళ దేశమందు మాత్రము చాలా ప్రచారములో నున్నవి. అచ్చటి వైద్యులు ఆభ్యంతరిక వైద్యశాలలను నెలకొల్పి అనేకరోగులకు పై చికిత్సలచే నారోగ్యమును చేకూర్చుచున్నట్లు ప్రతినిత్యము వినుచున్నాము. ఇటీవల నేను శ్రీ కాశీక్షేత్రములో నుండగా నాకీ ప్రేరణ కలుగుటచే నాంధ్ర దేశములో గూడ దీనిని వ్యాపింపజేయవలయుననే యుత్సాహముతో నీ సహస్రయోగమున కాంధ్రభాషలో సహస్రయోగ ప్రకాశిక యన బరగు ననువాదమును వ్రాయబూనుకొంటిని. ఈ కార్యనిర్వాహణమందు వైద్యులును శ్రీ కాశీలోని శృంగేరిమఠమునకు మేనేజరులును అగు శ్రీ శ్రీధరభట్టగారు నాకు కొంతప్రోత్సాహమును జేసిరి. వారికిని మఱియు నీ గ్రంథముయొక్క చిత్తుప్రతిని సరిచేసి సహాయమొసర్చిన, వ్యాకరణ శిరోమణి బ్రహ్మశ్రీ వరాయతం కృష్ణమూర్తిశాస్త్రి గారికిని, కవిశిరోమణి గర్గభాగవతాది గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి గారికిని, మఱియు నితరసహాయకులకును, నా ధన్యవాదములు. ఇదిగాక నీ గ్రంథమును విశేషము తప్పులులేకుండగ ముద్రణము చేసిన శ్రీ పబ్బా శంకరయ్య గుప్తగారికి నా ఆశీర్వాదములు.

అనుబంధము :—

ఈ సహస్రయోగ ప్రకాశికకు అనుబంధముగా ధారాకల్పము మఱియు భైషజ్యరత్నావళి యందలి ఆసవారిష్ట యోగములను, వైద్యుల యుపయోగార్థము జేర్చబడినవి. ఈ ధారాకల్పము పంచ కర్మాంతర్గతమైనది. అనగా పంచకర్మలలో జేరిన స్వేదకర్మకు సంబంధించినది. దీనినే పరిషేక స్వేదకర్మయందురు. ఇది అభ్యంగము, పరిషేకము, పిచు మఱియు శిరోవస్తి యని నాలుగు విధములుగా నుండి ఒక దాని కంటె నొకటి క్రమముగా గుణాధిక్యమును గలిగియుండును. ఈ కర్మలను విశేషముగా వాత ప్రధానవ్యాధులం దుపయోగించ వలసిన దని వైద్యశాస్త్రమందు లెస్సగా జెప్పబడినది. వివిధములైన ఈ స్వేద కర్మలు అనగా పిండస్వేదము (కేరళములో నవరకిజి) అన్నలేపము, కాయసేకము (పిజిచిల్, మలయాళదేశములో) శిరోవస్తి, శిరస్సేకము లేక ధారాస్నానము, మఱియు శిరోలేపన మొదలగునవి కేరళదేశ మందు తప్ప మిగిలిన ప్రాంతములందు ప్రచారములో లేవని చెప్ప వచ్చును. మూలగ్రంథములోని కొన్ని యోగములు సంస్కృతములోను, మరికొన్ని మణిప్రవాళములోను (సంస్కృత కేరళ మిశ్రమ) వ్రాయ బడినది. అందుచేత నేను కొందరి కేరళదేశస్థుల సహకారముతో నీ యనువాదమును జాగ్రత్తగా వ్రాయగల్గితిని. ఇందు వ్రాయబడిన ప్రాచీన చికిత్సాపద్ధతులను అనగా దేశములో బహిష్కృతమున ప్రచార ములో లేని ధారాకల్పము, శిరోవస్తి మొదలగునవి యాచరణము లోను మఱియు ప్రచారములోను బెట్టి దీర్ఘములగు కష్టతర వ్యాధు లచే బీడింపబడు ప్రజల కారోగ్యసుఖమును గలుగజేయుదురని సోదర వైద్యులను మఱియు సోదరదేశీయులను గోరుచున్నాను. ఇందు వ్రాయ బడిన యోగములలోని కొన్ని మూలికలను, ఇచ్చట ప్రచారములో నున్న వాటికిని భేదము కనబడుచున్నది. అందుచేత అచ్చట లభ్యమగు మూలికలకును, ఇచ్చట ప్రచారములో నున్న వానికిని సాధ్యమైనంత వరకు సమన్వయపరచుచు వ్రాయడమైనది. ఆ ప్రకారము చేయుటకు వీలులేని మూలికలు అనగా ఏకనాయకము జీవంతి, సహస్రవేధి (ఖనిజము) మొదలగువానిని కేరళదేశమునుండి తెప్పించుకొనుట యుక్తముగా నుండును.

సూచన :—

మానపరిభాషా ప్రకరణమందు చెప్పబడిన ప్రకారము ఈపొత్తము నందలి యోగములలోని ద్రవ్యములను గ్రహించవలెను. ఈ సహస్రయోగ ప్రకాశిక యందు ప్రమాదము లుండినచో వానిని దెల్పిన పునర్ముద్రణములో మిక్కిలి కృతజ్ఞతతో నట్టివానిని సవరించుకొందునని దెల్పుచున్నాను.

ఈ గ్రంథమునకు మిక్కిలి అభిమానముతో "తొలిపలుకు" సవిమర్శముగా వ్రాసిన, అమెరికా సంయుక్తరాష్ట్రములు, తురుష్క ప్రజాస్వామికము, చైనా జాతీయోద్యమము, ఉపనిషత్సారములు, ఈజిప్టు, నాజీవితకథ, నవ్యాంధ్రము మొదలగు వివిధవిధ గ్రంథకర్తలును, తెలుగు, ఉరుదూ, అకాడమీ, అధ్యక్షులును, ఆంధ్రప్రదేశ్ శాసన సభాధ్యక్షులును, దేశబంధు, ఆంధ్రభీష్మ, పద్మభూషణేత్యాద్యనేక బిరుదావళీ విరాజమానులు నగు శ్రీ గా॥ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు బి. ఎ. బి. యల్. గారికి నా హృదయపూర్వక వందనముల నర్పించుచున్నాడను.

దీనిపై ప్రేమతో అమూల్యాభిప్రాయము లొసంగిన ఆయుర్వేద శిరోమణి, ఆయుర్వేద వాచస్పతి శ్రీ. సి. కే. దివాకరన్, ఎం. ఎ. ఆయుర్వేద కళాశాల ప్రధానోపాధ్యాయులు (హైదరాబాదు) గారికిని, గోవిందరామాయణము, భారతదేశ ఆర్థికచరిత్రము, భారతీయ రాజ్యాంగచరిత్ర, గాంధీ జీవితచరిత్ర ఇత్యాది గ్రంథకర్తలగు శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు ( Ex. M. L. C. ) గారికిని నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

(Sd.) శ్రీరంగం సుబ్బారావు,
రిజిష్టర్డ్ ఆయుర్వేదిక్ మెడికల్ ప్రాక్టీషనర్,
సికిందాబాద్.
(ఆంధ్రప్రదేశ్.)

# విషయసూచిక

# అనుబంధమునకు విషయసూచిక

ఓం శ్రీ ధన్వంతరయే నమః

# సహస్రయోగ ప్రకాశిక

## మంగళాచరణమ్.

శ్లో॥ శంఖం చక్రి ముపర్యథశ్చ కరయో ర్దివ్యౌషధం దక్షిణే
వామే నాన్యకరేణ సంభృత సుధాకుంభం జలూకావలిమ్
బిభ్రాణః కరుణాకరః శుభకరః సర్వామయ ధ్వంసకః
సర్వంమేదురితం ఛినత్తు భగవాన్ ధన్వంతరి స్సంతతమ్॥

## సహస్రయోగః — అథ కషాయయోగ ప్రకరణమ్.

### ఘనాది కషాయః.

శ్లో॥ ఘనచందన శుంఠ్యంబు పర్పటోశీర సాధితమ్
శీతం తేభ్యో హితం తోయం పాచనం తృడ్జ్వరాపహమ్॥ 1.

తాత్పర్యము :— భద్రముస్తలు, రక్తచందనము, శుంఠి, కురువేరు, పర్పాటకము, మఱియు వట్టివేళ్లు వీనిచే సిద్ధమైన కషాయమును జల్లార్చి సేవించిన దప్పిని మఱియు మంటలతో గూడిన జ్వరములను బోగొట్టును. పాచనశక్తినికూడ వృద్ధిపఱచును.

### తోయాది కషాయః.

శ్లో॥ తోయ తోయద భూనింబ పాఠా ధాన్యమహౌషధైః
కృతః కషాయస్సర్వేషాం జ్వరాణాం పాచనః పరః॥ 2.

తా :— కురువేరు, భద్రముస్తలు, కిరాతతిక్తము (చిరాయితా), పాఠవేళ్లు, ధనియాలు మఱియు శుంఠి అనువాని కషాయము సర్వవిధ జ్వరములకు శ్రేష్ఠమైన పాచనౌషధము.

## పాఠాది కషాయః.

శ్లో॥ పాఠాగ్నిమంథ బృహతీద్వయ నాగరాణామ్
ఛిన్నోద్భవా మగధమూల కలింగకానామ్
వాసామృతాంబుద పటోల మహౌషధానామ్
క్వాథం పిబేదిహ మరుత్ప్రభవేజ్వరేషు ॥ 3.

తా :— చిరుబొద్ది, తక్కిలిచెక్క, ములక, వాకుడు, శుంఠి, వీని కషాయము లేక తిప్పతీగె, పిప్పలీ మూలము (మోడి) కొడిశపాలగింజలు అనువాని కషాయము లేక అడ్డసరము వేళ్లు, తిప్పతీగె, తుంగముస్తలు, చేదుపొట్ల, శుంఠి వీని కషాయము వాతప్రకోప జ్వరమందు త్రాగించవలయును.

## గోపాంగనాది కషాయః.

శ్లో॥ గోపాంగనా కమల చందన సేవ్య విశ్వ
యష్టీ జలోత్పల మధూక శతావరీభిః
సిద్ధం సుశీతమను మాక్షిక శర్కరాఢ్యం
పిత్తజ్వరం జయతి దాహ తృడాఢ్య మంబు ॥ 4.

తా :— సుగంధపాలవేళ్ళు, తామరదుంప, చందనము, వట్టివేళ్ళు, శుంఠి, యష్టిమధుకము, కురువేరు, నల్లకలువ, ఇప్పచేవ, పిల్లిపీచరవేళ్ళు అనువానిచేత సిద్ధమైన కషాయమును జల్లార్చి యందు తేనెయు, శర్కరయు చేర్చి సేవించిన దప్పి మఱియు మంటలతోగూడిన పిత్తజ్వరములు హరించును.

## పథ్యాది కషాయః

శ్లో॥ పథ్యా కట్ఫల నాగరాంబుద వచా భూనింబధాన్య ద్రుమైః
భార్గీ పర్పటకాన్వితైః శృతమిదం తోయం సుశీతం పునః॥
మధ్వాఢ్యం పరమాణు రామతయుతం శ్లేష్మజ్వరం నాశయేత్
కోష్ఠార్తి శ్వసనాగ్నిసాద కసనారుచ్యాస్య శోషాన్వితమ్॥ 5.

తా :— కరక్కాయబెరడు, కాయఫలముచెక్క, శుంఠి, భద్రముస్తలు, వస, భూనింబ (చిరాయితా), ధనియాలు, దేవదారు, గంటుభారంగి, పర్పాటకము వీనిచే సిద్ధమైన కషాయమును జల్లార్చి యందు తేనెయు, మఱియు ఇంగువయు జేర్చి సేవించిన ఆమాశయవ్యాధులను, శ్వాస, అగ్నిమాంద్యము, కాస, అరుచి, నోరెండుట అనువానితో గూడిన శ్లేష్మజ్వరములను నశింపజేయును.

## ద్రాక్షాది కషాయః.

శ్లో॥ ద్రాక్షా మధూక మధుక లోధ్ర కాశ్మర్యసారిబాః
ముస్తామలక హ్రీబేర పద్మకేసర పద్మకమ్॥ 6.

శ్లో॥ మృణాళ చందనోశీర నీలోత్పల పరూషకమ్
ఫాంటో హిమోవా దాౢక్షాదిర్జాతీకుసుమవాసితః॥ 7.

శ్లో॥ యుక్తో మధుసితా లాజై ర్జయత్యనిల పిత్తజమ్
జ్వరం మదాత్యయం ఛర్దిం మూర్ఛాం దాహం శ్రమం భ్రమమ్
ఊర్ధ్వగం రక్తపిత్తంచ పిపాసాం కామలా మపి॥ 8.

తా :— దాౢక్ష, ఇప్పచేవ, యష్టిమధుకము, లొద్దుగ, పెద్దగుమ్ముడు, సుగంధపాలవేళ్ళు, భద్రముస్తలు, ఉసిరికాయ, పరుపేరు, తామరకేసరములు, పద్మకాష్ఠము, తామరతూండ్లు, చందనము, వట్టివేళ్ళు, నల్లకలువదుంప, చిట్టీత (ఫాల్సా), వీని పాంటమందు లేక హిమమందు జాజి, మల్లెపువ్వులు, సువాసనకొఱకు జేర్చి పిదప అందు తేనె, శర్కర, మఱియు పేలపిండినివేసి సేవించిన, వాతపిత్తజ్వర మదాత్యయ, వాంతి, మూర్ఛ దాహ, శ్రమ, భ్రమ, ఊర్ధ్వాంగరక్తపిత్త, తృష మఱియు కామలారోగములను బోగొట్టును.

## నాగరాది కషాయః

శ్లో॥ నాగరామృత హారీతకీ క్రమా న్నాగహస్త నయనాంఘ్రి భాగశః
సాధుసిద్ధముదకం సశర్కరం నాశయత్యఖిలదోషజం జ్వరమ్॥ 9.

తా. :— శుంఠి 2 భాగములు, తిప్పతీగె 5 భాగములు, కరక్కాయబెరడు 4 భాగములు, వీనిచే సిద్ధమైన కషాయమందు శర్కరచేర్చి సేవించిన త్రిదోషజ్వరములు నశించును.

## వేణుభవ పత్రాది కషాయః

శ్లో॥ పత్రం వేణుభవం దళంచ తులసీజాతం హరిక్రాంతజమ్
పత్రంవా సునిషణ్ణజం బదరజం పత్రంచవాటందళమ్
పత్రంచోత్తమ కన్యకాఖ్య సుషవీ నారఙ్గపత్రం పృథక్
సర్వంనాగర పాదికం ప్రహరతి ప్రాగ్రూప శీతంజ్వరమ్॥ 10.

తా. :— వెదురు, తులసి, విష్ణుక్రాంతము, చెంచెలిచెట్టు, రేగు, నారింజ, మఱ్ఱి, పులిచింత, గొడ్డుఆకాకర అను వాని యాకులు సమభాగములు. వీనిమొత్తములో నాల్గవ భాగము శుంఠి. పై వానికషాయము శీతజ్వరమును హరించును.

## దార్వాది కషాయః.

శ్లో॥ దారునాగర భూనింబ ధాన్యవాసా కలిఙ్గకైః
గజాహ్వో దశమూలాద్యై ర్మైత్ర్యేకల్పం జ్వరం జయేత్॥ 11.

తా :— దేవదారు, శుంఠి, భూనింబ (చిరాయిత) ధనియాలు, అడ్డసరము వేరు, కొడిశపాల గింజలు, గజపిప్పళ్లు, మారేడు వేరు, తక్కలి వేరు, కలిగొట్టు, పెద్దగుమ్ముడు వేరు, ములక, వాకుడు, కోలపొన్న, ముయ్యాకు పొన్న, పల్లేరు, దుందిలము, మఱియు భద్రముస్తలు అనువాని కషాయము మృత్యువును సూచించు జ్వరములను జయించును.

## మహాబలాది కషాయః.

శ్లో॥ మహాబలామూలమహౌషధానాం క్వాథో నిహన్యాద్విషమజ్వరంచ
శీతం సకంపం పరిదాహయుక్తం మారీచకం రాఘవసాయకోయథా॥

తా :— పెద్దముత్తవపులగము వేరు, శుంఠి, వీనికషాయము విషమజ్వరము, కంప జ్వరము మఱియు దాహయుక్త జ్వరములను రామబాణము మారీచుని పారద్రోలినట్లు నివారించును.

## ఛిన్నోద్భవాది కషాయః.

శ్లో॥ ఛిన్నోద్భవా వృషకిరాతక పర్పటానామ్
శుంఠ్యా బలాహక యవాసకయోః క్రమేణ॥
ఏకద్వయ త్రితయ భాగకృతః కషాయః
సమ్మూర్ఛితం జ్వరమపోహతి సన్నిపాతమ్॥ 13.

తా :— తిప్పతీగె, అడ్డసరము వేరు, కిరాతతిక్తము (చిరాయిత) పర్పాటకము, ఇవి ప్రత్యేకము ఒకభాగము శుంఠి, రెండుభాగములు భద్రముస్తలు మఱియు దురద గొండివేరు ఇవి ప్రత్యేకము మూడుభాగములు. పైవాని కషాయము సన్నిపాతజ్వరములను హరించును.

శ్లో॥ కేవలే నాజమోదేన కషాయో విధినాకృతః
చాతుర్థికం జ్వరం హన్తి రోహిణ్యా సమలంకృతః॥ 14.

తా :— విధిప్రకారము చేయబడిన అజామోదవాము కషాయమందు కటుకరోహిణినిజేర్చి యిచ్చిన చాతుర్థిక జ్వరమును హరించును.

## మృద్వీకాది కషాయః.

శ్లో॥ మృద్వీక నాగమధుకోత్పల సారిబాభి
ర్మద్గేక్షు కాండ హిమసారిబ వార్యుశీరైః
యష్టీమధు ప్రవర గోస్తన సారిబాభి
స్తోయం శృతం జయతి పిత్త భవం జ్వరంహి॥ 15.

తా:— ద్రాక్ష, నాగకేసరములు, యష్టిమధుకము, నల్లకలువ దుంప, సుగంధపాలవేళ్ళు, వీని కషాయము గాని అడవి పెసర, చెఱకువేళ్లు, చందనము, సుగంధపాల వేళ్ళు, వట్టివేళ్ళు, అనువాని కషాయముగాని, యష్టిమధుకము, తేనె, ద్రాక్ష, అగరు, సుగంధపాలవేళ్ళు, వీని కషాయముగాని పిత్తజ్వరమును జయించును.

## భార్గ్యాది కషాయః.

శ్లో॥ భార్గ్యబ్ద పర్పటక ధన్వయవాస విశ్వ
భూనింబ కుష్ఠకణ సింహ్యామృతా కషాయః
జీర్ణ జ్వరం సతత సంతతకా న్నిహన్యా
దన్యేద్యుకం సహతృతీయ చతుర్థకాభ్యామ్॥ 16.

తా :— గంటుభారంగి, భద్రముస్తలు, పర్పాటకము, దూలగొండివేరు, శుంఠి, కిరాతతిక్తము (చిరాయితా), చెంగల్వకోష్టు, పిప్పళ్ళు, ములక, తిప్పతీగ, వీని కషాయము, సతత, సంతత, అన్యేద్యుక, తృతీయక, మఱియు చాతుర్థిక జ్వరములను హరించును

## శతావర్యాది కషాయః.

శ్లో॥ శతావరీ గోపకన్యా చందనోశీర వాలకైః
స తండులీయక ద్రాక్షా సమంగోత్పల యష్టిభిః॥ 17.
సాధితః సాధయత్యాశు నిర్యూహః స సితామధుః
ఊర్ధ్వగం రక్తపిత్తంచ హ్యుభయాయనమేవవా॥ 18.
శ్లో॥ తథా ప్రదర మున్మాదం సదాహం విషమం జ్వరం
వట శృఙ్గాట రూషాభ్యాం క్వాథం క్షీరయుతం తథా॥ 19.

తా :— పిల్లిపీచరవేళ్ళు, సుగంధపాలవేళ్ళు, చందనము, వట్టివేళ్ళు, కురువేరు చిర్రివేళ్లు, ద్రాక్ష, అత్తపత్తి, కలువ, యష్టిమధుకము, వీనికషాయమందు తేనె, శర్కర, లనుజేర్చి సేవించినయడల ఊర్ధ్వగత, అధోగతరక్త, ఉభయమార్గ రక్తపిత్తములును, ప్రదరములును, ఉన్మాదమును మఱియు దాహయుక్త విషమజ్వరములను శమించును లేక మఱ్ఱిమొగ్గలు, అడ్డసరము వేళ్ళు, అనువాని కషాయమందు ఆవుపాలుచేర్చి సేవించి నను పై వ్యాధులుపశమించును.

## చందనాది కషాయః

శ్లో॥ చందనోశీర జలద లాజముద్గ కణాయవైః
బలాజలే పర్యుషితైః కషాయో రక్తపిత్తహా॥ 20.

**తా :—** చందనము, వట్టివేళ్ళు, భద్రముస్తలు, వరిపేలాలు, పెసలు, పిప్పళ్లు, యవలు, వీనిని దంచి ముత్తవపులగమువేళ్ళ కషాయమందు నానబెట్టి, ఆ మరునాడు వడియగట్టి సేవించిన రక్తపిత్తమును హరించును.

## ఖదిరాది కషాయః.

శ్లో॥ ఖదిర శీతబలాసన సారిబా వృషజపాంబుద మోదకవల్కలైః
జయతిసామలకైః శృతమంబుయ త్ప్రదరమాశుసితామధుసంయుతం॥

**తా :—** చంద్రచేవ, మంచిగంధము, ముత్తవపులగవేళ్ళు, వేగిసచెక్క, సుగంధపాలవేళ్ళు, అడ్డసరమువేళ్ళు, దాసానిపువ్వులు, భద్రముస్తలు, *మోదక, ఉసిరికాయలు, వీని కషాయమందు శర్కరతేనెలనుజేర్చి సేవించిన ప్రదరరోగములు నివారించును.

## అమృతాది కషాయః

శ్లో॥ అమృతోశీర వాసాబ్ద విశ్వభూనింబవాలకైః
సపర్పటక ధాన్యాకర్ధన్వయాసైర్విపాచితమ్॥ 22.

**తా. :—** తిప్పతీగె, వట్టివేళ్ళు, అడ్డసరమువేళ్ళు, భద్రముస్తలు, శుంఠి, కిరాతతిక్తము, (చిరాయితా) కురువేరు, పర్పాటకము, ధనియాలు మఱియు దురదగొండివేళ్ళు, అనువాని కషాయము సర్వవిధ జ్వరములకు పాచనౌషధము.

## భార్గ్యాది కషాయః

శ్లో॥ భార్గీపుష్కరమూలంచ పథ్యా పర్పట తోయదమ్
నాగరం దశమూలంచ పిప్పలీంచాప్సుసాధయేత్॥ 23.
సన్నిపాతజ్వరం హన్తి విషమం శీతికాం స్తథా
కాసశ్వాసాగ్నిసదన హృత్పార్శ్వార్తి శిరోగ్రహమ్
జీర్ణజ్వరం సశ్వయధుం సంతతాదీంశ్చనాశయేత్॥ 24.

**తా :—** గంటుభారంగి, పుష్కరమూలము, కరక్కాయబెరడు, పర్పాటకము, భద్రముస్తలు, శుంఠి, దశమూలములు, పిప్పళ్లు, వీని కషాయముచేత సన్నిపాతజ్వరము, విషమజ్వరము, శీతజ్వరములు, కాస, శ్వాస, అగ్నిమాంద్యములు, హృత్పీడ, పార్శ్వపీడ, శిరశ్శూలలు జీర్ణజ్వరములు, సంతతజ్వరములు మఱియు శోఫలు మొదలగు రోగములు నశించును.

---

* మోదక లేక మోరట అనిపాఠాంతరము దీనిని మళయాళభాషలో కరింత కర తోలియని యందురు.

## అరశాది కషాయః

శ్లో॥ అరళాతివిషాముస్తా శుంఠీ బిల్వం సదాడిమమ్
సర్వజ్వర హరో యోగః సర్వాతీసారనాశనమ్॥ 25.

తా. :— పెద్దమానిచెక్క, అతివస, భద్రముస్తలు, శుంఠి, మారేడువేళ్లు, దానిమ్మచెక్క, వీని కసాయము సర్వ జ్వరములను మఱియు సర్వాతిసారములను నశింపజేయును.

## పాఠాది కషాయః

శ్లో॥ పాఠాగుడూచీఘనపర్పటాంబు భూనింబబిల్వేన్ద్రయవైః శృతాంభః
పేయం జ్వరార్తై రతిసారిభిశ్చ యథామృతం స్వర్గిభిరాదరేణ॥ 26.

తా :— చిరుబొద్ది లేక విషబొద్దివేళ్ళు తిప్పతీగె, తుంగముస్తలు, పర్పాటకము, కురువేరు, కిరాతతిక్తము, మారేడువేళ్లు, కోడిశపాల గింజలు, అనువాని కషాయమును సేవించుటచే స్వర్గనాసులు అమృతమును సేవించి సుఖమునుపొందినట్లు జ్వరరోగులు మఱియు అతిసార రోగులు నీరోగులై సుఖమును బొందుదురు.

## వ్యాఘ్రాది కషాయః.

శ్లో॥ వ్యాఘ్రీ శుంఠ్యమృతా క్వాథః పిప్పలీ చూర్ణ సంయుతః
వాత శ్లేష్మజ్వర శ్వాస కాస పీనస శూల జిత్॥ 27.

తా :— వాకుడు, శుంఠి, తిప్పతీగె, వీని కషాయమందు పిప్పళ్ళ చూర్ణమును గలిపి సేవించిన, వాతజ్వరములను, శ్లేష్మజ్వరములను మఱియు శ్వాస, కాస, పీనస, శూలలను జయించును.

## ఛిన్నోద్భవాది కషాయః.

శ్లో॥ ఛిన్నోద్భవాంబు ధరధన్వయవాస విశ్వైః
దుఃస్పర్శ పర్పటక సేఘ కిరాత తిక్తైః
ముస్తా టరూషక మహౌషధ ధన్వయాసైః
క్వాథాన్ పిబేదనిల పిత్త కఫ జ్వరేషు॥ 28.

తా :— తిప్పతీగె, భద్రముస్తలు, దూలగొండి, శుంఠి, వీనికషాయము; దూలగొండి వేళ్ళు, పర్పాటకము, భద్రముస్తలు, కిరాతతిక్తము (చిరాయితా) అను వాని కషాయము; భద్రముస్తలు, అడ్డసరము వేళ్ళు, శుంఠి, దురదగొండి వేళ్ళు; వీని కషాయము వరుసగా వాత, పిత్తకఫజ్వరములను హరించును.

## శ్వదంష్ట్రాది కషాయః.

శ్లో॥ శ్వదంష్ట్రాంబుద భూనింబ బలా నాగర పర్పటైః
క్వాథః ప్రశమయేత్ప్రీతః వాతపిత్త కృతం జ్వరమ్॥ 29.

తా :— పల్లేరు, భద్రముస్తలు, భూనింబ, (చిరాయితా) ముత్తవపులగముచేర్లు, శుంఠి, పర్పాటకము, వీని కషాయమును వాత, పిత్త ప్రకోపములవలన బుట్టిన జ్వరము లందు త్రాగించిన అట్టి జ్వరములు శమించును.

## పర్పాటాది కషాయః.

శ్లో॥ పర్పటకాబ్ద సురద్రుమ భార్గీమాగధి కౌషధ ధన్వయవాసైః
క్వాథ మిదం వినిహన్తి నరాణాం వాతకఫజ్వరజం పరితాపమ్॥

తా :— పర్పాటకము, భద్రముస్తలు, దేవదారు, గంటుభారంగి, పిప్పళ్ళు, శుంఠి, దురదగొండివేరు, వీని కషాయము వాతకఫజ్వరముల వలన కలుగు తాపమును హరించును.

## కటుకాది కషాయః.

శ్లో॥ కటుకా విజయా ద్రాక్షా ముస్తా పర్పట కౌషధైః
కషాయో నాశయేత్ప్రీతః కఫపిత్తభవం జ్వరమ్॥ 31.

తా :— కటుకరోహిణి, కరక్కాయ బెరడు, ద్రాక్ష, భద్రముస్తలు, పర్పాటకము, శొంఠి, వీని కషాయమును త్రాగిన యెడల కఫపిత్తజ్వరము నశించును.

## లకుచాది కషాయః.

శ్లో॥ లకుచదళ బిల్వ లశునై ర్నారంగ శలాటు పల్లవాభ్యాం
క్వాథో జయతః పీతౌ కఫాఢ్యాం శీతికాం త్రిదినాత్॥ 32.

తా :— చిరుపనస ఆకులు లేక క్షుద్రపనస ఆకులు, మారేడు ఆకులు, వెల్లుల్లి అనువాని కషాయముగాని నారింజ చిగుళ్ళు, మఱియు దానిలేతకాయలకషాయముగాని, త్రాగిన యెడల కఫము హెచ్చుగా నున్న శీతజ్వరములు మూడుదినములలో జయింపం బడును.

## విష్ణుక్రాంత్యాది కషాయః.

శ్లో॥ విష్ణుక్రాంత్యమృతా ముస్తా చందనోశీర సారిబాః
సహా దేవీ కణాసిద్ధః కషాయః శీతికాపహః॥ 33.

తా :—విష్ణుక్రాంతము, తిప్పతీగె, శుంగముస్తలు, చందనము, వట్టివేళ్లు, సుగంధపాలవేళ్లు, సహదేవి, పిప్పళ్ళు, వీని కషాయము శీతజ్వరమును హరించును.

శ్లో॥ అరణ్యా తులసీ మూలం విష్ణుకాంతి మహౌషధైః
క్వాథోయం నిర్హరేచ్ఛీఘ్రం శీతికాం విషమజ్వరమ్॥ 34.

తా :— అడవి తులసివేళ్ళు, విష్ణుక్రాంతము, శుంఠి అనువాని కషాయము శీతజ్వరమును మఱియు విషమజ్వరమును శీఘ్రముగా హరించును.

## ముస్తాది కషాయః.

శ్లో॥ ముస్తామృతా మధుక చందన సేవ్యవిశ్వ
మాషాగ్నిమంథ కణముద్గ కులత్థ చిత్రైః
సిద్ధాంబు మాక్షికయుతం పిబతాం వధూనాం
నశ్యంత్యసృగ్దరగదాః సహసైవ లోకే॥ 35.

తా : — భద్రముస్తలు, తిప్పతీగె, యష్టిమధుకము, చందనము, వట్టివేళ్లు, శుంఠి, మినుములు, తక్కలిచెక్క, పిప్పళ్ళు, పెసలు, ఉలవలు, ఆముదపువేళ్ళు, అనువానిచే సిద్ధమైన కషాయమందు తేనెచేర్చి త్రాగిన స్త్రీలయొక్క రక్తప్రదరవ్యాధులు బహు శీఘ్రముగా నశించును.

## ముసల్యాది కషాయః.

శ్లో॥ ముసలీ ఖదిరామలక త్రికంట జంబూవరీ క్వాథః
సాస్థిస్రావం ప్రదరం ప్రమాష్టి మధుమాన్ ప్రగే పీతః॥ 36.

తా :— నేలతాడిగడ్డలు, చంద్రచేవ, ఉసిరికాయలు, పల్లేరు, నేరేడుచెక్క, శతావరి వీనికషాయమందు తేనెవేసి ప్రాతఃకాలమున సేవించిన స్త్రీల అస్థిస్రావములు మఱియు ప్రదర వ్యాధులు చక్కపడును.

## దశమూలాది కషాయః.

శ్లో॥ దశమూల కటుత్రయోః కషాయః సవృషైరేష సమాక్షికః ప్రపీతః
శ్వసనానిల కాస పార్శ్వ పృష్ఠ త్రికమూర్ధాంసరుజాసు సంప్రదిష్టః॥

తా :— దశమూలములు (పెద్దగుమ్ముడు, దుందిలము, కలిగొట్టు, మారేడువేరు, శోలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, పల్లేరు, తక్కలిచెక్క,) శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, అడ్డసరముపేరు, వీని కషాయమందు తేనెకలిపి త్రాగిన శ్వాసలు, వాతకాస, పార్శ్వనొప్పులు, వెన్నెముక నొప్పులు, తలనొప్పులు మఱియు నడుము నొప్పులు శమించును.

## బలాది కషాయః.

శ్లో॥ బలా జీరక విశ్వాబ్ద వృషబిల్వా సురద్రుమైః
గుహేక్షు లాజ సహితై ర్నిష్క్వాథః శ్వాసకాసహా॥ 38.

తా. :— ముత్తవ పులగముvేళ్ళు, జీలకర్ర, శుంఠి, భద్రముస్తలు, అడ్డసరము వేరు, దేవదారు, మారేడువేరు, ముయ్యాకుపొన్న, చెఱుకు, వరిపేలాలు, వీని కషాయము శ్వాస కాసలను హరించును.

## కాసమర్దాది కషాయః

శ్లో॥ కాసమర్దక వార్తాక వృషబిల్వైశ్చ తద్గుణః॥ 38. అ.

తా. :— కసివింద, నేలములక, అడ్డసరము, మారేడువేరు. వీని కషాయము పై దానివలె గుణమును జేయును.

## భార్గ్యాది కషాయః

శ్లో॥ భార్గీకణా కాసహరీ హరిద్రా వాసామృతా నాగరధాన్యకానాం
క్వాథోజయేచ్ఛ్వాసమతి ప్రవృద్ధం కణేన తీక్ష్ణోత్థ పరాగమిశ్రః॥

తా. :— గంటుభారంగి, పిప్పళ్ళు, కసివింద, పసుపు, అడ్డసరమువేరు, తిప్ప తీగె, శుంఠి, ధనియాలు, వీని కషాయమందు మిరియాల చూర్ణమునువైచి సేవించిన మిక్కిలి వృద్ధిపొందిన శ్వాసరోగములు బహువేగముగా జయింప బడును.

## విదార్యాది కషాయః

శ్లో॥ విదారి పంచాంగుల వృశ్చికాలీ వృశ్చీవ దేవాహ్వాయ శూర్పపర్ణ్యైః
కండూకరీ జీవన హ్రస్వసంజ్ఞే ద్వే పంచకే గోపసుతాత్రిపాదీ॥ 40.

శ్లో॥ విదార్యాదిరయం హృద్యో బృంహణో వాతపిత్తహా
శోష గుల్మాంగ మర్దోర్ధ్వ శ్వాసకాస హరో గణః॥ 41.

తా. :— నేలగుమ్మడుగడ్డ, ఆముదపువేళ్ళు, తేలుమణిచెట్టు, తెల్లగలిజేరువేళ్ళు, దేవదారు, అడవిపెసర, అడవి మినుము, దూలగొండివేళ్ళు, జీవన పంచమూలములు (శతావరి, నేలగుమ్మడు, జీవంతి, జీవకము, ఋషభకము) హ్రస్వపంచమూలములు, (వాకుడు, ములక, పల్లేరు, ముయ్యాకుపొన్న, కోలపొన్న), సుగంధపాలవేళ్ళు, హంస పాది, వీని కషాయము హృదయమునకును శరీరమునకును బలమును గలిగించి వాతపిత్తమును, శోష, గుల్మ, అంగమర్ద ఊర్ధ్వశ్వాసకాసలను హరించును.

## అగ్నిమంథాది కషాయః

శ్లో॥ అగ్నిమంథా బలైరండ భార్గీకుష్ఠ మహౌషధైః
పిబేత్ ప్రక్వథితం తోయం హిక్కారుక్ శ్వాసకాసవాన్॥ 42.

తా. :— తక్కలివేరు, ముత్తవపులగమువేరు, ఆముదపువేరు, గంటుభారంగి, చంగల్వకోష్ఠు, శుంఠి, వీనిచేత సిద్ధమైన కషాయమును హిక్కా-శ్వాస, కాస, రోగులు త్రాగవలయును.

## దశమూలాది కషాయః

శ్లో॥ దశమూల విశ్వ లశునైః క్వాథంచ క్షీరసంయుతమ్॥ 42. అ.

తా. :— దశమూలములు, శుంఠి, వెల్లుల్లి, వీని కషాయమందు ఆవుపాలుచేర్చి సేవించినను పై వ్యాధులు శమించును.

## ఆవీరాది కషాయః

శ్లో॥ ఆవీరవచా భార్గీ యష్టీభద్రిపాదితేన తోయేన
పాలక్రోశియక్ష్మా విహితాం హిక్కామచిరేణ జయతి తీవ్రతరామ్॥

తా. :—కాసమర్దను (కసివింద) వస, గంటుభారంగి, యష్టిమధుకము, భద్రముస్తలు, వీని కషాయముచే రాజయక్ష్మయందుగలుగు తీవ్రహిక్క అతివేగముగ హరింపబడును.

## పునర్నవాది కషాయః

శ్లో॥ పునర్నవా బలా చవ్య స్థిరా పిప్పలిగోక్షురైః
జీవంత్యాచ శృతం తోయం పుష్టికృత్ క్షయనాశనమ్॥ 44.

తా. :— తెల్లగలిజేరువేళ్ళు, ముత్తవపులగమువేళ్ళు, చవ్యము, పృశ్నిపర్ణి (కోలపొన్న) పిప్పళ్లు, పల్లేరు, *జీవన్తి అనువాని కషాయము పుష్టికరము మఱియు క్షయనాశకము.

## అమృతాది కషాయః

శ్లో॥ అమృతా దశమూలదారు భార్గీవృషవృశ్చీవ పయోద ధన్వయాసైః
సబలా చిరిబిల్వ పంచకోలైర్మధునా హన్తి సృపామయం కషాయః॥

---

* జీవంతి = అటపతియన్ కిళంగ్. (ఒక చెట్టుదుంపయని మలయాళభాషలో నందురు.)

తా :— తిప్పతీగె, దశమూలములు, దేవదారు, గంటుభారంగి, అడ్డసరము వేళ్ళు తెల్లగలిజేరు వేళ్ళు, భద్రముస్తలు, దురదగొండివేరు, బలామూలము, కానుగు, పంచకోలములు (పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, చవ్యము, శుంఠి) పైవానికషాయమందు తేనెచేర్చి సేవించిన రాజయక్ష్మలు హరించును.

## ఏలాది కషాయః.

శ్లో॥ ఏలా కణా మధుక నాగర కాబ్దవాసా
నింబామృతాంబు దశమూల శృతఃకషాయః
లాక్షాసితా మధుక జీరక సంప్రయుక్తో
యక్ష్మాణ మాశు వినిహంతి మధుప్రగాఢః॥ 46.

తా :— ఏలకులు, పిప్పళ్ళు, అతిమధురము, శుంఠి, భద్రముస్తలు, అడ్డసరము వేళ్ళు వేపచెక్క, తిప్పతీగె, కురువేరు, దశమూలములు, వీని కషాయమందు లక్క, శర్కర, యష్టిమధుకము, జీలకర్ర, అను వాని చూర్ణము మఱియు తేనెయుచేర్చి సేవించిన రాజయక్ష్మ రోగములు హరించును.

## శుంఠ్యాది కషాయః.

శ్లో॥ శుంఠీ రాస్నా కణాజోంగధో వాసా క్వాథో ఘృతాన్వితః
సకణం దశమూలంవా స్వరభేదేనిలోత్థితే ॥ 47

తా :— శుంఠి, సన్నరాస్నము, పిప్పళ్ళు, అగరు, అడ్డసరము, అనువాని కషాయమందు నెయ్యిచేర్చి సేవించిన వాతముచే జనించు స్వరభేదము శమించును. లేక దశమూలములు, పిప్పళ్ళు, వీని కషాయమును సేవించినను పై వ్యాధి శమించును.

## త్రిజాతాది కషాయః.

శ్లో॥ త్రిజాత త్రికటు వ్యాఘ్రీ భార్గీ క్వాథో మధూత్కటః
కఫజాఽరుచి హృల్లాస ప్రసేక స్వరభేదనుత్ ॥ 48.

తా :— ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, వాకుడు, గంటుభారంగి, వీని కషాయమందు తేనెజేర్చి సేవించిన కఫముచే గలుగు అరుచియు, నోటనీరుకారుటయు మఱియు స్వరభేదము పోవును.

## ద్రాక్షాది కషాయః

శ్లో॥ ద్రాక్షా కృష్ణా వృషైరంబు పిత్తజ స్వరసాదనుత్
ఆమ్రపల్లవ తద్వృంత బిల్వాలాజార్ద్ర కేతుభిః
కేసరైర్మాతులుంగస్య యుక్తః క్వాథోరుచిం హరేత్ ॥ 49.

తా. :— ద్రాక్ష, పిప్పళ్ళు, అడ్డసరము వేరు, కురువేరు, అనువాని కషాయము పిత్త ప్రధాన స్వరభేదములను బోగొట్టును. మామిడిచిగుళ్ళు, దాని యీనెలు మారేడు వేరు, వరిపేలాలు, అల్లము, చెఱుకువేళ్ళు, మాధీఫలకేసరములు వీని కషాయము అరుచిని హరించును.

## విశ్వాది కషాయః

శ్లో॥ విశ్వాబ్ద లాక్షాతిబలా బలాక్వాథస్సమాక్షికః
రాస్నాకణా చూర్ణయుక్తో భక్తరోధ నిరోధకః॥ 50.

తా:— శుంఠి, భద్రముస్తలు, లక్క, పెద్దముత్తవపులగము వేరు, చిన్నముత్తవపులగము వేరు, వీనిక్వాథమందు తేనె, సన్నరాస్నచూర్ణము, మఱియు పిప్పళ్ళచూర్ణమునుగలిపి సేవించిన అరుచి మఱియు అగ్నిమాంద్యము హరించును.

## ఏలాది కషాయః

శ్లో॥ బలాశతావరీద్రాక్షా బిల్వమూల త్రికంటకైః
సదాడిమం శృతంతోయం భక్తద్వేష నివారణం॥ 51.

తా. :— ముత్తవపులగము వేరు, శతావరివేరు, ద్రాక్ష, మారేడువేరు, పల్లేరు దానిమ్మపండు, అనువాని కషాయమును అన్నద్వేషమును నివారించును.

## పంచపంచమూలది కషాయః

శ్లో॥ పంచానాం పంచమూలానాం కషాయేణ శృతంపయః
అజంమధు సితాయుక్తంభక్తరోధనిరోధనమ్॥ 52.

తా. :— బృహత్ పంచమూలములు (మారేడువేరు, పెద్దగుమ్ముడు, తక్కలి కలిగొట్టు, దుందిలము,) లఘుపంచమూలములు (వాకుడు, ములక, పల్లేరు, ముయ్యాకుపొన్న, కోలపొన్న,) మధ్యమ పంచమూలములు (బలామూలము తెల్లగలిజేరు, ఆముదపు వేరు, ముద్గపర్ణి, మాషపర్ణి,) జీవనపంచమూలములు (శతావరి, నేలగుమ్ముడు, జీవన్తి, జీవకము, ఋషభకము,) తృణపంచమూలములు, (రెల్లు, దర్భ, కుశ, కాశ, చెఱకు,) వీనివేళ్ళ కషాయమందు మేకపాలు, తేనె మఱియు చక్కెరచేర్చి సేవించిన అన్నద్వేషమును హరించును.

## పునర్నవాది కషాయః.

శ్లో॥ పునర్నవైరండ బలాశుంఠీ గోక్షురసాధితాః
అజాక్షీరాన్వితాపేయా భక్తరోధ నిరోధినీ॥ 53.

తా. :— తెల్లగలిజేరువేళ్ళు, ఆముదపువేళ్ళు, ముత్తవపులగము వేరు, శుంఠి, పల్లేరు, వీనికషాయమందు మేకపాలుచేర్చి చేసిన పేయము అన్నద్వేషమును నివారించును.

## బిల్వాది కషాయః.

శ్లో॥ బిల్వధాన్యాక బలామహౌషధై ర్లాజముద్గ సహితైః శృతం జలం
ఛర్దిమాశు పిబతః సశర్కరం హన్తి వాతకఫపిత్తజామపి॥ 54.

తా. :— మారేడువేరు, ధనియాలు, ముత్తవపులగమువేరు, శుంఠి, వరిపేలాలు, అడవిపెసర, పైవాని కషాయమందు శర్కర చేర్చి త్రాగినయెడల వాతపిత్త కఫముల వలనబుట్టిన వాంతులు శీఘ్రముగా హరించును.

## లాజాది కషాయః.

శ్లో॥ లాజబిల్వౌషధైః సిద్ధః క్వాథశ్ఛర్ద్యాం హితంపరమ్॥ 54. అ

తా. :— వరిపేలాలు, మారేడువేరు, శుంఠి, వీనిచేత సిద్ధమైన కషాయము వాంతి రోగమందు మిక్కిలి హితకరము.

## ధాన్యాకాది కషాయః.

శ్లో॥ ధాన్యాకశుంఠీ సురదారుచిత్రా బలేక్షుబిల్వైః పరిపక్వమంభః
ససైంధవో హృద్గదకోఠగుల్మ వాత ప్లిహాపార్శ్వరుజాసు శస్తః॥

తా. :— ధనియాలు, శుంఠి, దేవదారు, ఆముదపువేరు, ముత్తవపులగమువేరు, చెఱకువేళ్ళు, మారేడువేళ్ళు వీనిచే సిద్ధమైన కషాయమందు సైంధవ లవణమును జేర్చి సేవించిన హృద్రోగము, చర్మరోగము, వాతగుల్మ, ప్లీహ మఱియు పార్శ్వనొప్పులు హరించును.

## మాషాది కషాయః.

శ్లో॥ మాషదారు బలాక్వాథః సతైలశ్చ హితస్తథా
పిబేజ్జ్వరోక్తం ద్రాక్షా సారిబాది గణాంబుచ॥ 56.

తా :— మినుములు, దేవదారు, ముత్తవపులగమువేరు, అనువాని కషాయమందు నువ్వుల నూనె చేర్చి సేవించిన హృద్రోగము శమించును. జ్వరప్రకరణమందు జెప్ప బడిన ద్రాక్షాది గణముయొక్కయు మఱియు సారిబాది గణము యొక్కయు కషాయములు కూడ పై వ్యాధిని హరించును.

## విదార్యాది కషాయః.

శ్లో॥ విదార్యాది గణేనాపి సిద్ధం తృష్ణా ప్రపీడితః
సారిబోశీర కాశ్మర్య మధూక శిశిరద్వయమ్॥ 57.

తా :— విదార్యాది గణమందు జెప్పబడిన కషాయము కూడ దప్పిని హరించును. సుగంధపాలవేళ్ళు, వట్టివేళ్లు, పెద్దగుమ్మడు వేరు, ఇప్పచేవ, చందనము, రక్తచందనము,

యష్టిమధుకము, చిట్టీత (పాల్ సా) వీని కషాయము దాహమును రక్తపిత్తమును మఱియు దప్పితో గూడిన జ్వరములను హరించును.

ధాన్యాది కషాయః.

శ్లో॥ ధాన్యాక కృష్ణా తృణ పంచమూల శతావరీ కోల యవాసకానాం
సుశీతలం వార్యనివార్య వీర్యం నివారయేత్పిత్తతృషాం సితాఢ్యమ్॥

తా :— ధనియాలు, పిప్పళ్ళు, తృణపంచమూలము, శతావరి, రేగుపండ్లు, దూలగొండివేళ్ళు, వీనిని దంచి చల్లని నీటిలో నానబెట్టి పిదప వడియగట్టి, అందు శర్కర చేర్చి సేవించిన పిత్తప్రధాన దప్పిని నివారించును.

మృద్వీకాది కషాయః.

శ్లో॥ మృద్వీకా మధుకమధూకపిప్పలీభిః
ఖర్జూరై ర్మలయజసారిబాబ్ద లాజైః
సోశీరైః శృతమథవా సుశీతమంభః
తృణ్మూర్ఛా మద మతివిభ్రమా న్నిరస్యేత్॥ 59.

తా :— ద్రాక్ష, యష్టిమధుకము, ఇప్పపువ్వులు, పిప్పళ్ళు, ఖర్జూరము, చందనము, సుగంధపాలవేళ్ళు, భద్రముస్తలు, వరిపేలాలు, వట్టివేళ్ళు, వీనికషాయమునుగాని లేక శీతకషాయమునుగాని సేవించిన మూర్ఛ, మద, మతివిభ్రమ మఱియు తృష్ణా రోగములను నివారించును.

దుఃస్పర్శాది కషాయః.

శ్లో॥ దుఃస్పర్శకేన బిల్వేన యవాన్యా నాగరేణవా
కేవలై ర్తేషు సంయుక్తా పాతా హన్త్యర్శ సాంరుజమ్॥ 60.

తా :— దూలగొండివేరు, మారేడువేరు, ఖురాసాని ఓమ, మఱియు శొంఠి అనువానిలో ప్రతియొకటియందుగాని పై నాల్గింటియందుగాని విషబొద్దినిజేర్చి కషాయము కాచి సేవించిన మూలవ్యాధులందు కలుగు బాధలు హరించును.

చిరిబిల్వాది కషాయః.

శ్లో॥ చిరిబిల్వ పునర్నవ వహ్న్యభయాకణ నాగర సైంధవ పక్వజలమ్
గుదకీల భగందర గుల్మహరం జఠరాగ్ని వివర్ధనమాశు నృణామ్॥

తా :— కానుగవేరు, తెల్లగలిజేరువేరు, చిత్రమూలము, కరక్కాయబెరడు, పిప్పళ్ళు, సైంధవలవణము, శొంఠి వీని కషాయము గుదకీలమును, భగందరమును, గుల్మను హరించి అగ్నిదీప్తిని వృద్ధిజేయును.

## వర్షాది కషాయః.

శ్లో॥ వర్షాభూ నాగరాగ్నీనాం క్వాథ సిద్ధం పయ స్తథా॥ 61. అ.

తా :— తెల్లగలిజేరు, శుంఠి, చిత్రమూలము, వీని కషాయములో పాలు కలిపి సేవించిన అర్శోవ్యాధులు శమించును.

## చందనాది కషాయః.

శ్లో॥ చందన కిరాత తిక్త ధన్వయవాసాః సవత్సకాః క్వథితాః
రక్తార్శసాం ప్రశమనా దార్వీత్వగు శీరనింబాశ్చ॥ 62.

తా :— చందనము, భూనింబ (చిరాయితా) దూలగొండి, కొడిశపాల చెక్క, మానిపసుపు, లవంగపట్ట, వట్టివేరు, వేపచెక్క, వీనికషాయము రక్తార్శ వ్యాధులను శమింపజేయును.

## ఉశీరాది కషాయః.

శ్లో॥ ఉశీర కింజల్క మృణాలశీత శతావరీ వత్స వృషాంబుదోత్థః
రక్తార్శసాం హన్తి రుజం కషాయః కాలారి మేదోత్థమభీ రుజంవా॥

తా :— వట్టివేళ్లు, పద్మకేసరములు, తామరతూండ్లు, చందనము, శతావరీ, కొడిశపాల గింజలు, అడ్డసరమువేరు, భద్రముస్తలు వీని కషాయముగాని మురికితుమ్మ కషాయముగాని, లేక శతావరి కషాయముగాని, రక్తార్శస్సులను హరించును.

## కులుత్థాది కషాయః.

శ్లో॥ కులుత్థ లశునై రండ పాఠా గ్రంథిక నాగరైః
కషాయః సయవక్షారః శూలోదావర్త నాశనః॥ 64.

తా :—ఉలువలు, వెల్లుల్లి, ఆముదపు వేళ్ళు, విషబొద్ది, మోడి, శుంఠి, వీని కషాయములో యవక్షారమును జేర్చి సేవించిన శూలలను ఉదావర్తములను నశింపజేయును.

## దేవదార్వాది కషాయః.

శ్లో॥ దేవదారు వచా ముస్తై ర్నాగరాణి విషాన్వితైః
ఆమాతిసారనాశాయ క్వాథమేభిః పిబేన్నరః॥ 65.

తా :—దేవదారు, వస, ముస్తలు, శుంఠి, అతివస, వీనికషాయమును త్రాగినయెడల ఆమాతిసారములు నశించును.

## ముస్తాది కషాయః.

శ్లో॥ ముస్తా కరంజాతివిషాగ్నిబిల్వ మహౌషధ గ్రంథిక వత్సకానామ్
క్వాథోరుణధ్యామ మథోనిరామః ప్రవృద్ధశూలాన్విత సారముగ్రమ్॥

తా:— భద్రముస్తలు, కానుగచెక్క, అతివస, చిత్రమూలము, మారేడుకాయగుజ్జు, శుంఠి, మోడి, కొడిశపాలగింజలు వీని కషాయము తీవ్రమైన శూలతోగూడిన అతిసారములను మఱియు ఆమాతిసారములను హరించును.

## పానస్త్రాతివిషాది కషాయః.

శ్లో॥ పానస్త్రాతివిషా కృమిఘ్న హుతభుక్ పాఠావచాధాతకీ
లోధ్రాంబష్ఠ వటాంకురో భయనిశా పద్మాసమంగాభయా
ఏలా మోచరసాజమోద చపలా మూలారలు త్ర్యూషణమ్
బిల్వంచేతి బహుప్రకారవిహితం కుక్ష్యామయఘ్నోగణః॥ 67.

తా:— దూలగొండివేళ్లు, అతివస, వాయువిడంగములు, చిత్రమూలము, పాఠవేళ్లు, వస, ఆరెపువ్వు, లొద్దుగచెక్క, *అంబష్ఠ, మఱ్ఱి మొగ్గలు, వట్టివేళ్లు, పసుపు, మానిపసుపు, అజామోద వాము, అత్తపత్తి, కరక్కాయ, ఏలకులు, బూరుగుబంక, ఓమ, పిప్పలీ మూలము, పెద్దమానిచెక్క, శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, మారేడుకాయగుజ్జు వీని కషాయము వివిధములగు యుదరరోగములను హరించును.

## పూతికాది కషాయః.

శ్లో॥ పూతీక బిల్వ చవ్యాగ్ని కణామూల పునర్నవైః
పథ్యా శుంఠీయుతైః క్వాథః పాతవ్యోగ్ని వివర్ధనః॥ 68.

తా:— కానుగవేరు, మారేడువేరు, చవ్యము, చిత్రమూలము, మోడి, తెల్లగలిజేరు వేళ్ళు, కరక్కాయబెరడు, శుంఠి వీనికషాయము అగ్నిదీప్తిని గలుగజేయును.

## పథ్యాది కషాయః.

శ్లో॥ పథ్యా వ్యోమ పునర్నవాంబుద నిశా పూతీక యుగ్మాజటా
పాఠా బిల్వఘుణప్రియారలు కణామూలోగ్రగంధాగ్నిభిః
చవ్యా దీప్యక బాణపుంఖ సహితైరేతైః ప్రసిద్ధం జలమ్
పేయం తద్బహుదోషజగ్రహణి భిద్దైవైర్యథావామృతమ్॥ 69.

తా:— కరక్కాయ, పిప్పళ్ళు, మిరియాలు, శుంఠి, తెల్లగలిజేరు, భద్రముస్తలు, పసుపు, కానుగ, కలుగ్రానుగు, నేలయుసిరిక, విషబొద్ది, మారేడువేరు, అతివస, పెద్ద మాని వేరు, మోడి, వస, చిత్రమూలము, చవ్యము, ఓమ, వెంపలి వీని కషాయమును సేవించిన బహుదోషజగ్రహణీ రోగములు పోవును. దేవతలు అమృతమును సేవించి సుఖమును బొందినట్లు ఈ కషాయమును సేవించిన గ్రహణీరోగులు నీరోగులగుదురు.

* అంబష్ఠ = వేళుత్త అంబజత్తిక్ తొలి అని మలయాళ దేశములో నందురు.

## బిల్వాది కషాయః.

శ్లో॥ బిల్వాజమోద ఘననాగరధాన్యకోగ్రా పూతీక వాలక శఠీ
దహనైః శృతాంభః తృట్ శూలవాన్ పరిపిబేదథవా విషూచ్యాం
కైడర్య సిద్ధ సలిలం శరపుంఖజంవా॥ 70.

తా:— మారేడువేరు, అజామోద, ఓమ, తుంగముస్తలు, శుంఠి, ధనియాలు, వస, కానుగవేరు, కురువేరు, కచోరములు, చిత్రమూలము వీనికషాయము దప్పిశూలతో గూడిన విషూచీవ్యాధి (Cholera) యందు త్రాగించవలయును. కరివేపాకు లేక వెంపలి కషాయముకూడ గుణకారి.

## దశమూలాది కషాయః.

శ్లో॥ దశమూలం బలామూలం ద్రాక్షా యష్ట్యాహ్వ చందనమ్
క్వాథయిత్వా పిబేదేత న్మూత్ర కృచ్ఛ్రస్య శాన్తయే॥ 71.

తా:— దశమూలములు, ముత్తవపులగముచేళ్ళు, ద్రాక్ష, అతిమధురము, చందనము, వీని కషాయముచే మూత్రకృచ్ఛ్రము శమించును.

## వరాది కషాయః.

శ్లో॥ వరీసిద్ధం పిబేత్ క్షీరం ససితాం కృచ్ఛ్రశాంతయే॥ 71. అ

తా:— శతావరీ కషాయములో పాలు మఱియు శర్కర కలిపి త్రాగిన మూత్ర కృచ్ఛ్రము శాంతించును.

## వ్యాఘ్రాది కషాయః.

శ్లో॥ వ్యాఘ్రీ గోక్షురమత్స్యాక్షి పద్మాపాషాణభేదకైః
కపోతవంక శతకవరీ వసుక పాలకైః 72.

శ్లో॥ శృతక్షీరాద్వి శిష్ట్వాయంకషాయః శర్కరాన్వితః
మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి రక్తస్రావంచ నాశయేత్॥ 73.

తా:— వాకుడు, పల్లేరు, పొన్నగంటి, తామర, కొండపిండి, సరస్వతీఆకు, చిల్ల గింజ, శతావరి, *వసుక, కురువేరు వీని కషాయమందు పాలు మఱియు శర్కర గలిపి సేవించిన మూత్రకృచ్ఛ్రములు మఱియు రక్తస్రావములు నశించును.

*వసుక = మలయాళభాషలో తారతావర వేరు.

## పథ్యాది కషాయః.

శ్లో॥ పథ్యా గోక్షురశమ్యాక ధన్వయాసాక్షి భేషజైః
క్వాథంపిబేత్ సదుగ్ధాహే కృచ్ఛ్రే మధుసితాయుతమ్॥ 74.

తా:— కరక్కాయబెరడు, పల్లేరు, రేలచెక్క, దూలగొండి, లొద్దుగచెక్క వీని కషాయమందు తేనెయు మఱియు శర్కరచేర్చి సేవించిన మంట, నొప్పితోగూడిన మూత్రకృచ్ఛము శమించును.

## శతావర్యాది కషాయః.

శ్లో॥ వరీవిదారీ గోకంట ముస్తా గోపీజలంతథా॥ 74. అ

తా:— శతావరి, నేలగుమ్మడు, పల్లేరు, తుంగముస్తలు, సుగంధపాలవేళ్ళు, కురువేరు, వీని కషాయము మూత్రకృచ్ఛ్రహరము.

## బృహత్యాది కషాయః.

శ్లో॥ బృహత్యాదిగణైః సిద్ధం ద్విగుణీకృతగోక్షురైః
తోయం పయోవా సర్పిర్వా సర్వమూత్ర వికారజిత్॥ 75.

తా:— బృహత్యాదిగణము (వాకుడు, ములక, కోలపొన్న, ముయ్యాకుపొన్న.) ఈ మొత్తమునకు రెండింతలు పల్లేరును గలిపి కషాయముకాచి అందు పాలుగాని, నెయ్యిగాని వేసి సేవించిన సర్వమూత్రవికారములు నివారించును.

## అంకోల్లాది శీత కషాయః.

శ్లో॥ అంకోల్లాబ్ద ఫలత్రయ ద్విరజనీ జంబ్వర్జునక్షీరజః
త్వక్పాతా కతగాగ్నిమంథ ఖదిరాంబష్ఠా సనేంద్రద్రుమైః
క్వాథో వారిధి కోరకింశుక సక్షైరేభిః కృతః శీతలః
సక్షౌద్రాది జతూత్థచూర్ణసహితః సర్వప్రమేహాపహః॥ 76.

తా:— ఊడుగవేరు, తుంగముస్తలు, త్రిఫలములు, పసుపు, మానిపసుపు, నేరేడుచెక్క, తెల్లమద్దిచెక్క, క్షీరివృక్షముల చెక్కలు, విషబొద్ది, చిల్లగింజలు, తక్కిలివేరు, చంద్రచేవ, అంబష్ఠ, వేగిసచెక్క, దేవదారు, సముద్రఫేనము (నురుగు), మోదుగుబంక వీని శీతకషాయమందు తేనె మఱియు శిలాజిత్తు కలిపి సేవించిన సకల ప్రమేహములు హరించును.

## కతకాధి కషాయః.

శ్లో॥ కతక ఖదిర ధాత్రీ వైరి దార్వీ సమంగా
విదుల రజని పాఠా చూతబీజా భయాబ్దాః
కుసుమ రస సమేతం తోయమేభిః ప్రసిద్ధం
హరతి సకలమేహాన్ సప్తరాత్రిప్రయోగాత్॥ 77.

తా:— చిల్లగింజలు, చంద్రచేవ, ఉసిరికాయ, వైరి, (మలయాళభాషలో ఏకనాయకము) మానిపసుపు, అత్తపత్తి, సముద్రఫలము, పసుపు, విమబొద్ది, మామిడిజీడి, కరక్కాయబెరడు, తుంగముస్తలు వీని కషాయమందు తేనెజేర్చి యేడు దినములు సేవించిన సకల మేహ రోగములు నశించును.

## వ్యాఘ్రాది కషాయః.

శ్లో॥ వ్యాఘ్రీ వరణ తర్కారీ శిగ్రు విశ్వ పునర్నవమ్
శ్రిపయిత్వా పిబేత్తోయం విద్రధావంతరాశ్రయే॥ 78.

తా:— వాకుడువేరు, ఉలిమిరిచెక్క, తక్కలి, మునగవేరు, శుంఠి, తెల్లగలిజేరు వేళ్ళు వీని కషాయమును త్రాగినయెడల అంతర్విద్రధి హరించును.

## ముస్తాది కషాయః.

శ్లో॥ ముస్తా చందన దార్వీ త్వగ్భూనింబోశీరవత్సకైః
సక్షౌద్రైః శమనః క్వాథస్తథాపూయ వినాశనః॥ 79.

తా:— భద్రముస్తలు, చందనము, మానిపసుపు, కిరాతతిక్త (చిరాయితా), వట్టివేళ్ళు, కొడిశపాలచెక్క వీని కషాయమందు తేనెచేర్చి సేవించిన అంతర్విద్రధులు మతియు వానినుండి స్రవించు చీము శమించును.

## వరణాది కషాయః.

శ్లో॥ వరణ సైర్యకయుగ్మ శతావరీ దహన మోరట బిల్వవిషాణికాః
ద్విబృహతీ ద్వికరంజ జయాద్వయం బహులపల్లవ దర్భరుజాకరః॥80.

శ్లో॥ వరణాదిః కఫం మేదో మందాగ్నిత్వం నియచ్ఛతి
ఆఢ్యవాతం శిరశ్శూలం గుల్మంచాంత స్సవిద్రధిమ్॥ 81.

తా:— ఉలిమిరిచెక్క, నల్లముళ్ళగోరింట, పచ్చముళ్ళగోరింట, శతావరి, చిత్రమూలము, చాగవేరు, మారేడువేరు, దుష్టుపువేరు, ములక, వాకుడు, కానుగ, నేతి

కానుగు, తక్కలివేరు, కరక్కాయబెరడు, మునగజిగురు, దర్భవేళ్ళు, ఆదొండ వీని కషాయమును సేవించిన కఫము, మేదస్సు, మందాగ్ని, వాతాధిక్యము, శిరశ్శూల, గుల్మ మఱియు అంతర్విద్రధులు హరించును.

## లశునాది కషాయః.

శ్లో॥ లశున బర్బర శక్రలతాభయా హపుషయా కుదుగ్రగ్ని కణౌషధైః
సహాపునర్నవ మోరట శిగ్రుభిర్జయతివృద్ధ్యుదరాణి శృతంజలమ్॥ 82.

తా:— వెల్లుల్లి, నల్లతుమ్మ, చేమపుచ్చ, బోడతరము, కరక్కాయబెరడు, గచ్చవేరు, చిత్రమూలము, పిప్పళ్ళు శొంఠి, తెల్లగలిజేరువేళ్ళు, చాగవేరు, మునగచెక్క వీని కషాయము వృద్ధి మఱియు ఉదరరోగములను జయించును.

## లశునాది కషాయః.

శ్లో॥ లశునైరండ యష్ట్యాక్షీ వర్షాభూ హపుషౌషధైః
క్వథితం హింగుమద్వృద్ధి గుల్మానాహోదరాపహామ్॥ 83.

తా:— వెల్లుల్లి, ఆముదపువేరు, గచ్చవేరు, తెల్లగలిజేరువేరు, శుంఠి, బోడతరం వీని కషాయమందు ఇంగువను జేర్చి సేవించిన వృద్ధి, గుల్మ, అనాహ మఱియు ఉదర వ్యాధులను హరించును.

## దశమూలాది కషాయః.

శ్లో॥ దశమూల విశ్వదారు క్వథితం గుల్మజిజ్జలమ్
చిత్రక గ్రంధికైరండ శుంఠీ క్వాథశ్చ తద్గుణః॥ 84.

తా:— దశమూలములు, శుంఠి, దేవదారు వీని కషాయము గుల్మహరము. చిత్రమూలము, మోడి, ఆముదపువేరు, శుంఠి వీని కషాయమందు గూడ పైగుణములు కలవు.

## వర్షాది కషాయః.

శ్లో॥ వర్షాభూ బిల్వ ఖల్వోరుబు సహచర శుంఠ్యగ్నిమంథైః కషాయః
పాతవ్యః సప్తసారో గుదలవణ కణా హింగుమిశ్రోయథార్హమ్
విడ్బంధం వహ్నిమాంద్యం రుజమతిమహతీం యోనిహృత్పార్శ్వపృష్ఠ
శ్రోణీదేశేషుసద్యః శమయతి జఠరాష్ఠీల గుల్మప్లిహాంశ్చ॥ 85.

తా:— తెల్లగలిజేరు వేళ్ళు, మారేడువేరు, సరళదేవదారు, ఆముదపువేళ్ళు, నల్లముళ్ళ గోరింటవేళ్ళు, శుంఠి, తక్కలివేళ్ళు ఈ యేడు వస్తువుల కషాయమందు సైంధవ లవణము, పిప్పళ్ళు, వేయించిన ఇంగువ చూర్ణములను జేర్చి సేవించిన మలబద్ధము, అగ్ని

మాంద్యము, యోని, హృదయ, పార్శ్వపృష్ఠములందు నొప్పులను, ఉదర, అష్ఠీలా, గుల్మలను మఱియు ప్లీహలను శమింపజేయును.

## కణాది కషాయః.

శ్లో॥ కణాశతాహ్వా ద్వికరంజ దారు బార్ఙీకులత్థైః సతిలైర్విపక్వమ్
తథారసోనేనచ సిద్ధమంభః సహింగుకల్కం హితమస్రగుల్మే॥ 86.

తా:— పిప్పళ్ళు, బద్దసోపు, కానుగ, కలుకానుగ, దేవదారు, గంటుభారంగి, ఉలవలు, నువ్వులు, తెల్లులి వీని కషాయమందు వేయించిన ఇంగువ కల్కమును జేర్చి సేవించిన రక్తగుల్మలం మికించును.

## నిర్గుండ్యాది కషాయః.

శ్లో॥ నిర్గుండ్యేరండ కోరండ గోక్షుర ద్విపునర్నవమ్
పంచకోలాభయా శిగ్రు కులత్థైస్తైః శృతంజలమ్॥ 87.

శ్లో॥ సక్షార హింగు లవణం సర్వశూలనివారణమ్॥ 88.

తా:— వావిలివేరు, ఆముదపువేరు, నల్లముళ్ళగోరింటవేళ్ళు, పల్లేరు, తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, పంచకోలములు, కరక్కాయబెరడు, మునగచెక్క, ఉలవలు వీని కషాయమందు యవక్షారము వేయించిన ఇంగువ మఱియు సైంధవలవణము వీని చూర్ణములను వేసి యిచ్చిన సర్వశూలలు నివారించును.

## పథ్యాది కషాయః

శ్లో॥ పథ్యా పూతీక శుంఠీ దహన కణకణామూల చవ్యాజగంధా
వర్షాభూ బిల్వఖల్వోరుబు సహచర శుంఠ్యగ్నిమంథైః కషాయః
సక్షారోహింగుమిశ్రః క్షపయితి గుదజ ప్లీహగుల్మాగ్నిమాంద్యా
నష్ఠీలానాహ వాతప్రభవ కఫభవం శూలజాలోదరంచ॥ 89.

తా:— కరక్కాయబెరడు, నేతికానుగ, శుంఠి, చిత్రమూలము, పిప్పళ్ళు, మోడి, చవ్యము, పెన్నేరుగడ్డ, తెల్లగలిజేరు, మారేడువేళ్ళు, నాగబలా, ఆముదపు వేళ్ళు, ముళ్ళగోరింటవేళ్ళు, తక్కలివేరు, శుంఠి వీని కషాయమందు యవక్షారము మఱియు వేయించిన ఇంగువనువేసి సేవించిన గుదరోగ, ప్లీహ, గుల్మ, అగ్నిమాంద్య, అష్ఠీలా, ఆనాహవాతములును, కఫప్రధాన శూలలను మఱియు జలోదరములును హరించును.

## పలాశత్వగాది కషాయః.

శ్లో॥ త్వచాపలాశవృక్షస్య కషాయోవిధినాశృతః
సనాలికేరజక్షీరః సద్యః శూలమపోహతి॥ 90.

తా:— మోదుగచెక్క కషాయమందు కొబ్బరిపాలను జేర్చి సేవించిన శూలలు వెంటనే తగ్గిపోవును.

## దశమూలాది కషాయః.

శ్లో॥ దశమూలపంచకోల త్రిఫలావస్తి త్రికృత్సిద్ధమ్
తోయమశేషం తుపయేజ్జఠరాణ్యపిజాత పయాంసి॥ 91.

తా:— దశమూలములు, పంచకోలములు, త్రిఫలములు, నేపాళపువేరు, తెగడ వీని కషాయమును సేవించిన జలోదర మహోదరములు హరించును.

## నికుంభాది కషాయః.

శ్లో॥ నికుంభకుంభత్రిఫలా గవాక్షీస్నుక్త్రిల్వకైః కల్పితమంబుపీతమ్
సహేమదుగ్ధం సకణం విరేకాజ్జయత్యుదావర్త మహోదరాణి॥ 92

తా:— నాగదన్తివేరు, తెగడ, త్రిఫలములు, ఏటిపుచ్చ, కాడజముడు, లొద్దుగ పిచ్చికుసుమవేరు, పిప్పళ్ళు వీనికషాయము త్రాగినయెడల ఉదావర్తము మఱియు మహోదరములను జయించును.

## పునర్నవాది కషాయః.

శ్లో॥ పునర్నవానించిపటోలశుంఠీ తిక్తామృతా దార్వ్యభయాకషాయః
సర్వాంగశోఫం జ్వరకాసశూల శ్వాసాన్వితం పాండుగదంనిహన్తి॥93.

తా:— తెల్లగలిజేరు, వేపచెక్క, చేదుపొట్ల, శుంఠి, కటుకరోహిణి, తిప్పతీగె, మానిపసుపు, కరక్కాయబెరడు వీనికషాయము సర్వాంగశోఫ, జ్వర, కాస, శూల, శ్వాసలను మఱియు పాండురోగములను హరించును.

## వాసాది కషాయః.

శ్లో॥ వాసాగుడూచీ త్రిఫలా కట్వీభూనింబ నింబజః
క్వాథః క్షౌద్రయుతోహన్తి పాండుపిత్తాస్ర కామలాః॥ 94

తా:— అడ్డసరమువేరు, తిప్పతీగె, కరక్కాయబెరడు, ఉసిరికాయవరుగు, తాని కాయ బెరడు, కటుకరోహిణి, భూనింబ, వేపచెక్క వీని కషాయమందు తేనెజేర్చి సేవించిన పాండు, రక్తపిత్తము మఱియు కామలారోగములు హరించును.

## తింతిడ్యాది కషాయః.

శ్లో॥ తింతిడీవరుణపర్ణశలాకా లోహకిట్ట విజయా పునర్నవైః
ఇక్షుబిల్వసహితైః శృతంజలం పాండుమాశు సగుడంవినిహన్తి॥95.

తా :— చింతాకుల ఈనెలు, మందూరము, కరక్కాయ, తెల్లగలిజేరు వేళ్ళు, నేలకుపేళ్ళు, మారేడు వేళ్ళు వీనికషాయమందు బెల్లమును జేర్చి సేవించిన పాండురోగము హరించును.

## వాసాది కషాయః.

శ్లో॥ వాసాగుడూచీ యష్ట్యాహ్వా కతకామృతవాలకైః
సనింబైః కామలాం హన్యాత్ క్వాథః క్షౌద్రాజ్యసం యుతః॥ 96

తా :— అడ్డసరము, తిప్పతీగె, అతిమధురము, చిల్లగింజలు, తిప్పతీగె, కురువేరు వేపచెక్క వీని కషాయమందు తేనె మఱియు నెయ్యి చేర్చి సేవించిన కామలారోగము హరించును.

## నింబత్వగాది కషాయః.

శ్లో॥ నింబత్వక్త్రిఫలా పటోలరజనీ వాసామృతా సారిబా
శ్యామా తామలకీ ఫలంకవ బలానీలీ స్థిరాయష్టిభిః
సిద్ధో మాక్షికపిప్పలీగిరిజతుప్రక్షేపణాత్సంస్కృతః
క్వాథః కుంభహలీమకం ప్రశమయేద్భిందన్ దినైః పంచషైః॥ 97.

తా :— వేపచెక్క, త్రిఫలములు, చేదుపొట్ల, పసుపు, అడ్డసరము వేళ్ళు, తిప్పతీగె, సుగంధపాలవేళ్ళు, నల్లతెగడ, నేలయుసిరిక, మహిసాక్షిగుగ్గులు, ముత్తవపులగము వేళ్ళు, నీలివేళ్ళు, ముయ్యాకుపొన్న, అతిమధురము వీనికషాయమందు తేనెయు, పిప్పలీ చూర్ణమును మఱియు గోమూత్రి శిలాజిత్తునుజేర్చి సేవించిన కుంభకామలా. మఱియు హలీమకము అయిదురోజులలో శమించును.

## పథ్యాది కషాయః.

శ్లో॥ పథ్యాపునర్నవ నిశాకణమూల వహ్ని
చిత్రాబ్ద జీరకసురద్రుమ మాగధీనామ్
క్వాథంపిబేచ్ఛ్వయథు దండధరాత్త
జీవోప్యుత్తిష్ఠతే శివసమాశ్రిత బాలతుల్యః॥ 98.

తా :— కరక్కాయ, తెల్లగలిజేరు, పసుపు, మోడి, చిత్రమూలము, ఆముదపు వేరు, భద్రముస్తలు, జీలకర్ర, దేవదారు, పిప్పళ్ళు వీని కషాయమును త్రాగిన యముని బారినుండి శివునిచేత రక్షింపబడిన మార్కండేయునివలె పైనంజురోగులు మృత్యువునుండి రక్షింప బడుదురు.

## గోక్షురాది కషాయః.

శ్లో॥ గోక్షురార్ద్రిక వర్షాభూ పథ్యాదారు మహౌషధైః
సరసోనేక్షురైః సిద్ధం తోయం శోధహరం పరమ్॥ 99.

తా :— పల్లేరు, అల్లము, తెల్లగలిజేరు, కరక్కాయ, దేవదారు, శుంఠి, వెల్లుల్లి, నీటిగొబ్బి వీని కషాయము శోథలను హరించును.

## పటోలాది కషాయః.

శ్లో॥ పటోలదార్వీ పిచుమంద తిక్తా త్రాయన్తికాయష్టి వృషాభయోద్ధమ్
జలంవిసర్పం వినిహన్తి ధాత్రీ పటోలముస్తైశ్చ శృతాంబుతద్వత్॥100.

తా :— చేదుపొట్ల, మానిపసుపు, వేపచెక్క, కటుకరోహిణి, కలుకాన్రినుగ చెక్క, యష్టిమధుకము, అడ్డసరము, కరక్కాయ వీని కషాయమున్ను, ఉసిరిక, చేదు పొట్ల, భద్రముస్తలు, అనువాని కషాయమున్ను విసర్పహరములు.

## ముస్తాది కషాయః.

శ్లో॥ ముస్తారిష్ట పటోలదారురజనీ దార్విషా బలానాగరైః
త్రాయన్త్యుత్పల ధన్వయాస ధనికా భూనింబ సేవ్యాంబుధిః
శ్లేష్మా నింబ కుకోలకైశ్చ సకణైః సిద్ధాః కషాయామరుత్
పిత్తశ్లేష్మ విసర్పదర్పశమనాః ప్రోక్తాస్త్రయస్తేక్రమాత్॥ 101.

తా :— తుంగముస్తలు, వేపచెక్క, చేదుపొట్ల, దేవదారు, పసుపు, దారిశు, ముత్తవపులగముపేళ్ళు, (బలామూలము) శుంఠి అనువాని కషాయము వాత విసర్పమును, కలుకాన్రినుగ, నల్లకలువగడ్డ, దూలగొండివేళ్ళు, ధనియాలు, చిరాయితా వట్టివేళ్ళు, కురువేరు, వీనికషాయము పిత్తవిసర్పమును, త్రిఫలములు, వేపచెక్క, అడవిరేగు, (జిట్ట రేగు) చెక్క, పిప్పళ్ళు అనువాని కషాయము శ్లేష్మవిసర్పమును హరించును.

## జీవన్త్యాది కషాయః.

శ్లో॥ జీవన్తీ హిరువేలికా త్రిఫలికా వాసామృతా సారిబా
శుంఠీ యష్టి పయోదచందన పటోలోశీరనింబైః శృతః
నిష్క్వాథోష్ట మశేషితో మధుగుడ ప్రక్షేపణాత్సంస్కృతః
పీతశ్చజ్వరితేన తస్యపిటకోత్పత్తేః ప్రసంగః కుతః॥ 102.

తా :— జీవంతి (అటపతియున్కిళంగు) ఇరువేలి (కూతురుబుడమ) త్రిఫలములు' అడ్డసరము, తిప్పతీగె, సుగంధపాల, శుంఠి, అతిమధురము, తుంగముస్తలు, చందనము

చేదుపొట్ల, వట్టివేళ్ళు, వేపచెక్క, వీనిని అష్టమాంశ కషాయముగ కాచి వడియగట్టి అందు తేనె మఱియు బెల్లము వేసి త్రాగినచో మేహపిటకలకు ముందువచ్చు జ్వరములు శమించును. ఇక పైదానిచే మేహపిటకలు పుట్టవని చెప్పవలసిన అవసరముండదు. అనగా జ్వరములు పోవును మఱియు తత్సంబంధ మేహపిటకలు పుట్టవు.

## శుంఠ్యాది కషాయః

శ్లో॥ శుంఠీ బలానింబ పటోల కుష్ఠైః సధాన్యకైః సామలకైః సముస్తైః

శృతఃకషాయో వినిహన్తి పానాన్మసూరికామష్టవిధాం మధూఢః॥ 103

తా :— శుంఠి, బలామూలము (ముత్తవపులగము వేరు) వేపచెక్క, చేదుపొట్ల, చెంగల్వకోష్టు, ధనియాలు, ఉసిరికాయ, తుంగముస్తలు, వీనికషాయమందు తేనెచేర్చి సేవించిన అష్టవిధమసూరికలు అనగా మశూచికవ్యాధులు హరించును.

## చందనాది కషాయః.

శ్లో॥ చందన పర్పటకామృతవల్లీ సేవ్య జలాంబుద ధాన్యకసిద్ధమ్

దుష్కరముగ్రవిదాహవిమిశ్రం స్ఫోటమశేషమపోహతి సద్యః॥ 104.

తా :— మంచిగంధము, పర్పాటకము, తిప్పతీగె, వట్టివేళ్ళు, కురువేరు, ధనియాలు, తుంగముస్తలు. వీనికషాయము అత్యంత దుఃఖకరమైనట్టియు, ఉగ్రవిదాహముతో గూడిన నట్టివియు నగు విస్ఫోటములు హరించును.

## పటోలాది కషాయః.

శ్లో॥ పటోల త్రిఫలారిష్ట గుడూచీధావనీ వృషైః

సకరంజైః కషాయోఽయం కుష్ఠజిద్వజ్రికం స్మృతమ్॥ 105.

తా:— చేదుపొట్ల, త్రిఫలములు, వేపచెక్క, తిప్పతీగె, వాకుడు, అడ్డసరము వేరు, కానుగచెక్క, వీనికషాయము కుష్ఠరోగములపైని వజ్రాయుధమువలె పనిచేయును.

## ఖదిరాది కషాయః.

శ్లో॥ ఖదిరారిష్ట గుడూచీ పటోలదార్వీ దురాలభా క్వాథః

కుష్ఠానాం వినిహన్తా దైత్యానాం నృసింహఇవ॥ 106.

తా:— చంద్రచేవ, వేపచెక్క, తిప్పతీగె, చేదుపొట్ల, మానిపసుపు, దురదగొండి; వీని క్వాథము నరసింహమూర్తి రాక్షసులను సంహరించునట్లు కుష్ఠవ్యాధులన హరించును.

## కాకోదుంబరాది కషాయః.

శ్లో॥ కాకోదుంబరికావేల్ల చంద్రరేఖా శృతంజలమ్
పీతం ప్రథావయేచ్ఛ్విత్రిం కుష్ఠమౌదుంబరం తథా॥ 107.

తా:— అడవిమేడి, వాయువిడంగములు, బావంచాలు, వీనికషాయమును సేవించిన (బొల్లి) శ్వేతకుష్ఠము మఱియు ఔదుంబరకుష్ఠము పోవును.

## మంజిష్ఠాది కషాయః.

శ్లో॥ మంజిష్ఠాముస్త కుటజ గుడూచీ కుష్ఠనాగరైః
భార్గీక్షుద్రా వచా నింబ నిశాద్వయ ఫలత్రికైః॥ 108.

శ్లో॥ పటోలకటుకీ మూర్వా విడంగాసన చిత్రకైః
శతావరీ త్రాయమాణా కృష్ణేంద్రయవ వాసకైః॥ 109.

శ్లో॥ భృంగరాజ మహాదారు పాఠా ఖదిర చందనైః
త్రివృద్వరుణ కైరాత బాకుచీ కృతమాలకైః॥ 110.

శ్లో॥ శాఖోటక మహానింబ కరంజాతి విషాజలైః
ఇంద్రవారుణికానన్తా సారిబాపర్పటైః సమైః॥ 111.

శ్లో॥ ఏభిః కృతం పిబేత్ క్వాథం కృష్ణా గుగ్గులుసంయుతమ్
అష్టాదశసు కుష్ఠేషు వాతరక్తార్దితే తథా॥ 112.

శ్లో॥ ఉపదంశే శ్లీపదేచ ప్రసుప్తౌ పక్షఘాతకే
మేదోదోషే నేత్రరోగే మంజిష్ఠాదిః ప్రశస్యతే॥ 113.

తా:— మంజిష్ఠ, తుంగముస్తలు, కొడిశపాలచెక్క, తిప్పతీగె, చెంగల్వకోష్ఠు, శుంఠి, గంటుభారంగి, వాకుడు, వస, వేపచెక్క, పసుపు, మానిపసుపు, త్రిఫలములు, చేదుపొట్ల, కటుకరోహిణి, చాగవేరు, వాయువిడంగములు, వేగిసచెక్క, చిత్రమూలము, శతావరి, కానుగచెక్క, పిప్పళ్లు, కొడిశపాలగింజలు, అడ్డసరము, గుంటగలగర, దేవదారు, విమబొద్ది, చంద్రచేవ, చందనము, తెగడ, ఉలిమిరిచెక్క, చిరాయితా (కిరాతతిక్తము) బావంచాలు, రేలవేరు; భరణిక, లేక బిర్రెంక లేక తపసిచెక్క, పెద్దవేపచెక్క, కానుగచెక్క, అతివస, కురువేరు, ఏటిపుచ్చ, దూలగొండివేరు, సుగంధపాల, పర్పాటకము ఇవి సమభాగములు. వీనిచే సిద్ధమైన కషాయమందు పిప్పలీచూర్ణము మఱియు శుద్ధమహిసాక్షి గుగ్గులును జేర్చి సేవించిన అష్టాదశ కుష్ఠులు, వాతరక్తము, అర్దితవాతము, ఉపదంశము, శ్లీపదము, ప్రసుప్తి, పక్షాఘాతము, మేదోరోగము, మఱియు నేత్రరోగములను హరించుటయందు ప్రాముఖ్యమును బొందినది.

## నిర్గుండ్యాది కషాయః.

శ్లో॥ నిర్గుండ్యగ్ని విడంగదారు రజనీ ముస్తాఖుకర్ణీ కృవైః
భార్గీవ్యోమషఫలాశ శిగ్రు చవికా పథ్యారసోనాన్వితైః
క్వాథః శిగ్రువిడంగ హింగు పటుమాన్ కీటాంశ్చ విధ్వంసయేత్
దండోథర్వ సమస్త మంత్ర కృతసంస్కారోయథా వాసురాన్॥ 114.

తా:— వావిలి, చిత్రమూలము, వాయువిడంగములు, దేవదారు, పసుపు, తుంగ ముస్తలు, ఎలుకచెవియాకు, భూతాంకుశము, గంటుభారంగి, శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, మోదుగచెక్క, మునగచెక్క, చవ్యము, కరక్కాయ, వెల్లుల్లి వీని కషాయ మందు మునగగింజలు, వాయువిడంగములు, ఇంగువ మఱియు సైంధవలవణము, వీని చూర్ణములను జేర్చి సేవించిన అధర్వమన్త్రములచే దండింపబడిన రాక్షసులవలె క్రిములు ధ్వంసమగును

## విడంగాది కషాయః.

శ్లో॥ విడంగకృష్ణా మరిచ నిర్గుండీ మూల శిగ్రుభిః
భార్గీ విశ్వాఖుకర్ణ్యబ్దైః క్వాథః కృమిహరః పరః॥ 115.

తా:— వాయువిడంగములు, పిప్పళ్ళు, మిరియాలు, వావిలివేరు, మునగచెక్క గంటుభారంగి, శుంఠి, ఎలుకచెవియాకు, భద్రముస్తలు, వీనికషాయము కృమిహరమందు ముఖ్యమైనది.

## బలాది కషాయః.

శ్లో॥ బలాసహాచరైరండ శుంఠీ రాస్నా సురద్రుమైః.
ససింధువార లశునైరష్టవర్గో నిలాపహః॥ 116.

తా:— ముత్తవపులగమువేళ్ళు, నల్లముళ్ళగోరింటవేళ్లు, ఆముదపువేళ్ళు, శుంఠి, సన్నదుంపరాష్ట్రము, దేవదారు, వావిలివేళ్ళు, వెల్లుల్లి, ఈ యెనిమిది వస్తువుల కషాయము వాతమును హరించును.

## శుంఠ్యాది కషాయః.

శ్లో॥ శుంఠీ బలాద్వయ క్వాథస్సర్వవాత నిబర్హణః॥ 116. అ

తా:— శుంఠి, పెద్దముత్తవపులగము, చిన్నముత్తవపులగమువేళ్ళు, వీనికషాయము సర్వవాతములను హరించును.

## సప్తచ్ఛదాది కషాయః.

శ్లో॥ సప్తచ్ఛదోశీర పటోల ముస్తా
హరీతకీతిక్తక రోహిణీభిః
యష్ట్యాహ్వ రాజద్రుమ చందనానాం
క్వాథంపిబేత్ పాకహరం ముఖస్య॥ 117.

తా:— సప్తపర్ణి, (ఏడాకులపొన్న) వట్టివేళ్ళు, చేదుపొట్ల, భద్రముస్తలు, కరక్కాయ, కిరాతతిక్తము, కటుకరోహిణి, యష్టిమధుకము, రేలచెక్క, మంచి గంధము, వీనికషాయము త్రాగినయెడల నోటిపూత (ముఖపాకము) హరించును.

## దశమూలాది కషాయః.

శ్లో॥ దశమూలామృతా ముస్తా పర్పటోశీరచందనైః
పునర్నవా బలా ధాత్రీ పటోల కటుకాహ్వయైః॥ 118.

శ్లో॥ వాసాపుష్పలతాయాస విష్ణుక్రాంతిభిరన్వితైః
సహదేవీచ భార్గీచ త్రిజాతం కటురోహిణీ॥ 119.

శ్లో॥ అగ్రగ్రాహీచ రాస్నాచ కిరాతకశ్చసంయుతైః
పథ్యా విభీతకయుతైః కలింగకమన్వితైః॥ 120.

శ్లో॥ చోరజోంగకసంయుక్తైః శతాహ్వామధుకైరిభైః
చీనోషణమజాజీవ జాతీఫలదళాన్వితైః॥ 121.

శ్లో॥ తత్పుష్పైశ్చ సమైరేభిర్వ్యాఘ్రకంఠకుసుమాన్వితైః
దేవదారు నతం కుష్ఠం జీరకద్వయసంయుతైః॥ 122.

శ్లో॥ కిరాతతిక్తకం వేణుం తాలపల్లవయోజితమ్
క్వాథం సన్నివికారేషు విశేషాత్ కఫవాతయోః
కంపజాడ్యాది హరణం సర్వదోష హరంపరమ్॥ 123.

తా:— దశమూలములు, తిప్పతీగె, ముంగముస్తలు, పర్పాటకము, వట్టివేళ్ళు, చందనము, తెల్లగలిజేరు, ముత్తవపులగమువేళ్ళు, ఉసిరికాయ, చేదుపొట్ల, కటుక రోహిణి, అడ్డసరము, బూడిదగుమ్మడుతీగె, విష్ణుక్రాంతము, దూలగొండి, సహదేవి, గంటుభారంగి, అతుపత్రి, లవంగిపట్ట, ఏలకులు, కటుకరోహిణి, అగ్రగ్రాహి (దీనిని మలయాళ భాషలో 'తిలోణి కిళంగు' అందురు), సన్నరాస్నము, కిరాతతిక్తము

(చిరాయితా), కరక్కాయ బెరడు, తానికాయబెరడు, కొడిశపాల, కచోరములు, అగరుగంధము, సాయికూరగింజలు (బద్దసోపు), యష్టిమధుకము, గజపిప్పళ్ళు, కొష్టులు, మిరియాలు, నల్లజీలకర్ర, జాజికాయ, జాపత్రి, జాజిపువ్వులు, తులసిపువ్వులు, దేవదారు, గ్రంధితగరము, చెంగల్వకోష్ఠు, సన్నజీలకర్ర, పెద్దజీలకర్ర, కిరాతతిక్త (చిరాయితా), వెదురాకులు, తాటిచిగుళ్ళు, అనువాని కషాయము సర్వవిధ సన్నిపాత జ్వరములను విశేషముగా కఫవాతోల్బణ సన్నిపాత జ్వరములను, మఱియు కంపము మొదలగు వ్యాధులను హరించును.

## ఏరండాది కషాయః.

శ్లో॥ ఏరండకోరండ బలామృతానాం
శతావరీ విశ్వయుజాం కషాయః
హృత్పార్శ్వవస్తి త్రికపృష్ఠ శూలం
నిహన్తి సింధూత్థ సితామధూఢః॥ 124.

తా:— ఆముదపువేళ్ళు, నల్లముళ్ళగోరింటవేళ్ళు, బలామూలము (చిట్టాముట్టి వేళ్ళు), తిప్పతీగె, శతావరి, శుంఠి, వీనికషాయమందు సైంధవలవణము, చక్కెర, మఱియు తేనెయనుజేర్చి సేవించిన హృదయ, పార్శ్వ, వస్తి, త్రిక, పృష్ఠములందు గల శూలలను హరించును.

## ఏరండాది కషాయః.

శ్లో॥ ఏరండ కోరండ నిదిగ్ధికాహ్వా దేవద్రు
విశ్వైలశున్ఠైః పరిపక్వమంభః॥
పయోన్వితం పీతవతాం నరాణాం
హృత్కుక్షినాభివృషణోరు రుజోనిహన్తి॥ 125.

తా:— ఆముదపువేళ్ళు, నల్లముళ్ళగోరింటవేళ్లు, వాకుడు, దేవదారు, శుంఠి, వెల్లుల్లి, వీని కషాయమందు పాలుచేర్చి త్రాగినయెడల హృదయ కుక్షి నాభి వృషణములందును మఱియు తొడలయందునుగల నొప్పులను హరించును.

## ధనదాది కషాయః.

శ్లో॥ ధనదనయన శుంఠీ శిగ్రురాస్నాగ్నిగంధా
వరుణలశున కృష్ణా చిత్రకైరండకశ్చ
సురతరు ఘనపథ్యా బర్బరైః సంభృతాంభః
శమయతి పరిపీతం సార్దితాక్షేపవాతాన్॥ 126.

తా:— గచ్చపేరు, శుంఠి, మునగచెక్క, సన్నరాష్ణము, వస, ఉలిమిరిచెక్క, వెల్లుల్లి, పిప్పళ్ళు, చిత్రమూలము, ఆముదపువేళ్లు, దేవదారు, తుంగముస్తలు, కరక్కాయ, వసతులసి లేక భూతులసి, వీనికషాయము త్రాగినయెడల అర్దిత, ఆక్షేపకాది వాతములను శమింపజేయును.

## ప్రసారిణ్యాది కషాయః.

శ్లో॥ ప్రసారిణీ మాషబలారసోన రాస్నామహౌషధైః ప్రక్వథితం తదంభః
పిబంతి యేక్షీర భుజోజయంతి మరుద్వికారానపబాహుకంచ॥ 127.

తా:— ప్రసారిణీ, మినుములు, ముత్తవపులగమువేళ్ళు, వెల్లుల్లి, సన్నరాష్ణము, శుంఠి, వీని కషాయమును సేవించి పాలుమాత్రమే త్రాగినయెడల వాతవికారములు మఱియు అపబాహుక వాతములు నివారించును.

## సహచరాది కషాయః.

శ్లో॥ సహాచరం సురదారు సనాగరం క్వథితమంభసి తైలవిమిశ్రితమ్
పవనపీడిత దేహగతిః పిబేద్ద్రుత విలంబిత గోభవతీచ్ఛయా॥ 128.

తా:— నల్లముళ్ళగోరింటవేళ్ళు, దేవదారు, శుంఠి, వీనికషాయమందు తైలమును జేర్చి సేవించిన పురాతన వాతరోగములు పోయి దీర్ఘకాలమువరకు జీవింతురు. (దక్షిణమున నూనెకుబదులుగా వంటఆముదమును జేర్తురు.)

## రసోనాది కషాయః.

శ్లో॥ రసోనకారవీ కృష్ణా స్థిరాభిః సాధితం జలమ్
పీతమున్మార్గగం వాతమనులోమయతిక్షణాత్॥ 129.

తా:— వెల్లుల్లి, నల్లజీలకర్ర, పిప్పళ్ళు, ముయ్యాకుపొన్న, వీనికషాయము త్రాగినయెడల ఊర్ధ్వగతవాతము వెంటనే అరోగతమగును.

## గంధర్వహస్తాది కషాయః.

శ్లో॥ గంధర్వహస్త చిరిబిల్వ హుతాశవిశ్వ
పథ్యాపునర్నవ యవాసక భూమితాలైః
క్వాథస్ససైంధవ గుడః పవనస్య శాంత్యై
ర్వహ్నేర్బలాయ రుచయేమలశోధనాయ॥ 130.

తా:— ఆముదపువేరు, కానుగవేరు, చిత్రమూలము, శుంఠి, కరక్కాయబెరడు, తెల్లగలిజేరువేరు, దూలగొండివేరు, నేలతాడిగడ్డ, వీనిక్వాథమందు సైంధవలవణము

మఱియు బెల్లమును జేర్చి సేవించిన వాతము శమించి అగ్నిదీప్తిని, రుచిని గలిగించి మల శోధనమును జేయును.

## పంచమూల కషాయః.

శ్లో॥ పంచమూలశృతంక్షీరం వాతశోణిత నాశనమ్॥ 130. అ

తా:— మారేడువేరు, తక్కలివేరు, పెద్దగుమ్మడువేరు, కలిగొట్టు, దుందిలము, వీని కషాయమందు పాలుజేర్చి సేవించిన వాతరక్తము నశించును.

## రాస్నాది కషాయః.

శ్లో॥ రాస్నైరండ బలాసహాచర వరీదుఃస్పర్శ వాసామృతా
దేవాహ్వాతివిషా ఘనేక్షుర శఠీవిశ్వైః కషాయః శృతః
సర్పిస్తైలవిమిశ్రితః ప్రశమయేద్వాయుం సశూలంతథా
జంఘోరు త్రికపృష్ఠ పార్శ్వ హనుగం శోఫంచ వాతాసృజమ్॥ 131.

తా:— సన్నరాస్నము, ఆముదపువేళ్ళు, ముత్తవపులగమువేళ్ళు, నల్లముళ్ళ గోరింటవేళ్ళు, శతావరి, దూలగొండివేళ్ళు, అడ్డసరమువేళ్ళు, తిప్పతీగె, దేవదారు, అతివస, భద్రముస్తలు, నీటిగొబ్బి, కచోరములు, శుంఠి, వీనికషాయమందు నెయ్యి మఱియు తైలమును జేర్చి సేవించిన శూలతోగూడిన వాతము, పిక్కలు, తొడలు, నడుము, వీపు, పార్శ్వములు, దవడలు. వీనియందుండు వాపులు మఱియు వాతరక్తములు శమించును. (దక్షిణదేశమందు వాతహర కషాయములందు నూనెకు మారుగా వంట ఆముదమును జేర్తురు).

## (1) రాస్నాది కషాయః.

శ్లో॥ రాస్నాతామలకీ వృషా గురుశఠీ చిత్రాబ్ద చవ్యాశ్మభిః
ధాత్రీ బ్రాహ్మీ పటోల పుష్కరనిశా సైరేయ విశ్వాగ్నిభిః

## (2) రాస్నాది కషాయః.

నిష్కాథో దశమూలదారు సహితః పీతః కదుష్ణోనృణామ్
హన్యాత్సైంధవ ఖండశౌండ సహితో వాతం త్రిదోషోత్తరమ్॥ 132.

తా:— సన్నరాస్నము, నేలయుసిరిక, అడ్డసరమువేళ్ళు, అగరు, కచోరములు, ఆముదపువేళ్ళు, తుంగముస్తలు, చవ్యము, కొండపిండిచెట్టు, ఉసిరికాయ, గంటు భారంగి, చేదుపొట్ల, పుష్కరమూలము, పసుపు, ముళ్ళగోరింటవేళ్ళు, శుంఠి, చిత్రమూలము, దశమూలములు, దేవదారు, అనువాని కషాయమందు సైంధవలవణము,

ఖండశర్కర, మఱియు పిప్పలీచూర్ణములను జేర్చి కొంచెము ఉడుకుగానుండ సేవించిన త్రిదోష జనిత దుష్టవాత రోగములు హరించును.

## రాస్నాది కషాయః.

శ్లో॥ రాస్నా ద్విగుణభాగా స్యాదేక భాగాస్తతః పరే
ధన్వయాస బలైరండ దేవదారు శఠీవచాః॥ 133.

వాసకో నాగరం పథ్యా చవ్యా ముస్తా పునర్నవా
గుడూచీ వృద్ధదారుశ్చ శతపుష్పాచ గోక్షురః॥ 134.

అశ్వగంధా ప్రతివిషా కృతమాలః శతావరీ
కృష్ణా సహచరశ్చైవ ధాన్యకం బృహతీద్వయమ్॥ 135.

ఏభిః కృతం పిబేత్ క్వాథం శుంఠీ చూర్ణేన సంయుతమ్
కృష్ణాచూర్ణేనవా యోగ రాజగుగ్గులునాథవా॥ 136.

అజమోదాదినావాపి తైలేరండజేనవా
సర్వాంగకంపే కుబ్జత్వే పక్షాఘాతేఽప బాహుకే॥ 137.

గృధ్రస్యామామవాతేచ శ్లీపదేచాపతానకే
అన్త్రవృద్ధౌ తథాధ్మానే జంఘా జానుగతేర్దితే॥ 138.

శుక్రామయే మేఢ్రరోగే వంధ్యాయోన్యామయేషుచ
మహారాస్నాది రాఖ్యాతో బ్రహ్మణాగర్భకారణమ్॥ 139.

తా:— సన్నదుంపరాస్నము రెండుభాగములు, దురదగొండివేళ్ళు, ముత్తవపులగమువేళ్లు (వీనినే నూనెచుంతవేళ్ళందురు), ఆముదపువేళ్ళు, దేవదారు, కచోరములు, వస, అడ్డసరము, శుంఠి, కరక్కాయబెరడు, చవ్యము, తుంగముస్తలు, తెల్లగలిజేరు, తిప్పతీగ, వృద్ధదారు, బద్దసోపు (సాయికూరగింజలు), పల్లేరు, పెన్నేరుగడ్డ, అతివస, రేలకాయ, శతావరి, పిప్పళ్లు, నల్లఘుల్లగోరింటవేళ్ళు, ధనియాలు, ములక, వాకుడు. ఇవి ప్రత్యేకమొక భాగము. వీనిచే సిద్ధమైన కషాయమందు; శుంఠీచూర్ణమునుగాని లేక పిప్పలీచూర్ణమునుగాని లేక యోగరాజగుగ్గులునుగాని లేక అజామోదాది చూర్ణమునుగాని లేక వంటఆముదమును గాని చేర్చి త్రాగినయెడల సర్వాంగకంప, కుబ్జత్వ, పక్షాఘాత, అపబాహుక, గృధసీ, ఆమవాత రోగములును, శ్లీపద, అపతానక అన్త్రవృద్ధి, ఆధ్మాన, జంఘాజానుగతార్దితవాత రోగములును శుక్రరోగ, మేఢ్రరోగ, వంధ్యారోగములును మఱియు యోనిరోగములును హరించును. ఈమహారాస్నాదిక్వాథము బ్రహ్మచే జెప్పబడినది. ఇది వంధ్యలకు గర్భకారకౌషధము.

## (3) రాస్నాది కషాయః.

శ్లో॥ రాస్నైరండామృతోగ్రా సహచరచవికా రామసేనాబ్దభార్గీ
దీప్తానన్తా యవానీ వృకిముర కృమిజచ్ఛృంగి శుంఠీబలాభిః॥
మూర్వా తిక్తా సమంగాతివిష శతివరా పిప్పలీయావశూకైః
రక్తశ్రీఖండకారగ్వధ కటుకఫలైర్వత్స వృశ్చీవయుక్తైః॥ 140.
సర్వైరేతైర్దశాంఘ్రిప్రియుత సమలవైః సాధితోష్టావశేషః
క్వాథో రాస్నాదిరాద్యో మహదుపపదవాన్ కౌశికోక్తోనిహన్తి
సర్వాంగైకాంగవాతాన్ శ్వసన కసన హృత్స్వేద శైత్యాతితంద్రాన్
శూలం తూనీం ప్రతూనీం గలగద నిఖిలాంగ వ్యథా కంపఖల్లీః॥ 141.
విశ్వాచీ శ్లీపదామానిల నిఖిల మహాసూతికారోగసుప్తి
జిహ్వాస్తంభాపతానం స్ఫుటనవిమథనః క్లీబతాక్షేపకౌబ్జ్యం
శోఫాటోపాపతంద్రార్దిత ఖుడన హను గృధ్రసీ వాతశూలమ్
వాయుంశ్లేష్మోత్థరోగానపి గిరితనయావల్లభేనోపదిష్టః॥ 142.

తా:— సన్నరాస్నము, ఆముదపువేరు, తిప్పతీగె, వస, నల్లముళ్ళగోరింట, చవ్యము, దూలగొండివేరు, తుంగముస్తలు, గంటుభారంగి, ఓమ, సుగంధపాలవేళ్ళు, ఖురాసానిఓమ, విషబొద్ది, మురామాంసి, వాయువిడంగములు, కర్కాటకశృంగి, శుంఠి, ముత్తవపులగమువేరు, చాగపేరు, కటుకరోహిణి, మంజిష్ఠ, అతివస, కచోరములు, కరక్కాయ, ఉసిరికాయ, తాడికాయ, పిప్పళ్ళు, యవక్షారము, రక్తచందనము, మంచిగంధము, రేలకాయ, తక్కోలములు, కొండిశపాలగింజలు, తెల్లగలిజేరు, దశమూలములు, ఇవి సమభాగములు. వీనిని కషాయవిధి ననుసరించి అనగా అష్టమాంశముగ కాచి వడియగట్టి సేవించవలెను. ఇది లోకహితార్థము కౌశికమునిచే జెప్పబడినది. దీనిచేత సర్వాంగ, ఏకాంగవాతములును; శ్వాస, కాస, హృదయ, స్వేద, శైత్య, తంద్ర, శూల, తూనీ ప్రతూన్యానీ, గళ, నిఖిలాంగవ్యథ, కంపఖిల్లీ రోగములును, విశ్వాచీ, శ్లీపద, ఆమవాత, సర్వవిధసూతికలును, సుప్తి (అతినిద్ర), జిహ్వాస్తంభ, స్ఫుటన, విమథన, క్లైబ్య, ఆక్షేపక, కుబ్జత్వ, శోఫ, ఆటోప, తంద్ర, అర్దిత, వాతరక్త, హనుగ్రహ, గృధ్రసీ, వాతశూల, ఉదరవాతరోగములును, మఱియు శ్లేష్మప్రధాన రోగములును హరించును. ఇది తొలుత పార్వతీపతియైన శంకరునిచే జెప్పబడినది.

## వరాది కషాయః

శ్లో॥ వరీ ఛిన్నరుహాక్వాథో వాతశోణితనాశనః॥ 142.

తా:— శతావరి, మఱియు తిప్పతీగె వీని కషాయము వాతరక్తమును నాశనము చేయును.

## శతావర్యాది కషాయః.

శ్లో॥ శతావరీ ఛిన్నరుహామలత్వగ్బలేక్షు కాండేక్షుర సంభృతాంభః
కల్కేన యష్టీ మధుకస్యమిశ్రం దునోతివాతాస్రమథాస్రపిత్తమ్॥142.

తా:— శతావరి, తిప్పతీగె, ఉసిరికచెక్క, ముత్తవపులగముపేరు, నీటిగొబ్బి, వీని కషాయమందు యష్టిమధుక చూర్ణమును జేర్చి సేవించిన వాతరక్తము మఱియు రక్తపిత్తము హరించును.

## లఘుపంచమూల కషాయః.

శ్లో॥ లఘునాపంచమూలేన ఘృతంక్షీరం తథాహితమ్
వరాసనాగ్న్యయః పత్రనిశాంభః స్థౌల్యదోషజిత్॥ 144.

కటుకామలగుడూచీ శుంఠీశమ్యాక పల్లవైః సశివైః
సిద్ధం తోయం సగుడం పీతం మలశోధనం కురుతే॥ 145.

పటోలమూలకైరండ దన్తీ శ్రేష్ఠేక్షు కుంజకైః
శుంఠీ గుడూచీయుక్తైశ్చ పూతీశమ్యాకపల్లవైః 146.

ససింధూత్థగుడం క్వాథం విరేకార్థం ప్రశస్యతే॥

తా:— లఘుపంచమూలములు (వాకుడు, ములక, పల్లేరు, ముయ్యాకుపొన్న, కోలపొన్న) వీనికషాయమందు నెయ్యి మఱియు పాలుచేర్చి సేవించిన వాతరక్తము మఱియు రక్తపిత్తము హరించును. త్రిఫలములు, వేగిసచెక్క, శుద్ధలోహచూర్ణము, చిత్రమూలము, పసుపు, వీనికషాయము స్థౌల్యరోగమును బోగొట్టును. కటుకరోహిణి, ఉసిరికాయ, తిప్పతీగె, శుంఠి, రేలచిగుళ్ళు, కరక్కాయ, వీనిచే కాచబడిన క్వాథమందు బెల్లమును జేర్చి త్రాగినచో మలశోధనముచేయును. చేదుపొట్లవేళ్ళు, ఆముదపువేళ్ళు, దన్తీమూలము, కరక్కాయ, తాడికాయ, ఉసిరికాయ, చెఱుకువేళ్లు, తేగడ, శుంఠి, తిప్పతీగె, కానుగచిగుళ్ళు, రేలచిగుళ్ళు, వీని కషాయమందు సైంధవలవణము మఱియు బెల్లముచేర్చి సేవించిన విరేచనమగును. ఇది విరేచనములకుగాను ప్రశస్తమైనది.

## వాతరోగహర ధాన్యామ్లః.

శ్లో॥ అశీతివాతరోగేషు ధాన్యామ్లం సునిషేవయేత్॥ 147.

శ్లో॥ శుభేముహూర్తే నక్షత్రే స్వగృహే కలశం న్యసేత్
తస్మిన్నేతాంశ్చ సంభారాన్ నిక్షిపేన్మతిమాన్ భిషక్॥ 148.

శ్లో॥ తండులస్యదశప్రస్థం పృథుకస్య తథైవచ
కులత్థస్య తథాలాజాశ్చ త్వారింశన్న్యసేత్పునః॥ 149.

శ్లో॥ ఆఢకం కంగుబీజానాం కోద్రవస్యచ తండులాన్
చతుః ప్రస్థం క్షిపేత్ పశ్చాద్ద్విప్రస్థం నాగరస్యతు॥ 150.

శ్లో॥ కంసం దంతశతాలూనాం దీప్యకం కుడవాష్టకమ్
ఉష్ణోదకస్య ద్విశతప్రస్థం క్షిప్త్వాతిరోదధేత్॥ 151.

శ్లో॥ తస్య తద్వదనం బద్ధ్వా పరితోగ్నిం ప్రవర్తయేత్
ఆసప్తదివసాదేవ మష్టమే దివసే పునః॥ 152.

శ్లో॥ ధాన్యామ్లమస్మాదాకృష్య పునరుష్ణోదకం క్షిపేత్
ఆతురం స్నిగ్ధసర్వాంగం తదాత్రావగాహయేత్
మాత్రాణాం షట్సహస్రాణి పరమః కాలఉచ్యతే॥ 153.

తా:— ఎనుబది వాతరోగములకు ధాన్యామ్లము నుపయోగించ వలయును. శుభ ముహూర్త శుభనక్షత్రమందు బుద్ధిమంతుడగు వైద్యుడు తనగృహమున పరిశుభ్రమైన ఒక మృణ్మయపాత్రలో నీ క్రిందచెప్పబడిన వస్తువులను వేయవలయును. బియ్యము 10 ప్రస్థములు, అటుకులు 10 ప్రస్థములు, ఉలవలు 10 ప్రస్థములు, వరిపేలాలు 4 ప్రస్థములు, కొఱ్ఱలు 4 ప్రస్థములు, ఆరికెలు 4 ప్రస్థములు, శుంఠి 2 ప్రస్థములు, గజనిమ్మపళ్లు చాంగేరీ (పులిచింత) 4 ప్రస్థములు, ఓమ 2 ప్రస్థములు, వీనిని వేరువేరుగా బట్టలతో మూటలుగాగట్టి పైకుండలోవేసి అందు 200 ప్రస్థములు వేడినీళ్ళుకూడపోసి దాని ముఖమును బంధించునది. పైపాత్రను ప్రతిదివము ఉదయమున నిప్పుమీదపెట్టి కాచుచు ఈ ప్రకారము ఏడురోజులుంచి ఎనిమిదవ దినమున దానిని తెరువవలయును. దీనిలో నుండి రోగికి కావలసినంత ధాన్యామ్లమును గ్రహించి దీనికిసమము వేడినీళ్ళు పైపాత్రలో బోసి జాగ్రత్తగా నుంచవలెను. ఈగ్రహించిన ధాన్యామ్లమును వేడిచేసి ఒక తొట్టిలో (ద్రోణిలో) బోసి రోగికి ముందుగా నవసరమగు తైలమును సర్వాంగలేపముచేసి కూర్చుండ బెట్ట వలయును. అందులోని ధాన్యామ్లము చల్లారినచో తింగి వేడియైనదానిని జేర్చ వలయును. ఈ ప్రకారము ఆరోగి ద్రోణిలో 6000 మాత్రల కాలమువరకు (3¾ ఘడియలు) ఉండవలెను. అంతకంటె హెచ్చుకాల ముండరాదు. దీని తరువాత రోగి వేడి నీళ్ళతో స్నానముచేసి శుభ్రముగా తుడుచుకొని మంచిబట్టలను ధరించవలయును. రోగి చేత ఒకరోజు ధాన్యామ్ల ద్రోణీ స్నానమున్ను, ఆమరునాడు, ధారావిధి ననుసరించి

ధాన్యామ్లధారాస్నానమున్ను చేయించుచు యీ ప్రకారము 14 రోజులు ధారా స్నానమును మఱియు 14 రోజులు ద్రోణీ స్నానమును మొత్తము 28 రోజులు చేయించ వలయును. అటుపిమ్మట అగ్ని బలానుసారము, రోగానుసారము, యథోచిత ఘృతమును సిద్ధముచేసి రోగికివ్వవలయును. దీనిచే సకల వాతవ్యాధులు, మూలవ్యాధులు, మఱియు ఆమాశయ వ్యాధులు శమించును. ద్రోణి, దాని నిర్మాణవిధి, ధారాకల్పవిధి, ఇత్యాదులు అనుబంధ ప్రకరణమందు జూడనగును.

## పిప్పల్యాది యవాగూ

శ్లో॥ పిప్పలీ పిప్పలీమూల చవ్య చిత్రక నాగరైః
యవాగూ దీపనీయాస్యాత్ శూలఘ్నీ చోపసాధితా॥ 154.

తా :— పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి, వీనిచే సిద్ధమైన యవాగును సేవించిన దీపనముకలిగించి శూలలనుబోగొట్టును.

## కఫపిత్తాతిసారఘ్నకషాయః — తాలపర్ణ్యాది పేయః

శ్లో॥ తాలపర్ణా బలాబిల్వైః పృశ్నిపర్ణాచసాధితా ।
దాడిమామ్లా హితా పేయా కఫపిత్తాతిసారిణామ్॥ 155.

తా :— నేలతాడిగడ్డలు, ముత్తవపులగమువేళ్ళు, మారేడువేళ్లు, కోలపొన్న వీని పేయనుందు దానిమ్మరసమును జేర్చి సేవించిన కఫపిత్తాతిసారములు హరించును.

## హ్రీబేరాది పేయః

శ్లో॥ పయస్యర్ధోదకే ఛాగే హ్రీబేరోత్పల నాగరైః
పేయారక్తాతిసారఘ్నీ పృశ్నిపర్ణీ రసాన్వితా॥ 156.

తా :— ఒకభాగము మేకపాలలో అర్థభాగము నీళ్ళుచేర్చి అందు కురువేరు, కలువదుంప, శుంఠి, కోలపొన్న, అనువానినివైచి పేయముచేసి సేవించిన రక్తాతిసారము హరించును.

## శ్వదంష్ట్రాది కషాయః

శ్లో॥ శ్వదంష్ట్రాకంటకారిభ్యాం మూత్రకృచ్ఛ్రే సఫాణితమ్॥

తా:— పల్లేరు, వాకుడు, వీనిఫాంటము లేక కషాయము మూత్రకృచ్ఛ్రహరము.

## విడంగాది యవాగూ

శ్లో॥ విడంగపిప్పలీమూల శిగ్రుభిర్మరిచేనచ ।
తక్రసిద్ధా యవాగూస్యాత్ కృమిఘ్నీ ససువర్చికా ॥ 157.

తా :— వాయువిడంగములు, మోడి, మునగవేరు, మిరియాలు, మఱియు సౌవర్చలవణము వీనిగంజిలో మజ్జిగను జేర్చి సేవించిన కృమివ్యాధులు హరించును.

## దశమూల పేయః

శ్లో॥ దశమూలశృతా పేయా శ్వాసకాసరుజాపహా॥ 158.

తా :— దశమూలక్వాథముతో జేయబడిన పేయము శ్వాసకాసహరము.

## తామ్రచూడరససిద్ధఘృతమ్

శ్లో॥ తామ్రచూడరసేసిద్ధా స్రోతోమార్గ రుజాపహా ।
సమాషవిడులా వృష్యా ఘృతక్షీరోపసాధితా॥ 159.

తా :— కోడిమాంసముతో సిద్ధమైన రసమందు పాలు మఱియు నెయ్యిచేర్చి సేవించిన స్రోతస్సులందుండు బాధలను బోగొట్టి శుక్రవృద్ధిని జేయును. మినుములు, శీకాయవేరు, అనువానిని ఘృతక్షీరములతో గాచి సేవించినను పై గుణములను జేయును.

## ధాత్ర్యాదిరసః (సోమరోగహర కషాయః)

శ్లో॥ ధాత్రీరసస్య స్వరసేనరంభాఫలం మధూఢం ససితం పిబేద్వా
సితామధూఢం మధుకం విదారీం మాషంచదుగ్ధైః సహసోమరోగే॥

తా :— ఉసిరికస్వరసమందు అఁటిపండు, తేనె, మఱియు శర్కరచేర్చి సేవించిన సోమరోగము హరించును. లేక యష్టిమధుకము, నేలగుమ్మడుగడ్డ, మినుములు, వీనికషాయమందు పాలు, తేనె, మఱియు శర్కరచేర్చి సేవించినను సోమరోగము శమించును.

శ్లో॥ ధాత్రీ మాష ద్విదర్భాంగీ సాధితాంబు సితాయుతమ్ ।
సోమరోగే విదారీక్షు మాషయష్టీ శృతాంబువా ॥ 161.

తా :— ఉసిరికాయలు, అడవిమినుమువేరు, కుశవేళ్ళు, దర్భవేళ్ళు, వీని కషాయమందు శర్కరచేర్చి సేవించినను, లేక నేలగుమ్మడు, చెఱకు, అడవిమినుములు, అతిమధురము, వీనికషాయమును త్రాగినను సోమరోగము హరించును.

## గుడూచ్యాది కషాయః

శ్లో॥ గుడూచీ రోహిణీక్వాథః సితా మధు సమన్వితః
సన్తతాది జ్వరం హన్యాద్విశేషాద్రాత్రిసంభవమ్॥ 162.

తా :— తిప్పతీగె, కటుకరోహిణి, వీని కషాయమందు శర్కర మఱియు తేనె చేర్చి సేవించిన సన్తతాది జ్వరములను విశేషముగా రాత్రిభాగమందు వచ్చుజ్వరములను హరించును. వీని ప్రమాణము రెండుపలములు ఇందు తేనె శర్కర చేర్చవలసిన యెడల కషాయకల్పనయందు చెప్పబడిన ప్రమాణములను గ్రహించవలెను.

**సహస్రయోగ ప్రకాశికయందలి కషాయప్రకరణము సంపూర్ణము.**

---

## కషాయక్వాథకల్పన

కషాయమునకు జెప్పబడిన వస్తువులను బాగుగా నలగగొట్టి వానిని ఒక కుండలోపోసి అందు కషాయదినుసులకు 16 రెట్లు నీళ్లుపోసి ఎనిమిదవభాగము మిగులు నట్లుగ కాచి వడియగట్టవలయును. దీనిని శృతము, కషాయము, క్వాథము మఱియు నిర్యూహమని యందురు. ఈ కషాయముయొక్క ప్రమాణము రెండుపలములు లేక వైద్యుని ఆదేశానుసారము. జీలకర్ర, గుగ్గులు, క్షారలవణములు, శిలాజిత్తు, ఇంగువ, త్రికటుకములు, పాలు, నెయ్యి, నూనె, మూత్రములు, మఱియు తదితరవస్తువులను శాణప్రమాణముగ గ్రహించవలెను. చూర్ణము మఱియు కల్కము వీనిమాత్ర ఒక కర్షము.

## హిమకల్పన

యోగములందు జెప్పబడిన వస్తువులను దంచి ఒక కుండలోబోసి వానికి ఆరురెట్లు నీళ్ళుపోసి ఒక రాత్రియంతయు నానబెట్టవలయును. ఆ మరునాడుదయమున దానిని బాగుగా పిసికి వడకట్టవలయును. దీనిని హిమమనియును, శిశిరమనియును, శీత కషాయమనియును జెప్పుదురు. దీని ప్రమాణము 2 పలములు.

## ఫాంటకల్పన

యోగములందు జెప్పబడిన వస్తువులను బాగుగా దంచి ఒక కుండలోవేసి అందు దినుసులకు నాల్గురెట్లు వేడినీళ్ళుపోసి మూతపెట్టవలయును. కొంతకాలమైన తరువాత వడియగట్టవలయును. దీనిని చూర్ణద్రవమందురు. దీని ప్రమాణము రెండుపల ములు. ఇందు తేనె, శర్కర, చేర్చవలసినయెడల కషాయ కల్పనయందు చెప్పబడిన ప్రమాణములను గ్రహించవలెను.

---

ఓం శ్రీ ధన్వంతరయే నమః

# సహస్రయోగ ప్రకాశిక

## 2. అథ ఘృత యోగ ప్రకరణమ్

### తిక్తక ఘృతమ్

శ్లో॥ పటోల నింబ కటుకా దార్వీ పాఠాదురాలభాః
పర్పటం త్రాయమాణాంచ పలాంశం పాచయేదపామ్ ॥ 1.

శ్లో॥ ద్వ్యాఢకేఽష్టాంశశేషేణ తేన కర్షోన్మితైస్తథా ।
త్రాయంతీ ముస్తభూనింబ కలింగ కణ చందనైః ॥ 2.

శ్లో॥ సర్పిషో ద్వాదశపలం పచేత్తిక్తకం జయేత్ ।
పిత్తకుష్ఠ పరీసర్ప పిటకా దాహరుగ్భ్రమాన్ ॥ 3.

శ్లో॥ కండూం పాండ్వామయాన్ గండదుష్ట నాడీవ్రణాపచీః ।
విస్ఫోట విద్రధీ గుల్మ శోఫోన్మాద మదానపి ॥ 4.

శ్లో॥ హృద్రోగ తిమిర వ్యంగ గ్రహణీ శ్విత్రకామలాః ।
భగందరమపస్మారముదరం ప్రదరం గరమ్ ॥ 5.

శ్లో॥ అర్శోఽస్రపిత్తమన్యాంశ్చ సకృచ్ఛ్రాన్ పిత్తజాన్ గదాన్ ।

తా :— చేదుపొట్ల, వేపచెక్క, కటుకరోహిణి, మానిపసుపు, చిరుబొద్ది, దూలగొండి, పర్పాటకము, కలుకారుగు, ఇవి ప్రత్యేకమొక ఫలముచొప్పున గ్రహించి బాగుగా దంచి రెండుఆఢకముల ప్రమాణము నీళ్ళలోవేసి అష్టావశేషముగ కషాయముకాచి వడియగట్టి అందు కలుకారుగ, భద్రముస్తలు, భూనింబ (చిరాయితా) కొడిశపాలగింజలు, పిప్పళ్లు, చందనము అనునవి ప్రత్యేకము ముప్పావుతులము చొప్పున గ్రహించి కల్కముగ నూరికలిపి ఆవునెయ్యి 12 పలములు కూడజేర్చి యథావిధి ఘృతపాకముచేసి వడియగట్టి సేవించిన పిత్తము, కుష్ఠము, విసర్పము, పిటకలు,

దాహరోగములు, భ్రమ, కండూ, పాండురోగము, గండరోగము, దుష్టనాడీ వ్రణములు, విస్ఫోటము, విద్రధి, గుల్మము, శోఫ, ఉన్మాదము, మద, హృద్రోగము, తిమిరము, వ్యంగము, మూలవ్యాధి, రక్తపిత్తములను మఱియు ఇతర కఠిన పిత్తజ రోగములను హరించును.

## మహాతిక్తక ఘృతమ్

శ్లో॥ సప్తచ్ఛదః పర్పటకః శమ్యాకః కటుకావచా ॥ 6.

శ్లో॥ త్రిఫలా పద్మకం పాఠా రజన్యౌ సారిబే కణే ।
నింబచందన యష్ట్యాహ్వ విశాలేంద్ర యవామృతమ్ ॥ 7.

శ్లో॥ కిరాతం తిక్తకం సేవ్యం వృషోమూర్వా శతావరీ ।
పటోలంతివిషా ముస్తా త్రాయన్తీ ధన్వయాసకమ్ ॥ 8.

శ్లో॥ త్రైజలేష్టగుణేసర్పిః ద్విగుణామలకీరసమ్ ।
సిద్ధం తిక్తాన్మహాతిక్తం గుణైరభ్యధికం స్మృతమ్ ॥ 9.

సప్తపర్ణి (ఏడాకులపొన్న), పర్పాటకము, రేలచెక్క, కటుకరోహిణి, వస, త్రిఫలములు, పద్మకాష్ఠము, చిరుబొద్ది, పసుపు, మానిపసుపు, సుగంధపాల వేళ్ళు, నల్లసుగంధపాలవేళ్ళు, పిప్పళ్లు, గజపిప్పళ్ళు, వేపచెక్క, చందనము, అతిమధురము, ఏటిపుచ్చ వేరు, కొడిశపాలగింజలు, తిప్పతీగె, భూనింబ (చిరాయితా), గాగచెట్టు వేరు, వట్టివేళ్ళు, అడ్డసరముచెక్క, చాగవేళ్ళు, శతావరి, చేదుపొట్ల, అతివస, తుంగముస్తెలు, కలుకాయిసుగ, దూలగొండి, అనువి సమభాగములుగ గ్రహించి నలగగొట్టి ఎనిమిది రెట్లు నీళ్ళలోవేసి ఒక భాగము మిగులునట్లు కషాయముగ కాచి వడియగట్టి దీనికి సమానము ఆవునెయ్యి, నేతికి రెండురెట్లు ఉసిరికాయల రసమునుజేర్చి ఘృతపాక విధిననుసరించి ఘృతమును వండవలయును. ఇది తిక్తక ఘృతముకంటె అత్యధిక గుణముకలది.

## గుగ్గులుతిక్తక ఘృతమ్

శ్లో॥ నింబామృతా వృషపటోల నిదిగ్ధికానామ్
భాగాన్ పృథగ్దశపలాన్ విపచేద్ఘటేపామ్
అష్టాంశశేషితరసేన పునశ్చ తేన
ప్రస్థం ఘృతస్య విపచే త్పిచుభాగకల్కైః ॥ 10.

శ్లో॥ పాఠావిడంగ సురదారు గజోపకుల్యా
ద్విక్షార నాగర నిశామిశి చవ్యకుష్ఠైః
తేజోవతీ, మరిచవత్సక దీప్యకాగ్ని
రోహిణ్యరుష్కర వచాకణమూల యుక్తైః ॥ 11.

శ్లో॥ మంజిష్ఠయాతి విష యా విషయాయవాన్యా
సంశుద్ధగుగ్గులు పలై రపి పంచ సంఖ్యైః
తత్సేవితం ప్రదమతి ప్రబలం సమీరమ్
సంధ్యస్థి మజ్జగతమప్యథ కుష్ఠమీదృక్ ॥ 12.

శ్లో॥ నాడీవ్రణార్బుద భగందర గండమాలా।
జత్రూర్ధ్వసర్వగద గుల్మగుదోత్థ మేహాన్।
యక్ష్మారుచి శ్వసన పీనస కాసశోఫాన్।
హృత్పాండురోగ మదవిద్రధివాతరక్తాన్ ॥ 13.

వేపచెక్క, తిప్పతీగె, అడ్డసరము, చేదుపొట్ల, వాకుడు, ఇవి ఒక్కొక్కటి పదిపలములు, వీనిని బాగుగా దంచి ఒక ద్రోణమునీళ్ళలోవేసి, ఎనిమిదవభాగము మిగులునట్లు కషాయముగకాచి వడియగట్టి అందు ఆవునెయ్యి ఒక ప్రస్థముచేర్చి పిదప విషబొద్ది, వాయువిడంగములు, దేవదారు, గజపిప్పళ్లు, యవక్షారము, సర్జాక్షారము, శుంఠి, పసుపు సోపుగింజలు, (బద్దసోపు) చవ్యము, చెంగల్వకోష్టు, మాల్కంగినీ గింజలు, మిరియాలు, కొడిశపాలగింజలు, ఓమము, చిత్రమూలము, కటుకరోహిణి, జీడిగింజలు, వస, మోడి, సన్నరాష్ట్రము, మంజిష్ఠ, అతివస, ఖురాసానిఓమ, అనునవి ప్రత్యేకము కర్ష ప్రమాణము, శుద్ధిచేసిన మహిసాక్షి గుగ్గులు, 5 పలములు, వీనిని కల్కముచేసి పై దానిలోజేర్చి ఘృతపాక విధిననుసరించి వండవలయును. అనంతరము వడియగట్టి భద్రపరచవలయును. దీనిని సేవించిన ప్రబలవాతరోగములు సంధి, అస్థి, మజ్జా, గత కుష్ఠరోగములు, నాడీవ్రణ, అర్బుదములు, భగందరము, గండమాల, ఊర్ధ్వజత్రు రోగములు, గుల్మలు మూలవ్యాధులు, మేహములు, రాజయక్ష్మ, అరుచి, శ్వాసలు, పీనస, కాస, శోఫ, హృద్రోగ, పాండు, మద, విద్రధ, వాతరక్త రోగములను హరించును.

## ఇందుకాంతఘృతమ్

శ్లో॥ *పూతీకదారు దశమూలకషాయసిద్ధమ్
సక్షీరషట్పలయుతం ఘృతమిందుకాంతమ్
వాతామయ క్షయమహోదర గుల్మశూల
విమ్నోన్నతజ్వరహరం బలవర్ధనంచ ॥ 14.

నేతికానుగ, దేవదారు, దశమూలములు, వీనిని కషాయవిధి ననుసరించి క్వాథముగ కాచి వడియగట్టి యందు పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము,

*పూతీక = మలయాళ భాషలో ఆవిల్ తొలియని వ్యవహరించెదరు.

శుంఠి, సైంధవలవణము, అను వాని కల్కము మఱియు ఆవునెయ్యి, ఆవుపాలు, అనునవి యథోచితముగ జేర్చి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించుటచే వాతరోగములు, క్షయ, మహోదర, గుల్మశూలలు మఱియు విషమజ్వరములును శమించును. ఈఘృతము బలమును వృద్ధిజేయును.

## సుకుమార ఘృతమ్

శ్లో॥ పచేత్పునర్నవ తులాంతథా దశపలాః పృథక్ ।
దశమూల పయస్యాశ్వగంధై రండ శతావరీః ॥ 15.

శ్లో॥ ద్విదర్భ శరకాశేక్షు మూల పోటగలాన్వితాః ।
పచేచ్చాష్టమభాగస్థే తత్రత్రింశత్పలంగుడమ్ ॥ 16.

శ్లో॥ ప్రస్థమేరండతైలస్య ద్వౌఘృతాత్పయసస్తథా
ఆవపేత్ ద్విపలాంశంచ కృష్ణాతన్మూల సైంధవమ్ ॥ 17.

శ్లో॥ యష్టీ మధూక మృద్వీకా యవానీ నాగరాణిచ ।
తత్సిద్ధం సుకుమారాఖ్యం సుకుమారం రసాయనమ్ ॥ 18.

శ్లో॥ వాతాతపాధ్వయానాది పరిహార్యేష్వయంత్రిణమ్ ॥
ప్రయోజ్యం సుకుమారాణా మీశ్వరాణాం సుఖాత్మనామ్॥ 19.

శ్లో॥ నృణాం స్త్రీబృంద భర్తృణామలక్ష్మీ కలినాశనమ్ ।
సర్వకాలోపయోగేన కాంతిలావణ్య పుష్టిదమ్ ॥ 20.

శ్లో॥ వృద్ధి విద్రధి గుల్మార్శో యోనిరోగానిలార్తిషు ।
శోఫోదర ఖుడ ప్లీహావిడ్విబంధేషు చోత్తమమ్ ॥ 21.

తా :— తెల్లగలిజేరువేళ్ళు, 100 పలములు దశమూలములు ప్రత్యేకము పది పలములు, పావింట, పెన్నేరుగడ్డ, ఆముదపువేళ్ళు, పిల్లిపీచరవేళ్ళు, దర్భవేళ్ళు, రెల్లు, కుశవేళ్ళు, కాశవేళ్లు, చెఱకువేళ్ళు, (తృణపంచమూలములు) ఇవి ఒక్కొక్కటి 10 పలములు, వీనిని 38 ఆఢకములనీళ్ళలోవేసి, అష్టభాగావశేషముగ కాచి వడియగట్టి యందు 30 పలముల బెల్లము, ఒక ప్రస్థము ఆముదము, ఆవునెయ్యి 2 ప్రస్థములు, 2 ప్రస్థముల ఆవుపాలు, వేసి పిదప పిప్పళ్ళు, మోడి, సైంధవలవణము, యష్టిమధుకము, ఇప్పపువ్వు, ద్రాక్ష, ఖురాసానిఓమ, శుంఠి, ఇవి ప్రత్యేకము 2 పలములుచొప్పున గ్రహించి కల్కముచేసి పై వాటిలోవేసి, విధి ప్రకారము ఘృతపాకము చేయవలయును. దీనిని వడియగట్టి భద్రపరచవలెను. ఇది సౌందర్యదాయకము. రసాయనము,

మఱియు వాత ఆతప, మూర్ఛాయాసములను బోగొట్టును. ఈ ఘృతము సుకుమారులకును, సుఖజీవులకును మిక్కిలి హితకరము. పురుషులకు స్త్రీలకు మిక్కిలి లాభదాయకము. ఇది అలక్ష్మిని వఱియు కలిని నాశము చేయును. ఇదిగాక, కాంతిలావణ్యముల నిచ్చి పుష్టిని గలుగజేయును. సర్వకాలములం దుపయోగించదగిన రసాయనము. ఈసుకుమార ఘృతము వృద్ధి, విద్రధి, గుల్మ, మూలవ్యాధి, యోనిరోగ, వాతశూల, శోఫ, ఉదర రోగ వాతరక్తములందును మఱియు మలబద్ధ వ్యాధులయందు నుత్తమమైనది.

## ఇక్షుదూర్వాది ఘృతమ్

శ్లో॥ ఇక్షుదూర్వా మృతాధాత్రీ శ్వదంష్ట్రా స్వస్తికోద్భవే ।
స్వరసే నాలికేరాంబు పయోయుక్తైః సుకల్కితైః ॥ 22.

శ్లో॥ చాతుర్జాతపయోవృక్ష ముకుళాంబు పయోధరైః
సారిబోశీర యష్ట్యాహ్వా సితోత్పల హిమామయైః॥
సిద్ధం ఘృతం నవంసమ్యగ్రక్తపిత్త హరం పరమ్ ॥ 23.

తా :— చెఱకుపేళ్లు, గరికవేళ్ళు, తిప్పతీగె, ఉసిరికాయలు, పల్లేరు, చెంచలి కూర, వీని స్వరసములు లేక కషాయము పాపు ఆఢకము. దీనిలో ఆవునెయ్యి అర్థప్రస్థము మఱియు కొబ్బరిబొండంనీరు అర్ధప్రస్థముచేర్చి యందు చాతుర్జాతములు, నాగకేశరములు. మేడి, రావి, జువ్వి, కళ్ళరావి, మఱ్ఱి, అనువాని చిగుళ్ళు, పాగడచెక్క, సుగంధపాలవేళ్ళు, వట్టివేళ్ళు, తుంగముస్తలు, యష్టిమధుకము, తెల్లకలువగడ్డ, మంచి గంధము, కృష్ణాగరు, పైవానిని ప్రత్యేకమొక తులము చొప్పున గ్రహించి, కల్కము చేసి వైచి యథావిధి ఘృతము వండవలయును. దీనిని సేవించిన రక్తపిత్తములు హరించును.

## ధాత్ర్యాది ఘృతమ్

శ్లో॥ ధాత్రీ విదారీక్షు శతావరీణాం కూష్మాండకానాం స్వరసేషుసర్పిః
క్షీరేణసార్థం విపచేత్సుపిష్టైః మృద్వీకయష్ట్యాహ్వయ చందనైశ్చ॥
శ్లో॥ ఏతత్సుసిద్ధం సితయా విమిశ్రం నివారయేచ్ఛ్రమమస్రగ్ధరాణి
పాండ్వామయే పిత్తకృతే హితంస్యాత్ పైత్తేచ గుల్మేక్షయినిః స్మృతౌచ॥
శ్లో॥ వంధ్యాచ పీత్వాలభతేచ పుత్రం
శీఘ్రం నిహన్యాదపి వాతరక్తమ్
అన్యాంశ్చ పిత్తప్రభవాన్ వికారాన్
మూర్ఛామదోన్మాద మదాత్యయాదీన్ ॥ 26.

తా :— ఉసిరికాయలరసము, నేలగుమ్మడురసము, చెఱకురసము, శతావరి రసము, బూడిదగుమ్మడు రసము, వీని మొత్తము 2 భాగములు, ఆవునెయ్యి, 1 భాగము, ఆవుపాలు 2 భాగములు, పైనానియందు ద్రాక్ష, అతిమధురము, మంచిగంధము, అనువాని యథోచిత కల్కమును వేసి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిని శర్కరతో సేవించిన రక్తప్రదరము, పిత్తప్రధాన పాండురోగము, పిత్తగుల్మ, పిత్తకృతవాతము, అస్థిస్రావము, వాతరక్తము, పిత్తవికారములు, మూర్ఛ, ఉన్మాదము, మఱియు మదమదాత్యయ రోగములు హరించును. వంధ్యాస్త్రీలు దీనిని సేవించిన సంతానవతులగుదురు.

## 1. వారాహ్యాది ఘృతమ్

శ్లో॥ *వారాహీకంద తోయే ఘృతమమృత సమం సేవ్యమానావిపక్వమ్
నారీ జహ్యాత్సుఘోరం హుతవహసదృశం వ్యాధిమస్థ్యాస్రవంవా
ద్రాక్షామాషాశ్వగంధా కదళిఫలయుతం శర్కరావాంశి మిశ్రమ్
దేవేన స్వర్గభర్త్రా విహితమనుపమం స్వర్గసీమంతినీనామ్ ॥ 27.

తా :— వారాహీకంద (పందిమూతిగడ్డలు?) రసము లేక కషాయము 4 భాగములు, ఆవునెయ్యి ఒక భాగము, పాలు ఒక భాగము, వీనియందు ద్రాక్ష, అడవి మినుములు, పెన్నేరుగడ్డ, అరటిపండు, వంశలోచనము, వీని కల్కమును జేర్చి ఘృతపాకము చేసి స్త్రీలు సేవించిన, అత్యంత ఘోర అగ్నిసమాన అస్థి స్రావరోగములు హరించునని ఇంద్రుడు స్వర్గములోనున్న స్త్రీలతో జెప్పెను.

## మోదకీత్వగాది ఘృతమ్

శ్లో॥ *మోదకీత్వగ్బలాదూర్వా తాలనిర్గుండికా జపా
విపచేత్పాద శిష్టేన తేనప్రస్థం ఘృతం పచేత్ ॥ 28.

శ్లో॥ కుహల్యాశ్చ జపాపుష్పాద్రసేన పయసాయుతమ్
అశ్వగంధా వరీకృష్ణా మృద్వీకా యష్టిచందనైః ॥ 29.

శ్లో॥ సితాత్రుట్యద్రిజయుతైః కల్కైరేతాంశ్చ సాధయేత్
అసృగ్దరం నిహన్యాత్తదస్థిస్రావంచ దారుణమ్ ॥ 30.

తా:—*మోదకీ ముత్తవపులగముపేరు, గరిక, నేలతాడిగడ్డలు, వావిలి, తెల్లదాసాని వేరు, ఇవి ప్రత్యేక మొక పలముచొప్పున గ్రహించి ఒకటిన్నర ఆఢకముల నీళ్ళలోవేసి

*వారాహీకంద = నిలప్పనకిళంగు అని మలయాళ భాషలో వ్యవహరించెదరు.
*మోదకీ = మలయాళ భాషలో కరింతకరలియని యందురు.

అష్టమాంశ కషాయముకాచి, వడియగట్టి, యందు పోకపువ్వులరసము, దాసాని పువ్వుల రసము, మొత్తము ఒకశేరు, నెయ్యి ఒకశేరు. ఆవుపాలు ఒకశేరు, పెన్నేరుగడ్డ, శతావరీ, పిప్పళ్లు, ద్రాక్ష, అతిమధురము, మంచిగంధము, శర్కర, ఏలకులు, గైరికము అనువాని కల్కము తగుమాత్రము జేర్చి యథావిధి ఘృతము వండవలయును. ఈ ఘృతమును సేవించిన దారుణమైన శ్వేత ప్రదరములు, మఱియు రక్తప్రదరములు హరించును.

## 2. వారాహ్యాది ఘృతమ్

శ్లో॥ వారాహీకంద ఖదిర జంబూ మోరట వల్కలాత్
తులాంపచేత సబలాత్ క్షుణ్ణాత్ కుంభేంభసః పునః ॥ 31.

శ్లో॥ పాదశిష్టే కషాయేస్మిన్ ఘృతప్రస్థం విపాచయేత్
సునిషణ్ణ శతావర్యాస్తోయం క్షీరంచ నిక్షిపేత్ ॥ 32.

శ్లో॥ కపిత్థఫలినీ ధాన్యధన్వయాస కసేరుకమ్
పాఠా ఫలత్రయామ్రాస్థి శిలాభేదం రసాంజనమ్ ॥ 33.

శ్లో॥ ఖర్జూరం కట్ఫలం శుంఠీ మృద్వీకా రక్తచందనమ్
*అంబష్ఠకా మోచరసం సమంగా పద్మకేసరమ్ ॥ 34.

శ్లో॥ కట్వంగ వత్సకానంతా ధాతకీ మధు కాంజనమ్
దాడిమాతివిషా ముస్తా లోధ్రం బిల్వం సగైరికమ్ ॥ 35.

శ్లో॥ పిప్పలీ మశ్వగంధాంచ సారిబోశీర పుండ్రకైః
తత్సిద్ధం సితయోపేతం మధుమాత్రా సమన్వితమ్ ॥ 36.

శ్లో॥ సర్పిర్జయేద్యోనిరోగం పానవస్త్యాది యోజితమ్ ॥ 37.

తా :— పందిమూతిగడ్డలు ? చండ్రచేవ, నేరేడుచెక్క, ముత్తవపులగముపేళ్ళు, మోరట, వీనిని చూర్ణముచేసి నీళ్ళలోవేసి చతుర్థాంశ కషాయముగ కాచి వడియగట్టి అందు యథోచితము ఆవునెయ్యి, పులిచింతస్వరసము, మఱియు శతావరిస్వరసము ఒకొక్క ప్రస్థముచొప్పున జేర్చి పిదప వెలగపండు, ప్రియంగు, ధనియాలు, దురదగొండి, నమ్మదుంప, (కసేరుగడ్డ) విషబొద్ది, త్రిఫలములు, మామిడిజీడి, కొండపిండి, రసాంజనము, ఖర్జూరము, కాయఫలముచెక్క. శుంఠి, ద్రాక్ష, రక్తచందనము, అంబష్ఠ బూరుగుబంక, అత్తపత్తి, తామరకేసరములు, పెద్దమానిచెక్క, కొడిశపాలచెక్క, గరికె, ఆరెపువ్వు, అతిమధురము, సౌవీరాంజనము, దానిమ్మ, అతివస, భద్రముస్తలు,

*అంబష్ఠ = మలయాళభాషలో వేళుత్తఅంబిజత్తిన్ తొలియని వ్యవహరించెదరు.

లొద్దుగ, మారేడువేరు, గైరికము, పిప్పళ్ళు, అశ్వగంధ, సుగంధపాలవేళ్ళు, వట్టివేళ్ళు, ఎఱ్ఱచెఱకు, వీని యథోచిత కల్కమునుగూడ జేర్చి, విధి ప్రకారము ఘృతము సిద్ధము చేయవలయును. దీనిలో తేనె, శర్కర, చేర్చి సేవించిన యోనివ్యాధులు హరించును. దీనిని వస్తికర్మకుగూడ ఉపయోగపఱచ వచ్చును.

## (1) వృషఘృతమ్

శ్లో॥ సమూలపత్రాంకురపల్లవస్య
వృషస్య సిద్ధం స్వరసేవిపక్వమ్
తత్పుష్పకల్కం ఘృతమాశుహన్యాత్
సమాక్షికం శ్వాసమశేషకాసమ్॥ 38.

తా:— అడ్డసరము వేరు, దానిఆకులు, మఱియు దానిచిగుళ్ళు వీనికషాయమందు లేక స్వరసమందు దానిపువ్వుల కల్కమును మఱియు యథోచిత ఘృతమును వైచి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిలో తేనెకలిపి సేవించిన శ్వాసరోగములు మఱియు సర్వవిధకాసలు హరించును.

## (2) వృషఘృతమ్

శ్లో॥ సమూలమస్తకంక్షుణ్ణం వృషమష్టగుణేంభసి
పక్త్వాష్టాంశావశేషేణ ఘృతం తేనవిపాచయేత్॥ 39.

శ్లో॥ తత్పుష్పకల్కం తచ్ఛీతం సక్షౌద్రం పిత్తశోణితమ్
పిత్తగుల్మ జ్వరశ్వాస కాసహృద్రోగకామలామ్॥ 40.

శ్లో॥ తిమిరభ్రమవీసర్ప స్వరసాదాంశ్చ నాశయేత్॥

తా:— అడ్డసరము వేరు, దానికాండము, దానియాకులు, మఱియు దానిపువ్వులు, వీని నన్నిటిని దంచి ఎనిమిదింతలు నీళ్ళలోవేసి ఎనిమిదవ భాగము మిగులునట్లుగ కాచి వడియగట్టి అందు యథోచితము ఆవునెయ్యి మఱియు అడ్డసరము పువ్వుల కల్కమునుజేర్చి విధిప్రకారము ఘృతము వండవలయును. కొంచెము చల్లారిన తరువాత వడియగట్టి అందు యథోచితము తేనె కలిపి సేవించిన రక్తపిత్తము, పిత్తగుల్మము, జ్వరము, శ్వాస కాసలు, హృద్రోగము, కామల, తిమిరము, భ్రమ, విసర్పము, మఱియు స్వరభంగరోగ ములు నశించును.

## నిర్గుండ్యాది ఘృతమ్

శ్లో॥ నిర్గుండీ పత్రస్వరసే సాధితం కాసజిద్ఘృతమ్॥ 41.

తా:— వావిలాకురసమందు తగినంత ఆవునెయ్యి మఱియు వావిలిపువ్వుల కల్కమును జేర్చి యథావిధి ఘృతపాకముచేసి సేవించిన కాసరోగములు హరించును.

## దశాంగఘృతమ్

శ్లో॥ చిరిబిల్వ విడంగవహ్ని హింస్రా
త్రిఫలా వ్యోష సమన్వితే కషాయే
అమృతావృష కంటకారికానాం
విపచేత్సర్పిరనుత్తమం దశాంగమ్
క్షయ గుల్మారుచి శూల కాసహిక్కా
గుదజానాంచ వినాశనం ప్రధానమ్॥ 42.

తా:— కానుగచెక్క, వాయువిడంగాలు, చిత్రమూలము, జటామాంసి, త్రిఫలములు, త్రికటుకములు, వీనిని విధిప్రకారము కషాయముచేసి యందు యథోచితముగ ఆవునెయ్యివేసి పిదప తిప్పతీగె, అడ్డసరము వేరు, వాకుడు అనువాని యథోచిత కల్కమును జేర్చి ఘృతము వండవలయును ఇది శ్రేష్ఠమైన దశాంగఘృతము. దీనిని సేవించుట వలన క్షయ, గుల్మ, అరుచి, శూల, కాస, హిక్క మఱియు గుదజరోగములు నశించును.

## శశవాసాది ఘృతమ్

శ్లో॥ శశవాసారసక్షీరే పృథగాఢక సమ్మితే
దారు వెల్లాశ్వగంధాబ్ద హారిద్రా జీవకర్షభౌ॥ 43.

శ్లో॥ మధూలికా కణారాస్నా శృంగీ భార్గీసగోస్తనాః
కాకోళీ క్షీరకాకోళీ నాగరం మధుకం సితా॥ 44.

శ్లో॥ పృశ్నిపర్ణీ మాషపర్ణీ పిష్టైః ప్రస్థం ఘృతాత్పచేత్
ఘృతం తచ్ఛశవాసాఖ్యం క్షయకాస జ్వరాపహమ్॥ 45.

తా:— కుందేలు మాంసము 4 ప్రస్థములు, అడ్డసరము 4 ప్రస్థములు. వీనిని 8 ఆఢకముల నీళ్ళలోవేసి 2 ఆఢకములు మిగులునట్లుగ కషాయముకాచి వడియగట్టి అందు ఒక పావు ఆఢకము ఆవునెయ్యి మఱియు ఒక ఆఢకము ఆవుపాలు చేర్చి పిదప దేవదారు, వాయువిడంగములు, పెన్నేరుగడ్డ, తుంగముస్తలు, పసుపు, జీవకము, ఋషభకము,

చాగదుంప, పిప్పళ్ళు, సన్నరాస్నము, కర్కాటకశృంగి, గంటుభారంగి, ద్రాక్ష, కాకోళీ, క్షీరకాకోళీ, శుంఠి, యష్టిమధుకము, నేలగుమ్ముడు, కోలపొన్న, మాషపర్ణి అనునవి ప్రత్యేకమొకతులము చొప్పున గ్రహించి కల్కముచేసి యందువైచి యథావిధి ఘృతమును సిద్ధము చేయవలయును. చల్లారిన తరువాత వడియగట్టి భద్రపరచవలెను. దీనిని సేవించిన క్షయ, కాస మఱియు జ్వరములు హరించును.

## కాకమాచ్యాది ఘృతమ్

శ్లో॥ కాకమాచీదళరసే యష్టీకల్కం ప్రసాధితమ్
తైలంఘృతంవా పానేన స్వరసాదహరం పరమ్॥ 46.

తా:— కామంచియాకు (కాచియాకు) రసమందు యష్టిమధుక కల్కమును మఱియు తగినంత ఘృతమును గాని తైలమునుగాని జేర్చి పాకముచేసి సేవించిన స్వరభంగము పోవును.

## లశునఘృతమ్

శ్లో॥ తులాం లశునకందానాం దశమూలం హరీతకీమ్
దారుపూతీక దుఃస్పర్శ పాఠేంద్రయవ గ్రంధికాన్॥ 47.

కపోతవం కేందవల్లీ వనసూరణ కందకమ్
దశసంఖ్య పలానేతాన్ నిష్క్వాధ్యచ తథాఢకమ్॥ 48.

విపాచయేత్సుపిష్టైస్తు కల్కై రర్ధపలోన్మితైః
పంచకోలక విశ్వైలా జీరకాజాజిసైంధవైః॥ 49.

పాఠా హింగ్వాత్మ గుప్తాభిస్త్రిఫలా మధుకేక్షుభిః
చతుర్గుణేన తక్రేణ క్షీరేణ ద్విగుణేనచ॥ 50.

నిశావై కుంఠ, చాంగేరీస్వరసేనభిషగ్వరః
తత్పీతమాత్రం దుర్నామ గుల్మశూలహరం పరమ్॥ 51.

తా:— వెల్లుల్లి 100 పలములు, దశమూలములు, కరక్కాయబెరడు, దేవదారు, నేతికానుగచెక్క, దురదగొండివేళ్ళు, విషబొద్ది, కొడిశపాలగింజలు, మోడి, బ్రాహ్మి, ఏటిపుచ్చ, (ఇంద్రవల్లి), అడవికంద, ఇవి ప్రత్యేకము 10 పలములు, వీనిని బాగుగాదంచి తగినన్ని నీళ్ళలో వేసి అష్టమాంశ కషాయముగకాచి వడియగట్టి దానిలో ఆవునెయ్యి ఒక ఆఢకము, మజ్జిగ 4 ఆఢకములు, ఆవుపాలు 2 ఆఢకములు, పచ్చిపసుపు, తులసి

యాకులు, పులిచింత. వీని స్వరసములు ఒక అఢకము చేర్చి పిదప శొంఠి, పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, ఏలకులు, జీలకర్ర, నల్లజీలకర్ర, సైంధవలవణము, చిరుబొద్ది, ఇంగువ, పెద్దదూలగొండి వేరు, త్రిఫలములు, అతిమధురము, చెఱుకు, వీని కల్కమునుకూడ పైదానిలో వేసి విధిప్రకారము ఘృతము వండవలయును. ఇది విశేషముగా గుల్మలను మఱియు శూలలను హరించును.

## దార్వీబలాది ఘృతమ్.

శ్లో॥ దార్వీ బలా గోక్షుర పృశ్నిపర్ణీ మాయూరికా కౌటజ వల్కలైశ్చ
క్షీరప్రవాళంచ తథాశతిల్ల ముత్క్వాథ్య తోయేష్టమ శేషి తేస్మిన్॥ 52.
ఘృతంపచేత్ క్షీరయుతం సుపిష్టైః కల్కైరిమైశ్చందన దీప్యకుష్ఠైః
అభీరు యష్టీజలపంచకోలైః శ్యామాస్థిరా శ్రీఫలదారువిశ్వైః॥ 53.
కాశ్మర్యతిక్తాంజన తోయదైశ్చ
వ్యాఘ్రీ పయాస్యాతివిషా లవంగైః
చాంగేరికాయాశ్చ రసేన మిశ్రం
త్రాయన్తికాయాశ్చ సుసిద్ధమేతత్
నిషేవ్యమాణాం విధివద్విహాన్యాత్
గుదాంకురాన్ రక్తభవాన్ క్షణేన॥ 54.

తా:— మానిపసుపు, ముత్తవపులగము వేరు, పల్లేరు, కోలపొన్న, ఉత్తరేణి వేరు, కొడిశపాల వేరు చెక్క, క్షీరివృక్షముల చిగుళ్ళు, అడవికాకర, ఇవి ప్రత్యేకి ముకపలము. వీనిని నలగగొట్టి 2ఆఢకముల జలములో వేసి ఒకపావు అఢకము కషాయము మిగులునట్లుగ కాచి వడియగట్టి దానియందు అర్ధప్రస్థము ఆవునెయ్యి, ఒకప్రస్థము ఆవుపాలు, పులిచింత స్వరసము అర్ధ ప్రస్థము మఱియు కలుప్రానుగాకుల స్వరసము అర్ధప్రస్థము చేర్చి పిదప మంచిగంధము, ఓమము, చెంగల్వకోష్ఠు, శతావరి, అతిమధురము, కుగు వేరు, శుంఠి, పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, నల్లతేగడ, ముయ్యాకుపొన్న, మారేడు వేరు, దేవదారు, శొంఠి, పెద్దగుమ్మడు చెక్క, భూనింబ (చిగాయితా) సౌవీరాంజనము, భద్రముస్తలు, వాకుడు, క్షీరకాకోళీ, అతివస, లవంగములు, అనునవి ఒకతులము చొప్పున గ్రహించి కల్కముచేసి పైదానిలో వైచి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించిన రక్తార్శస్సులు మఱియు గుదాంకురములు వెంటనే హరించును.

## (1) పాఠాకరంజాది ఘృతమ్

శ్లో॥ పాఠాకరంజయుగ్మాగ్ని శరపుంఖౌషధాంబుదమ్
చించామూల ప్రివాలస్య కౌటజస్యాచ వల్కలమ్॥ 55.

శ్లో॥ కృష్ణామూలం యవాసంచ క్వాథయిత్వాతు తద్రసే
ఘృతమార్ద్రిక చాంగేరీరస తక్రీవయోన్వితమ్॥ 56.
సిద్ధం సవత్సకై ర్వ్యష్టి భార్గీ కట్వంగవత్సకైః
హింగు ప్రీతివిషా వ్యోష బలాబిల్వ సురదుమైః॥ 57.
ఏలాలవంగ మృద్వీకా దీప్యసింధూత్థ జీరకైః
కోల చందన ధాన్యైశ్చ సర్వాతీసారనాశనమ్॥ 58.

తా:—చిరుబొద్దివేళ్ళు, నేతికానుగ, పెద్దకానుగ, చిత్రమూలము, వెంపలి, శుంఠి, భద్రముస్తలు, చింత వేరు చెక్క మఱియు దానిచిగుళ్ళు, కొడిశపాలచెక్క, మోడి, దురదగొండ వేళ్ళు వీనిని సమభాగములుగ గ్రహించి దంచి ఎనిమిదిరెట్లు నీళ్ళలోవేసి చతుర్థాంశ కషాయము మిగులునట్లుగ కాచి వడియగట్టి అందుఆవునెయ్యి ఒకప్రస్థము, అల్లపురసము, ఒకప్రస్థము, పులిచింతాకు రసము ఒకప్రస్థము, మజ్జిగ ఒకప్రస్థము, ఆవుపాలు ఒకప్రస్థము చేర్చి పిదప కొడిశపాలగింజలు, అతిమధురము, గంటుభారంగి, పెద్దమానిచెక్క, కొడిశపాలగింజలు, ఇంగువ, అతివస, త్రికటుకములు, బలామూలము, (ముత్తవపులగము వేరు) మారేడువేరు, దేవదారు, ఏలకులు, లవంగాలు, ద్రాక్ష, ఓమ, సైంధవలవణము, జీలకర్ర, రేగుపండ్లు, చందనము, ధనియాలు, వీనిని ఉచితప్రమాణముగ గ్రహించి కల్కము చేసి పైదానిలోగలిపి ఘృతపాకము చేయవలయును. పిదప వడియగట్టి దీనిని సేవించిన సర్వవిధ అతిసారములు హరించును.

## (2) పాఠాకరంజాది ఘృతమ్

శ్లో॥ పాఠా చవ్యకరంజయుగ్మ శరపుంభాగ్న్యబ్ద శుంఠీ రసైః
సిద్ధం సైంధవ పంచకోలక విషా ద్విక్షార హింగూషణైః
సాజాజీ ద్వయ దీప్యకైః ఘృతమజా దధ్నారసేనార్ద్రికాత్
చాంగేర్యాశ్చ రసేన వహ్నిజననం గుల్మగ్రహణ్యంతకమ్॥ 59.

తా:— విషబొద్ది, చవ్యము, కానుగచెక్క, నేతికానుగచెక్క, వెంపలి, చిత్రమూలము, తుంగముస్తలు, శుంఠి, ఇవి ఒక్కొక్కటి ఒకపలము. వీనిని రెండు ఆఢకముల నీళ్ళలోవేసి రెండుప్రస్థముల కషాయము మిగులునట్లుగ కాచి వడియగట్టి దానిలో ఆవునెయ్యి అర్థప్రస్థము, అల్లపురసము అర్థప్రస్థము, పులిచింతరసము అర్థప్రస్థము, మేకపెరుగు అర్థప్రస్థము, వైచి పిదప, పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, సైంధవలవణము, అతివస, యవక్షారము, సర్జాక్షారము, ఇంగువ, జీలకర్ర, నల్లజీలకర్ర, ఓమ, అనునవి ప్రత్యేకము రెండుతులముల చొప్పున గ్రహించి కల్కముచేసి పైదానిలో వేసి ఘృతము వండవలయును. దీనివలన అగ్నిదీప్తికలిగి గుల్మము మఱియు గ్రహణీరోగములు నశించును.

## వస్త్యామయాంతకఘృతమ్

శ్లో॥ దార్వీ మధూక మత్స్యాక్షీ పద్మాపాషాణ భేదకైః
బృహత్యంశుమతీ ద్వంద్వ సారిబేక్షు కసేరుకైః॥ 60.
కపోతవం కేక్షురకం వసుకం శిగ్రు వాలకమ్
వారాహీ వరణం ద్రాక్షా భద్రా యష్టీ పలంకషమ్॥ 61.
పృథక్ త్రిపలికం క్షుణ్ణాం సర్వతుల్యాంతు గోక్షురమ్
ద్రోణేషాం విపచేత్తత్ర పాదశిష్టే పరిస్రుతే॥ 62.
ప్రక్షిప్యసర్పిషః ప్రస్థం దత్వాక్షీరం వరీరసమ్
ధాత్రీ బింబరసంచాపి నారికేళోదకం తథా॥ 63.
కూష్మాండోర్వారుకజలం స్నేహద్విగుణితం పృథక్
ద్రవ్యైస్సుపిష్టైః సంయుక్తమేతన్మృద్వగ్నినా పచేత్॥ 64.
పరూషకోత్పల త్రుటీ మధూక హిమదారుభిః
త్రిఫలా పిప్పలీ కాంతీ శృంగబేరైస్ససైంధవైః॥ 65.
హస్తిపిప్పల్యపామార్గ మంజిష్ఠా పద్మకేసరైః
ముస్తా కుస్తుంబరీ లోధ్ర హయగంధా పునర్నవైః॥ 66.
స్వయంగుప్తేక్షురఫలైః స్వయంభూ పత్రశృంగిభిః
శిలాజిత్వర్థ భాగస్థైః సిద్ధం తత్సేవితం ఘృతమ్॥ 67.
మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి శర్కరామశ్మరీమపి
పానవస్త్యాదిభిర్యుక్తో నాశయే న్నాత్రసంశయః॥ 68.
వాతపిత్త సముత్పన్నాన్ సర్వాన్ వస్తిగతాన్ గదాన్
ప్రమేహేణ సహాక్షిప్రమపావర్తయతే ధ్రువమ్॥ 69.
వస్త్యామయాంతకం నామ దేవవేదేన భాషితమ్॥ 70.

తా :— మానిపసుపు, ఇప్పపువ్వు, పొన్నగంటి, మెట్టతామర, కొండపిండి, వాకుడు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, సుగంధపాలవేళ్ళు, చెఱుకు, కసేరుకము, (నమ్మదుంప), బ్రాహ్మి, నీటిగొబ్బి, పొగడపువ్వులు, మునగచెక్క, కురువేరు, పంది మూతి గడ్డ?, ఉలిమిరిచెక్క, ద్రాక్ష, భద్రముస్తలు, యష్టిమధుకము, మహిసాక్షి, గుగ్గిలము ఇవి ప్రత్యేకము మూడు పలముల చొప్పున గ్రహించి బాగుగా చూర్ణించి వీనికి సమముగ పల్లేరును గలిపి ఒక ద్రోణము జలములోవేసి నాల్గవభాగము మిగులు

నట్లు కషాయముగ కాచవలయును. దీనిని వడియగట్టి అందులో ఆవుపాలు, శతావరీ రసము, ఉసిరికాయల రసము, దొండాకురసము, కొబ్బరి బొండముల నీరు, బూడిద గుమ్మడు రసము, దోసాకురసము అనునవి ప్రత్యేకము రెండు ప్రస్థములు, చొప్పునను మఱియు ఒక ప్రస్థము ఆవునెయ్యియును జేర్చి మందాగ్నిచే ఘృతపాకముచేసి అందు చిట్టీత (ఫాలసా) నల్లికలువగడ్డ, ఏలకులు, ఇప్పపువ్వు, మంచిగంధము, దేవదారు, కరక్కాయ బెరడు, ఉసిరికాయలు, తానికాయబెరడు, పిప్పళ్ళు, రేణుకలు, శుంఠి, సైంధవలవణము, గజపిప్పళ్ళు, ఉత్తరేణి, మంజిష్ఠ, పద్మకేసరములు, తుంగముస్తలు, ధనియాలు, లొద్దుగచెక్క, పెన్నేరుగడ్డ, తెల్లగలిజేరువేరు, దురదగొండివేరు, నీటిగొబ్బి గింజలు, అడవిమినుములు, ఆకుపత్రి, కర్కాటకశృంగి, శిలాజిత్తు, అనువానిని ప్రత్యేకము అర్ధతులము చొప్పున గ్రహించి కల్కముచేసి పై ఘృతములో జేర్చి యథావిధి ఘృతమును కాచి సిద్ధముచేసి వడియగట్టి భద్రపరచ వలయును. దీనిని సేవించిన సకల మూత్రకృచ్ఛ్రరోగములు, శర్కరా మేహరోగములు అశ్మరీరోగములు నిస్సందేహముగా హరించును. ఈఘృతము వస్తికర్మకు కూడఉపయోగించ వచ్చును. వాతపిత్తముల వలన కల్గు వస్తిగతరోగములు మఱియు ప్రమేహములు తప్పక హరించును. దీనినే వస్త్యామయాంతక ఘృతమందురు. ఇది లోక కల్యాణమునకుగాను మహాదేవునిచే జెప్పబడినది.

## త్రికంటక ఘృతమ్.

శ్లో॥ క్వాథస్త్రికంటకైలా గిరిజతు శిలాభేద యష్టీ వరీణామ్
దర్భ ద్రాక్షాంబు శౌండీ వసుక వసిర కాశేక్షు మత్స్యాక్షికానామ్
కల్కైః సిద్ధం సదుగ్ధం హరతి ఘృతమిదం సేవితం మూత్రదోషాన్
మేహాన్ కృచ్ఛ్రాణి సర్వాణ్యనిలమపితథా శర్కరామశ్మరీంచ॥71

తా:— పల్లేరు, ఏలకులు, శిలాజిత్తు, కొండపిండి, యష్టిమధుకము, శతావరి, దర్భ, ద్రాక్ష, కురువేరు, మోడి, నందివర్ధన పుష్పము, ఉత్తరేణి వేరు, కాశవేళ్లు, చెఱుకువేళ్లు, పొన్నగంటి, వీనిని యుక్తప్రమాణముగ గ్రహించి, విధిప్రకారముకషాయముగ కాచి వడియగట్టి అందు యథోచితము ఆవునెయ్యి, ఆవుపాలు చేర్చి, పై వస్తువులనే కల్కముగా జేసివేసి పాకము చేయవలయును. దీనిని సేవించిన మూత్ర దోషములు, మేహరోగములు, మూత్రకృచ్ఛ్రములు, వాతముచే కలుగు శర్కరా మేహరోగములు మఱియు అశ్మరీ రోగములుకూడ హరించును.

## శతావర్యాది ఘృతమ్.

శ్లో॥ శతావర్యాః శ్వదంష్ట్రాయాః స్వరసస్యాఢకం పృథక్
ఘృత ప్రస్థద్వయం క్షీరే ద్విగుణేపి పచేదిమైః 72.
విదారీచందన తుగామృద్వీకా మధు యష్టిభిః
కసేరుకైర్వారుబీజం త్రుట్యద్రిజ కణోత్పలైః॥ 73.

శ్లో॥ పద్మాపత్తూర ముస్తైశ్చ కాకోల్యాది గణేనచ
సిద్ధంతు శీతలేఽస్మిన్ ఘృతార్థం మధు నిక్షిపేత్॥ 74.
మధ్వర్థం శర్కరాచూర్ణం క్షిప్త్వోన్మథ్య నిధాపయేత్
నిహన్తి మూత్రకృచ్ఛ్రాణి మూత్ర దోషాంశ్చ శర్కరామ్॥ 75.

తా:— శతావరీస్వరసము ఒక ఆఢకము, గోక్షుర కషాయము ఒక ఆఢకము, ఆవు నెయ్యి అర్ధ ఆఢకము, ఆవు పాలు ఒక ఆఢకము వీనిని గలిపి పాకము చేసి అందు నేలగుమ్మడు గడ్డ, మంచిగంధము, తవాక్షీరి, ద్రాక్ష, అతిమధురము, కసేరుకము (నమ్మదుంప), దోసగింజలు, ఏలకులు, శిలాజిత్తు, పిప్పళ్లు, నల్లకలువగడ్డ, మెట్టతామర, తామర, పతంగవృక్షము, పొన్నగంటి, తుంగముస్తలు, కాకోలీ, క్షీరకాకోలీ, మేదా, మహామేదా, అడవి మినుములు, అడవి పెసర, జీవకము, ఋషభకము అనునవి ప్రత్యేకము అరతులము చొప్పున గ్రహించి కల్కముచేసి విధి ప్రకారము ఘృతము వండవలయును. చల్లారిన తరువాత వడియగట్టి దానిలో ఒక ప్రస్థము తేనె మఱియు అర్ధ ప్రస్థము శర్కరయు చేర్చవలయును. ఈ ఘృతమును సేవించిన మూత్ర కృచ్ఛ్రములు సర్వ విధములగు మూత్ర దోషములు మఱియు శర్కరా మేహ రోగములు హరించును.

## ఆకుల్యాది ఘృతమ్.

శ్లో॥ ఆకులీబీజ కతక పారంతీ మూల రాత్రిభిః
మేహారి మూలామలక భద్రకింశుక వల్కలైః॥ 76.
వృశ్చీవాంశుమతీ ద్వంద్వ గోక్షురైః క్వథితేజలే
సిద్ధం సముద్ధంతు ఘృతం శతావర్యాజ్యకల్కవత్॥ 77.
శర్కరా సహితంచైతత్సేవనా న్మేహ నాశనమ్

తా:— అకులీబీజ (అవిరంకురు బీజములు మలయాళ భాషలో, తెనుగులో కాష మర్దము లేక కసివింద గింజలు), చిల్లగింజలు, పారంతీమూలము (మలయాళ భాషలో) తెచ్చి మేహారి, (మలయాళ భాషలో ఏకనాయకము వేరు), పసుపు, ఉసిరికాయ, దేవదారు, మోదుగు చెక్క, తెల్లగలిజేరు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, పల్లేరు వీనిని దంచి విధి ప్రకారము కషాయముగ కాచి వడియగట్టి దానిలో యథోచిత ప్రమాణము ఘృతమును చేర్చి పిదప శతావరీ ఘృతమందు చెప్పబడిన కల్క వస్తువులను నూరి కల్కము చేసివైచి తగు మాత్రము పాలుకూడ పోసి ఘృతపాకము చేయవలయును. చల్లారిన తరువాత తిరిగి వడియగట్టి శర్కరతో సేవించిన ప్రమేహ రోగములు నశించును.

## ధాన్వంతర ఘృతమ్.

శ్లో॥ దశమూలం శఠీదన్తీ సురాహ్వా ద్విపునర్నవమ్॥ 78.

శ్లో॥ మూలం స్నుహ్యార్కయోః పథ్యా భూకదంబ మపుష్కరమ్
కరంజ వరణామూలం పిప్పల్యాః పౌష్కరంచయత్॥ 79.
పృథగ్దశపలం ప్రస్థాన్ యవకోల కులత్థతః
త్రింశోష్టగుణితే తోయే విపచేత్ పాదవర్తినా॥ 80.
తేనద్విపిప్పలీ చవ్య వచానిచుల రోహిషైః
త్రివృద్విడంగ కంపిల్ల భార్గీవిశ్వైశ్చ సాధయేత్॥ 81.
ఘృతంప్రస్థం జయేత్సర్వాన్మేహాంశ్చ పిటకోదితాన్
పాండు విద్రధి గుల్మార్శ శోషశోఫగరోదరమ్॥ 82.
కుష్ఠోన్మాదావపస్మారం ధాన్వంతరమిదం ఘృతమ్॥ 83.

తా:— దశమూలములు, కచ్చూరములు, దనివేరు, దేవదారు, జిల్లేడువేరు, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, కాడజముడువేరు, కరక్కాయ, బోడతరము, జీడిగింజలు, కానుగవేరు, ఉలిమిరిచెక్క, పిప్పళ్లు, పుష్కరమూలము ఇవి ఒక్కొక్కటి పది పలములు యవలు, రేగుపండ్లు, ఉలవలు అనునవి ప్రత్యేకము 30 పలములు వీనినన్నిటిని దంచి ఎనిమిది రెట్లు నీళ్ళలోవేసి నాల్గవ భాగము మిగులునట్లుగ కషాయము కాచి దానియందు ఒక ప్రస్థము ఆవునెయ్యి చేర్చి పిదప పిప్పళ్లు, గజపిప్పళ్లు, చవ్యము, వస, సముద్ర ఫలము,ఆమ్లవేతసము (వసంతిముగుండ), కంపిల్లము, తేగడ, వాయువిడంగములు, గంటుభారంగి, శుంఠి అను వానిని సమభాగములను మఱియు ఉచిత ప్రమాణముగను గ్రహించి కల్కము చేసి పై దానిలో జేర్చి ఘృతపాకము చేయవలయును. చల్లారిన పిదప వడియగట్టి భద్రపరచవలయును. ఇది ధాన్వంతర ఘృతము. ఈ ఘృతమును సేవించిన పిటకయుక్త సమస్త ప్రమేహములు, పాండు, విద్రధి, గుల్మ, మూలవ్యాధి, శోష, శోఫ, గర, విష మఱియు ఉదర రోగములును జయింపబడును. ఇదిగాక దీనిచేత కుష్ఠ, ఉన్మాద, అపస్మార రోగములుకూడ నశించును.

## పర్పటాది ఘృతమ్.

శ్లో॥ పర్పటరసోన ముండా శక్రలతా యకృద్రుక్ స్వరసే
కృష్ణాద్విజీరకైః సార్ధం చిత్రా తైల సమన్వితం సిద్ధమ్॥ 84.
వృద్ధిహరంచోద్దిష్టం సపది ప్రలేపపానాభ్యామ్॥ 85.

తా:— పర్పటి (సవత్పణ, పొట్టి మలయాళ భాషలో), వెల్లుల్లి, బోడతరము, ఏటిపుచ్చ (ఇంద్రవల్లి) గచ్చచెట్టు వీని తగుమాత్ర స్వరసమందు పిప్పళ్లు, తెల్లజీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ అనువాని యథోచిత కల్కమును మఱియు ఆముదమునుజేర్చి ఘృతపాకవిధిని వండవలయును. దీనిచే వృద్ధిరోగములు హరించును. ఇది లేపములకున్ను మఱియు పానములకును పనికివచ్చును.

## వరణాది ఘృతమ్.

శ్లో॥ వరణచిత్ర బలేంద్రలతాభయా హవుషయక్షుద్రగగ్ని కణౌషధైః
లవణజీరక హింగుబలాజటా మరిచచవ్య సురద్రుమ దీప్యకైః॥
ఘృతమథోరుబు తైలసమన్వితం సకలవృద్ధ్యుదరామయగుల్మనుత్,

తా:— ఉలిమిరిచెక్క, ఆముదపువేరు, ముత్తవపులగము వేళ్లు, ఏటిపుచ్చ (ఇంద్రవల్లి), కరక్కాయ, బోడతరము (హవుష) గచ్చవేళ్లు, చిత్రమూలము, పిప్పళ్లు, శుంఠి, సైంధవలవణము, జీలకర్ర, ఇంగువ, బలామూలము, జటామాంసి, మిరియాలు, చవ్యము, దేవదారు మఱియు ఓమము, వీని నుచిత ప్రమాణముగ గ్రహించి కల్కముచేసి యందు ఆవునెయ్యివైచి మఱియు అదేప్రమాణము ఆముదమును గూడజేర్చి ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించిన వృద్ధి మఱియు ఉదర రోగములును నివారించును.

## పునర్నవాది ఘృతమ్.

శ్లో॥ పునర్నవస్యార్ధతులాం తులాంస్ఫోట్యాభుజంగయోః
దశమూలస్యపంచాశత్ పలాని లశునస్యచ॥ 87.
తావంతితోయే నిష్క్వాథ్య తేన ప్రస్థం ఘృతంపచేత్
ఏరండతైలయుక్తంవా కృష్ణాతన్మూలసైంధవైః॥ 88.
యష్టీమధూకమృద్వీకా యవాని విశ్వభేషజైః
ఏతైర్హింగ్వాదినావాపి ప్రతీవాపం వినిక్షిపేత్॥
సదుగ్ధం సాధితం తత్తు శూలగుల్మోదరాపహమ్॥ 89.

తా:— తెల్లగలిజేరువేళ్లు, 50 పలములు, ఎలుకచెవి యాకులు (ఎలిదశె మలయాళ భాషలో) 50 పలములు, దశమూలములు 50 పలములు, వెల్లుల్లి 50 పలములు వీని నన్నిటిని యథావిధి కషాయముగ కాచి వడియగట్టి దానిలో ఒకప్రస్థము ఆవునెయ్యి మఱియు ఒకప్రస్థము వంటఆముదమును జేర్చి పిదప పిప్పళ్లు, మోడి, సైంధవలవణము, అతిమధురము, ఇప్పపువ్వు, ద్రాక్ష, ఖురాసాని ఓమ, శుంఠి, వీని యథోచిత ప్రమాణ కల్కమునుగాని, హింగ్వాది కల్కమునుగాని (మోడి, చవ్యము, చిత్రమూలము, ఏలకులు, అజామోదఓమ, ఇంగువ) పైదానియందు వైచి ఘృతపాకము చేయవలయును. దీనిని ఆవుపాలతో సేవించిన శూలగుల్మ మఱియు ఉదర రోగములును హరించును.

## శూలారి ఘృతమ్.

శ్లో॥ స్ఫోట్యా భుజంగమాదాయ స్వరసం యంత్రపీడితమ్॥ 90.
చతుర్గుణ రసే తస్మిన్ ఘృతప్రస్థం విపాచయేత్
ద్విపంచమూల స్వరసైః ప్రస్థం ప్రస్థం ప్రదాపయేత్॥ 91.

శ్లో॥ అత్రకల్కాన్ నిమాన్ దద్యాత్ కార్షికాణి భిషగ్వరః
పంచభిర్లవణై ర్యుక్తం త్రికటు త్రిఫలాన్వితమ్॥ 92.
కారవీ కటురోహిణ్యౌ మాతులుంగ ఫలం తథా
ద్విక్షారం హింగు లవణ మేలా చవ్యాజ మోదకమ్॥ 93.
మృద్వీకాం కాకజిహ్వాంచ దేవదారు కశిల్లకమ్
వజ్రకం శూర్పమూలంచ విషముష్టేశ్చ పత్రకమ్॥ 94.
ఏతచ్చూలారికం నామ ఘృత మాత్రేయ నిర్మితమ్॥ 95.

తా :—ఎలుక చెవియాకులు, వీని స్వరసము 4 ప్రస్థములు, ఆవునెయ్యి ఒకప్రస్థము దశమూల కషాయము ఒక ప్రస్థము, పంచలవణములు ఒక్కొక్కటి అర్ధతులము, త్రికటుకములు ఒక్కొక్కటి అర్ధతులము, త్రిఫలములు ప్రత్యేకము అర్ధతులము, నల్లజీలకర్ర, కటుకరోహిణి, మాదీఫలము, యవక్షారము, సర్జాక్షారము, ఇంగువ, సైంధవ లవణము, ఏలకులు, చవ్యము, ఓమ, ద్రాక్ష, వెలమసంధి, దేవదారు, ఎర్రగలిజేరు, నీటిగొబ్బి, అడవి మినుము, అడవిపెసర, మఱియు విషముష్టియాకులు, వీనిని ప్రత్యేకము అర్ధతులము చొప్పున గ్రహించి కల్కము చేసి పైదానిలో గలిపి యథావిధి ఘృతమువండవలయును. దీనిని సేవించిన శూలలు నివారించును. ఇది ఆత్రేయునిచే నిర్మితమైనది.

## ఆర్ద్రిక ఘృతమ్.

శ్లో॥ తథార్ద్రికస్య స్వరసే విపక్వం తత్కల్కమాజ్యం
సపయశ్చ తద్వత్॥ 96.

తా :— అల్లపురసమందు నెయ్యి, పాలు ఉచిత ప్రమాణముగ వైచి అందు శూలారిఘృతమందు జెప్పబడిన వస్తువుల కల్కమును జేర్చి యథావిధి ఘృతపాకముచేయవలయును. ఇది కూడ పై ఘృతమువలె సకల శూలలను హరించును.

## కల్యాణ ఘృతమ్.

శ్లో॥ వరా విశాలా భద్రైలా దేవదార్వేల వాలుకైః
ద్విసారిబా ద్విరజనీ ద్విస్థిరా ఫలినీ నతైః॥ 97
బృహతీ కుష్ఠమంజిష్ఠా నాగకేసర దాడిమైః
వేల్ల తాలీస పత్రైలా మాలతీ ముకుళోత్పలైః॥ 98.
సదంతీ పద్మక హిమైః కర్షాంశైః సర్పిషఃపచేత్
ప్రస్థం భూతగ్రహోన్మాద శ్వాసాపస్మార పాప్మజిత్॥ 99.

శ్లో॥ పాండౌ కుష్ఠే విషే శోషే మేహే మోహే జ్వరేగరే
అరేతస్యాల్ప రజసి దైవోపహత చేతసి॥ 100.
అమేధసి స్ఖలద్వాచి స్మృతి కామేల్ప వాచకే
బల్యం మాంగల్య మాయుష్యం కాంతి సౌభాగ్య పుష్టిదమ్॥
కల్యాణక మిదం సర్పిః శ్రేష్ఠం పుంసవనేషుచ॥ 101.

తా :— కరక్కాయ బెరడు, ఉసిరిక వరుగు, తానికాయ బెరడు, వేమపుచ్చ, తుంగముస్తలు, ఏలకులు, దేవదారు, కూతురు బుడమ, నల్లసుగంధపాల వేళ్ళు, తెల్ల సుగంధపాలవేళ్ళు, పసుపు, మానిపసుపు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ప్రియంగు, గ్రంధితగరము, ములక, చెంగల్వకోష్ఠు, మంజిష్ఠ, నాగకేసరములు, దానిమ్మ చెక్క, వాయువిడంగములు, తాళీసపత్రి, పెద్దఏలకులు, మాలతి పువ్వులు, నల్లకలువ పువ్వులు, దంతిమూలము, పద్మకాష్ఠము, ఘంచిగంధము, వీనిని ఒక్కొక్క తులము చొప్పున గ్రహించి కల్కముగ నూరి పిదప ఒక ప్రస్థము ఆవునెయ్యిలో జేర్చి యధావిధిగ ఘృతపాకము చేయవలెను. ఈ కల్యాణ ఘృతమును సేవించిన, భూతబాధ, గ్రహపీడ, ఉన్మాద, శ్వాస, అపస్మార, జ్వర, పాండు, కుష్ఠ, విషదోష, శోష, మేహ, మోహ, కృత్రిమవిష, ధాతుక్షీణ, అల్పార్తవ, మఱియు బుద్ధిభ్రంశరోగములును హరించును. ఇది మందబుద్ధిని, గద్గదభాషణను, స్మృతిహీనతను, మఱియు అల్పవాక్ఛక్తిని బోగొట్టును. ఈ ఘృతము బలకరము, మాంగల్య ప్రదము, ఆయుర్వర్ధకము, కాంతి, సౌభాగ్యపుష్టికారకము,మఱియు గర్భపోషకము, (అనగా గర్భస్థశిశువును పోషించును.) దీనిని ఆవుపాలతో సేవించవలయును.

## మహా కల్యాణ ఘృతమ్.

శ్లో॥ ఏభ్యోద్విసారిబాదీని జలేప క్త్వైక వింశతిమ్॥ 102.
రసేతస్మిన్ పచేత్ సర్పిః గృష్టిక్షీర చతుర్గుణమ్
వీరర్ధి మేదా కాకోలీ కపికచ్ఛు విషాణిభిః॥ 103.
శూర్పపర్ణీయుతైరేతై ర్మహాకల్యాణకం స్మృతమ్
బృంహణం సన్నిపాతఘ్నం పూర్వస్మా దధికం గుణైః॥ 104.

తా :— పైన జెప్పబడినది అనగా సుగంధపాల మొదలుగాగల 21 ద్రవ్యములు, శతావరి, బుద్ధి, వృద్ధి, మేద, మహామేద, కాకోలీ, క్షీరకాకోలీ, దూలగొండి, దుష్టపు తేరు, అడవి మినుము. అడవి పెసరవేళ్ళు, వీనిని యధోచిత ప్రమాణముగ గ్రహించి, దంచి కషాయముగ, కాచి, వడియగట్టి, అందుచిత ప్రమాణము ఆవునెయ్యి, మఱియు దీనికి నాలుగురెట్లు తొలిసారి యీనిన ఆవుయొక్క పాలువేసి, ఘృతము వండవలయును. దీనినే మహాకళ్యాణ ఘృతమందురు. ఇది బృంహణము, సన్నిపాతఘ్నము, మఱియు కల్యాణఘృతము కంటె అధికగుణము గలది.

## కూష్మాండ ఘృతమ్.

శ్లో॥ కూష్మాండకం సమాదాయ జలద్రోణే విపాచయేత్
చతుర్భాగావశిష్టేతు కల్క ద్రవ్యాణి పేషయేత్॥ 105.
జీవంతీం ముద్గపర్ణీంచ ముస్తాం పర్పటకం తథా
రాస్నాం శుంఠీంచ భార్గీంచ పిప్పలీం మధుయష్టికామ్॥ 106.
సైంధవం పిప్పలీమూలం చిత్రకం హస్తి పిప్పలీమ్
పృథగర్ధ పలాన్యేతాన్యతః సర్పిశ్చతుర్గుణే॥ 107.
క్షీరేచేక్షురసేతద్వచ్ఛనైర్మృద్వగ్నినాపచేత్
ఏతత్సర్పిః పీయమానం సర్వక్షయ వినాశనమ్॥ 108.
విశేషాత్ పిత్తజం శోషం గుల్మం సవిషమజ్వరమ్
హంతి కూష్మాండక ఘృత మేతద్వర్ణ్యం బలప్రదమ్॥ 109.

తా :— ముదురు బూడిదగుమ్మడుకాయను దెచ్చి ముక్కలుగ జేసి ఒకద్రోణము జలములో వేసి నాలుగవ భాగము అనగా 8 శేర్లు మిగులునట్లు కషాయముగ కాచి వడియగట్టి, అందు జీవంతి(మలయాళభాషలో అటపతియక్ కిళంగు),అడవిపెసర, తుంగ ముస్తలు, పర్పాటకము, సన్నరాస్నము, శుంఠి, గంటుభారంగి, పిప్పళ్ళు, అతిమధురము, సైంధవలవణము, మోడి, చిత్రమూలము, గజపిప్పళ్ళు, అనువానిని ఒక్కొక్కటి రెండు తులములుచొప్పున గ్రహించి చేసిన కల్కము, ఆవుపాలు, ఆవునెయ్యి, మఱియు చెఱుకు రసము, అనునవి ప్రత్యేకము నాలుగుపాళ్ళు చొప్పునచేర్చి మృద్వగ్నిచే యథావిధి ఘృత పాకము చేయవలయును. దీనిని సేవించిన సర్వక్షయము నశించును దీనిచే విశేషముగా పిత్తజశోష, గుల్మ మఱియు విషమ జ్వరములును హరించును. ఇది బలకరము, మఱియు కాంతిదాయకము.

## మహా కూష్మాండ ఘృతమ్.

శ్లో॥ కూష్మాండక విదారీక్షు వాసాధాత్రీ శతావరీ
రంభా శ్వదంష్ట్రా జీవంతీ వాజిగంధా మహాబలా॥ 110.
సారిబా జలమేతేషాం ప్రస్థం ప్రస్థం పృథక్ పృథక్
నారికేళోదకం ప్రస్థం ద్విప్రస్థం గోఘృతస్యచ॥ 111.
అజానాంచ పయః ప్రస్థం కల్కద్రవ్యాణి పేషయేత్
ద్రాక్షా దాడిమ ఖర్జూర ధాన్య జీరక చందనమ్॥ 112.

శ్లో॥ యష్టీ త్రిజాతకం ముస్తా పంచకోలం లవంగకమ్
విడంగ మపి తక్కోలం పద్మకోశీర వాలకమ్॥ 113.
రజనీ త్రిఫలా కుష్ఠం సారిబా నాగకేసరమ్
క్రాంతీ యవాని వాసాఖ్యం మరిచం కృష్ణజీరకమ్॥ 114.
ఏతాని సమభాగాని కల్కీకృత్య విపాచయేత్
నవవస్త్రేణ దండేన విపచేద్భిష గుత్తమః॥ 115.
క్షౌద్రప్రస్థం వినిక్షిప్య దినపూర్వం ఘృతం పిబేత్
జ్వరకాస క్షయశ్వాస వాతరక్త విషార్తిజిత్॥ 116.
రక్తగుల్మం రక్తపిత్త మస్థిస్రావంచ శోణితమ్
మూత్రకృచ్ఛ్రాశ్మరీ పాండు కామలా మేహనాశనమ్॥ 117.
అన్యాంశ్చ పిత్తజాన్ రోగాన్ వాతజానపి నాశయేత్
మాంగల్యం పూజితం శ్రేష్ఠం బలధాతు వివర్ధనమ్॥ 118.
నరాణాం వీర్యవృద్ధించ తథా స్త్రీణాం తథోధికమ్
వంధ్యానాం లభతే గర్భం గర్భిణీనాంచ శస్యతే
మహా కూష్మాండకం సర్పి రశ్విభ్యాం నిర్మితం పురా॥ 119.

తా :— ముదురు బూడిదగుమ్మడుకాయ రసము; నేలగుమ్మడు రసము, చెఱకు రసము, అడ్డసరము రసము, ఉసిరికాయలరసము, శతావరి రసము,) అరటిదుంపరసము, పల్లేరు కషాయము, జీవంతీ రసము, పెన్నేరుగడ్డ కషాయము, ముత్తవపులగము వేళ్ళ కషాయము, సుగంధపాలవేళ్ళ కషాయము, ఇవి ప్రత్యేకమొక ప్రస్థము, లేతకొబ్బరి బొండము నీరు ఒకప్రస్థము, ఆవునెయ్యి రెండుప్రస్థములు, మేకపాలు ఒకప్రస్థము, వీని నన్నిటినిజేర్చి అందు ద్రాక్ష, దానిమ్మ, ఖర్జూరము, ధనియాలు, జీలకర్ర, మంచి గంధము, అతిమధురము, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, తుంగముస్తలు, పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి, లవంగాలు, వాయువిడంగాలు, తక్కోల మూలు, పద్మకము, (పద్మకాష్ఠము) వట్టివేళ్ళు, కురువేరు, పసుపు, త్రిఫలములు, చెంగల్వకోష్ఠు, సుగంధపాలవేళ్ళు, నాగకేసరములు, రేణుకలు, ఖురాసాని ఓమ, అడ్డసరమువేరు, మిరియాలు, నల్లజీలకర్ర, అనువానిని ప్రత్యేకమొక తులము చొప్పున గ్రహించి కల్కముచేసివేసి పాకము చేయవలయును. ఈ మందును సిద్ధము చేయునప్పుడు కలియబెట్టుటకు కర్రతెడ్డును, మఱియు వడిచు గట్టుటకు క్రొత్తవస్త్రము నుపయోగించ వలయును. స్వాంగశీతలమైన తరువాత ఒకప్రస్థము తేనె కలుపవలయును. ఇది పురుషులకు వీర్యవృద్ధియు, స్త్రీలకు బలప్రదము. వంధ్యలు సేవించిన గర్భవతులగుదురు. గర్భవతు

బుపయోగించిన సుఖప్రసవము కలుగును. దీనిచే జ్వర, కాస, క్షయ, శ్వాస, వాతరక్త, విషరోగ, రక్తగుల్మ, రక్తపిత్త, అస్థిస్రావ, శోణితరోగ, మూత్రకృచ్ఛ్ర, అశ్మరి, పాండు, కామల, మేహ, పిత్తజ రోగములు మఱియు వాతజరోగములు హరించును. ఈ మహాకూష్మాండఘృతము, మాంగల్యప్రదము, అనుభవసిద్ధము, మఱియు బలధాతువర్ధక శ్రేష్ఠరసాయనము. ఇది యశ్వినీదేవతలచే నిర్మింపబడినది.

## జీవంత్యాది ఘృతమ్.

శ్లో॥ తులాంపచేత జీవంత్యా ద్రోణేపాం పాదశేషితే॥ 120.

తత్క్వాథేద్విగుణక్షీరం ఘృతప్రస్థం విపాచయేత్
ప్రపౌండరీక కాకోళీ పిప్పలీ లోధ్ర సైంధవైః॥ 121.

శతాహ్వా మధుకద్రాక్షా సితా దారు ఫలత్రయైః
కార్షికైర్నిశితత్పీతం తిమిరాపహరంపరమ్॥ 122.

తా:— జీవంతి (అటపతియన్ కిళంగు) సమూలము 100 పలములు దీనిని దంచి ఒక ద్రోణము నీళ్లలోవేసి నాల్గవ భాగము మిగులునట్లు కషాయముగ కాచి, వడియగట్టి, అందు ఆవుపాలు 2 ప్రస్థములు, ఆవునెయ్యి ఒక ప్రస్థము చేర్చి పిదప చెంగువ, కాకోళి, పిప్పళ్లు, లొద్దుగచెక్క, సైంధవలవణము, సోయికూర గింజలు, (శద్దసోపు) అతిమధురము, ద్రాక్ష, శర్కర, దేవదారు మఱియు త్రిఫలములు అనువానిని ప్రత్యేకమొక తులముచొప్పున గ్రహించి, కల్కముచేసి పై దానిలో వేసి ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించిన తిమిర వ్యాధులు (కంటి రోగములు) హరించును.

## పటోలాది ఘృతమ్.

శ్లో॥ పటోలనింబ కటుకాదార్వీ సేవ్యవరా వృషాః
సధన్వయాస త్రాయంతీ పర్పటం పాలికంపృథక్॥ 123.

ప్రస్థమామలకానాంచ క్వాథయేదర్మణేంభసః
తదాఢకేర్ధలక్తకే ఘృతప్రస్థం విపాచయేత్॥ 124.

ముస్తా భూనింబ యష్ట్యాహ్వా కుటజోదీచ్య చందనైః
సపిప్పలీకైస్తత్సర్పిర్ఘ్రాణకర్ణాక్షిరోగజిత్॥ 125.

విద్రధి జ్వరదుష్టాదుర్వి సర్పాపచి కుష్ఠనుత్
విశేషాచ్ఛుక్లతిమిర నక్తాంధ్యోష్ణామ్ల దాహహృత్॥ 126.

తా:— చేదుపొట్ల, వేపచెక్క, కటుకరోహిణి, మానిపసుపు, వట్టివేళ్లు, త్రిఫలములు, అడ్డసరము, దూలగొండివేళ్లు, కానుగచెక్క, పర్పాటకము ఇవి ప్రత్యేక మొక పలము, ఉసిరికాయలు ఒక ప్రస్థము వీనిని దంచి ఒక ద్రోణము జలములో వేసి నాల్గవ భాగము మిగులునట్లు కషాయము కాచి వడియగట్టి అందు ఒక ప్రస్థము ఆవునెయ్యి వేసి పిదప భద్రముస్తలు, కిరాతతిక్తము (చిరాయితా) అతిమధురము, కొడిశపాలగింజలు, వట్టివేళ్లు, మంచిగంధము, పిప్పళ్లు ఇవి ప్రత్యేకము రెండుతులములచొప్పున గ్రహించి కల్కముచేసి పై దానితో జేర్చి ఘృతపాకము చేయవలయును. ఈ ఘృతమును సేవించిన నాసారోగములు, కర్ణరోగములు మఱియు నేత్రరోగములును హరించును. ఇది గాక దీనిచేత విద్రధి, జ్వరము, దుష్టవ్రణములు, విసర్పము, అపచి, గుల్మము, శుక్లతిమిర, నక్తాంధ రోగములు మఱియు ఉష్ణామ్ల దాహరోగములుకూడ హరించును.

## త్రిఫలాది ఘృతమ్.

శ్లో॥ త్రిఫలాష్టపలం క్వాథ్యం పాదశేషం జలాఢకే
తేనతుల్యపయస్తేన త్రిఫలాపలకల్కవాన్॥ 127.
అర్ధప్రస్థే ఘృతాత్సిద్ధం సితయామాక్షికేనవా
యుక్తం పిబేత్తత్తిమిరీ తద్వ్యక్తంవా వరారసమ్॥ 128.

తా:— త్రిఫలముల యెరదు 8 పలములు, దీనిని దంచి ఒక ఆఢకము జలములో వేసి చతుర్థావశిష్టముగ కషాయము కాచి, వడియగట్టి, దానిలో ఒక ప్రస్థము ఆవుపాలు మఱియు అర్ధప్రస్థము ఆవునేతిని వైచి పిదప త్రిఫలా కల్కము ఒక పలముకూడ జేర్చి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిలో శర్కరగాని, తేనెగాని లేక త్రిఫలా కషాయము కాచి చేర్చి సేవించిన తిమిరవ్యాధులు శమించును.

## క్షీరిద్రుమాది ఘృతమ్.

శ్లో॥ క్షీరిద్రుమాంకురం ముండీం గోజిహ్వాం జలకందకమ్
కారస్కరాగస్త్రి లోధ్ర శంబరాణాంచ పల్లవమ్॥ 129.
వారణాం ముకురం దూర్వాం క్షోదయిత్వాతు తద్రసే
క్షిప్త్వా తద్ద్విగుణం క్షీరం తథాతాలఘటీరసమ్॥ 130.
సర్పిః పచేత్ సూక్ష్మ పిష్టైర్ద్రాక్షా యష్టీద్విచందనైః
జాతీ ముకుళ శైలోత్థ లాక్షా కతకసంయుతైః॥ 131.
మందపాకే పరిస్రావ్య శుద్ధపాత్రే నిధాపయేత్
తర్పణాశ్చ్యోతనైరేత న్నేత్రరోగ వినాశనమ్॥ 132.

తా:— క్షీరి వృక్షములు అనగా మఱ్ఱి, రావి, జువ్వి, మేడి, కళ్ళరావి అనువాని చిగుళ్ళ రసము, బోడతరము, ఎద్దునాలికచెట్టు, సింగాడాలు, విషముష్టిచెట్టుయొక్క చిగురుటాకులు, అవిశలేతాకులు, లొద్దుగలేతాకులు, అగరుగంధముచెట్టుయొక్క లేతాకులు, అరటిదుంప, మల్లెపువ్వులు, గరికె, ఇది ప్రత్యేక మొకపలము పంతున గ్రహించి యథావిధి కషాయముకాచి వడియగట్టి అందు రెండింతలు ఆవుపాలు, రెండుభాగములు, తాటిపళ్ళరసము మఱియు తగినంత ఆవునేతిని గలిపి పిదప మానిపసుపు, యష్టిమధుకము, రక్తచందనము, మంచిగంధము, జాజిమొగ్గలు, రాతిపువ్వు, శిలాజిత్తు, లక్క, చిల్లగింజలు, వీని యథోచిత కల్కమును పైదానిలో గలిపి మందపాకవిధిని ఘృతము వండవలయును. దీనిని తర్పణ, ఆశ్చ్యోతనముల కుపయోగించిన సర్వనేత్రరోగములు హరించును.

## గోపాత్మజాది ఘృతమ్.

శ్లో॥ గోపాత్మజా కమల చందన సేవ్యకుష్ఠ
క్షీరిద్రుమాంకుర బిసోత్పల కందమిశ్రమ్
దూర్వారసే జయతి సాధితమాజ్యమాశు
క్షీరేణ సార్థమిహసర్వ విసర్ప ముగ్రమ్॥ 133.

తా :— సుగంధపాలవేళ్ళు, తామరతూండ్లు, మంచిగంధము, వట్టివేళ్లు, చెంగల్వ కోష్టు, మఱ్ఱిచెట్టుయొక్క చిగుళ్ళు, తామరగడ్డ, నల్లకలువగడ్డ, వీని నుచితప్రమాణ కల్కమును, తగినంత గరికరసముతో జేర్చి అందు నెయ్యి యథాప్రమాణముగ గలిపి ఘృతపాక విధిని వండవలయును. దీనిని పాలతో సేవించిన ఉగ్రమైన సర్వవిధ విసర్ప రోగములు హరించును.

## తాళీసాది ఘృతమ్.

శ్లో॥ తాళీసంచ హ్రీబేరంచ మంజిష్ఠాం సారిబాం తథా
మధుకం చందనం లోధ్రం కుంకుమం హరిచందనమ్॥ 134.
ఉశీరం పద్మకంచైవ మాతులుంగ ఫలంపచామ్
శతాహ్వాం నాగపుష్పంచ పీతదారు హరిద్రికమ్॥ 135.
ఏతాని సమభాగాని కల్కం దృషది పేషితమ్
నవనీతం పచేత్ ప్రస్థం కల్కైరేభిః శనైర్భిషక్॥ 136.
ఏతన్ముఖగతం శ్విత్రం సిధ్మాని పిటకాస్తథా
తథావ్యంగ వికారంచ క్షిప్రమేతద్వ్యపోహతి॥ 137.

తా :— తాళీసపత్రి, కురువేరు, మంజిష్ఠ, సుగంధపాలవేళ్ళు, అతిమధురము. మంచిగంధము, లొద్దుగచెక్క, కుంకుమపువ్వు, రక్తచందనము, వట్టివేళ్ళు, పద్మకాష్ఠము మాదీఫలములోని కేసరములు, వస, సోయా గింజలు, (బద్దసోపు), నాగకేసరములు, మానిపసుపు, పసుపు, వీనిని ప్రత్యేక మొక తులము చొప్పున గ్రహించి, కల్కముచేసి, ఒకప్రస్థము ఆవువెన్న కూడ గలిపి ఘృతము వండవలయును. దీనిని సేవించుట వలన ముఖముమీద జనించిన శ్విత్రము (బొల్లి), సిధ్మ, పిటకలు, మఱియు వ్యంగ వికార ములును బహుశీఘ్రముగా హరించును.

## గ్రహణ్యంతక ఘృతమ్.

శ్లో॥ పాఠా చవ్య కరంజయుగ్మ శరపుంఖాగ్నిర్వృద్ధ శుంఠీరసే
సిద్ధం సైంధవ పంచకోలక విష ద్విక్షార హింగ్వంబుభిః
సాజాజీ ద్వయదీప్యకై ర్ఘృతమజా దధ్నారసేనార్ద్రకా
చాంగేర్యాశ్చ రసేనవహ్నిజననం గుల్మగ్రహణ్యంతకమ్॥ 138.

తా :— విషబొద్ది (చిరుబొద్ది) చవ్యము, చిన్నకానుగ, పెద్దకానుగ, వెంపలివేరు, చిత్రమూలము, భద్రముస్తలు, శుంఠి, ఇవి ప్రత్యేకము రెండు పలములు. వీని నన్నిటిని నలియగొట్టి ఒక ద్రోణము జలములోవైచి నాల్గవభాగముమిగులునట్లు కషాయముగకాచి, వడియగట్టి, దానిలో ఆవునెయ్యి ఒక ప్రస్థము, మేకపెరుగు ఒక ప్రస్థము, అల్లపురసము ఒక ప్రస్థము, మఱియు పులిచింతాకు రసము ఒకప్రస్థమును జేర్చి అనంతరము సైంధవ లవణము, పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి, అతివస, యవక్షారము, సర్జాక్షారము, ఇంగువ, కురువేరు, జీలకర్ర, నల్లజీలకర్ర, ఓమ, ఖురాసానిఓమ, అనునవి ప్రత్యేకమొక తులముచొప్పున గ్రహించి, కల్కముచేసి, పై దానిలో జేర్చి యథావిధి ఘృతము సిద్ధము చేయవలయును. దీని నుచిత ప్రమాణము సేవించిన అగ్నిదీప్తిని గలిగించి గుల్మలను మఱియు గ్రహణీ వ్యాధులను హరించును.

## (1) బ్రాహ్మీ ఘృతమ్.

శ్లో॥ ద్వాప్రస్థౌ స్వరసాద్బ్రాహ్మ్యాః ఘృతప్రస్థంచ సాధితమ్
వ్యోష శ్యామా త్రివృద్దంతీ శంఖపుష్పీ నృపద్రుమైః॥ 139.
ససప్తలా కృమిహరైః కల్కితైరక్ష సమ్మితైః
పలవృద్ధ్యా ప్రయుంజీత పరం మాత్రా చతుష్పలమ్॥ 140.
ఉన్మాద కుష్ఠాపస్మార హరం వంధ్యా సుతప్రదమ్
వాక్స్వర స్మృతి మేధా కృద్ధన్యం బ్రాహ్మీఘృతం స్మృతమ్॥141.

తా:— సరస్వతీయాకు రసము 2 ప్రస్థములు, ఆవునెయ్యి ఒక ప్రస్థము, వీనిని జేర్చి అందు మిరియాలు, పిప్పళ్ళు, శుంఠి, సుగంధపాల వేళ్ళు, తేగడ, నాగదంతివేరు, శంఖపుష్పి, శేలచెక్క, శీకాయవేరు, వాయువిడంగములు, ఇవి ప్రత్యేకమొక తులము చొప్పున గ్రహించి కల్కముచేసి కలిపి విధిప్రకారము ఘృతపాకము చేయవలయును. దీనిని ఏకోత్తర వృద్ధిగా అనగా రోజుకు ఒక తులము చొప్పున హెచ్చించుచు 8 తులముల మాత్రవరకు సేవించిన ఉన్మాదము, కుష్ఠము మఱియు అపస్మారము హరించును. వాక్పటిమను, స్మృతి, మేధాశక్తులను వృద్ధిచేయును. ఇదిగాక వంధ్యలు సేవించిన సంతానవతులగుదురు.

## అష్టాంగ ఘృతమ్.

శ్లో॥ వచేందులేఖా మండూకీః శంఖపుష్పీ శతావరీ
బ్రహ్మసోమామృతా బ్రాహ్మీ కల్కీకృత్య పలాంశికాః॥ 142.
అష్టాంగం విపచేత్సర్పిః ప్రస్థం క్షీరం చతుర్గుణమ్
తత్పీతం ధన్యమాయుష్యం వాఙ్మేధాస్మృతి బుద్ధికృత్॥ 143.

తా:— వస, సోమలత, సంబరేణి, శంఖపుష్పి, శతావరి, వృద్ధదారు, తిప్పతీగె, సరస్వతిఆకు, మాల్కంగిని, ఈ యెనిమిది వస్తువులను ప్రత్యేకమొక పలము చొప్పున గ్రహించి కల్కముచేసి, ఒకప్రస్థము ఆవునెయ్యి మఱియు నాలుగు ప్రస్థముల ఆవు పాలలో జేర్చి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించిన వాక్శక్తి, బుద్ధి, స్మృతులను మఱియు ఆయువును వృద్ధిపఱచును.

## (1) సారస్వత ఘృతమ్.

శ్లో॥ త్రిఫలా లక్ష్మణానంతా సమంగా సారిబా వచా
బ్రాహ్మీ పాఠా ద్విబృహతీ ద్విస్థిరా ద్విపునర్నవా॥ 144.
సహాదేవీ రవిర్వల్లీ పయస్యా గిరిమల్లికా
తోయకుంభే పచేదేతత్ పలాంశం పాదశోషితమ్॥ 145.
తేన కౌంతీ వచా కుష్ఠ కృష్ణా సైంధవ సర్షపైః
నిరుక్సురూప వత్సాఖ్యా సంయుక్తం పయసాచగోః॥ 146.
పుష్యయోగే ఘృతప్రస్థం సహేమ శకలం శృతమ్
పానాభ్యంజన భోజ్యేషు స్మృతిమేధాకరం పరమ్
రక్షోఘ్నంచ విషఘ్నంచ సారస్వత మిదం ఘృతమ్॥ 147.

తా:— కరక్కాయ బెరడు, ఉసిరిక వరుగు, తాడికాయ బెరడు, లక్ష్మణా (లక్ష్మణపంజ) మూలము, దూలగొండివేరు, అత్తపత్తి, సుగంధపాలవేళ్లు, వస, సరస్వతీ ఆకు, విషబొద్ది, ములక, వాకుడు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, సహదేవి, (మంకెనవేరు) రవిర్వల్లీ, క్షీరకాకోళీ, కొడిశపాలచెక్క, ఇవి ప్రత్యేకము ఒకపలము వీనిని దంచి 16 ప్రస్థములనీళ్ళలోవేసి పుష్యమీ నక్షత్రమందు, చతుర్థాంశముగ కషాయము కాచి, వడియగట్టి అందుఆవునెయ్యి ఒకప్రస్థము, క్రొత్తగా యీనిన ఆవుపాలు 2 ప్రస్థములు, మఱియు దానిలో ఒక బంగారు తునకనువేసి, పిదప రేణుకలు, వస, చెంగల్వకోష్ఠు, పిప్పళ్లు, సైంధవలవణము, ఆవాలు, అనువాని యథోచిత కల్కమును కూడ జేర్చి ఘృతము సిద్ధము చేయవలయును. సాంగశీతలమైన తరువాత వడియగట్టి బంగారు ముక్కను తీసుకొని భద్రపరచవలయును. ఈ ఘృతమును పాన అభ్యంజన భోజనాదులందుపయోగించ వచ్చును. ఈ సారస్వత ఘృతము స్మృతి మేధా శక్తులను వృద్ధిపఱచి రాక్షస పిశాచాది పీడలను బారదోలి విషబాధలను హరించును. ఇది అత్యుత్తమమైన రసాయనము.

## (2) సారస్వత ఘృతమ్.

శ్లో॥ అజాక్షీరే భయా వ్యోష పాఠాగ్రా శిగ్రుసైంధవైః
సిద్ధం సారస్వతం సర్పిః వాఙ్మేధా స్మృతి వహ్నికృత్॥ 148.

తా:— కరక్కాయ బెరడు, పిప్పళ్ళు, శుంఠి, మిరియాలు, చిరుబొద్ది, వస, మునగవేరు, సైంధవలవణము, ఇవి ప్రత్యేకము రెండు తులములు. వీని కల్కమును ఒక ప్రస్థము ఆవునెయ్యి, మఱియు ఒక ప్రస్థము మేకపాలతో జేర్చి విధిప్రకారము ఘృతపాకము చేయవలయును. ఈ సారస్వత ఘృతమును సేవించిన వాఙ్మేధా స్మృతి శక్తులను వృద్ధి పఱచి అగ్నిదీప్తిని గలుగజేయును.

## సమంగాది ఘృతమ్.

శ్లో॥ సమంగా ధాతకీ లోధ్ర కుటన్నట బలాద్వయైః
మహాసహా క్షుద్రసహా ముద్గ బిల్వ శలాటుభిః॥ 149.
సకార్పాస ఫలైస్తోయే సాధితైః స్సాధితం ఘృతమ్
క్షీరం మస్తుయుతం హన్తి శీఘ్రం దంతోద్భవాన్ గదాన్
వివిధానామయానేత ద్వృద్ధ కాశ్యప నిర్మితమ్॥ 150.

తా:— అత్తపత్తి సమూలము, ఆరెపువ్వు, లొద్దుగచెక్క, పెద్దమానిచెక్క, చిన్నముత్తవ పులగమువేళ్లు, పెద్దముత్తవపులగము వేళ్ళు, అడవిమినుము, అడవిపెసర, చిన్నపెసర, మారేడు పిందెలు, పత్తికాయలు, ఇవి సమభాగములుగా గ్రహించి కషాయముగ కాచి, వడియగట్టి, దీనికి సమముగ ఆవునెయ్యి, ఆవుపాలు, ఆవుపెరుగుమీది నీరు

(మస్తు) పైదానిలోజేర్చి యథావిధి ఘృతపాకము చేయవలయును. ఈ సమంగాది ఘృత మును సేవించిన సమస్త దంతవ్యాధులు బహుశీఘ్రముగా నయమగును. ఇదిగాక అనేక వ్యాధులు నయమగును. ఇది వృద్ధుడగు కాశ్యపునిచే నిర్మింపబడినది.

## మహాపైశాచిక ఘృతమ్.

శ్లో॥ జటిలా పూతనా కేశీ జారటీ మర్కటీ వచా
త్రాయమాణా జయావీరా చోరకః కటురోహిణీ॥ 151.
కాయస్థా సూకరీ ఛత్రా అతిఛత్రా పలంకషా
మహాపురుషదంతాచ వయస్థా నాకులీద్వయమ్॥ 152.
కటంభరా వృశ్చికాలీ శాలిపర్ణీచ తైః శృతమ్
సిద్ధం చాతుర్థికోన్మాద గ్రహాపస్మార నాశనమ్॥ 153.
మహాపైశాచికంనామ ఘృతమేతద్యథామృతమ్
బుద్ధిమేధా స్మృతికరం బాలానాం చాంగవర్ధనమ్॥ 154.

తా:— సుగంధజటామాంసి, కరక్కాయ బెరడు, జటామాంసి, మెట్టతామర, (లేక నల్లజీలకర్ర) దుగదగొండివేరు, వస, కలుకాస్రిసుగ, తక్కలివేరు, నేలయుసిరిక, కచోరములు, కటుకరోహిణి, కాకోళి, పందిమాతిగడ్డ, సదాప, సోయికూరగింజలు (బద్దసోపు), గుగ్గిలము, శతావరి, తిప్పతీగె, సర్పాక్షి, ప్రసారణి, తేలుకుణిచెట్టు, ముయ్యాకుపొన్న, వీనిని సమభాగములుగ గ్రహించి దంచి యథావిధి కషాయముగ కాచి వడియగట్టి దానిలో ఆవునెయ్యి యథోచితముగ జేర్చి, ఘృతపాకము చేయ వలయును. వీనిని సేవించిన చాతుర్థిక జ్వరములు, ఉన్మాదములు, గ్రహబాధలు మఱియు అపస్మారరోగములును నశించును. ఈ మహాపైశాచిక ఘృతము అమృతము వంటిది. మఱియు నిది బుద్ధి మేధాస్మృతులను కూడ వృద్ధిపఱచును. బాలురు దీనిని సేవించిన వారి సర్వాంగములు వృద్ధినొందును.

## పంచగవ్య ఘృతమ్.

శ్లో॥ ద్విపంచమూల త్రిఫలాద్వినిశా కుటజ త్వచః
సప్తపర్ణమపామార్గం నీలినీం కటురోహిణీమ్॥ 155.
శమ్యాక పుష్కరజటా ఫల్గుమూల దురాలభాః
ద్విపలాః సలిలద్రోణే పక్త్వా పాదావశేషితే॥ 156.
భార్ఙీపాఠాఢకీ కుంభ నికుంభ వ్యోష రోహిషైః
మూర్వాభూతీక భూనింబ శ్రేయసీ సారిబాద్వయైః॥ 157.

శ్లో॥ మదయంత్యగ్ని నిచులై రక్తాంశైః సర్పిషః పచేత్
ప్రస్థం తద్వత్ ద్రవైః పూర్వైః పంచగవ్యమిదం ఘృతమ్॥ 158.
జ్వరాపస్మార జఠర భగందర హరం పరమ్
శోఫార్శః కామలా పాండుగుల్మకాసగ్రహాపహమ్॥ 159.

తా:— తక్కలి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, వాకుడు, పల్లేరు, మారేడు వేరు, పెద్దగుమ్ముడు, ములక, కలిగొట్టు, దుందిలము, త్రిఫలములు, పసుపు, మాని పసుపు, కొడిశపాలచెక్క, ఏడాకులపొన్న (సప్తపర్ణి) చెక్క, ఉత్తరేణి, నీలివేరు, కటుకరోహిణి, రేలచెక్క, పుష్కరమూలము, జటామాంసి, అడవిమేడివేరు, దూలగొండి ఇవి ఒక్కొక్కటి రెండు పలములు చొప్పున గ్రహించి బాగుగా దంచి రెండు ద్రోణముల నీళ్ళలోవేసి చతుర్థాంశావశేషముగ కాచి వడియగట్టి అందు గంటుభారంగి, విషబొద్ది, కందివేరు, తేగడ, నల్లతేగడ, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కామంచిపూరి చాగవేరు, వట్టివేళ్ళు, భూనింబ (చిరాయిత) గజపిప్పళ్ళు, నల్లసుగంధపాలవేళ్ళు, తెల్ల సుగంధపాలవేళ్లు, మల్లెపువ్వులు, చిత్రమూలము, సముద్రఫలము, అనువానిని ప్రత్యేకము తులము చొప్పున గ్రహించి కల్కముచేసిచేర్చి మఱియు ఆవుపేడరసము, గోమూత్రము, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, ఇవి ప్రత్యేకమొక ప్రస్థము చొప్పున కూడవేసి యథావిధి ఘృతము వండవలయును. దీనిని సేవించిన జ్వర, అపస్మార, జఠర, భగందర శోఫ, అర్శ, కామల, పాండు, గుల్మకాసరోగములును మఱియు గ్రహబాధలును, హరించును.

## సర్వామయాంతక ఘృతమ్.

శ్లో॥ బలామూల శతం గ్రాహ్యం దశమూల శతం తథా
శతావర్యా గుడూచ్యాశ్చ ద్రాక్షా మధుక దారుచ॥ 160.
మాషాశ్వగంధాం చైరండం కులుత్థం బదరం యవాః
భూపీలుం వై జయంతీంచ మధుశిగ్రు పునర్నవాః॥ 161.
వరణాం సింధువారంచ సోమంచార్క ప్రసారణీః
హింస్రా కులత్థ వహ్నించ హపుషాచ త్రివృద్వ్యచా॥ 162.
సైరిశంచ మహావృక్షం మోరటార్జున మేవచ
రాస్నాం కార్పాస బీజంచ భద్రదారు మహా బలామ్॥ 163.
శరంజ ద్వయ కైరండ శుంఠీంచ తృణపంచకమ్
ఏషాం పృథక్ పంచపలం జలేఖారీ చతుష్టయే॥ 164.

శ్లో॥ అష్టభాగావశిష్టేతు ఘృతప్రస్థంచ యోజయేత్
తిలతైలం చతుఃప్రస్థం ప్రస్థమేరండ సంభవమ్॥ 165.
దేవదారు వచా కుష్ఠం సరళం చందనం తథా
మాంసీ రాస్నా శతాహ్వాచ శైలేయాగురు చోరకమ్॥ 166.
కాకోలీ క్షీరకాకోలీ జీవకర్షభకావుభౌ
మేదాచైవ మహామేదా పత్త్రంగం రక్తచందనమ్॥ 167.
మధుకోశీర మంజిష్ఠా కాంతీ వ్యాఘ్రనఖం తథా
త్రిగంధాం నాగపుష్పంచ తగరం పద్మకం తథా॥ 168.
తురంగగంధా మంజిష్ఠా హింగు శోభాంజనం తథా
కుష్ఠమధుక లోధ్రాణి విడంగం సర్జగుగ్గులు॥ 169
ఏషాం నిష్కం పృథక్ పిష్ట్వా శనైర్మృద్వగ్నినా పచేత్
క్రోడా పరిస్రుతం సమ్యక్ స్వనిగుప్తం నిధాపయేత్॥ 170.
నస్యే పానే తథాభ్యంగే వస్తావేతత్తు పూజితమ్
అర్ధావాతే శిరఃకంపే కలాయే ఖంజపత్తకే॥ 171.
మన్యాస్తంభే హనుస్తంభే గ్రీవాస్తంభేచ జిహ్వకే
ఆక్షేపకే శిరోరోగే పక్షాఘాతే తథార్దితే॥ 172.
ఊరుస్తంభే కరస్తంభే తథా శ్వాసే బలాసకే
యోనిశూలే వస్తిశూలే హృచ్ఛూలేచ తథైవచ॥ 173.
కుక్షిశూలే పార్శ్వశూలే కంఠశూలే విశేషతః
వింశతి శ్లేష్మదోషేషు వ్యాశీతివాతరోగకే॥ 174.
చత్వారింశచ్చ పిత్తేషు సర్వరోగాన్ జయేదిదమ్
సర్వజ్వర క్షయోన్మాద శ్వాసాపస్మార పాప్మజిత్
సర్వామయాంతకం నామ సింహః క్షుద్రమృగాన్ యథా॥ 175.

తా :— ముత్తవపులగమువేళ్లు 100 పలములు, దశమూలములు 100 పలములు, శతావరి, తిప్పతీగ, ద్రాక్ష, అతిమధురము, దేవదారు, మినుములు, పెన్నేరుగడ్డ, ఆముదపువేరు, ఉలవలు, రేగుపండులోని గింజలు, యవలు, రక్తచందనం జిగురు (ఖూన్ ఖారాట్) తక్కలి, ఇప్పపువ్వు, మునగవేరు, తెల్లగలిజేరు, ఉలిమిరిచెక్క, వావిలిచెక్క, సోమలత, జిల్లేడువేరు, ప్రిసారణీ, జటామాంసి, ఉలవలు, చిత్రమూలము, బోడతరము (హాపుష), తేగడ, వస, ముళ్ళగోరింటవేరు, కాడజముడు, చాగవేరు, మద్దిచెక్క, సన్నరాస్నము, పత్తిగింజలు, దేవదారు, పెద్దముత్తవపులగమువేరు, పెద్దకానుగ, చిన్నకానుగ, ఆముదపువేరు, శుంఠి, తృణపంచమూలములు, ఇవి ప్రత్యేకము 5 పలములు. వీటిని బాగుగా దంచి 16 ద్రోణముల జలములో వేసి, 2 ద్రోణములు

మిగులునట్లుగ కషాయముకాచి వడియగట్టి అందు ఆవునెయ్యి ఒక ప్రస్థము, నువ్వుల నూనె 4 ప్రస్థములు, ఆముదము ఒక ప్రస్థము చేర్చి పిదప దేవదారు, వస, చెంగల్వ కోష్టు, సరళకాష్ఠము, జటామాంసి, మంచిగంధము, సన్నరాష్నము, సాయికూరగింజలు (బద్దసోపు), రాతిపువ్వు, అగరు, కచ్చూరములు, కాకోళి, క్షీరకాకోళి, జీవకము, ఋషభకము, మేద, మహామేద, బొక్కపుచెట్టుయొక్క చెక్క (పత్త్రంగం) రక్తచందనము, అతిమధురము, వట్టివేళ్ళు, మంజిష్ఠ, రేణుకలు, నఖం చిప్పలు, (వ్యాఘ్రనఖము) ఏలకులు, దాక్షిణిచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు, గ్రంధితగరము, పద్మకాష్ఠము, పెన్నేరుగడ్డ, మంజిష్ఠ, ఇంగువ, మునగ చెక్క, చెంగల్వకోష్టు, ఇప్పపువ్వు లొద్దుగచెక్క, వాయువిడంగములు, గుగ్గిలము, మహిసాక్షి గుగ్గిలము, అనునవి ఒక్కొక్కటి ¼ తులము. వీనిని నూరి కల్కముచేసి పైదానిలోవేసి యథావిధి ఘృతపాకము చేయవలెను. చల్లారిన తరువాత వడియగట్టి భద్రపరచునది. ఈ ఘృతము నస్య, పాన, అభ్యంగములకును వస్తికర్మలం దుపయోగించుట కుత్తమమైనది. దీనిని సేవించిన ఆఢ్యవాత, శిరఃకంప, ఖంజవాత, మన్యాస్తంభ, హనుస్తంభ, గ్రీవాస్తంభ, జిహ్వాస్తంభ, ఆక్షేపక, శిరోరోగ, పక్షాఘాత, అర్ధితవాత, ఊరుస్తంభ, కరస్తంభ, శ్వాస, బలాసక, యోనిశూల, పార్శ్వశూల, కుక్షిశూల, వస్తిశూల, హృదయశూల, కంఠశూలరోగములును విశేషముగా వింశతిశ్లేష్మరోగములును, ఎనుబదివాతరోగములును, నలుబదిపిత్తరోగములును, సర్వజ్వరములును, క్షయ, ఉన్మాద, శ్వాస, అపస్మార మఱియు పాపజరోగములును హరించును. సింహము చిన్న మృగములను ఏవిధముగా వేటాడునో ఆ విధముననే యీ ఘృతమును సేవించుట వలన సమస్త వ్యాధులు నాశనమగును.

## జాత్యాది ఘృతమ్.

శ్లో॥ జాతీ కింశుక పర్పటాఖ్య సుమవీ మాయూరికా భద్రికా
నిర్గుండీ మృదుకుంచికా కటుకికా దూర్వా నిశానాంరసే
సర్పిః సిద్ధమనేన సూక్ష్మవదనా మర్మాశ్రితాః స్రావిణో
గంభీరాః సురుజో వ్రణాః సగతికాః శుధ్యంతి రోహంతిచ॥ 176.

తా:— జాజిమల్లి యాకులు, మోదుగాకులు, పర్పాటకము, నల్లజీలకర్ర, కొత్తరేణి, అడవిమేడియాకులు, వావిలాకులు, ములుగోరింట, కటుకరోహిణి, గరిక, పసుపు, వీనిని సమభాగములుగాగొని కల్కముగానూరి అందుతగినంత ఆవునేతిని జేర్చి, విధిప్రకారము ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించిన సూక్ష్మముఖ వ్రణములు, మర్మాశ్రిత వ్రణములు, గంభీరమైనవియు, మఱియు బాధయుక్త వ్రణములను హరించును. ఈ ఘృతము రోపణ పూరణములను జేయును.

## బిందు ఘృతమ్.

శ్లో॥ త్రిఫలా త్రివృతాక్వాథే సక్షీరం కుడవం రవిః
కంపిల్లం చ స్నుహీం క్షిప్త్వా క్షీరం తావచ్ఛ నిక్షిపేత్॥ 177.

శ్లో॥ సమాలోక్య శనైర్ధీమాన్ మృదునా గోమయాగ్నినా
పచేద్బిందు ఘృతం నామ్నా త్వగ్దోషశమనం పరమ్
కండూపామాహరం త్వచ్యం ఆత్రేయేణ ప్రపూజితమ్॥ 178.

తా :— కరక్కాయ బెరడు, ఉసిరిక వరుగు, తానికాయ బెరడు, తేగడ, వీనికషాయము 64 తులములు, ఆవుపాలు 16 తులములు, ఆవునెయ్యి 16 తులములు, కంపిల్లము (వసంతంగుండ) 16తులములు, కాడజముడుపాలు 16 తులములు, వీనినన్నిటిని గలిపి ఆవుపేడతో జేసిన పిడకల నిప్పుమీద ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించుటవలన అనగా దురదలు, గజ్జి మొదలగు చర్మరోగములను హరించి చర్మమునకు మృదుత్వమును గలుగజేయును. ఇది ఆత్రేయునిచే జెప్పబడినది.

## నారికేళ ఘృతమ్.

శ్లో॥ కేరీ స్నుక్పయసా యుక్తం సక్షీరం సాధితం ఘృతమ్
త్రాయంతీ స్వరసే సమ్యక్ శోఫగుల్మోదరాపహమ్॥ 179.

తా :— కొబ్బరిపాలు, కాడజముడుపాలు, ఆవుపాలు, ఆవునెయ్యి, కలుద్రాసుగ స్వరసము, వీనిని సమభాగములుగా గ్రహించి యథావిధి ఘృతపాకము చేయవలయును. దీనిని సేవించిన శోఫ, గుల్మ, ఉదరరోగములు హరించును.

## విరేచన ఘృతమ్.

శ్లో॥ క్వాథేన కల్కేన విరేచనానాం సర్పిః శృతం స్నుక్పయసా సమేతమ్
విరేకయోగాత్ సకలోదరాణి ప్రణాశయేజ్జ్యోతిరివాంధకారమ్॥
నికుంభకుంభ త్రిఫలాగవాక్షీ స్నుక్ శంఖినీ నీలిని తిల్వకాని
శమ్యాకకంపిల్లక హేమదుగ్ధా దుగ్ధంచ మూత్రంచ విరేచనాని॥181

తా :— నాగదంతి, తేగడ, త్రిఫలములు, ఏటిపుచ్చ, జముడుపాలు, పద్మపు తీగె, తెల్లగింటెన, లొద్దుగ, రేలపండు, కంపిల్లము (కమలాగుండి) (హేమదుగ్ధ) పిచ్చి కుసుమ, ఆవుపాలు, ఆవుమూత్రము, అనునవి విరేచనకారులు. పై మూలికల కషాయమందు వీని కల్కమునుజేర్చి పిదప ఆవుపాలు, ఆవుమూత్రము, ఆవునెయ్యి, జముడు పాలు, వీని నుచిత ప్రమాణముగ జేర్చి ఘృతము వండవలయును. దీనిని సేవించిన విరేచనములయి జ్యోతిచే అంధకారము పోవునట్లు ఉదరరోగములు పోవును.

## (2) పంచగవ్య ఘృతమ్.

శ్లో॥ సిద్ధం వచైలా త్రిఫలా విడంగ యష్ట్యావ్హాశౌండీ కటురోహిణీభిః
ద్రాక్షాహరిద్రా ద్వయభద్రముస్తా సపాఠమంజిష్ఠ వృషాగ్నికల్కైః॥
సర్పిర్దధిక్షీర పురీషమూత్రై ర్గవాం సమస్తైరితి పంచగవ్యమ్

రక్షోఘ్నమాయుష్య మతీవధన్యం మేధాస్మృతి శ్రీ ప్రతిభాకరంచ
నష్టస్వరాణాం విగతప్రజానాం స్త్రీణాంచ పథ్యం విగతార్తవానామ్॥

తా:— వస, ఏలకులు. త్రిఫలములు, వాయువిడంగములు, యష్టిమధుకము, పిప్పళ్ళు, కటుకరోహిణి, ద్రాక్ష, పసుపు, మానిపసుపు, భద్రముస్తలు, వివబొద్ది, మంజిష్ఠ, అర్కసరము, చిత్రమూలము, వీని యథోచిత కల్కమును, తగుమాత్రము ఆవు నెయ్యి, ఆవుపాలు, ఆవుమూత్రము, ఆవు పేడరసము మఱియు ఆవుపెరుగు అనున వీనిలో జేర్చి ఘృతపాకవిధి ననుసరించి కాచవలయును. ఇది భూతబాధను పోగొట్టి ఆయువ్యమును మేధాస్మృతి ప్రతిభలను వృద్ధిపఱచును. ఇది గాక స్వరభంగమును హరించును. వంధ్యలకు ఋతుబద్ధమును హరించి సంతాన ప్రాప్తిని కూడ కలిగించును.

## (2) బ్రాహ్మీ ఘృతమ్.

శ్లో॥ సమూల పత్రముద్ధృత్య ప్రక్షాళ్య శీతవారిణా
ఉలూఖలేచ సంక్షుద్య రసంసాధు నిపీడయేత్॥ 184.
చతుర్గుణ రసేతస్మిన్ ఘృతప్రస్థం విపాచయేత్
హరిద్రామలకీచైవ త్రివృతాచ హరీతకీ॥ 185.
ఏతేషాం పాలికాభాగః స్మృతశేషస్తు కర్షికాః
పిప్పల్యోథ విడంగాని సైంధవం శర్కరా వచా॥ 186.
ఏతత్ ప్రాశితమాత్రేణ వాగ్విశుద్ధిస్తు జాయతే
ఏతద్బ్రాహ్మీ ఘృతం ధన్యం సరస్వత్యా వినిర్మితమ్॥ 187.

తా:—సరస్వతీచెట్టు సమూలమును (బ్రాహ్మీమూలము) చన్నీళ్ళతో కడగి నీటిలో వేసి దంచి తీసినరసము 4 ప్రస్థములు, ఆవునెయ్యి ఒక ప్రస్థము. వీనిని గలిపి పిదప పసుపు, ఉసిరిక, తెగడ, కరక్కాయ, ఇవి ప్రత్యేక మొకపలము మఱియు పిప్పళ్ళు, వాయువిడంగములు, సైంధవలవణము, ఖండశర్కర, వస, అనునవి ఒక్కొక్కటి ఒక తులము. వీనినన్నిటిని కల్కముగచేసి పైదానిలో గలిపి యథావిధి ఘృతము సిద్ధము చేయవలయును. దీనిని సేవించిన, వాక్ శుద్ధి కలుగును. ఇది సరస్వతిచే నిర్మింపబడిన బ్రాహ్మీ ఘృతము.

## విడంగాది ఘృతమ్.

శ్లో॥ విడంగ పంచాంగుల మూలశుంఠీ పలాండుసిద్ధాత్ పయసస్సుజాతమ్
దధిప్రమథ్యాత్ర సముత్థితంయత్ ససైంధవం తన్నవనీత మద్యాత్
విబంధకోష్ఠానిల పిత్త గుల్మ హృదామయాంత్రార్తి వినాశనాయ॥188

తా :— వాయు విడంగములు, ఆముదపువేరు, శుంఠి, నీరుల్లి, వీని యుచిత ప్రమాణకల్కమును తగినంత ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవువెన్న, మఱియు సైంధవ లవణములందు వేసి యథావిధి ఘృతము వండవలయును. దీని సేవించిన మలబద్ధము, కోష్ఠవాతము, వాత పిత్త గుల్మలు, హృద్రోగములు మఱియు అంత్రరోగములును నశించును.

## శూల ఘృతమ్.

శ్లో॥ అపామార్గస్య నిర్యూహే ఘృతం వైద్యో విపాచయేత్
పిప్పలీ కల్కసంయుక్తం పరం శూల వినాశనమ్॥ 189.

తా :— ఉత్తరేణి కషాయమందు ఉచితప్రమాణము ఆవునెయ్యి మఱియు పిప్పలీ కల్కము వేసి యథావిధి ఘృతమును వండవలయును. ఇది శూలలను నశింపచేయుటకు శ్రేష్ఠమైనది.

## మర్మక్షత ఘృతమ్.

శ్లో॥ అశ్మఘ్నస్వరసే సర్పిః పక్వం క్షీరసమన్వితమ్
జలప్రసాదనం కల్కం సితయాచ విమిశ్రితమ్
సర్వమర్మక్షతోత్థానాం రుజాం ప్రశమనం పరమ్॥ 190.

తా :— కొండపిండి స్వరసమం దుచితప్రమాణము ఆవుపాలు, ఆవునెయ్యి, మఱియు చిల్లగింజల కల్కమునువేసి యథావిధి ఘృతపాకము చేయవలెను. దీనిని శర్కరతో గలిపి సేవించిన సర్వమర్మస్థలములందు కలిగిన క్షతములు (గాయములు) మానును.

## బలాది ఘృతమ్.

శ్లో॥ బలా చిత్రరసే సిద్ధం సర్పిః క్షీరం చతుర్గుణమ్॥ 191.
జీరకద్వయ మృద్వీకా మధుకేన సమన్వితమ్
సమీరణ వికారఘ్నం కాస హిక్కాన్త్ర నాశనమ్॥ 192.

తా :— ముత్తవప్పులగము వేరు, ఆముదపువేరు, వీనికషాయములో సగము ఆవు నెయ్యి, మఱియు ఆవుపాలు నాలుగురెట్లు, వీనన్నిటిని గలిపి కాచి అందు జీలకర్ర, నల్లజీలకర్ర, ద్రాక్ష, అతిమధురము, అనువాని కల్కమును తగినంతజేర్చి యథావిధి పాకము చేయవలయును. దీని నుపయోగించిన వాత వికారములు, కాస, హిక్క, మఱియు అంత్రరోగములును నశించును.

సహస్రయోగ ప్రకాశిక యందలి
ఘృతయోగ ప్రకరణము సంపూర్ణము.

---

ఓం శ్రీధన్వంతరయేనమః

# సహస్రయోగ ప్రకాశిక

## 3. అథ తైలయోగ ప్రకరణమ్

---

### ధాన్వంతర తైలమ్.

శ్లో॥ బలామూల కషాయస్య భాగాః షట్పయసస్తథా
యవకోల కులత్థానాం దశమూలస్య చైకతః॥ 1.
నిష్క్వాథ భాగో భాగశ్చ తైలస్యచ చతుర్దశ
ద్విమేదా దారుమంజిష్ఠా కాకోళీ ద్వయ చందనైః॥ 2.
సారిబాకుష్ఠ తగర జీవకర్షభ సైంధవైః
కాలానుసార్యా శైలేయ వచాగురు పునర్నవైః॥ 3.
అశ్వగంధా వరీక్షీర శుక్లా యష్టి వరా రసైః
శతాహ్వా శూర్పపర్ణేలా త్వక్పత్రైః శ్లక్ష్ణ కల్కితైః॥ 4.
పక్వం మృద్వగ్నినా తైలం సర్వవాత వికారజిత్
సూతికా బాలమర్మాస్థి క్షత క్షీణేషు పూజితమ్॥ 5.
జ్వరగుల్మ గ్రహోన్మాద మూత్రాఘాతాంత్ర వృద్ధిజిత్
ధన్వంతేరరభిమతం యోనిరోగక్షయాపహమ్॥ 6.

తా:— ముత్తవపులగమువేళ్ళ కషాయము $1\frac{1}{2}$ ఆఢకములు దీనికి సమము ఆవుపాలు చేర్చవలయును. పిదప యవలు, రేగుపండ్లు, ఉలవలు, అనునవి ప్రత్యేకము 24 తులములు, దశమూలములన్నియును గలిపి 24 తులములు. వీనిని బాగుగా దంచి 2 ఆఢకముల నీళ్ళలో వేసి నాల్గవభాగము మిగులునట్లు కషాయముగ కాచి వడియగట్టి పైకషాయములో జేర్చి దానియందు నువ్వులనూనె అర్ధఆఢకము కూడ జేర్చవలయును. తరువాత మేద, మహామేద, దేవదారు, మంజిష్ఠ, కాకోళీ, క్షీరకాకోళీ, చందనము, సుగంధపాలవేళ్ళు, చంగల్వకోష్ఠు, గ్రంధితగరము, జీవకము, ఋషభకము, సైంధవలవణము

గ్రంధితగరము, రాతిపువ్వు, వస, అగరు, తెల్లగలిజేరు, పెన్నేరుగడ్డ, శతావరి, నేల గుమ్ముడుగడ్డ, అతిమధురము, త్రిఫలములు, ద్రాక్ష, సాయికూరగింజలు (బద్దసోపు) అడవి మినుములు, అడవి పెసలు, ఏలకులు, దాక్షిణిచెక్క, ఆకుపత్రి అనువానిని ప్రత్యేకము అర్ధపలము చొప్పున గ్రహించి కల్కముచేసి పైదానిలో జేర్చి మందాగ్నిచే యధావిధి తైలపాకము చేయవలయును. దీనివలన సర్వవాతరోగములును, సూతికలును, బాలరోగములును, మర్మరోగములును, అస్థి, క్షత, క్షీణరోగములును చక్కబడును. ఇవిగాక జ్వర, గుల్మగ్రహబాధ, ఉన్మాద, మూత్రాఘాత, అంత్రవృద్ధి, యోనిరోగములు మఱియు క్షయవ్యాధులును హరించును.

## శుద్ధబలా తైలమ్.

శ్లో॥ బలామూలాత్పలశతం కుట్టయిత్వా జలే పచేత్
చతుర్భాగావశిష్టేస్మిన్ తత్కల్కం దశభిః పలైః॥ 7.
తైలాఢకం విపక్తవ్యం ద్విగుణక్షీర సంయుతమ్
ఏతచ్ఛుద్ధ బలాతైలం వాతరోగ వినాశనమ్॥ 8.

తా :— ముత్తవపులగము వేళ్లు 100 ఫలములు గ్రహించి బాగుగా దంచి, ఉచిత ప్రమాణము నీళ్ళలో వేసి నాల్గవభాగము మిగులునట్లు కాచి వడియగట్టి అందు ఒక ఆఢకము నువ్వులనూనె మఱియు 2 ఆఢకములు ఆవుపాలు చేర్చి పిదప పదిపలములు ముత్తవపులగము వేళ్ళ కల్కమును పైదానిలో వేసి యధావిధి తైలపాకము చేయవలయును. ఈ శుద్ధబలాతైలము వాతరోగములను నశింపజేయును.

## క్షీరబలా తైలమ్.

శ్లో॥ బలామూలాత్పంచపలం క్షీరపిష్టంచ యోజయేత్
క్షీరే చతుర్గుణేతైల ప్రస్థం మృద్వగ్నినా పచేత్
ఏతత్ క్షీరబలా తైలం వాతాశీతి వినాశనమ్॥ 9.

తా.— ముత్తవపులగము వేళ్ళు 5 పలములు, వీనిని పాలతోనూరి ముద్దగా చేయవలయును. ఆవుపాలు నాలుగు ప్రస్థములు, నువ్వులనూనె ఒక ప్రస్థము, వీనిలో పై ముద్దను వైచి యధావిధి తైలపాకము చేయవలయును. దీనినుపయోగించిన ఎనుబది వాత రోగములు హరించును.

## క్షీరబలా తైలమ్ (ఆవర్తన సహితము)

శ్లో॥ బలాకషాయ కల్కాభ్యాం తైలం క్షీర సమం పచేత్॥ 10.
సహస్ర శతపాకం తద్వాతాసృగ్వాత రోగనుత్
రసాయనం ముఖ్యతమ మింద్రియాణాం ప్రసాదనమ్॥ 11.

శ్లో॥ జీవనం బృంహణం స్వర్యం శుక్రాసృగ్దోష నాశనమ్
కుపితే మార్గ సంశోధార్థ మేదసో వా కఫస్యచ॥ 12.
అతివృద్ధానిలే శస్తమాదౌ స్నేహన బృంహణమ్
కృత్వా తత్రాఢ్య వాతోక్త వాతశోణిత కృంతతః॥ 13.
భేషజం స్నేహనం కుర్యాద్యచ్చ రక్తప్రసాదనమ్
ప్రాణాదికోపే యుగపద్యథోద్దిష్టం యథామయమ్॥ 14.
యథాసన్నంచ భైషజ్యం వికల్పం స్యాద్యథోల్బణమ్
నీతేనిరామతాం సామేస్వేదలంఘన పాచనైః॥
రూక్షైరాలేపసేకాద్యైః కుర్యాత్ కేవలవాతనుత్॥ 15.

తా :— ముత్తవపులగము వేళ్ళు 16 పలములను దంచి ఒక ద్రోణము నీళ్ళలోవేసి నాల్గవభాగముండునట్లు కషాయముగకాచి వడియగట్టి అందు ఆవుపాలు ఒకప్రస్థము, తిలతైలము ఒక ప్రస్థము, మఱియు యథోచితము పాలతో నూరబడిన బలామూలకల్కమునువైచి తైలపాకము చేయువలయును. ఈ ప్రకారముగ పైతైలము నూరుసార్లుగాని, వెయ్యిసార్లుగాని జేసిన ఆవర్తిత తైలమనబడును. ఇది మిక్కిలి గుణవత్తరము. దీనిని అవసరానుసారము సేవించిన వాతములు మఱియు వాతరక్తరోగములను హరించును. ఇది ముఖ్యమైన రసాయనము మఱియు ఇంద్రియ ప్రసాదనమును గలుగ జేయును. ఇది జీవనము, బృంహణము, మఱియు స్వరములను వృద్ధిజేసి శుక్రదోష, రక్తదోష మేదస్సులను మఱియు కఫదోషములను హరించి వాని మార్గములను శోధనము చేయును. దీనిని వాతాధిక్యమునందు తొలుత స్నేహన బృంహణలను జేసి పిదప ఆఢ్యవాతము మఱియు వాతరక్తము లందు జెప్పబడిన చికిత్సలను జేసి అనంతరమా యావర్తిత క్షీరబలాతైలము నుపయోగించిన ప్రారంభమున స్నేహముగా పనిచేసి తదుపరి రక్తమును ప్రసాదించును. ప్రాణాది పంచవాయువులు ఒకేసారి ప్రకోపించినప్పుడు ఇది సిద్ధౌషధమువలె పనిచేయును. మఱియు దోషములయొక్క ఋతుప్రకోపావస్థల గుంపెది దివ్యౌషధము. వాతము ప్రకోపించినపుడు తొలుత స్వేదన, లంఘన, మఱియు పాచన కర్మలను జేసి, రూక్షత్వమందు, ఆ లేపము మఱియు సేకము మొదలగు కర్మలచే దోషములను నిరామములుగా జేసి తదనంతరము దీనిని కేవలము వాతహరముగా నివ్వవలయును.

## కేతక్యాది తైలమ్.

శ్లో॥ కేతకమూల బలాతిబలానాం యచ్ఛహాలేన రసేనవిపక్వమ్
తైలమనల్ప తుషోదక యుక్తం మారుత మస్థిగతం వినిహన్తి॥16

తా :— మొగలిఊడలు, చిన్నముత్తవపులగము, పెద్దముత్తవ పులగము వేళ్లు, మునగవేరు, వీనిని దంచి విధిప్రకారము కషాయముగకాచి వడియగట్టి అందు యవగంజి

మఱియు తిలతైలమును యథోచితము చేర్చి తైలవిధిని పాకము చేయవలయును. ఈ తైలము అస్థిగతవాతమును హరించును.

## (1) చించాది తైలమ్.

శ్లో॥ చించాయాః పత్రక్వాథేతు శిగ్రు సర్జార్జకైః పచేత్
పంచభిర్లవణై ర్యుక్తం తైలం సర్వాంగ వాతనుత్॥ 17.

తా :— చింతాకును కషాయముగ కాచి, అందు యథోచితము నువ్వులనూనెను జేర్చి పిదప ఏపిచెక్క, మునగచెక్క, రుద్రజడ మఱియు పంచలవణములను జేర్చి తైల పాకము చేయవలయును. ఇది సర్వాంగవాతములను బోగొట్టును.

## ప్రభంజన విమర్దన తైలమ్.

శ్లో॥ బలా శతావరీ శిగ్రు వరణార్క కరంజకాః
ఏరండశ్చైవ కోరంటో వాజిగంధా ప్రసారిణీ॥ 18.
పంచమూలం వరిష్ఠంచ తైః సమే క్వథితే జలే
పాదావశేషితే దద్యాత్ తైలస్యార్థాఢకం భిషక్॥ 19.
క్షీరం తద్విగుణం దద్యాత్ తత్సమం దధికాంజికే
తగరామర కుష్ఠైలా శుంఠీ సర్షప చోరకాన్॥ 20.
ఉత్పలాంద్యాంజనే సీలిం శ్లక్ష్ణపిష్టాన్ సమావపేత్
శతాహ్వా కుష్ఠ సింధూత్థ రాస్నా కాలానుసారికా॥ 22.
వచా సచిత్రకం మాంసీ సరలం కటురోహిణీ
ప్రత్యేకం కర్షికాన్ భాగాన్ ప్రతీవాపాయ పండితః॥ 22.
తత్సంభారేణ మృద్వగ్ని సిద్ధం తిలజ మాదరాత్
పానాభ్యంజన గండూషే విధేయం వస్తి కర్మణి॥ 23.
అశీతి వాతజాన్ రోగాన్ హన్యాదాశు సుదారుణాన్
ఏతత్తైలం మహావీర్య మాత్రేయ ప్రముఖైఃపురా॥
నిర్మితం నామకం చాపిప్రభంజన విమర్దనమ్॥ 24.

తా :— ముత్తవపులగము వేళ్ళు, శతావరి, మునగచెక్క, ఉలిమిరిచెక్క, జిల్లేడు వేరు, కానుగవేరు, ఆముదపు వేరు, పచ్చ ముళ్ళ గోరింటవేళ్లు, పెన్నేరుగడ్డ, ప్రసారిణీ, బృహత్పంచమూలములు, (మారేడు వేరు, తక్కలివేరు, పెద్దగుమ్ముడు వేళ్ళు, దుందిలము,

కలిగొట్టు) వీనిని సమభాగములుగ గ్రహించి దంచి నాల్గవ భాగము అనగా 2ఆఢకములు మిగులునట్లుగ కషాయముకాచి దానియందు అర్ధఆఢకము నువ్వులనూనెవైచి పిదప గ్రంధి తగరము, దేవదారు, చెంగల్వకోష్టు, ఏలకులు, శుంఠి, ఆవాలు, కచోరములు, నల్లకలువ, సుర్మారాయి, నీలివేరు, సోయాగింజలు (బద్దసోఫు) సైంధవలవణము, సన్నరాస్నము, మెంతులు, వస, చిత్రమూలము, జటామాంసి, సరళదేవదారు, కటుకరోహిణి, అనువానిని ప్రత్యేకము కర్షప్రమాణము చొప్పున గ్రహించి చేసిన కల్కము ఆవుపాలు ఒకఆఢకము, పెరుగు అర్ధఆఢకము మఱియు యవగంజి అర్ధఆఢకము. వీనిని పైదానిలో గలిపి మందాగ్నిచే తైలపక్వము చేయవలయును. ఇది పాన, అభ్యంజన, గండూషములకును, మఱియు వస్తికర్మలకు నుపయోగపడును. దీనివలన ఎనుబది వాతములు ఎంత భయంకరమైనవైనను హరించును. ఇది మహాగుణకారి. ఈ తైలము ఆత్రేయాది మునులచేత నిర్మింపబడినది.

## (2) చించాది తైలమ్.

శ్లో॥ చించామండక సారిణీ వరణక స్నుగ్భాను గండీరికా
జంబీరీ శతపత్రి గుంజనరసే దధ్యామ్ల శుక్తాన్వితే
సిద్ధార్థామరదారు శిగ్రు లవణై ర్విశ్వాన్వితైః కల్కితైః
తైలం సిద్ధమశీతివాత వికృతిం చించాది శీఘ్రంహరేత్॥ 25.

తా:— చింతాకులు, ఆముదపాకులు, ప్రసారిణి, తీగె, ఉల్లిమిరియాకులు, జముడాకులు, జిల్లేడాకులు, మంజిష్ఠ, తామరపువ్వులు, నారింజాకులు, వెల్లుల్లి, వీనిస్వరసముగాని చతుర్థాంశకషాయముగాని ఒక భాగము, అందు పెరుగుమీదినీరు 1 భాగము, పుల్లకలిలేక తరవాణి 1 భాగము, పిదప తెల్లఆవాలు, దేవదారు, మునగచెక్క, సైంధవలవణము, శుంఠి వీని యథోచిత కల్కమును పైవానిలోవైచి మఱియు నవసరమైనంత నువ్వులనూనె కూడ జేర్చి యథావిధి తైలము వండవలయును. దీని నుపయోగించిన ఎనుబది వాతరోగములు త్వరగా పోవును.

## పరిణతకేరీ క్షీరాది తైలమ్.

శ్లో॥ పరిణత కేరీ క్షీరే జంబీర ఫలోదకేన తులితేన
క్షుణదా సురధూప శృతం తైలం హ్యాపబాహుకం జయతి॥ 26.

తా:— కొబ్బరిపాలు, నిమ్మపళ్ళ రసము ఇవి సమభాగములు వీనిలో తగినంత నువ్వుల నూనె గలిపి దానిలో పసుపు, గుగ్గిలము, అనువాని యథోచిత కల్కమును జేర్చి తైలమును విధిప్రకారము వండవలయును. ఈ తైలము అపబాహుక వాతరోగములను జయించును.

## దేవదారు బలాదితైలమ్.

శ్లో॥ దేవదారు బలారాస్నా మాంసీ సర్షప నాగరైః
బలా కషాయ సంసిద్ధం తైలం సర్వాంగ వాతజిత్॥ 27.

తా :— ముత్తవపులగనువేరు కషాయమందు దేవదారు, సన్నరాస్నము, జటామాంసి, ఆవాలు, శుంఠి, అనువాని యథోచిత కల్కమును జేర్చి దానిలో తగినంత నువ్వులనూనె కూడ జేర్చి యథావిధి తైలము వండవలయును. దీనివలన సర్వాంగ వాతములు హరించును.

## బలాగుడూచ్యాది తైలమ్.

శ్లో॥ బలా గుడూచ్యాః క్వాథేన తైలం క్షీరసమన్వితమ్
చందనోశీర యష్ట్యాహ్వా ముస్తాకల్కైః పచేత్పునః॥ 28.
సిద్ధమేతద్వాతరక్తం రక్తపిత్తం శిరోరుజమ్
వాతపిత్త కృతాన్ రోగానాశు హన్యాత్ సుపూజితమ్॥ 29.

తా :— ముత్తవపులగముపేళ్లు, (బలామూలము) తిప్పతీగె, వీని క్వాథమందు తగినంత తిలతైలము మఱియు ఆవుపాలను జేర్చి పిదప చందనము, వట్టివేళ్ళు అతిమధురము, భద్రముస్తలు, వీని యథోచిత కల్కమును కూడ పైదానిలో గలిపి తైలపాకము చేయవలయును. దీనిచేత వాతరక్తము, రక్తపిత్తము, శిరోరోగము, మఱియు వాతపిత్తరోగములను హరించును.

## త్రిమిశ్రిత తైలమ్.

శ్లో॥ వరీబలామృతా క్వాథే తైలం సిద్ధం పయః సమమ్
చందనోశీర కుష్ఠాబ్ద కల్కితం వాతరక్తనుత్॥ 30.

తా :— శతావరి, బలామూలము, తిప్పతీగె, ఈ మూడింటి యథోచిత కషాయములో తగుమాత్రము తిలతైలమును, తైలమునకు సమము ఆవుపాలను చేర్చి పిదప వట్టివేళ్ళు, చందనము, చెంగల్వకోష్టు, భద్రముస్తలు, అనువాని కల్కమును తగినంత వేసి తైలమును సిద్ధము చేయవలయును. దీనిచేత వాతరక్తరోగములు పోవును.

## బలాశ్వగంధాది తైలమ్.

శ్లో॥ బలాశ్వగంధా లాక్షాణాం క్వాథే పాదాంశ శోషితే
తైలప్రస్థం పచేద్ధీమాన్ దధిమస్తు చతుర్గుణే॥ 31.
రాస్నా చందన మంజిష్ఠా దూర్వా మధుక చోరకైః
సారిబోశీర జలద కుష్ఠాగురు సురద్రుమైః॥ 32.
హరిద్రా కుముదా కాంతీ శతాహ్వా పద్మకేసరైః
కల్కైరేభి స్స సంయుక్తో క్వార్థికైశ్చ సుపేషితైః॥ 33.

శ్లో॥ శనైర్మృద్వగ్నినా పక్వా గాఢ యేద్భాజనే శుభే
పరిశస్తే తిథి నక్షత్రే తత్తైలం శీలయేన్నరః॥ 35.
తేన సర్వే జ్వరోన్మాద క్షయకాసాదయో గదాః
నశ్యంతి వివిధాశ్చైవ వాతరోగానసంశయః॥
అశ్విభ్యాం నిర్మితం తైలమేతత్పుష్టికరం పరమ్॥ 36.

తా :— బలామూలము, పెన్నేరుగడ్డ, పుడకలక్క, వీని చతుర్థాంశకషాయము, 4 ప్రస్థములు, తిలతైలము ఒక ప్రస్థము, పెరుగ మీదినీరు (మస్తు) 4 ప్రస్థములు, వీనినన్నిటిని జేర్చి దానియందు సన్నరాష్ట్రము, చందనము, మంజిష్ఠ, గరిక, అతిమధురము, కచోరములు, సుగంధపాల, వట్టివేళ్ళు, భద్రముస్తలు, చెంగల్వకోష్టు, అగరు, దేవదారు, పసుపు, ఎర్రగలువగడ్డ, రేణుకలు, సాంబుకూర గింజలు (బద్దసోపు), పద్మకేసరములు, అనువానిని ప్రత్యేకము ఒక కర్షము చొప్పున గ్రహించి కల్కముచేసి వేసి యథావిధి తైలము వండవలయును. ఈ తైలమును మంచి తిథి, వార, నక్షత్రములందు సిద్ధముచేసి దీని నుపయోగించుట వలన సమస్తక్షయవ్యాధులు, ఉన్మాదములు, జ్వరములు, కాసలు, మఱియు వివిధ వాత రోగములును హరించి పుష్టిని గలుగ జేయును. ఈ తైలము అశ్వినీ కుమారులచే నిర్మితమైనది.

## బలాగుడూచ్యాది తైలమ్.

శ్లో॥ బలాగుడూచీ సురపాదపానాం క్వాథే పచే త్తైలమిమైశ్చకల్కైః
జటామయం చందన కుందురుష్క నతాశ్వగంధా సరలైః సరాస్నైః॥
ఏతత్సదాహం సరుజం సశోఫం రక్తానుగం వాతగదం నిహన్తి॥ 37.

తా :— ముత్తవపులగము వేళ్ళు, తిప్పతీగె, దేవదారు, వీని చతుర్థాంశకషాయములో నువ్వులనూనె తగినంత కలిపి పిదప జటామాంసి, చెంగల్వకోష్ఠు, చందనము, కుందురుష్కము, గ్రంధితగరము, పెన్నేరుగడ్డ, సరళదేవదారు, సన్నరాష్ట్రము, వీని కల్కమును యథోచితము పైదానిలో జేర్చి విధిప్రకారము తైలపక్వము చేయవలయును. జేయవలయును. దీనిని పైకి రాచుటవలన వాపు మంట మొదలగు బాధలతో గూడిన రక్తగతవాతరోగము లన్నియును నశించును.

## కార్పాసాస్థ్యాది తైలమ్.

శ్లో॥ కార్పాసాస్థి బలామాష కులుత్థైః క్వథితేజలే
కుహోదారు బలారాస్నా కుష్ఠ సర్షపనాగరైః॥ 38.
శతాహ్వా పిప్పలీమూల చవ్యశిగ్రు పునర్నవైః
కల్కైస్తైలమాజేన క్షీరేణ సహితం పచేత్॥ 39.

శ్లో॥ తత్పాన నావనాభ్యంగ యోగాత్ సర్వానిలాపహామ్
విశేషాదపబాహుంచ పక్షాఘాతార్దితం హరేత్॥ 40.

తా:— ప్రత్తిగింజలు, బలామూలము, మినుములు, ఉలవలు, వీని చతుర్థాంశ కషాయములో నువ్వులనూనె మఱియు మేకపాలు యథోచితముగా గలిపి అందు రేగు పండ్లు, బలామూలము, సన్నరాస్నము, దేవదారు, చెంగల్వకోష్టు, ఆవాలు, శుంఠి, పాయికూర గింజలు (బద్దసోపు) మోడి, చవ్యము, మునగవేరు, తెల్లగలిజేరువేళ్ళు, అను వాని కల్కమును యథోచితముగ జేర్చి తైలము సిద్ధము చేయవలయును. ఈ కార్పాసాస్థ్యాదితైలమును పాన, నశ్య అభ్యంగములకు పనికివచ్చును. దీనిచే సర్వవాతములు హరించును. ఇది అపబాహుక, పక్షాఘాతములను మఱియు, అర్దిత వాత రోగములను బోగొట్టును.

## లాక్షాది తైలమ్.

శ్లో॥ లాక్షారససమం తైలం తైలాన్మస్తు చతుర్గుణం
అశ్వగంధా నిశాదారు కౌంతీకుష్ఠాబ్ద చందనైః॥ 41.
సమూర్వా రోహిణీరాస్నా శతాహ్వా మధుకైః సమైః
సిద్ధం లాక్షాదికంనామ తైలమభ్యంజనాదికమ్॥ 42.
సర్వజ్వర క్షయోన్మాద శ్వాసాపస్మార పాప్మజిత్
యక్ష రాక్షస భూతఘ్నం గర్భిణీనాంచశస్యతే॥ 43.

తా:— పుడకలక్క కషాయము మఱియు నువ్వులనూనె ఇవి సమభాగములు, నూనెకు నాలుగురెట్లు మస్తు (పెరుగుమీది నీరు) వీనినన్నిటిని గలిపి అందు పెన్నేరు గడ్డ, పసుపు, దేవదారు, రేణుకలు, చెంగల్వకోష్టు, భద్రముస్తలు, చందనము, చాగవేరు, కటుకరోహిణి, సన్నరాస్నము, సోయిగింజలు (బద్దసోపు) అతిమధురము, వీని సమభాగ కల్కమును తగినంత జేర్చి యథావిధి తైలము వండవలయును. దీనిని వడియగట్టి అభ్యంజనము చేసిన సర్వజ్వరములు, క్షయలు, ఉన్మాదములు, శ్వాసలు, అపస్మార రోగములను మఱియు యక్ష, రాక్షస, భూత బాధలను హరించును. ఇది గర్భిణీ స్త్రీల కుత్తమమైనది.

## ఆరనాళాది తైలమ్.

శ్లో॥ ఆరనాళాఢకే తైలం పాదసర్జరసే శృతమ్
ప్రభూతే ఖజితం తోయే జ్వరదాహార్తినుత్పరమ్॥ 44.

తా:— యవగంజి ఒక ఆఢకము, నువ్వులనూనె పావు ఆఢకము, గుగ్గిలము 16 తులములు. దీనిని పొడిచేసి పైవాటిలో జేర్చి తైలము వండి పిదప నీటితో కడిగి సేచనాది విధులయం దుపయోగించినయెడల జ్వర, దాహ, మేదస్సులను హరించును.

## పిండ తైలమ్.

శ్లో॥ సమధూచ్ఛిష్ట మంజిష్ఠం ససర్జరససారిబమ్
పిండతైలం తదభ్యంగా ద్వాతరక్త రుజాపహమ్॥ 45.

తా:— సుగంధపాలవేళ్లు మఱియు మంజిష్ఠను దంచి తీసిన కషాయము 1 భాగము అందు నాలుగు రెట్లు నువ్వులనూనె పోసి కాచి పిదప కషాయములో నాల్గవభాగము గుగ్గిలమును వేసి అనంతరము అదే ప్రమాణము తేనెమైనమును గలిపి పొంగిపోకుండా జాగ్రత్తగా కలుపుచు తైలము సిద్ధపఱచవలయును. దీనిని పైకి రాయుటచే వాతరక్త వ్యాధులు నశించును.

## పిండ తైలమ్ (చరకే).

శ్లో॥ సమధూచ్ఛిష్ట మంజిష్ఠం ససర్జ రససారిబమ్
పిండతైలం తదభ్యంగా ద్వాతరక్త రుజాపహమ్॥

## పిండ తైలమ్ (వాగ్భటే).

శ్లో॥ సమధూచ్ఛిష్ట మంజిష్ఠం ససర్జరస సారిబమ్
పిండతైలం తతభ్యాంగా ద్వాతరక్త రుజాపహమ్॥

## పిండ తైలమ్ (శార్ఙ్గధరే).

శ్లో॥ మంజిష్ఠా సారిబా సర్జ యష్టీసిక్థైః పలోన్మితైః
పిండాఖ్యం సాధయేత్తైలమైరండం వాతరక్తనుత్॥

తా:— సర్జరసము, సుగంధపాలవేళ్లు, మైనము, మంజిష్ఠ అనువాని కల్కమును యథోచితముగ అందులో జేర్చి యథావిధి తైలపాకము చేయవలయును. ఈ పిండ తైలమును అభ్యంగముల కుపయోగించినచో వాతము మఱియు రక్తబాధలును శమించును.

## పిండ తైలము (మలయాళ సాంప్రదాయము).

తా:— సుగంధపాలవేళ్ల పొట్టు, మంజిష్ఠ, అనునవి సమభాగములు. వీనిని దంచి 16 రెట్లు నీళ్లలో వేసి నాల్గవ భాగము మిగులునట్లు కషాయముగ కాచి వడియగట్టి అందు కషాయమునకు నాల్గు రెట్లు ఆముదమును పోసి నెమ్మదిగా కాచి, కషాయ మింకి పోయిన తదుపరి తెల్లగుగ్గిలమును గలిపి, అవి కలిసిపోవువరకు జాగ్రత్తగా కాచి పిమ్మట మైనమునుగూడ జేర్చి యధావిధి తైలపాకము చేయవలయును. వేడిమిగానుండగానే వడియగట్టి భద్రపరచవలయును. ఈ పిండతైలమును పైకి రాచుటచే వాతరక్త బాధ ఉపశమించును.

## తేకరాజాది తైలమ్.

శ్లో॥ తేకరాజరసవింశతిభాగే పక్వా తైలముభయా ప్రతివాపమ్
కాస మాశు వినిహంతి నరాణాం మేఘసృందమివ మారుతవేగః॥ 46.

తా:— భృంగరాజస్వరసము 20 భాగములు, తిలతైలము 5 భాగములు మఱియు తగినంత కరక్కాయ కల్కమును పై వానిలో జేర్చి యథావిధి తైలము వండవలయును. దీని నుపయోగించుటచేత గాలిచే నీడ్వబడిన మేఘములవలె కాసరోగములు శీఘ్రముగ దొలగిపోవును.

## పంచవల్కాది తైలమ్.

శ్లో॥ పంచవల్క నిశా గోపీ కషాయే తిలజం పచేత్
రంభాది కంద మధుక త్వక్సే వ్యామయ చందనైః
రక్తపిత్తోత్తరే కుష్ఠే విసర్పే క్లేదవత్యపి॥ 47.

తా :— మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, కలుజువ్వి, లేక వేతసము అనువాని పట్టలు (క్షీరివృక్షముల పట్టలు) పసుపు మఱియు సుగంధపాల వీనినన్నిటిని సమభాగములుగా గ్రహించి దంచి యథావిధి కషాయమును గాచి అందు తగినంత తిలతైలమును జేర్చి పిదప అరటి దుంప, తామరదుంప, నల్లకలువదుంప, నేలసంపంగి గడ్డ, మెట్టతామర, యష్టి మధుకము, లవంగపట్ట, వట్టివేళ్ళు మఱియు చందనము వీని యథోచిత కల్కమును జేర్చి యథావిధి తైలపాకము చేయవలయును. దీనిచే రక్తపిత్తము వలన గల్గిన కుష్ఠరోగములు మఱియు విసర్పములును హరించును.

## దినేశవల్ల్యాది తైలమ్.

శ్లో॥ దినేశవల్లీ రజనీ దినేశ వ్యాఘాతక క్షీర మహీరుహాణామ్
క్వాథేన కల్కేన పచేత్తైలం త్వగ్దోషశాంత్యై ర్వరవర్ణకారి॥ 48.

తా :— మంకెనచెట్టు వేళ్ళు, (మలయాళ భాషలో వెంబాడ), పసుపు, జిల్లేడువేరు, రేలచెక్క, వీని కషాయములో పై వస్తువుల కల్కమునే తగినంత జేర్చి అందు నువ్వులనూనె యథోచితము వేసి యథావిధి తైలము వండవలయును. ఇది చర్మ రోగములను బోగొట్టి మంచి వర్ణమును బ్రసాదించును.

## (2) లాక్షాది తైలమ్.

శ్లో॥ లాక్షోశీర బలాక్వాథే జలే ద్విప్రస్థ మస్తుకే
పృశ్నిపర్ణీ విషాద్వంద్వం ద్వేహారిద్రే శతావరీ॥ 49.

శ్లో॥ జీవకర్షభకౌ రాస్నా సరళం దేవదారుచ
ముస్తా విదారీ మంజిష్ఠా వాలకాగురు వత్సకమ్॥ 50.
కుష్ఠం లోహిత యష్టించ మధూకం ద్వేచసారిబే
అనంతామలకీ మూర్వా మయూరం శిశిరద్వయమ్॥ 51.
అశ్వగంధాం కణాం కొంతీం తిక్తాం శ్యోనాక దీప్యకే
పాఠాం భార్ఙించ సంపిష్య తైలప్రస్థం విపాచయేత్॥ 52.
తతో మందాగ్నినా పక్వం తైలమభ్యంజనాదినా
జీర్ణ జ్వర క్షయోన్మాద శ్వాసాపస్మార పాప్మజిత్॥ 53.
బలపుష్ట్యర్థినాం నృణాం గర్భిణీనాంచశస్యతే॥ 54.

తా :— పుడకలక్క, వట్టివేళ్ళు, ముత్తవపులగము వేళ్ళు, వీని కషాయమొక ప్రస్థము, నువ్వుల నూనె ఒక ప్రస్థము, పెరుగ మీద నీళ్లు (మస్తు) 2 ప్రస్థములు, వీని నన్నిటిని జేర్చి అందు కోలపొన్న, వస, అతివస, పసుపు, మానిపసుపు, శతావరి, జీవకము, ఋషభకము, సన్నరాస్నము, సరళదేవదారు, దేవదారు, భద్రముస్తలు, నేలగుమ్మడు గడ్డ, మంజిష్ఠ, కురువేరు, అగరు, కొడిశపాలచెక్క, చెంగల్వకోష్టు, రక్తచందనము, అతిమధురము, ఇప్పచేవ, తెల్లసుగంధపాలవేళ్ళు, నల్లసుగంధపాల వేళ్లు, నేలయుసిరిక, ఉసిరికాయ, చాగవేరు, ఉత్తరేణివేరు, మంచిగంధము, పీతచందనము, పెన్నేరుగడ్డ, పిప్పళ్లు, రేణుకలు, కటుకరోహిణి, శెద్దమానివేరు, ఓమ, అమబొద్ది, గంటుభారంగి, వీనిని సమభాగములుగా గ్రహించి తగినంత కల్కమును చేసివైచి తైలమును సిద్ధముచేయవలయును. ఈ తైలమును అభ్యంజనమున నుపయోగించుటచేత, క్షయలు, జీర్ణజ్వరములు, ఉన్మాదములు, శ్వాసలు, అపస్మారములు మఱియు జ్వరాదిరోగములను హరించును. గర్భిణీస్త్రీల కుత్తమమైనది పురుషులు దీనినుపయోగించిన బలమును మఱియు పుష్టిని గలిగించును.

## ఫేనోశీరాది తైలమ్.

శ్లో॥ ఫేనోశీర నిశాంబు కుష్ఠ మధుకైర్మంజిష్ఠ విశ్వాంబుభిః
మూర్వాలోహిత యష్టిసర్జ కటుకా సింధూత్థ లాక్షాంజనైః
సశ్రీకంఠ కణా నతైస్తిలరుహాం తక్రే పచేత్ షడ్గణే
తత్సద్యో హరతి జ్వరాన్ జ్వరకృతాన్ దాహాదిశీతాదికాన్॥ ౫౫

తా :— సముద్రఫేనము, (సారపియ్య) వట్టివేళ్ళు, పసుపు, కురువేరు, చెంగల్వకోష్టు, అతిమధురము, మంజిష్ఠ, శొంఠి, భద్రముస్తలు, చాగవేరు, రక్తచందనము, గుగ్గిలము, కటుకరోహిణి, సుర్మారాయి, మారేడువేరు, పిప్పళ్ళు, సైంధవలవణము,

లక్క, అగరు, గ్రంధితగరము, వీనిని యథోచిత ప్రమాణములుగ గ్రహించి కల్కము చేసి, తగినంత నువ్వుల నూనెలో జేర్చి పిదప నూనెను ఆరుసేర్లు మజ్జిగ కూడ వేసి తైలపాకము చేయవలయును. దీని నుపయోగించుటవలన జ్వరశూలం మఱియు వానిచే గలుగు దాహశీతాది బాధలును హరించును.

## భృంగాలర్కాది తైలమ్.

శ్లో॥ భృంగాలర్క వృషవ్యాఘ్రీ వృశ్చికాలీ పునర్నవాః
సూర్పర్ణకం సింధువారంచ కపోతా తామలక్యపి॥ 56.

కుండలీం కాసమర్దంచ ద్వాదశైషాం రసేపచేత్
త్రయోదశాంశ తిలజం కల్కైరేభిర్విపాచయేత్॥ 57.

పిప్పల్యగ్ని వచావత్స కోలగ్రంధిక తోయదైః
విశాలాతివిషా కౌంతీ చవ్య త్ర్యూషణ జీరకైః॥ 58.

భార్ఙ్గిమూర్వా మహానింబ ఫలదీప్యక సర్షపైః
హింగు తిక్త విడంగైశ్చ తత్సిద్ధం తిలజం జయేత్
కాసం పంచవిధం శ్వాసమశేషం జయతి క్షణాత్॥ 59.

తా :— గుంటగలగర, తెల్లజిల్లేడు, అడ్డసగము, వాకుడు, తేలుమణిచెట్టు, తెల్లగలిజేరువేళ్ళు, తుమికిచెక్క, వావిలిచెక్క, ఏలకులు, నేలయుసిరిక, తిప్పతీగె, కసివింద, అను నీ ద్రవ్యములను గ్రహించి, దంచి కషాయముగ కాచి, వడియగట్టి అందు తగు మాత్రము నువ్వుల నూనె జేర్చి పిదప పిప్పళ్ళు, చిత్రమూలము, వస, కొడిశపాలచెక్క, రేగుపండ్లు, మోడి, భద్రముస్తలు, ఏటిపుచ్చ, అతివస, రేణుకలు, చవ్యము, శుంఠి, పిప్పళ్లు, మిరియాలు, జీలకర్ర, గంటుభారంగి, చాగవేరు, పెద్దవేపపండ్లు, ఖురాసాని ఓము, ఆవాలు, ఇంగువ, కటుకరోహిణి, వాయువిడంగములు, వీని యథోచిత కల్కమును వైచి తైలమును వండవలయును. ఈ తైలము నుపయోగించుటచేత పంచవిధ కాసలు, మఱియు సమస్త శ్వాసరోగములును బహు శీఘ్రముగా హరించును.

## కచ్చూరాది తైలమ్.

శ్లో॥ కచ్చూర హేమ రజతారి ధనేంద్రవల్లీ
సైరేయకుకారలతికా బలభద్ర శృంగీ,
ఇక్ష్వాకు కూల రజనీ హరిపర్ణికా స్న
గ్ధర్మాంశు రోగరిపు రక్షిత కాపమార్గా॥ 60.

శ్లో॥ కచ్చూరి కేశర సురస్య శుభగ్నిజిహ్వా
ద్రోణా కుబేర రససిద్ధ విశుద్ధ తైలమ్
అర్కార్క వల్ల్య గధ పంచమహీరుహాణా
మత్స్యాభ ధూమలక వర్ణవతీ యుగానామ్॥ 61.

క్వాథే పచేద్గన ఫలత్రియ కాలియాబ్ద
మంజిష్ఠ యాన్విత కషాయగణైశ్చ పిష్టైః
పక్వాం విగాహ్య శశిజే సకలేచ కుష్ఠే
హ్యాభ్యఙ్గతాం సతి విశేషత ఏవభిన్నైః॥ 62.

తా:— కచోరగములు, ఉమ్మెత్త, పర్పాటకము, నేలయుసిరిక, గచ్చచెట్టు వేళ్లు, ముళ్ళగోరింటవేళ్లు, కాకరతీగె, ముత్తవపులగము వేళ్లు, కర్కాటకశృంగి, చేదు ఆనబ, చేమపాట్లతీగె, పసుపు, కోలపొన్న, జముడుపాలు, రావిచెక్క, రేలాకు, ఆవాలు, ఉత్తరేణివేరు, (సీమఅవిసి) పెద్దతంగేడు, మొగిలియూడలు, తులసి, అశోకపు ఆకు, పాత్తిమంప, తుమ్మి, నల్లతులసి, వీనిఫ్యగసము లేక కషాయము, (గల్లేడువేరు), వెంబాడ (దినేశవల్లి) (మలయాళభాషలో వెంబాడ). రావిచెక్క, మంకెనచెట్టువేరు, రేలచెక్క, పంచవల్కలములు, త్రిఫలములు, పసుపు, మానిపసుపు, వీనికషాయము. మఱియు నల్లనువ్వులనూనె, వీని నుచితప్రమాణముగా జేర్చి అందు చెంగల్వకోష్టు, త్రిఫలములు, పీతచందనము, భద్రముస్తలు, మంజిష్ఠ, అనువాని కల్కమును తగినంత వైచి యథావిధి తైలము వండవలయును. దీనిని అభ్యంజనాదులం దుపయోగించుట వలన సకల కుష్ఠువ్యాధులు హరించును.

## గుగ్గుల్వాది తైలమ్.

శ్లో॥ గుగ్గులు మరిచ విడంగైః సర్షప కాసీస సర్జరస ముస్తైః
శ్రీవేష్ట తాలగంధైర్మనశ్శిలా కుష్ఠకంపిల్లైః॥ 63.
ఉభయహరిద్రా సహితై శ్చక్రికతైలేన మిశ్రితై రేభిః
దినకరకరాభితప్తైః కుష్ఠం గృష్టంచ నష్టంచ॥ 64.

తా:— గుగ్గిలము, మిరియాలు, వాయువిడంగములు, ఆవాలు, కాసీసము, ఏపిజిగురు లేక మహిసాక్షి (సర్జరసము), తుంగముస్తలు, శ్రీవేష్టము, తాళకము, గంధకము, మనశ్శిల, చెంగల్వకోష్టు, వసంతంగుండ, (కంపిల్లము లేక కమలాగుండి) పసుపు, మానిపసుపు, వీనిని సమభాగములుగా గ్రహించి చూర్ణించి తగుమాత్రము తంటెపుగింజల తైలము లేక అణు(చక్రి)కా) తైలమందు వేసి ఎండలో బెట్టవలయును. దీనివలన నూతనముగా వచ్చిన కుష్ఠువ్యాధులు నశించును.

## ఏలాది తైలమ్.

శ్లో॥ ఏలాయుగ్మ తురుష్క కుష్ఠ ఫలినీ మాంసీ జలధ్యామకమ్
స్పృక్కా చోరక చోచపత్ర తగర స్థౌణేయ జాతీరసాః॥
శుక్తి వ్యాఘ్రనఖో మరాహ్వా మగురుః శ్రీవాసకం కుంకుమమ్
చండా గుగ్గులు దేవధూప ఖపురాః పున్నాగ నాగాహ్వాయమ్॥65
ఏలాదికో వాతకఫౌ విషంచ వినియచ్ఛతి
వర్ణప్రసాదనః కండూపిటకా కోఠ నాశనః॥ 66.

తా :— సన్న ఏలకులు, పెద్దఏలకులు, తురుష్కము, చెంగల్వకోష్ఠు, ప్రియంగు, జటామాంసి, కురువేరు, వట్టివేళ్ళు, స్పృక్క (పిక్కచెట్టుచెక్క) కచోరములు, ఆకు పత్రి, గ్రంథతగరము, పచ్చాకు, జాజియాకుల రసము, నఖంచిప్పలు, ముత్యపుచిప్పలు, దేవదారు, అగరు, శ్రీవేష్టము, కుంకుమపువ్వు, మాత్రిపసుపు, మహిసాక్షి, సర్జరసము, బూరుగుబంక, సురపొన్న లేక పున్నాగపుష్పములు, నాగకేసరములు, వీనినన్నిటిని కల్కముచేసి, తగినంత నువ్వుల నూనెలో పక్వము చేయవలయును. దీనివలన, వాత, కఫ, విష, కండూ, పిటకలును మఱియు చర్మకోఠరోగములును వశించి, శరీరమునకు మంచి కాంతిని గలిగించును.

## నిశోశీరాది తైలమ్.

శ్లో॥ నిశోశీర బలాహ్వాభే తైలమేలాది కల్కితమ్
సిద్ధమభ్యంగయోగేన పిటకా మేహసూదనమ్॥ 67.

తా :—పసుపు, వట్టివేళ్లు, బలామూలము, (ముత్తవపులగము వేళ్ళు), వీనికషాయ మందు తిలతైలమును యథోచితమువేసి అందు ఏలాది తైలమందు జెప్పబడిన కల్కమును తగుమాత్రముజేర్చి వండవలయును. దీనితో అభ్యంగము చేసిన యెడల పిటకలు మఱియు మేహరోగములును హరించును.

## అష్టపత్రి తైలమ్.

శ్లో॥ బిల్వం కారస్కరదళం భ్రమరం శశ్రివల్లరీ
సామృతం నాగవల్ల్యగ్రం పటోలామలకం తథా॥ 68.
ఆసుత్య ద్విగుణం క్షీరం తైలప్రస్థం విపాచయేత్
అష్టపత్రి మిదం తైలం శిరోరోగ వినాశనమ్॥ 69.

తా:— మారేడాకులు, విషముష్టియాకులు, గుంటగలగరాకులు, ఏటిపుచ్చాకులు, తిప్పతీగయాకులు, తమలపాకులు, మఱియు వాని చిగుళ్ళు, చేదుపొట్ల, ఉసిరికాయలు

వీని నన్నిటి రసములు కలిపి ఒక భాగము, ఆవుపాలు రెండు భాగములు, తిలతైలము ఒక భాగము, పై వాని నన్నిటిని జేర్చి తైలము వండవలయును. ఈ తైలము శిరోరోగములను హరించును.

## దార్వీస్వరసాది తైలమ్.

శ్లో॥ దార్వీస్వరస యష్ట్యాహ్వాం గృహధూమనిశాన్వితమ్
తైలమభ్యంజనాత్ పక్వం మేఢ్రరోగం నివారయేత్॥ 70.

తా :— మానిపసుపు కషాయమందు తగినంత నువ్వులనూనెను జేర్చి అందు యష్టిమధుకము, కరిధూపము(గృహధూపము) మఱియు పసుపు అనువాని కల్కమును యథోచితముగ గలిపి తైలపాకము చేయవల్లయును. ఈ తైలము నుపయోగించుట వలన మేఢ్రరోగములు నివారించును.

## అమృతోత్తర తైలమ్.

శ్లో॥ గుడూచ్యా విపచేత్ క్వాథే తైలం క్షీరసమన్వితమ్
చందనోశీర కుష్ఠాబ్ద సారిబామలకోత్పలైః॥ 71.
కల్కైరేభిః శిరోదాహం పిత్తగుల్మమపి జ్వరమ్
ప్రమేహం వినిహన్త్యాశు నామ్నా తదమృతోత్తరమ్॥ 72.

తా :—తిప్పతీగె కషాయము 4 భాగములు, తిలతైలము 1 భాగము, ఆవుపాలు 1 భాగము, వీనిని గలిపి పిదప చందనము, వట్టివేళ్ళు, చెంగల్వకోష్ఠు, తుంగముస్తలు, ఉసిరికాయలు, సుగంధపాలవేళ్ళు, మఱియు నల్లకలువ. అనునవి సమానముగ తైలములో నాల్గవభాగము గ్రహించి కల్కముగానూరి పైదానిలో జేర్చి తైలము వండవలయును. దీని నుపయోగించుట వలన శిరోదాహము, పిత్తగుల్మలు, జ్వరములు, ప్రమేహములు హరించును.

## చందనాది తైలమ్.

శ్లో॥ చందనోశీర నలద ధాత్రీ యష్ట్యాహ్వా సారిబాః
సబలాః సలిల ద్రోణే పృథగ్దశపలోన్మితాః॥ 73.
పక్త్వాకషాయే సక్షీరతే పేద్బ్రాహ్మీ వరీరసమ్
కుమారీ నాలికేరాంబు తైలమానం పృథక్ పృథక్॥ 74.
ప్రపౌండరీక మంజిష్ఠా ధాతకీ పద్మకేసరమ్
కుముదోత్పల శాలూక మృణాల బిసపద్మకమ్॥ 75.

శ్లో॥ అనంతా కుశకాశేక్షు క్షీరి శృంగం సవల్కలమ్
గణంచ జీవనీయాఖ్యం క్వాథేద్రవ్యాణి పేషయేత్॥ 76.
ప్రస్థంచ దత్వాతైలస్య శనైర్మృద్వగ్నినా పచేత్
ఏతత్తైలం ప్రశమయేద్దాహ మూర్ఛా శిరోగ్రహాన్॥ 77.
కామలా మాఢ్యరోగంచ రక్తపిత్తంచ నాశయేత్
ప్రదరం పిత్తవిభ్రంశం విసర్పం పిత్తవైకృతమ్
అభ్యంగ పాన నస్యాద్యైర్హంతి వజ్రమివాసురాన్॥ 78.

తా:— చందనము, కురువేరు, వట్టివేళ్లు, ఉసిరికాయలు, అతిమధురము, బలామూలము, సుగంధపాలవేళ్లు. వీనిని ప్రత్యేకము పదిపలములచొప్పున గ్రహించి, దంచి, ఒక ద్రోణము జలములో వైచి నాల్గవ భాగము మిగులునట్లు కషాయముగ కాచి వడియగట్టి అందులో ఆవుపాలు, బ్రాహ్మీరసము, శతావరీస్వరసము, కలబందరసము, లేతకొబ్బరి బొండముల నీళ్లు, మఱియు నువ్వులనూనె ఇవి ప్రత్యేకము ఒక ప్రస్థము చొప్పున వేసి పిదప తెల్లతామర, మంజిష్ఠ, ఆరెపువ్వు, పద్మకేసరములు, నల్లకలువ, ఎర్రకలువ, తామరతూండ్లు, తామరకాడలు, తామరపువ్వులు, పద్మకాష్టము, గరికె, కుశవేళ్లు, కాశగడ్డి, చెఱకువేళ్లు, పంచక్షీరి వృక్షముల వల్కలములు, మఱియు వాని చిగుళ్లు, జీవనీయగణము అనగా అష్టవర్గము, వీనిని ప్రత్యేకము 3 తులములచొప్పున గ్రహించి కల్కముగా నూరి పై దానిలో జేర్చి, తైలపాక విధిని వండవలయును. ఈ చందనాది తైలమునుపయోగించుటచేత మూర్ఛ, దాహ, శిరోగ్రహ, కామలా, ఆఢ్యవాత, రక్తపిత్త, ప్రదర, పిత్తవిభ్రంశ, విసర్పరోగములను మఱియు అన్యపిత్త వికారములను నశించును. దీనిని పాన అభ్యంగ నస్యకర్మలయం దుపయోగించిన వజ్రాయుధము రాక్షసుల నేవిధముగ సంహరించెనో ఆవిధముగనే పై వ్యాధులను నశింపజేయును.

## మాషాది తైలమ్.

శ్లో॥ మాషముద్గ బలాసిద్ధం తైలం సర్వశిరోర్తినుత్॥ 79.

తా:—అడవిమినుము, అడవి పెసర, బలామూలము వీని కషాయములో యథోచిత తిలతైలమును వేసి తైలము వండవలయును. ఇది సర్వశిరో రోగములను బోగొట్టును.

## తులసీ స్వరసాది తైలమ్.

శ్లో॥ తులసీస్వరసే సిద్ధం కుందురుష్క సమన్వితమ్
పూతినా సంభృతం హన్యాత్తైలం దుష్టజలస్రుతిమ్॥ 80.

తా:— తులసీస్వరసములో పిరంగి సాంబ్రాణి (కుందురుష్కం) కల్కము, మఱియు నువ్వులనూనె తగినంత వేసి విధిప్రకారము తైలము వండి ముక్కు రంధ్రములలో

వేసిన (నశ్యకర్మ చేసిన) ముక్కునుండి దుర్గంధముతో స్రవించు చీము మఱియు నీరు హరించును.

## తింతిడీ స్వరసాది తైలమ్.

శ్లో॥ తింతిడీస్వరసే తైల ప్రస్థం సమ్యక్ పచేద్భిషక్
అత్రకల్కం ప్రవక్ష్యామి సర్వవాత హరశ్చ యత్॥ 81.

తా:— చింతాకు స్వరసము రెండు ప్రస్థములు, నువ్వులనూనె ఒక ప్రస్థము వీనిని జేర్చి అందు వాతహర ద్రవ్యముల కల్కమునుకూడ తగినంత గలిపి తైలము సిద్ధము చేయవలయును. ఈ తైలము నుపయోగించిన సకల వాతరోగములు హరించును.

## కుష్ఠాంతక తైలమ్.

శ్లో॥ ద్వాత్రింశద్వాకుచీ బీజం జలద్రోణే విపాచయేత్
చతుర్భాగావశేషంతు కషాయమవతారయేత్॥ 82.
పూతేఽస్మిన్ కషాయేతు త్రికాంతంచ రసంతథా
పృథక్ పృథక్ పంచనిష్కం చతుర్వింశశ్చ నిష్కకమ్॥ 83.
గంధకంచైవ సంయోజ్య నాగవల్లీ రసేనతు
యామమాత్రం సుపిష్ట్వాతు సూక్ష్మం దృశది డోలయేత్॥ 84.
తైలప్రస్థం పచేత్సమ్యక్ శనైర్ద్రవ్యాన్ ప్రవాహయేత్
యావచ్చిక్కణతాం యాతి తత్తైలమవతారయేత్॥ 85.
ధాన్యమధ్యేతు నిఖనేత్ పక్షద్వయమపేక్షయా
శుభే ముహూర్తే నక్షత్రే సకల్కం తైలముత్తమమ్॥ 86.
లేహయేత్త్వాతరుత్థాయ మాసమాత్రం వివర్జేత్
క్షీరాన్నాశీ పరిహరన్ వ్యాయామాదీన్ జితేంద్రియః 87.
ప్రలేపాత్ సర్వకుష్ఠాని నాశయేత్ సహజానిచ
కుష్ఠాంతకమిదం నామ్నా తైలమాత్రేయనిర్మితమ్॥ 88.

తా:— బావంచాలు 32 పలములను, ఒక ద్రోణము జలములో వేసి చతుర్థాంశ కషాయముగ కాచి వడియగట్టి దానిలో అయస్కాంతము, సూర్యకాంతపురాయి, చంద్రకాంతము, రసము. ఇవి ఒక్కొక్కటి 5 నిష్కములు, గంధకము 24 నిష్కములు వీనిని తమలపాకుల రసములో ఒక యామకాలము నూరి పై కషాయములో జేర్చి నువ్వులనూనె ఒక ప్రస్థము పోసి మందాగ్నిచేత చిక్కపడువరకు వంట చేయవలయును.

ఇవి పాకము చేయునప్పుడు ఇనుపగంటెతో కలుపవలయును. ఈ తైలమును ఒకమాసము పర్యంతము ధాన్యరాశియందుంచి శుభనక్షత్ర శుభముహూర్తమందు పైకితీసి భద్రపరచవలయును. దీనిని ప్రాతఃకాలమందు కుష్ఠరోగులు సేవించిన ఆ వ్యాధి హరించి అమరత్వమును బొందుదురు. దీనిని సేవించునప్పుడు పాలు అన్నము మాత్రమే భుజింపవలెను. వ్యాయామము చేయకూడదు. ఈ తైలమును శరీరమునకు రాచినచో కుష్ఠములు మఱియు సహజ కుష్ఠములును నశించును.

## త్రిఫలాది తైలమ్.

శ్లో॥ ఏకా వాకుచి కీటహ్నాత్తు వరకైరా వేదితా వైద్యకై
రన్యోరుష్కర తేజనీ హరియవైర్యుక్తా ఫలాన్యంత్రయైః॥
అక్షేణామలకేన లోహితకయాచాన్యాపి సంకీర్తితా
త్రీణ్యేతాని ఫలత్రయాణి శరణం కుష్ఠాతురాణాం నృణామ్॥ 89.

తా:— బావంచాలు, వాయువిడంగములు, నీరుడిగింజలు (చాల్ మొగరా) వీని కషాయము, జీడిగింజలు, కొడిశపాల గింజలు, జ్యోతిష్మతి (వెక్కుడు తీగె), అను వాని కషాయము మఱియు త్రిఫలముల కషాయము, ఈ మూడు కషాయములను జేర్చి అందు తగినంత నువ్వులనూనె పోసి తైలపాకము చేయవలయును. ఇది కుష్ఠరోగులకు మిక్కిలి ప్రయోజనకారి.

## సహచరాది తైలమ్.

శ్లో॥ సమూల శాఖస్య సహాచరస్య తులాంసమేతాం దశమూలతశ్చ
పలాని పంచాశదభీరతశ్చ పాదావశేషం విపచేద్ఘటేపామ్॥ 90.
తత్రసేవ్య నఖకుష్ఠ హిమైలాస్పృక్ప్రియంగు నలికాంబు శిలాజైః
లోహితానలద సురాహ్వైః కోపనామిశి తురుష్క నతైశ్చ॥ 91.
కంపాక్షేప స్తంభ శోషాదియుక్తాన్
గుల్మోన్మాదౌ పీనసం యోనిరోగాన్
తుల్యక్షీరం పాలికైస్తైలపాత్రం
సిద్ధం కృచ్ఛ్రాన్ శీలితం హంతి వాతాన్॥ 92.

తా:— నల్లముళ్ల గోరింట సమూలము 100 పలములు, దశమూలములు 100 పలములు. శతావరి 50పలములు, జలము ఒక ద్రోణము. వీనిని గలిపి నాల్గవభాగము మిగులు నట్లుగ కాచి వడియగట్టిన కషాయమునకు సమానము ఆవుపాలు మఱియు నువ్వులనూనె యును జేర్చి అందు వట్టివేళ్ళు, నఖం చిప్పలు, చెంగల్వకోష్ఠు, మంచిగంధము, ఏలకులు

ఎఱ్ఱగంధపాల, పిక్కచెట్టుచెక్క, ప్రియంగు పగడపుతీగె, వట్టివేరు, రాతిపువ్వు, మంజిష్ఠ, జటామాంసి, దేవదారు, ఎఱ్ఱగన్నేరు, సాయిపుగాగి గింజలు (బద్దసోపు) శిలారసము, మఱియు గ్రంథితగరము, వీని యథోచిత కల్కమును గూడవేసి తైలపాకము చేయవలయును. దీనినుపయోగించిన కంప, ఆక్షేప, స్తంభ, శోషయుక్తవాతరోగములను, గుల్మ, ఉన్మాద, పీనస, యోనిరోగములును మఱియు కష్టతర వాతవ్యాధులను హరించును.

## కరంభశాఖోటాది తైలమ్.

శ్లో॥ కరంభ శాఖోట వరా నిశానాం ప్రాచీన కాలూశజ చిత్రకానామ్
దంతీయుతానాం క్వథితే కషాయే ప్రాచీనకల్కం తిలజంపచేత॥ 93.
ఆలూక మిథ్యా స్వరసైరుపేతం సపాదచిత్రా భవతైలమేతత్
శ్లీపాదనాశాయ వదంతి తైలం ఘృతంతు పిత్తప్రభవే వికారే॥ 94.

తా:—*కరంభ(నీరుబచ్చలి), *శాఖోట, బరివెంక లేక బరిణికచెట్టు? త్రిఫలములు పసుపు, పిప్పబొద్ది, అంకోడ్డ, చిత్రమూలము, దంతీమూలము, వీనికషాయమందు తగినంత తిలతైలమును గలిపి అందు చిరుబొద్ది కల్కమును చేర్చి తైలవిధిని పాకము చేయవలెను. దీనిచేత శ్లీపదవ్యాధులు (బోదకాళ్లు) హరించును. పైతానిలో తైలమునకు బదులుగా ఘృతమును చేర్చి కరంభశాఖోటాది ఘృతమువండి సేవించిన యెడల పిత్తప్రకోపముచే గలుగు శ్లీపదవ్యాధులు తొలగును.

## వచాది తైలమ్.

శ్లో॥ వచా హరీతకీ లాక్షా కటుకా రక్తచందనైః
నిర్గుండీ స్వరసే సిద్ధం తైలమాశ్వపచీం జయేత్॥ 95.

తా:— నల్లవావిలి లేక వావిలిరసములో తగినంత నువ్వులనూనె, గలిపి అందు వస, కరక్కాయ బెగడు, లక్క, కటుకరోహిణి, రక్తచందనము, అనువాని కల్కమును యథోచితముగ జేర్చి తైలము వండవలయును. దీని నుపయోగించిన అపచీరోగము బహుశీఘ్రముగా హరించును.

## (2) త్రిఫలాది తైలమ్.

శ్లో॥ త్రిఫలామృతవల్ల్యాచ కేతక్యసనకౌ బలామ్
ఏరండమింద్రవల్లీం చ జలద్రోణే విపాచయేత్॥ 96.
రసేన తేకరాజస్య హంసస్య స్వరసేనచ
తైలప్రస్థం పచేద్ధీమాన్ ద్విగుణ క్షీరసంయుతమ్॥ 97.

---

* కరంభ = ఉమ్మతిన్ వేరు (మళయాళభాషలో).

* శాఖోట = చేటుపరువవేరు (మలయాళభాషలో).

శ్లో॥ కల్కంచ కుష్ఠయష్ట్యాహ్వ పద్మకోశీర చందనైః
ముస్తైలా వత్రిమాంసీచ హయగంధామృతా బలా॥ 98.
సారిబామర కుష్టంచ లవంగ నతచోరకాన్
ఉత్పలాద్యంజనే నీలీ శ్లక్ష్ణపిష్టాన్ సమావపేత్॥ 99.
శిరోరోగ ప్రతిశ్యాయాఽ విశేషేణ వినాశయేత్
ఖాలిత్యంచైవ పాలిత్యం కేశానాం భంజనం తథా
త్రిఫలాద్య మిదం తైల మూర్ధ్వజత్రు గదాపహమ్॥ 100.

తా:— త్రిఫలములు, తిప్పతీగె, మెంగలియూడలు, వేగిసచెక్క, బలామూలము, ఆముదపువేళ్ళు, ఏటుపుచ్చ, వీనినిసమభాగములుగా గ్రహించి దంచి ఒక ద్రోణము నీళ్ళలో వేసి, చతుర్థాంశావశిష్టముగ కషాయము కాచి వడియగట్టి అందు భృంగరాజరసము ఒక ప్రస్థము, అంతరతామర స్వరసము ఒకప్రస్థము, తిలతైలము ఒక ప్రస్థము, ఆవుపాలు 2 ప్రస్థములు చేర్చి పిదప చెంగల్వకోష్ఠు, యష్టిమధుకము, పద్మకాష్ఠము, వట్టివేళ్ళు, మంచిగంధము, తుంగముస్తలు, ఏలకులు, ఆకుపత్రి, జటామాంసీ, పెన్నేరుగడ్డ, తిప్ప తీగె, బలామూలము, సుగంధిపాలవేళ్ళు. దేవదారు, చెంగల్వకోష్ఠు, లవంగాలు, గ్రంధి తగరము, కచోరములు, ఎర్రకలువ, నల్లకలువగడ్డ మార్గము, మెట్టతామర, తెల్ల కలువ, సుర్మారాయి, నీలిచెట్టు, వీని యథోచిత కల్కమును కూడ గలిపి తైలపాకము చేయవలయును. ఈ త్రిఫలాది తైలము నుపయోగించిన శిరోరోగములు, ప్రతిశ్యాయ ములు (జలుబులు) విశేషముగా శమించును. ఇది ఊర్ధ్వజత్రు రోగములను హరించును.

## అసన బిల్వాది తైలమ్.

శ్లో॥ అసన బిల్వ బలామృత పాచితే మధుక నాగర త్రిఫలాన్వితే
పయసి తైలమిదం పయసా పచేన్నయన కర్ణ శిరోహిత ముత్తమమ్॥

తా:— వేగిసచెక్క, మారేడుచెక్క, ముత్తవపులగము వేళ్ళు, తిప్పతీగె వీనివి సమభాగములుగా గ్రహించి దంచి కషాయముగ కాచి, వడిముగట్టి, అందుతగినంత తిలతైలము మఱియు ఆవుపాలు చేర్చి పిదప, యష్టిమధుకము, శుంఠి, త్రిఫలములు, వీని కల్కమును యథోచితమువైచి పాకము చేయవలయును. ఈ అసనబిల్వాది తైలము నుప యోగించిన నయన, కర్ణ, శిరోవ్యాధులన్నియును శమించును.

## (1) నాగరాది తైలమ్.

శ్లో॥ నాగరస్య తులే ద్వేతు స్యాత్తులా చిత్రకస్య చ
దేవదారు తదర్ధంస్యాత్ తదర్ధం ద్వికరంజకమ్॥ 102.

శ్లో॥ ముస్తారిమేద త్రిఫలా ఛత్రీ దంత్యార్క గుగ్గులుః
తదర్ధమితి సంగృహ్య ద్విద్రోణే సలిలే పచేత్॥ 103.
తైలాఢకం విపక్తవ్యం శార్షికైః కల్కైరిమైః
శఠీ పుష్కర శార్జ్గేష్టా హవుషా పిప్పలీ త్రియమ్॥ 104.
భార్జ్గీ రాస్నా మధూచ్ఛిష్టం నిశాద్వయ వచాంబుదమ్
చాతుర్జాతం చ మంజిష్ఠా చందనాగురు పద్మకైః॥ 105.
మాంసీ లోధ్రా వరా కుష్ఠైర్ద్విగుణం క్షీరసంయుతమ్
తత్పక్వం వినిహంత్యాశు ముఖజాన్ సకలామయాన్
పానా భ్యంజన గండూషనస్యోన్మర్దనవస్తిభిః॥ 106.

తా:— శుంఠి 200 పలములు, చిత్రమూలము 100 పలములు, దేవదారు 50 పలములు, చిన్నకానుగచెక్క, పెద్దకానుగచెక్క చేరి 50 పా. ములు, తుంగముస్తలు, ముదికి తుమ్మ, త్రిఫలములు, ఏడాకులఅరటి, (సప్తపర్ణి) దంతీమూలము, జిల్లేడువేరు, మఱియు గుగ్గిలము, వీని మొత్తము 25 పలములు వీని నన్నిటిని దంచి రెండుద్రోణముల జలములో వైచి చతుర్థాంశ కషాయముగ కాచి, వడియగట్టి, అందు, నువ్వులనూనె ఒకఆఢకము, ఆవుపాలు రెండు ఆఢకములు చేర్చి, పిదప కచోరములు, పుష్కరమూలము, వెలమసంధి, బోదతరము, పిప్పళ్లు, గజపిప్పళ్ళు, మోడి, గంటుభారంగి, సన్నరాస్నము, మైనము, పసుపు, మానిపసుపు, వస, కురువేరు, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, మంజిష్ఠ, మంచి గంధము, అగరు, పద్మకాష్ఠము, జటామాంసి, లొద్దుగచెక్క, త్రిఫలము, చెంగల్వకోష్ఠు, వీనిని ఒక్కొక్క కర్షము చొప్పున గ్రహించి కల్కముచేసి పైదానిలో జేర్చి తైలము వండవలయును. దీని నుపయోగించిన ముఖ సంబంధమగు వ్యాధు లన్నియును హరించును. ఇది పానాభ్యంజన నస్య, గండూష, మర్దన, మఱియు వస్తికర్మ లందుపయోగించ వచ్చును.

## మంజిష్ఠాది తైలమ్.

శ్లో॥ మంజిష్ఠాంజన సారిబాబ్ద కటుకా తక్కోల జాతీఫల
శ్రీకంఠ త్రిఫలా జటా తగర రుగ్యష్టీ చతుర్జాతికైః
సోశీరాగురు చోరయుగ్మ మృగనాభీ దూత్పలాంభోబిసైః
తైలం నేత్ర శిరోర్తి హారి సపయః సిద్ధం కుమారీ రసే॥ 107.

తా:— కలబందరసము 4 ప్రస్థములు, నువ్వుల నూనె ఒకప్రస్థము, ఆవుపాలు 4 ప్రస్థములు, ఈ మూడింటిని చేర్చి అందు మంజిష్ఠ, సుర్మారాయి, సుగంధపాలవేళ్ళు, తుంగముస్తలు, కటుకరోహిణి, తక్కోలాలు, జాజికాయ, మంచిగంధము, త్రిఫలములు,

జటామాంసి, గ్రంధితగరము, చెంగల్వకోష్టు, యష్టిమధుకము, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, వట్టివేళ్ళు, అగరు, ఏలకులు, కచోరములు, అడవికచోరములు, పచ్చకర్పూరము, పునుగు. తామరగడ్డ, కురువేరు, తామరదంటు, తామరపువ్వు, ఇవి ప్రత్యేకము అర్ధతులము చొప్పున గ్రహించి కల్కముచేసి పైదానిలో వేసి తైలము వండవలయును. ఈ మంజిష్ఠాది తైలము నుపయోగించినచో నేత్రశిరోరోగములు హరించును.

## బలాహఠాది తైలమ్.

శ్లో॥ బలా హఠామృతా ముద మాష క్వాథే తిలోద్భవమ్
పక్వం శిరోరుజం హంతి చందనామయ యష్టిభిః॥ 108.

తా:— ముత్తవపులగము వేళ్ళు, అంతరతామర, తిప్పతీగె, పెసలు, మినుములు, వీని కషాయములో తగినంత నువ్వులనూనెవేసి, పిదప మంచిగంధము, చెంగల్వకోష్టు, యష్టిమధుకము, వీని కల్కమును పైదానిలో యథోచితముగ జేర్చి, తైలము వండవలయును. ఈ తైలముచేత శిరోరోగములు హరించును.

## భృంగామలకాది తైలమ్.

శ్లో॥ భృంగామలక రసప్రస్థే తైలప్రస్థం పలంచమధుకస్య
క్షీరాఢకే విపక్వం బలా కామపి కోకిలాం కురుతే॥ 109.
అంధమనంధం కురుతే బధిర మబధిరం వా
చలదంత ముపచిత పీనోరస్కో భవతి నరో మాసమాత్రేణ॥ 110.

తా:— భృంగరాజరసము ఒక ప్రస్థము, ఉసిరికాయల రసము ఒక ప్రస్థము, నువ్వులనూనె ఒక ప్రస్థము, ఆవుపాలు ఒక ఆఢకము, వీనిని గలిపి అందు ఒకపలము యష్టిమధుక కల్కమును జేర్చి యథావిధి తైలము సిద్ధముచేయవలయును. దీనిని చెవిలో వేసిన చెవుడుపోయి బాగుగా వినబడును. ఇది తలకు రాచినయెడల కోకిల వర్ణమువంటి నల్లని వెండ్రుకలు పెరుగును. కండ్లలో వేసిన గ్రుడ్డితనమును బోగొట్టి దృష్టిని ప్రసాదించును. దీనిని విడువక ఒకమాసము పర్యంత ముపయోగించిన కదలుచున్న దంతములు గట్టిపడును.

## బలాధాత్ర్యాది తైలమ్.

శ్లో॥ ఏకో భాగో బలాధాత్ర్యో ర్గుడూచ్యాస్తు తదర్థకమ్
ఉశీరస్య తదర్థం స్యాత్తదర్థం హీరుబేరకమ్॥ 111.
తదర్థం చందనం యష్టి ప్రసూనం వకుళస్యచ
ద్రోణోఽపాం సాధయేత్ సమ్యక్ చతుర్భాగావశేషితే॥ 112.

శ్లో॥ అతఃకల్కం ప్రదాతవ్యం మధుకా చన్దన ద్వయమ్
కుష్ఠముత్పల మబ్దం చ సారిబాచ త్రిజాతకమ్॥ 113.
జాతీఫలంచ తక్కోలం కర్పూరంచ శతావరీ
జీవర్ష భకౌ మేదా మృద్వీకా కుంకుమం తథా॥ 114.
లామజ్జకంచ శాలూకం చోరక ద్వయపుష్కరమ్
నాగపుష్పం నఖం స్పృక్కా మంజిష్ఠా కటురోహిణీ॥ 115.
అంజనం సరళం దారు చంపకం మృగనాభికమ్
మధూకపుష్పం శ్యోనాకం త్రిఫలా ఫలినీమిశిః॥ 116.
ముస్తా గురూ తథామాంసీ తగరం పద్మకేసరమ్
కషాయస్య సమంక్షీరం సమమామలకం తథా॥ 117.
దత్వా తద్వచ్ఛతావర్యా స్తైలప్రస్థం విపాచయేత్
ఏతత్తైలం నిహన్త్యాశు పానాభ్యంజన నావనైః॥ 118.
శిరోనేత్ర గతాన్ రోగానన్యాన్ పిత్తానిలోద్భవాన్
అంగదాహే శిరోదాహే నేత్రదాహేచ శస్యతే॥ 119.
క్షతక్షయహరం వృష్యం రక్తమాంస బలప్రదమ్
ఊర్ధ్వజత్రుగతాన్ రోగాన్ విశేషణ వినాశయేత్॥ 120.

తా :— ముత్తవపులగము వేళ్ళు మఱియు ఉసిరికాయలు ఈ రెండు కలిసి ఒక భాగము. తిప్పతీగె అర్ధభాగము, వట్టివేళ్ళు పావుభాగము, కురువేరు ఎనిమిదవభాగము ($\frac{1}{8}$). చందనము, యష్టిమధుకము, పొగడపువ్వు, ఇవి ప్రత్యేకము ($\frac{1}{16}$) 16వ భాగము. వీని నన్నిటిని దంచి ఒక ద్రోణము జలములో వైచి చతుర్థాంశ కషాయముగ కాచి వడియ గట్టి అందులో కషాయమునకు సమానము ఆవుపాలు, ఉసిరికాయల రసము, నువ్వుల నూనె మఱియు శతావరిరసమును జేర్చి దానిలో అతిమధురము, మంచిగంధము, రక్తచందనము, చెంగల్వకోష్టు, నల్లకలువదుంప, తుంగముస్తలు, సుగంధపాలవేళ్ళు, ఏలకులు, దాక్షిణచెక్క, ఆకుపత్రి, జాజికాయ, తక్కోలాలు, పచ్చకర్పూరము, శతావరి, జీవకము, ఋషభకము, మేద, ద్రాక్ష, కుంకుమపువ్వు, వట్టివేళ్లు, తామరదుంప, కచోరములు, అడవికచోరములు, పుష్కరమూలము, నాగకేసరమును, నఖంచిప్పలు, పిక్కచెట్టుచెక్క, మంజిష్ఠ. కటుకరోహిణి, సుర్మారాయి (సౌవీరాంజనము), సరళ కాష్ఠము, దేవదారు, సంపెంగపువ్వు, కస్తూరి లేక పునుగు, ఇప్పపువ్వు, పెద్దమానిచెక్క త్రిఫలములు, ప్రియంగు, సాయికూరగింజలు (బద్దసోపు), భద్రముస్తలు, అగరు, జటామాంసి, గంధితగరము, పద్మకేసరములు, వీని యథోచిత పరిమాణముకల్కమును కూడ గలిపి తైలము వండవలయును. పాన అభ్యంజన నస్యములందుపయోగించిన బహు

శీఘ్రముగా శిరోరోగములు, నేత్రరోగములు మఱియు పిత్తవాత ప్రకోపముచే కల్గు సమస్త వికారములును హరించును. ఇవిగాక, అంగదాహ, నేత్రదాహ, శిరోదాహ మఱియు క్షతక్షయలను కూడ బోగొట్టును. దీనిచే విశేషముగా ఊర్ధ్వజత్రురోగములు హరించి రక్తమాంసములు వృద్ధిబొందును.

## తుంగద్రుమాది తైలమ్.

శ్లో॥ తుంగద్రుమస్య తరుణస్య రసే సుగంధా
లామజ్జ యష్టి మధుకోత్పల చందనానామ్
కల్కేన దుగ్ధసహితేన విపక్వ మేతత్
తైలం శిరోనయన తర్పణ మర్పణేన॥ 21.

తా :— లేతకొబ్బరి బొండమునీరు 4 ప్రస్థములు, ఆవుపాలు 4 ప్రస్థములు, నువ్వుల నూనె ఒక ప్రస్థము, వీనిని గలిపి పిదప సుగంధపాలవేళ్ళు, వట్టివేళ్ళు, అతిమధురము, నల్లకలువగడ్డ, మంచిగంధము, వీని కల్కమును కూడ తగుమాత్రమందు చేర్చి తైలపాకము చేయవలయును. దీని నుపయోగించుట వలన శిరోరోగములు మఱియు నేత్రరోగములును శమించును.

## చందనాది తైలమ్.

శ్లో॥ చందనం మధుకం కుష్ఠ మశ్వగంధాం సురద్రుమమ్
ఉశీర ముత్పలం మాంసీ పత్రాగురు నిశాబలాః॥ 122.
హ్రీబేరం నాగకుసుమం స్పృక్కా మంజిష్ఠ సారిబాః
తగరం మృగనాభిశ్చ శతపుష్పా హరేణుకమ్॥ 123.
సూక్ష్మైలాబ్దం త్వచా చోర బర్బరం తైః సుకల్కితైః
కేతకీమూలజక్వాథే సక్షీరం తిలజం పచేత్॥
తదభ్యంగాదిభిస్తైలం వాత శోణితనాశనమ్॥ 124.

తా :— మంచిగంధము, యష్టిమధుకము, చెంగల్వకోష్ఠు, పెన్నేరుగడ్డ, దేవదారు, వట్టివేళ్ళు, నల్లకలువగడ్డ, జటామాంసి, ఆకుపత్రి, అగరు, పసుపు, ముత్తవ పులగము వేరు, కురువేరు, పిక్కచెట్టుచెక్క, పున్నాగపుష్పములు, మంజిష్ఠ, సుగంధపాల వేళ్ళు, గ్రంధితగరము, కస్తూరి లేక పునుగు, సాయగింజలు (బద్దసోపు), రేణుకలు, సన్నఏలుకులు, తుంగముస్తలు, లవంగపట్ట, కచోరములు, బర్బరచందనము, అనువాని యథోచిత కల్కము, మొగలి యూడల కషాయము 4 ప్రస్థములు, తిలతైలము ఒక ప్రస్థము మఱియు ఆవుపాలు 4 ప్రస్థములు, వీనిని గలిపి యథావిధి తైలపాకము చేయవలయును. ఈ చందనాది తైలముతో అభ్యంజనము చేసిన వాతరక్తరోగములు నశించును.

## అమృతాది తైలమ్.

శ్లో॥ అమృతక్వాథ సంసిద్ధం తైలం చందన సర్షపైః॥ 125.
సారిబోశీర కుష్ఠాబ్ద ధాత్రీసోత్పల తస్కరైః
కల్కైర్వా వాతపిత్తాస్రి శిరోరోగహారం పరమ్॥ 126.

తా:— తిప్పతీగ కషాయము 4 ప్రస్థములు, నువ్వులనూనె ఒక ప్రస్థము. వీనిని ఒకటిగా జేర్చి దానిలో మంచిగంధము, ఆవాలు, సుగంధపాలవేళ్ళు, నట్టివేళ్ళు, చెంగల్వ కోష్టు, తుంగముస్తలు, ఉసిరికాయలు, నల్లకలువగడ్డ, కచోరములు, అనువాని కల్కమును తగినంతవైచి యథావిధి తైలము సిద్ధము చేయవలెను. దీనిచే వాతపిత్త, వాతరక్తములు మఱియు శిరోరోగములును శమించును.

## దుర్ధూరాది తైలమ్.

శ్లో॥ ధుర్ధూరపత్ర స్వరసే తద్బీజైః శ్లక్ష్ణ చూర్ణితైః
పక్వం తైలం నిహంత్యాశు కండూం కేశచ్యుతిం నృణామ్॥ 127

తా:— ఉమ్మెత్తస్వరసము, మఱియు తిలతైలము వీనిని నుచిత ప్రమాణములుగా గలిపి అందు ఉమ్మెత్తగింజల కల్కమును యథోచితముగ గలిపి తైలపాకము చేయవలయును. దీనితో దురదలు, తలవెండ్రుకలూడుట తగ్గిపోవును.

## జీమూతాది తైలమ్.

శ్లో॥ జీమూత భృంగ కరవీర నిశార్క నీలైః
తేషాం రసే తిలజ మేక రసేన తుల్యమ్
కార్పాస మూల సహితం మృదువహ్ని పక్వం
తైలం సకేశ పతనం వినిహంతి కండూమ్॥ 128.

తా:— దేవదాళియాకుల స్వరసము ఒక ప్రస్థము, భృంగరాజరసము ఒక ప్రస్థము, గన్నేరాకుల రసము ఒకప్రస్థము, పసుపురసము ఒకప్రస్థము, జిల్లేడాకుల రసము ఒకప్రస్థము, నీలియాకుల రసము ఒకప్రస్థము, నువ్వులనూనె ఒక ప్రస్థము, ప్రత్తివేరు కషాయము ఒకప్రస్థము వీని నన్నిటిని గలిపి యథావిధతైలము సిద్ధము చేయవలయును. దీని నుపయోగించిన దురదలు మఱియు వెండ్రుక లూడుటయును పోవును.

## నీలీభృంగాది తైలమ్.

శ్లో॥ నీలీ భృంగరజః శతక్రతులతా ధాత్రీఫలానాం రసైః
క్షీరైః రాజక నారికేళ మహిషీ ధేనూద్భవైః సాధితమ్॥

తైలం తత్పయస్సైవ పిష్టలుళితైర్యష్ట్యాహ్వా గుంజాంజనైః
కేశాన్ సంజనయేత్తలేపి కరయో రాస్త్రామ కేశం శిరః॥ 129.

తా :— నీలియాకుల రసము, భృంగరాజరసము, చేదుపుచ్చ రసము, ఉసిరిక రసము, ఇవి ప్రత్యేకము ఒక ప్రస్థము, తిలతైలము ఒకప్రస్థము, మేకపాలు ఒకప్రస్థము, కొబ్బరిపాలు ఒక ప్రస్థము, ఆవుపాలు ఒక ప్రస్థము, గేదెపాలు ఒక ప్రస్థము, వీనినన్నిటిని గలిపి దానియందు అతిమధురము, గురిగింజలు మఱియు సుర్మారాయి అనువాని కల్కమును తగినంత జేర్చి యథావిధి తైలము వండవలయును. ఇది అరచేతులకు రాచినను వెంద్రుకలు మొలచును. ఇక తలకు రాచిన యెడల వెండ్రుకలు వచ్చునని చెప్పనవసరముండదు.

## అంకోలాది తైలమ్.

శ్లో॥ అంకోలబీజ మరిచ కుష్ఠైః కల్కీకృతైర్భిషక్
పచేద్వకుళ పత్రస్య జంబీరస్య రసాఢకే
తైలప్రస్థం శిరోభ్యంగాత్ శిరః కుష్ఠవినాశనమ్॥ 130.

తా :— ఊడుగు గింజలు, మిరియాలు, చెంగల్వకోష్టు, వీనిని ప్రత్యేకము ఒక పలము చొప్పున గ్రహించి కల్కముచేసి పొగడాకు రసము రెండుప్రస్థములు, నిమ్మపళ్ల రసము రెండుప్రస్థములు, నువ్వులనూనె ఒకప్రస్థము, పైవానిలో జేర్చి తైలము, సిద్ధము చేయువలయును. ఈ తైలమును తలకు రాచిన యెడల శిరస్సంబంధ కుష్ఠవ్యాధులు నశించును.

## నీలీనిర్గుండ్యాది తైలమ్.

శ్లో॥ నీలీ నిర్గుండికా భృంగ దుర్ధూర రజనీ స్తథా
కోశాతకీ చ చించార్కా తేషాం సారే చతుర్గుణే॥ 131.

త్రిజాత వాకుచీ కుష్ఠై స్తైలం సమ్యగ్విపాచయేత్
సప్తరాత్ర ప్రయోగేణ కపాలార్శో వినాశనమ్॥ 132.

తా:— నీలియాకులు, వావిలాకులు, భృంగరాజము, ఉమ్మెత్తాకులు, పచ్చిపసుపు చేదుబీర, చింతాకులు, జిల్లేడాకులు వీని స్వరసములు ప్రత్యేకము అర్ధప్రస్థము, నువ్వులనూనె ఒక ప్రస్థము, వీని నన్నిటిని గలిపి అందు ఏలకులు, దాల్చినిచెక్క, ఆకుపత్రి, బావంచాలు, చెంగల్వకోష్ఠు అనువానిని ఒక్కొక్కటి ఒక పలము చొప్పున గ్రహించి కల్కముగనూరి చేర్చి విధిప్రకారము తైలము వండవలయును. ఈ తైలమును ఏడురోజు లుపయోగించిన యెడల కపాలార్శ రోగములు హరించును.

## నీలీనిశాది తైలమ్.

శ్లో॥ నీలీ నిశేంగుదీ క్షీర వల్కా వై కుంఠజే రసే
తైలం సజంబీర రసే కపాల వ్యాధి నుచ్ఛృతమ్॥ 133.

తా :— నీలియాకులు, పసుపు, గారచెక్క, క్షీరి, పంచ వల్కాలములు, (మఱ్ఱిపట్ట, రావిపట్ట, జువ్విపట్ట, మేడిపట్ట, కళ్ళరావిపట్ట,) వీని కషాయమందుగాని, స్వరస మందుగాని తులసియాకుల రసము, నిమ్మపళ్ళరసము మఱియు తగినంత తిలతైలమును గలిపి తైలము సిద్ధము చేయవలయును. దీని నుపయోగించుటచేత కపాలవ్యాధులుపోవును.

## వచాలశునాది తైలమ్.

శ్లో॥ వచా లశున పీతాభి ర్బిల్వపత్ర రసేశృతమ్
తైలం శ్రవణదోషఘ్నం విశేషాత్ పూయనాశనమ్॥ 134.

తా :— వస, వెల్లుల్లి, పసుపు, వీని కల్కమును తగుమాత్రము మారేడాకు స్వరస ములో గలిపి అందు తగినంత తిలతైలమును జేర్చి తైలము కాచవలయును. ఈ తైలమును చెవులలో వేసినయెడల తత్సంబంధ వ్యాధులును మఱియు విశేషముగా చీముకారుట యును నశించును.

## నిర్గుండీరజన్యాది తైలమ్.

శ్లో॥ నిర్గుండీ రజనీ బిల్వ స్నుహ్యాలర్క రసే శృతమ్
రసోవ దారుబిల్వాబ్ద విశ్వ భేషజ కల్కితమ్॥
తైలం శ్రవణ దోషఘ్నం విశేషా త్పూయ నాశనమ్॥ 135.

తా :— వావిలాకులు, పసుపు, మారేడాకులు, కాడజముడు, తెల్లజిల్లేడాకులు, వీని సరిసమాన స్వరసములందు వెల్లుల్లి, దేవదారు, మారేడువేళ్లు, తుంగముస్తలు, శుంఠి, అనువాని యథోచిత కల్కమును చేర్చి పిదప దానిలో తగినంత నువ్వులనూనెకూడ వేసి తైలమును సిద్ధము చేయవలయును. ఇది సమస్త కర్ణవ్యాధులను బోగొట్టును. మఱియు విశేషముగా చెవులనుండి స్రవించు చీమును బోగొట్టును.

## అరిమేదత్వగాది తైలమ్.

శ్లో॥ అరిమేద త్వచోగ్రాహ్యం నవం పలశతం భవేత్॥ 136.
న్యగ్రోధో దుంబరాశ్వత్థ ప్లక్ష వల్కాచ్ఛృతం తథా
చతుర్ద్రోణే జలేపక్త్వా చతుర్భాగావశేషితే॥ 137.
తైలాఢకం పచేత్తత్ర కార్షికై ః కల్కితై రిమైః
యష్టీ త్రిజాత మంజిష్ఠా గాయత్రీ లోధ్ర కట్ఫలై ః॥ 138.

శ్లో॥ క్షీరివృక్షారిమేద త్వఙ్మూస్తాగురు హిమద్వయైః
కర్పూర జాతీ కంకోల మాంసీ ధాతకి గైరికైః॥ 139.

మృణాల మిశి వైదేహీ పద్మకేసర కుంకుమైః
లాక్షా సమంగా బృహతీ బిల్వ మధ్య సురద్రుమైః॥ 140.

శైలేయం సరళం స్పృక్కా పలాశ రజనీద్వయైః
ప్రియంగు తేజినీ పార్థ శరపుంఖ ఫలత్రయైః॥ 141.

కాలేయ పుష్కర జటా వ్యాఘ్రీ మదన సంయుతైః
జాతే చిక్కణ పాకేతు పరిస్రావ్య నిధాపయేత్॥ 142.

తన్నస్యే పాన గండూష వస్త్యభ్యంగేషు యోజయేత్
ముఖజానామయాన్ హంతి విశేషాద్దంత రోగజిత్॥ 143.

తా :— మురికితుమ్మచెక్క 100 పలములు, మఱ్ఱిచెక్క, రావిచెక్క, జువ్వి చెక్క, మేడిచెక్క ఇవియన్నియు చేరి 100 పలములు, వీని నన్నిటిని బాగుగాదంచి 4 ద్రోణముల జలములోవేసి నాల్గవభాగము కషాయముగ కాచి వడియగట్టి అందు నువ్వులనూనె ఒక ఆఢకము చేర్చి పిదప అతిమధురము, ఏలకులు, దాక్షిణిచెక్క, ఆకు పత్రి, మంజిష్ఠ, చంద్రచేవ, లొద్దుగచెక్క, కాయఫలముచెక్క, నాలుగు క్షీరివృక్షముల పట్టలు, మురికి తుమ్మ, భద్రముస్తలు, అగరు, మంచిగంధము, రక్తచందనము, పచ్చ కర్పూరము, జాజికాయ, తక్కోలాలు, జటామాంసి, ఆరెపువ్వు, గైరికము, తామర తూండ్లు, బద్దసోపు (సాయికూగ గింజలు), పిప్పళ్ళు, తామరకేసరములు, కుంకుమపువ్వు లక్క, అత్తపత్తి, ములక, మారేడుకాయగుజ్జు, దేవదారు, రాతిపువ్వు, సరళదేవదారు ఫిక్కచెక్క, మోదుగచెక్క, పసుపు, మానిపసుపు, ప్రియంగు, మాల్కంగినీ గింజలు, మద్దిచెక్క, వెంపలి, త్రిఫలములు, పీతచందనము, పుష్కరమూలము, జటామాంసి, నఖంచిప్పలు, నేలములక, మ్రింగచెక్క, వీని కల్కమును తగుమాత్రము పైదానియందు జేర్చి తైలపాకము చేయువలయును. ఈ తైలమును నస్య, పాన, గండూష, మఱియు వస్తికర్మలందును, అభ్యంగమునకు నుపయోగించిన ముఖజరోగములు మఱియు విశేష ముగా దంతరోగములను నశించును.

## పుంఖాది తైలమ్.

శ్లో॥ పుంఖక్వాథే భయా కల్క సిద్ధం తైలం ద్విజార్తినుత్॥ 144.

తా :— వెంపలికషాయమందు తగినంత తిలతైలమును వేసి అందు కరక్కాయ కల్కమును యథోచితముగ జేర్చి తైలపాకముచేసి నుపయోగించిన దంతవ్యాధులు నివారించును.

## రామఠాది తైలమ్.

శ్లో॥ రామఠ లవణో పేతం తైలం తన్నాళికేరస్య
విధినా సపయః సిద్ధం రదశూలానాశు నాశయేత్॥ 145.

తా:— కొబ్బరినూనె, అవుపాలు, అనువానిని సమముగా జేర్చి దానియందు ఇంగువ మఱియు సైంధవ లవణము వీనికల్కమును తగినంతగలిపి తైలము వండవలయును. దీనిచేత దంతముల నొప్పులు శీఘ్రముగా నశించును.

## అధ్యండాది తైలమ్.

శ్లో॥ అధ్యండా నింబ నిర్గుండీ స్వరసేన విపాచితమ్
నిశా కల్కయుతం తైలమోష్ఠరోగ వినాశనమ్॥ 146.

తా:— నేలయుసిరికరసము, వేపరసము, వావిలిరసము, అనువానిని యథోచితము గ్రహించి యందు పసుపు కల్కము తగుమాత్రమున్ను మఱియు తగినంత నువ్వులనూనె యున్ను జేర్చి తైలము వండవలయును. దీనిచే పెదవుల వ్యాధులు నశించును.

## దినేశవల్ల్యాది తైలమ్.

శ్లో॥ దినేశవల్లీ స్వరసే విపక్వం తచ్చర్మ కల్కేన పునర్నవస్య
సారేచ తైలం వ్రణరోపణార్థం ప్రశస్తమిత్యేతద్వదంతితజ్ఞాః॥

తా:—దినేశవల్లి (మలయాళభాషలో వెంబాడ) (తెనుగులో మంకెన) ఈ చెట్టు వేళ్లు లేక పువ్వులరసము, తెల్లగలిజేరు స్వరసము, లేక కషాయము, ఇవి సమభాగములు. మఱియు, నువ్వులనూనె, తగుమాత్రము, వీనినన్నిటికిని గలిపి అందు మంకెన చెక్కను నూరి కల్కముచేసి జేర్చి తైలము వండవలయును. ఈ తైలము వ్రణరోపణకు ప్రశస్తమైనదని పెద్దలు చెప్పుదురు.

## దూర్వాది తైలమ్.

శ్లో॥ దూర్వాస్వరస కల్కాభ్యాం సిద్ధం తైలం వ్రణేహితమ్॥ 148.

తా:— గరికెస్వరసము, మఱియు తగినంత నువ్వులనూనె, వీనిని కలిపి కాచి పిదప గరికె కల్కము నుచితప్రమాణముగ జేర్చి తైలపాకము చేయవలయును. ఇది వ్రణములకు హితకరమైనది.

## తిలాది తైలమ్.

శ్లో॥ తిలయష్ట్యాహ్వయోః కల్కం మహిషీక్షీర సంయుతమ్
శీర్యమాణేషు కేశేషు కేశస్థాపన ముత్తమమ్॥ 149.

తా:— ఎనుముపాలు (గేదెపాలు) మఱియు నువ్వులనూనె, ఇవి సమభాగములు, వీనియందు నువ్వులు మఱియు యష్టిమధుక కల్కమును తగినంతజేర్చి తైలవిధిని పాకము చేయవలయును దీనిని తలకు రాచిన యెడల వెండ్రుకలూడుట తగ్గిపోయి వాని కుదుళ్ళు దిట్టపడును.

## (2) నాగరాది తైలమ్.

శ్లో॥ నాగర సైంధవ మాగధి ముస్తా గోక్షుర వాసా లశునై స్తైలమ్
అర్క సుపర్ణరసేన విమిశ్రం కర్ణరుజం శతకోటి నిహంతి॥ 150.

తా:— జిల్లేడాకుల రసములో యథోచిత తిలతైలమును గలిపి పిదప శుంఠి, సైంధవలవణము, పిప్పళ్ళు, తుంగముస్తలు, పల్లేరు, అడ్డసరముపేరు, వెల్లుల్లి అనువాని కల్కము నవసరమైనంత జేర్చి తైలవిధిని పాకము చేయవలయును. ఈ నాగరాదితైలము శతకోటి కర్ణవ్యాధులను హరించును.

## అణు తైలమ్.

శ్లో॥ జీవంతీ జల దేవదారు జలద త్వక్సేవ్య గోపీ హిమమ్
దార్వీ త్వఙ్మధుక ప్లవాగురు వరీపుండ్రాహ్వ బిల్వోత్పలమ్॥
ధావన్యౌ సురభిః స్థిరే కృమిహరం కుష్ఠం త్రుటిం రేణుకమ్
కింజల్కం కమలాహ్వయం శతగుణే దివ్యేంభసి క్వాథయేత్॥ 151.
తైలాద్రసం దశగుణం పరిశేష్య తేన
తైలం పచేచ్చ సలిలేన దశైవ వారాన్
పాకేక్షిపేచ్చ దశమే సమమాజదుగ్ధం
నస్యం మహాగుణముశంత్యణుతైలమేతత్॥ 152.

తా:— జీవంతి, కురువేరు, దేవదారు, తుంగముస్తలు, లవంగపట్ట, వట్టివేరు, సుగంధపాలవేళ్ళు, మంచిగంధము, మానిపసుపు, యష్టిమధుకము, భద్రముస్తలు, అగరు, త్రిఫలములు, తెల్లతామరపువ్వు, మారేడువేళ్ళు, నల్లకలువగడ్డ, వాకుడు, ములక, గుగ్గిలము, కోలపొన్న, ముయ్యాకుపొన్న, వాయువిడంగములు, ఛిరంగిసాంబ్రాణి, ఆకుపత్రి, ఏలకులు, రేణుకలు, తామరకేసరములు, అనువానిని సమభాగములుగా గ్రహించి, దంచి అందు వర్షపునీరు నూరు భాగములుపోసి, చతుర్థాంశకషాయముగ కాచి వడియగట్టి, దానిలో నువ్వులనూనె పదియవభాగము జేర్చి తైలపాకము చేయవలయును. ఈ ప్రకారము అనగా ప్రతిసారి కషాయము పోయుచు, పాకము చేయుచు తొమ్మిదిసార్లు పాకముచేసి పదియవసారి తైలమునకు సమానము మేకపాలు పోసి పాకము చేయవలయును. దీనిని నస్యముగా నుపయోగించిన శిరోరోగములు చక్కపడును. అనగా యీ తైలము శిరోరోగములపైన మహాగుణము నిచ్చును.

## సహదేవ్యాది తైలమ్.

శ్లో॥ సహదేవీ రసే తైలం సాధయేన్మతిమాన్ భిషక్
షడంగకల్కం సక్షీరం సర్వజ్వరహరం పరమ్॥ 153.

తా:— సహదేవీ రసమందు తగుమాత్రము నువ్వులనూనె మఱియు ఆవుపాలుజేర్చి పిదప షడంగకల్కము తగినంత (తుంగముస్తలు, పర్పాటకము, వట్టివేళ్ళు, చందనము, కురువేరు, శుంఠి,) వైచి యథావిధి తైలమును వండవలయును. ఈ తైలము సర్వజ్వరములను హరించును.

## వ్రణరోపణ తైలమ్.

శ్లో॥ మహావృక్షార్కజే దుగ్ధే మధూచ్ఛిష్టేన సాధితమ్॥
తైలం సకృత్ ప్రయోగేణ దుష్టవ్రణ విరోపణమ్॥ 154.

తా:— జెముడుపాలు, జిల్లేడుపాలు, మఱియు నువ్వులనూనె. వీనినన్నిటిని సమానముగ గలిపి అందుమైనమును తగుమాత్రముగ నూరి చేర్చి యథావిధి పాకము చేయవలయును. దీనిచే దుష్టవ్రణములు మానును.

## బలా తైలమ్.

శ్లో॥ బలాశతం ఛిన్నరుహా పాదం రాస్నాష్ట భాగికమ్
జలాఢకే శతేపక్త్వా దశభాగస్థితే రసే॥ 155.
దధిమస్త్విక్షు నిర్యాస శుక్తైస్తైలాఢకం సమైః
పచేదాజ పయోర్ధాంశం కల్కైరేభిః పిచోన్మితైః॥ 156.
శఠీ సరళ దార్వేలా మంజిష్ఠాగురు చందనైః
పద్మకాతిబలా ముస్తా శూర్పపర్ణీ హరేణుభిః॥ 157.
యష్ట్యాహ్వ సురసా వ్యాఘ్రీ నఖ ర్షభక జీవకైః
పలాశరస కస్తూరీ నాలికా జాతి కోశకైః॥ 158.
స్పృక్కా కుంకుమ శైలేయ జాతీ కటువచాంబుభిః
త్వక్కుందురుక్క కర్పూర తుంబురు శ్రీవాసకైః॥ 159.
లవంగ నత తక్కోల కుష్ఠమాంసీ ప్రియంగుభిః
స్థౌణేయ తగరధ్యామ వచా మదనక ప్లవైః॥ 160.
సనాగకేసరైః సిద్ధే ర్దద్యాచ్చాత్రావతారితే
పత్రం కల్కం తతః పూతం విధినా తత్ప్రపూజితమ్॥ 161.

కాసం శ్వాసం జ్వరం ఛర్ది గుల్మం క్షతం క్షయమ్
ప్లీహా శోఫావపస్మార మలక్ష్మీంచ వినాశయేత్॥ 162.

తా :— ముత్తవపులగము వేరు 100 పలములు, తిప్పతీగె, 25 పలములు సన్నరాస్నము 12½ పలములు. వీనిని బాగుగా దంచి 100 ఆఢకముల జలములో వైచి పదిఆఢకముల కషాయము మిగులునట్లుగ కాచి వడియగట్టి అందు పదిఆఢకములు నువ్వులనూనె, ఒక ఆఢకము పెరుగుమీదినీరు (మస్తు), ఒక ఆఢకము చెఱకురసము, ఒక ఆఢకము శుక్తము (పులియబెట్టిన కాంజికము), అర్థఆఢకము మేకపాలు, వీనిని గలిపి మరలకాచి దానిలో కచోరములు, సరళదేవదారు, దేవదారు, ఏలకులు, మంజిష్ఠ, అగరు, మంచిగంధము, పద్మకాష్ఠము, పెద్దముత్తవపులగము వేరు, భద్రముస్తలు, అడవిపెసర, రేణుకలు, అతిమధురము, తులసి, వాకుడు, నఖంచిప్పలు, జీవకము, ఋషభకము, మోదుగచెక్క, శిలాజిత్తు, కస్తూరి లేక జాజిపువ్వులు, కలంబీశాకము (హిందీలో), జాపత్రి, ప్రియంగు, పిక్కచెక్క, కుంకుమపువ్వు, రాతిపువ్వు, జాజిపువ్వు, కటుకరోహిణి, వస, కురువేరు, దాక్షిణిచెక్క, ఫిరంగిసాంబ్రాణి, పచ్చకర్పూరము, తుంబురులు, కర్పూరము, లవంగాలు, గ్రంథితగరము, చెంగల్వకోష్ఠు, జటామాంసి, శ్రేంకణము, పచ్చాకు, దవనము, గ్రంథితగరము, కామంచిపూరి, వస, మైనము, తుంగముస్తలు, నాగకేసరములు, అనువానిని ప్రత్యేక మొకతులము చొప్పున గ్రహించి కల్కముగానూరి పైదానిలో జేర్చి యథావిధి తైలము వండవలయును. దీనిని వడియగట్టి భద్రపరచవలయును. ఈ తైలము నుపయోగించుట వలన కాస, శ్వాస, జ్వర, వాంతి, గుల్మ, క్షత క్షయ, ప్లీహ, శోఫ, అపస్మార రోగములు మఱియు అలక్ష్మియు నివారించును.

శ్లో॥ బలాతైల మిదం శ్రేష్ఠం వాతవ్యాధి వినాశనమ్॥ 162.
పానే నస్యేన్వాసనేభ్యంజనేచ
స్నేహాః కాలే సమ్యగేతే ప్రయుక్తాః
దుష్టాన్ వాతానాశు శాంతిం నయేయు
ర్వంధ్యాశ్చపుత్రభాజశ్చ కుర్యుః॥ 163.

తా :— పై చెప్పబడిన బలాతైలము వాతవ్యాధులను నశింపజేయుటకు శ్రేష్ఠమైనది. ఇది పాన, అనువాసన మఱియు అభ్యంజనాది విధులం దుపయోగించ వచ్చును. ఈ తైలము దుష్టవాతరోగములను బహుశీఘ్రముగాహరించును. మఱియు వంధ్యస్త్రీలు దీనినుపయోగించిన యెడల సుపుత్రులను బడయునట్లు చేయును.

## ప్రసారిణీ తైలమ్.

శ్లో॥ ప్రసారిణీ తులాక్వాథే తైలప్రస్థం పయః సమమ్
ద్విమేదా మిశి మంజిష్ఠా కుష్ఠరాస్నా కుచందనైః॥ 165.

జీవకర్షభ కాకోలీ యుగళామర దారుభిః
కల్కైర్విపాచయేత్ సర్వమారుతామయ నాశనమ్॥ 166.

తా :— ప్రసారిణీ కషాయము నూరుపలములు, నువ్వులనూనె ఒకప్రస్థము, ఆవుపాలు ఒక ప్రస్థము, వీని నన్నిటిని జేర్చి కాచి అందు మేద, మహామేద, సోయకూర గింజలు (బద్ధసోపు) మంజిష్ఠ, చెంగల్వకోష్ఠు, సన్నరాష్ట్రము, రక్తచందనము, జీవకము, ఋషభకము, కాకోళీ, క్షీరకాకోళీ, దేవదారు, వీనిని సమభాగములుగా గ్రహించి కల్కముచేసి తగుమాత్రము చేర్చి, తైలము సిద్ధముచేయువలయును. దీనిచేత సర్వవాత రోగములు నశించును.

## (3) చందనాది తైలము.

తా :— మంచిగంధము, వట్టివేళ్లు, ఉసిరికాయలు, సంపెంగపువ్వులు, కురువేరు, ఇవి ప్రత్యేకము 36 తులములు, వీనిని నలియగొట్టి 18ప్రస్థముల నీళ్లలోవైచి చతుర్థాంశముగ కషాయముకాచి అందులో నువ్వులనూనె $1\frac{1}{2}$ ప్రస్థములు, ఆవుపాలు మూడు ప్రస్థములును వైచి పిదప ఏలకులు, లవంగాలు, చలువమిరియాలు, జాజికాయ, దేవదారు, మంజిష్ఠ, ఎఱ్ఱసంపెంగ, ఆకుపత్రి, జటామాంసి, వట్టివేళ్ళు, అగరు, కురువేరు, తెల్లసంపెంగ, మంచిగంధము, రక్తచందనము అనునవి ప్రత్యేక మొక తులము చొప్పున గ్రహించి ఆవుపాలతో నూరి కల్కముచేసి పై దానిలో గలిపి నాలుగురోజుల వరకు మందాగ్నిచే మెల్లమెల్లన పాకము చేసి భద్రపరచ వలయును. పిమ్మట ఒకగుంజ ప్రమాణము కస్తూరి, ఒక తులము కుంకుమపువ్వు, అర్ధతులము పచ్చకర్పూరము, మూడు గుంజలు పునుగు వీనిని నూరి పాత్రకుపైనను, అడుగునను రాచి తైలమును పోసియుంచ వలయును. ఇది పూర్వము చెప్పబడిన చందనాదితైలమువలె గుణము చేయును.

సహస్రయోగ ప్రకాశిక యందలి తైలయోగ ప్రకరణము
సంపూర్ణము.

---

ఓం శ్రీధన్వంతరయేనమః

# సహస్రయోగ ప్రకాశిక

## 4. అథ చూర్ణయోగ ప్రకరణమ్.

### సుదర్శన చూర్ణమ్

శ్లో॥ త్రిఫలా రజనీ యుగ్మం కంటకారీయుగం శఠీ
త్రికటు గ్రంధికం మూర్వా గుడూచీ ధన్వయాసకః॥ 1.
కటుకా పర్పటో ముస్తా త్రాయమాణాచ వాలకమ్
నింబః పుష్కరమూలంచ మధుయష్టీచ వాసకమ్॥ 2.
యవానీంద్రయవో భార్గీ శిగ్రుబీజం సురాష్ట్రిజా
వచా త్వక్పద్మకోశీర చందనాతివిషా బలాః॥ 3.
శాలిపర్ణీ పృష్టిపర్ణీ విడంగం తగరం తథా
చిత్రకో దేవ కాష్ఠంచ చవ్యం పత్రం పటోలజమ్॥ 4.
జీవకర్షభకౌచైవ లవంగం వంశలోచనా
పుండరీకంచ కాకోలీ పత్రకం జాతిపత్రకమ్॥ 5.
తాళీసపత్రం చ తథా సమభాగాని చూర్ణయేత్
సర్వచూర్ణస్యచార్థాంశం కైరాతం నిక్షిపేత్ సుధీః॥ 6.
ఏతత్సుదర్శనం నామ చూర్ణం దోషత్రయాపహమ్
జ్వరాంశ్చ నిఖిలాన్ హన్యాన్నాత్ర కార్యా విచారణా॥ 7.
పృథగ్ద్వంద్వాగంతుజాంశ్చ ధాతుస్థాన్ విషమజ్వరాన్
సన్నిపాతోద్భవాం శ్చాపి మానసానపి నాశయేత్॥ 8.
శీతజ్వరైకాహికాదీన్ మోహం తంద్రాం భ్రమం తృషామ్
శ్వాసం కాసంచ పాండుంచ హృద్రోగం హంతికామలామ్॥ 9

త్రికపృష్ఠకటీజాను పార్శ్వశూల నివారణమ్
శీతాంబునా పిబే ద్ధీమా౯ సర్వజ్వర నివృత్తయే॥ 10.

సుదర్శనం యథాచక్రం దానవానాం వినాశనమ్
తద్వజ్జ్వరాణాం సర్వేషా మిదం చూర్ణం ప్రణాశనమ్॥ 11.

తా:—త్రిఫలములు, పసుపు, మానిపసుపు, వాకుడు, ములక, కచోరములు, త్రికటుకములు, పిప్పలీమూలము, చాగవేరు, తిప్పతీగె, దురదగొండి, కటుకరోహిణి, పర్పాటకము, తుంగముస్తలు, కలుప్రాకునగ, కురువేరు, వేపచెక్క, పుష్కరమూలము, అతిమధురము ఖురాసానిఓమము. అడ్డసరము, కొడిశపాల గింజలు, గంటుభారంగి, మునగగింజలు, గోపీచందనము, వస, దాక్షిణిచెక్క, పద్మకాష్ఠము, పట్టివేళ్లు. చందనము, అతివస, ముత్తవపులగమువేరు, కోలపొన్న, సూర్యాకుపొన్న, వాయువిడంగములు, గ్రంధితగరము, చిత్రిమూలము, దేవదారు, చవ్యము, చేదుపొట్ల, జీవకము, ఋషభకము, లవంగాలు, తవాక్షీరి, తెల్లతామర, కాకోళీ, ఆకుపత్రి, జాపత్రి, తాళీసపత్రి, వీనిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణముచేసి అందు చూర్ణమునకు సగముభాగము చిరాయితా (భూనింబ) మెత్తగాచూర్ణించి కలుపవలెను. దీనిని సుదర్శన చూర్ణమందురు. ఈ చూర్ణమును సేవించుటచేత త్రిదోషములు, సర్వజ్వరములు, ధాతుగతవిషము, ద్వంద్వజ, సన్నిపాతజ, మానసిక, శీతఏకాహికాజ్వరములును. మోహ, తంద్ర, భ్రమ, తృష, శ్వాస, కాస, పాండు, హృదయ, కామలారోగములును హరించును. త్రిక, పృష్ఠ, కటి, జాను పార్శ్వములందుండు శూలలను కూడ హరించును. ఈ చూర్ణమును చన్నీళ్ళతో నిచ్చిన సర్వజ్వరములు నివృత్తించును. సుదర్శన చక్రము రాక్షసులను నాశనము చేసినట్లు ఈ సుదర్శన చూర్ణము పైవ్యాధులను అదేప్రకారము నాశనము జేయును.

## లఘుగంగాధర చూర్ణమ్ (అతిసారే).

శ్లో॥ ముస్తమింద్రియవం బిల్వం లోధ్రం మోచరసం తధా
ధాతకీం చూర్ణయేత్తక్రి గుడాభ్యాం పాయయేత్సుధీః॥ 12.

సర్వాతీసార శమనం నిరుణద్ధి ప్రవాహికామ్
లఘుగంగాధరం నామ చూర్ణం సంగ్రాహకం పరమ్॥ 13.

తా:— భద్రముస్తలు, కొడిశపాల గింజలు, మారేడుపండుగుజ్జు, లొద్దుగచెక్క, బూరుగుబంక, ఆరెపువ్వు, వీనిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణించవలయును. ఈ లఘుగంగాధర చూర్ణమును చల్ల మఱియు బెల్లముతోను సేవించిన సర్వవిధ అతిసారములు, మఱియు ప్రవాహికలును నివారించును. ఇది అత్యంత శ్రేష్ఠమైన సంగ్రాహకౌషధము.

## వృద్ధగంగాధర చూర్ణమ్.

శ్లో॥ ముస్తారళుకశుంఠీభి ర్ధాతకీ లోధ్ర వాలకైః
బిల్వమోచ రసాభ్యాంచ పాఠేంద్రయవ వత్సకైః॥ 14.
అమ్రబీజం ప్రతివిషా లజ్జాలురితి చూర్ణితమ్
క్షౌద్ర తండులపానీయైః పీతైర్యాతి ప్రవాహికా॥ 15.
సర్వాతీసార గ్రహణీ ప్రశమం యాతివేగతః
వృద్ధగంగాధరం చూర్ణం సరిద్వేగ విబంధకమ్॥ 16.

తా :— భద్రముస్తలు, పెద్దమానివేరు, శుంఠి, ఆరెపువ్వు, లొద్దుగచెక్క, కురువేరు, మారేడుకాయగుజ్జు, బూరుగుబంక, విషబొద్ది, కొడిశపాలగింజలు, కొడిశపాలచెక్క, మామిడిజీడి, అతివస, అత్తపత్తి, ఇవి సమభాగములుగా గ్రహించి, మెత్తగా దంచి వస్త్రగాళిత చూర్ణము చేయవలయును. దీనిని బియ్యపు కడుగు మఱియు తేనెతో సేవించిన ప్రవాహిక, సర్వవిధ అతిసారములును మఱియు గ్రహణీవ్యాధులును శమించును. ఈ చూర్ణము అతివేగముగా నతిసారములను బంధించును.

## (రక్తపిత్తే) చందనాది చూర్ణమ్.

శ్లో॥ చందనం నలదం రోధ్రముశీరం పద్మకేసరమ్
నాగపుష్పం తథా బిల్వం భద్రముస్తం సశర్కరమ్॥ 17.
హ్రీబేరంచైవ పాఠాచ కుటజస్య ఫలం త్వచమ్
శృంగబేరం విషాచైవ ధాతకీచ రసాంజనమ్॥ 18.
ఆమ్రాస్థి జంబుసారంచ తథా మోచ రసస్మృతః
నీలోత్పలం సమంగాచ సూక్ష్మైలా దాడిమత్వచః॥ 19.
చతుర్వింశతి మేతాని సమభాగాని కారయేత్
తండులోదక సంయుక్తం క్షౌద్రేణ సహయోజయేత్॥ 20.
చలతాంచామ గర్భాణాం స్తంభనం పరముచ్యతే
అశ్విభ్యాం విహితం పూర్వం రక్తపిత్త వినాశనమ్॥ 21.
హితం లోహిత పిత్తిభ్యో హ్యర్శస్సు లోహితేషుచ
తమో మూర్ఛోప సృష్టానాం తృషార్తానాంచ దాపయేత్॥ 22.

తా :— మంచిగంధము, వట్టివేళ్ళు, లొద్దుగచెక్క, వట్టివేళ్ళు, పద్మకేసరములు, నాగకేసరములు, మారేడువేరు, భద్రముస్తలు, ఖండశర్కర, కురువేరు, విషబొద్ది,

కొడిశపాలచెక్క, కొడిశపాలగింజలు, శుంఠి, అతివస, ఆరెపువ్వు, రసాంజనము, మామిడిజీడి, నేరెడుబంక లేక చెక్క, బూరుగుబంక, నల్లకలువ, అత్తిపత్తి, చిన్న ఏలకులు, దానిమ్మచెక్క, ఈ 21 వస్తువులను సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణము చేయవలయును. దీనిని బియ్యపు కడుగు మఱియు తేనెతో సేవించిన అమ గర్భము అనగా వృద్ధిపొందని గర్భము, దినదినాభివృద్ధిని బొంది గర్భము నిలచి సుఖప్రసవము కలుగును. ఇది రక్తపిత్తము, అగ్నమాంద్యము. రక్తాగ్నిమాంద్యము, మూర్ఛ, శోష, మఱియు తృషరోగములను చక్కపఱచును. దీనిని పూర్వమందు అశ్వినీదేవతలు నిర్మించిరి.

## చూర్ణామృతయోగమ్ (రాజయక్ష్మణి)

శ్లో॥ తాళీసపత్రం మరిచం పృథగర్ధపలం భవేత్
ద్రాక్షాయాశ్చ పలం తద్వత్ పరూష కతకాహ్వయాన్॥ 23.
బలామూలంచ పలికం పిప్పల్యాశ్చ పలం భవేత్
శుంఠీ ఫలత్రయంచైవ చవ్యకంచ త్రిజాతకమ్॥ 24.
కణామూలం తథైవాస్య శర్కరాయాశ్చతుష్పలమ్
భార్గీ పలద్వయంచైతత్ సూక్ష్మ చూర్ణాని కారయేత్॥ 25.
మధునావలిహేత్ ప్రాతః శోష మేకాదశాన్వితమ్॥
హరేచ్చూర్ణామృత మిదం సర్వవ్యాధి వినాశనమ్॥ 26.

తా:— తాళీసపత్రి, మిరియాలు, ఇవి ప్రత్యేకము అర్ధపలము, ద్రాక్ష, చిట్టీత (పాల్సా) చిల్లగింజలు ఇవి ప్రత్యేకమొకపలము, ముత్తవపులగముచేరు, పిప్పళ్ళు, శుంఠి తాడికాయబెరడు, కరక్కాయబెరడు. ఉసిరిక వరుగు, చవ్యము, ఏలకులు, దాల్చిని చెక్క, ఆకుపత్రి, మోడి అనునవి ప్రత్యేకమొకపలము, శర్కర నాల్గుపలములు మఱియు గంటుభారంగి రెండుపలములు. పైవాని నన్నిటిని మెత్తగా చూర్ణము చేయవలయును. ఈ చూర్ణము నుచిత ప్రమాణము ఉదయమున తేనెతో సేవించిన యెడల 11 విధముల శోషరోగములు హరించును. మఱియు సర్వవ్యాధులు నశించును.

## సితోపలాది చూర్ణమ్.

శ్లో॥ సితోపలా షోడశస్యా దష్టౌస్యా ద్వంశ రోచనా
పిప్పలీస్యాచ్చతుష్కర్షా స్యాదేలాచ ద్వికార్షకీ॥ 27.
ఏకః కర్షస్త్వచః కార్య శ్చూర్ణయే త్సర్వ మేకతః
సితోపలాదికం చూర్ణం మధుసర్పిర్యుతం లిహేత్॥ 28.
శ్వాసకాస క్షయహరం హస్త పాదాంగ దాహజిత్

మందాగ్నిం సుప్తజిహ్వాత్వం పార్శ్వశూల మరోచకమ్॥
జ్వర మూర్ధ్వగతం రక్తపిత్తమాశు వ్యపోహతి॥ 29.

తా :— ఖండశర్కర 16 కర్షములు, తవాక్షీరి 8 కర్షములు, పిప్పళ్ళు 4 కర్షములు, ఏలకులు 2 కర్షములు, దాల్చిన చెక్క ఒక కర్షము, వీని నన్నిటిని మెత్తగా చూర్ణము చేయవలయును. ఇదియే సితోపలాది చూర్ణము దీని నుచితప్రమాణము రేపు మాపు తేనె మఱియు ఆవునెయ్యితో సేవించిన శ్వాసకాస క్షయలు చేతులుకాళ్ళు వీని యందలి మంటలు, మందాగ్ని, నోరెండుట, పార్శ్వశూల, అరోచకము, జ్వరము మఱియు ఊర్ధ్వగత రక్తపిత్తరోగములును హరించును.

## ఖండ సమక చూర్ణమ్ (పాండురోగే).

శ్లో॥ త్రిఫలా వ్యోష బిల్వాబ్ద పిప్పలీమూల చిత్రకైః
త్వగేలాపత్ర చవికా తింతిడీ కామ్లవేతసైః॥ 30.
సమాంశైర్ధాతుమాక్షీకం సర్వైస్తుల్యం ప్రదాపయేత్
లోహచూర్ణం సమం తైశ్చ సర్వైః ఖండం సమాంశకమ్॥ 31.
చూర్ణితం మధునా లేహ్యం వటకాన్ వా స మాక్షికాన్
భక్షయిత్వా యథాసాత్మ్య మనుపానం ప్రయోజయేత్॥ 32.
నాశయేత్కుష్ఠమాలస్యం ప్రమేహోదర కామలాః
పాండురోగం తథాకాసం హలీమక శిరోరుజమ్॥ 33.
ప్రసేక మరుచిం మూర్ఛాం హృల్లాసం మందవహ్నితాం
రక్తపిత్తం పరీసర్పం శ్వయథుంచ వినాశయేత్॥ 34.

తా :— ఉసిరికాయలు, తాడికాయలు, కరక్కాయలు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, మారేడువేరు, తుంగముస్తలు, మోడి, చిత్రమూలము, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రి, చవ్యము, చింతచెక్క, అమ్లవేతసము, వీనిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణము చేయవలయును. ఈ చూర్ణమునకు సమానము స్వర్ణమాక్షిక భస్మము మఱియు లోహభస్మము, మొత్తమునకు సమానముగా ఖండశర్కర కలిపి మెత్తగా చూర్ణము చేయవలయును. దీనిని రోగానుసారము అనుపాన విశేషములతోగాని కేవలము తేనెతోగాని సేవించిన కుష్ఠ, అలస్య, ప్రమేహ, ఉదర, కామల, పాండు, కాస, హలీమక, శిరశ్శూల, ప్రసేక, అరుచి, మూర్ఛ, హృల్లాస, మందాగ్ని, రక్తపిత్త, విసర్ప, మఱియు శోథ మొదలగు రోగములను బోగొట్టును.

## పాఠాది చూర్ణమ్ (శోఫరోగే)

శ్లో॥ పాఠా సకృష్ణా గజపిప్పలీచ నిదిగ్ధికా నాగర చిత్రకాచ
సపిప్పలీమూల మజాజి రాత్రి ముస్తంచ చూర్ణం సుఖతోయపీతమ్
హన్యాత్ త్రిదోషం చిరజంచ శోఫం కుష్ఠంచ చూర్ణస్యహి
సుప్రయోగాత్॥ 35.

తా :— విషబొద్ది, పిప్పళ్లు, గజపిప్పళ్ళు, వాకుడు, శుంఠి, చిత్రిమూలము, మోడి జీలకర్రి, పసుపు, భద్రముస్తలు, ఇవి సమభాగములు. వీని నన్నిటిని మెత్తగా చూర్ణము చేయవలయును. దీనిని వేడినీళ్ళతో సేవించిన చిరకాలము నుండి యున్న త్రిదోషజనిత శోఫలును, మఱియు కుష్ఠరోగములును హరించును.

## పంచారిష్ట చూర్ణమ్ (కుష్ఠరోగే)

శ్లో॥ కాలే త్వక్ ఛదసార బీజ కుసుమై ర్నింబస్య తుల్యాంశకైః
కృత్వా చూర్ణమథః కటుత్రిక నిశా ధాత్ర్యైక్ష పథ్యాయుతైః
పంచారిష్టమిదం పయో మధు ఘృతై రుష్ణాంబునావా పుమాన్
పీత్వా కాస గర ప్రమేహ పిటకా కుష్ఠాదిభి ర్ముచ్యతే॥ 36.

తా :— వేపచెట్టుయొక్క పంచాంగములు (వేరు, చెక్క, పుష్పు, కాయ, ఆకు) సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణముచేసి, దానిలో త్రికటుకములు, పసుపు, త్రిఫలములు, అనునవి సమభాగములుగ గ్రహించి చూర్ణించి కలుపవలెను. ఈచూర్ణమును ఆవుపాలు, తేనె, నెయ్యి, లేక వేడినీటితో సేవించిన కాస, గరవిష, ప్రమేహ, పిటకాద్యులను, కుష్ఠరోగములను హరించును.

## మహాఖాండవ చూర్ణమ్.

శ్లో॥ మరిచం నాగపుష్పాణి తాలీసం లవణానిచ
ప్రత్యేక మేకభాగాః స్యుః పిప్పలీమూల చిత్రకైః॥ 37.
త్వక్కణా తింతిడీకంచ జీరకంచ ద్విభాగికమ్
ధాన్యామ్లవేతసా విశ్వం భద్రైలా బదరాణిచ॥ 38.
అజమోదా జలధరః ప్రత్యేకం స్యు స్త్రిభాగికాః
సర్వౌషధి చతుర్థాంశం దాడిమస్య ఫలం భవేత్॥ 39.
ద్రవ్యేభ్యో నిఖిలేభ్యశ్చ సితా దేయార్ధమాత్రయాః
మహాఖాండవ సంజ్ఞం స్యాచ్చూర్ణ మేతత్సురోచనమ్॥ 40.

శ్లో॥ అగ్నిదీప్తికరం హృద్యం కాసాతీసార నాశనమ్
హృద్రోగ కంఠ జఠర ముఖరోగ ప్రణాశనమ్॥ 41.
విషూచికాం తథాధ్మాన మర్శో గుల్మ కృమీనపి
ఛర్దిం పంచవిధాం శ్వాసం చూర్ణ మేతద్వ్యపోహతి॥ 42.

తా:— మిరియాలు, నాగకేసరములు, తాళీసపత్రి, పంచలవణములు, ఇవిప్రత్యేక మొకభాగము, మోడి, చిత్రమూలము, దాక్షిణచెక్క, పిప్పళ్లు, చింతచెక్క, జీలకర్ర, ఇవి ప్రత్యేకము రెండుభాగములు, ధనియాలు, అమ్లవేతసము, శుంఠి, వస, పెద్దఏలకులు, రేగుపండ్లు, ఓమము, తుంగముస్తలు, అనునవి ప్రత్యేకము మూడుభాగములు. వీని మొత్తములో నాల్గవభాగము దానిమ్మపండు మొత్తములో సగభాగము శర్కరను గలిపి మెత్తగా చూర్ణము చేయవలయును. ఇది అత్యంతరుచికరమైన మహాఖాండవ చూర్ణము. ఈ చూర్ణము అగ్నిదీప్తికరము, హృద్యము, మఱియును కాసాతిసార నాశకము. ఇదిగాక హృద్రోగ, కంఠ, జఠరముఖరోగములను, విషూచిక, ఆధ్మాన, అర్శ, గుల్మ, కృమి, ఛర్ది, వ్యాధులను మఱియు శ్వాసరోగములను బోగొట్టును.

## లవంగాది చూర్ణమ్. (గ్రహణీరోగే)

శ్లో॥ లవంగం శుద్ధకర్పూర మేలా త్వఙ్నాగకేసరమ్
జాతీఫలముశీరంచ నాగరం కృష్ణజీరకమ్॥ 42.
కృష్ణాగురు స్తుగాక్షీరీ మాంసీ నీలోత్పలం కణా
చందనం తగరం బాలం కంకోలం చేతి చూర్ణయేత్॥ 43.
సమభాగాని సర్వాణి సర్వేభ్యోర్ధ సితాభవేత్
లవంగాద్యమిదం చూర్ణం సక్షౌద్రం వహ్నిదీపనమ్॥ 44.
రోచనం తర్పణం వృష్యం త్రిదోషఘ్నం బలప్రదమ్
హృద్రోగం కంఠరోగంచ కాసం హిక్కాంచ పీనసమ్॥ 45.
యక్ష్మాణం తమకం శ్వాస మతీసార మురఃక్షతమ్
ప్రమేహారుచి గుల్మాదీన్ గ్రహణీమపి నాశయేత్॥ 46.

తా:— లవంగములు, శుద్ధపచ్చకర్పూరము, ఏలకులు, లవంగచెక్క, నాగకేసరములు, జాజికాయ, వట్టివేళ్ళు, శుంఠి, నల్లజీలకర్ర, పిప్పళ్ళు, అగరు, వంశలోచనము, జటామాంసి, నల్లకలువగడ్డ, సన్నపిప్పళ్లు, మంచిగంధము, గ్రంథితగరము, కురువేరు, తక్కోలములు, అనువానిని సమభాగములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి అందు మొత్తములో నర్ధభాగము చక్కెరనుచేర్చి తిరిగి చూర్ణము చేయవలెను. ఈ చూర్ణమును తగుమాత్రము తేనెతో సేవించిన అగ్ని దీప్తిని గలుగజేయును. ఇది రుచికరము, తృప్తి

కరము, వృష్యము, త్రిదోషఘ్నము, మఱియు బలప్రదము. దీనిచేత హృద్రోగములు కంఠరోగములు, కాస, హిక్క, పీనస, రాజయక్ష్మ, తిమర, శ్వాస, అతిసార, ఉరక్షత ప్రమేహ, అరుచి, గుల్మ, గ్రహణి మొదలగు రోగములు హరించును.

## అష్టచూర్ణమ్.

శ్లో॥ త్రికటుక మజమోదా సైంధవం జీరకే ద్వే
సమధరణ ధృతానా మష్టమో హింగుభాగః
ప్రథమ కబళ భోజ్యః సర్పిషా చూర్ణకోయం
జనయతి భృశమగ్నిం వాతగుల్మం నిహన్తి॥ 48.

తా :—శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, ఓమ, సైంధవలవణము, జీలకర్ర, నల్లజీలకర్ర,ఇవిసమభాగములు. వీనిలో ఎనిమిదవభాగము వేయించిన ఇంగువనుజేర్చి మెత్తగా చూర్ణము చేయవలయును. ఈ చూర్ణమును యథోచిత ప్రమాణము భోజనమునకు ముందు నెయ్యి కొంచము అన్నములో గలిపి ప్రథమకబళ మాత్రగా భుజించినచో వాతగుల్మను హరించి అగ్నిదీప్తిని గలిగించును.

## తుగాది చూర్ణమ్.

శ్లో॥ తుగా తింతిడీ లాజైశ్చ కోల వ్యోష త్రిజాతకైః
సచంద్రైర్మోదకం రుచ్యం క్రమాత్ ద్విగుణ శర్కరమ్
ఛర్ద్యస్రుక్ పిత్తహృద్రోగ కాస క్షయ జ్వరాపహమ్॥ 49.

తా :— వంశలోచనము, చింతచెక్క, వరిపేలాలు, రేగుపండ్లు; త్రికటుకములు, (శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు) ఏలకులు, దాల్చిణిచెక్క, ఆకుపత్రి, పచ్చకర్పూరము, ఇవి సమభాగములు. వీనిని మెత్తగాచూర్ణము చేయవలయును. మొత్తమునకు రెండురెట్లు చక్కెరను గ్రహించి పాకముచేసి అందు పై చూర్ణమునువేసి బాగుగా గలిపి మోదకము సిద్ధము చేయవలయును. దీనిని సేవించిన ఛర్ది, రక్తపిత్తము, హృద్రోగము, కాస క్షయలును మఱియు జ్వరములును హరించును.

## శ్వాసకాసాది చూర్ణమ్.

శ్లో॥ తేకరాజ రసప్రస్థే కుడవం మరిచం పచేత్
అభయా పిప్పలీ భార్గీ సైంధవం పుష్కరాహ్వయమ్॥ 50.

అక్షప్రమాణం సంచూర్ణ్య మిశ్రయిత్వా మధుప్లుతమ్
తత్స్వాదేత్ ప్రాతరుత్థాయ శ్వాస కాస వినాశనమ్॥ 51.

తా :— భృంగరాజరసము ఒక ప్రస్థమందు మిరియాలు ఒక కుడవ ప్రమాణము వేసి వండి పూర్తిగా శుష్కమైన తరువాత అందులో కరక్కాయ పిప్పళ్ళు, గంటుభారంగి, సైంధవలవణము, పుష్కరమూలము అనునవి ప్రత్యేకము ఒక తులము, వీని చూర్ణము వేసి పిదప అందు తేనెకూడ జేర్చి ప్రాతఃకాలమందు సేవించిన శ్వాసకాసలు నశించును.

## జీవంత్యాది చూర్ణమ్.

శ్లో॥ జీవంతీ ముస్త సురసా త్వగేలా ద్వయ పౌష్కరమ్
చండా తామలకీ లోహ భార్గీ నాగర వాలకమ్॥ 52.

కర్కాటక శఠీ కృష్ణా నాగకేసర చోరకమ్
ఉపయుక్తం యథా కామం చూర్ణా ద్విగుణ శర్కరమ్॥ 53.
పార్శ్వరు గ్జ్వరకాసఘ్నం హిక్కా శ్వాస హరం పరమ్॥ 54.

తా :— జీవంతి (మలయాళభాషలో అటపతియన్ కిళంగు), భద్రముస్తలు, కృష్ణ తులసి, లవంగపట్ట, చిన్నఏలకులు, పెద్దఏలకులు, పుష్కరమూలము, నేలయుసిరిక, శంఖపుష్పి, అగరు, గంటుభారంగి, శుంఠి, కురువేరు, కర్కాటక శృంగి, కచోరములు, పిప్పళ్ళు, నాగకేసరములు, అడవికచోరములు, వీనిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణము చేయువలయును. ఈ చూర్ణమునకు రెండుభాగములు శర్కరనుజేర్చి మెత్తనిపొడి సిద్ధముచేసి యథాప్రమాణము సేవించిన పార్శ్వపీడ, జ్వర, కాస, హిక్కా, శ్వాస ఇత్యాది రోగములు హరించును.

## త్రికట్వాది చూర్ణమ్.

శ్లో॥ త్రికటు త్రిఫలా ముస్తా విడంగం చవ్య చిత్రకా
త్వక్ శఠీ పిప్పలీమూలం మాతులం సురదారుచ॥ 55.
తుంబురుః పౌష్కరం మూలం పాఠైలా రజనీద్వయమ్
బిడం సౌవర్చలం క్షారః సైంధవం హస్తి పిప్పలీ॥ 56.
యావంత్యేతాని ద్రవ్యాణి తావంతం గుగ్గులుం సమమ్
కోలప్రమాణాం గుటికాం కృత్వేదం మధు సర్పిషా॥ 57.
కాసం శ్వాసం తథానాహ మర్శాంసిచ భగందరమ్
గుల్మం ప్లీహం తథా శోఫమంత్ర వృద్ధించ నాశయేత్
సప్తవింశతికో హ్యేష గుగ్గులుః కథితో మయా॥ 58.

తా :— శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరక్కాయబెరడు, తాడికాయబెరడు, ఉసిరికపరుగు, తుంగముస్తలు, వాయువిడంగములు, చవ్యము, చిత్రమూలము, లవంగ

చెక్క, కచోరములు, మోడి, స్వర్ణమాక్షికభస్మ, దేవదారు, తుంబురు ఫలము, పుష్కర మూలము, చిరుబొద్ది, ఏలకులు పసుపు, మానిపసుపు, బిడాలవణము, సౌవర్చలవణము, యవక్షారము, సైంధవలవణము, గజపిప్పళ్లు, ఇవి సమభాగములు, వీని నన్నిటిని మెత్తగా చూర్ణించి దీనికి సమము గుగ్గులు కూడ జేర్చి అందు తేనె, నెయ్యివేసి రేగుగింజలంత మాత్రలు జేయవలెను. దీనిని సేవించిన శ్వాస, కాస, అనాహ, అర్శ, భగందర, గుల్మ, ప్లీహ, శోఫలును మఱియు అంత్రవృద్ధి రోగములును నశించును. దీనినే సప్తవింశతి గుగ్గులు అని యందురు.

## పుష్యానుగ చూర్ణమ్.

శ్లో॥ పాఠా జంబ్వామ్రయోరస్థి శిలోద్భేదం రసాంజనమ్
అంబష్ఠాం శాల్మలీపిచ్ఛాం సమగాం వత్సకత్వచమ్॥ 59.
బాహ్లీక బిల్వాతివిషా లోధ్ర తోయద గైరికమ్
శుంఠీ మధూక మృద్వీకా రక్తచందన కట్ఫలమ్॥ 60.
కట్వంగ వత్సకానంతా ధాతకీ మధుకార్జునమ్
పుష్యే గృహీత్వా సంచూర్ణ్య సక్షౌద్రం తండులాంభసా॥ 61.
పిబేదర్శ స్స్వతీసారే రక్తం యశ్చోపవేశ్యతే
దోషజంతు కృతాయేచ బాలానాం తాంశ్చ నాశయేత్॥ 62.
యోనిదోషం రజోదోషం స్రావం శ్వేతారుణాసితమ్
చూర్ణం పుష్యానుగం నామ హిత మాత్రేయ పూజితమ్॥ 63.

తా :— చిరుబొద్ది, నేరేడుగింజల పప్పు, మామిడిజీడి, కొండపిండి, రసాంజనము, అంబష్ఠ, బూరుగుబంక, అత్తపత్తి, కొడిశపాలచెక్క, కుంకుమపువ్వు, మారేడుకాయ గుజ్జు, అతివస, లొద్దుగచెక్క, భద్రముస్తలు, గైరికము (కావిరాయి) శుంఠి, ఇప్పపువ్వు ద్రాక్షు, రక్తచందనము, కాయఫలముచెక్క, పెద్దమానిచెక్క, కొడిశపాల గింజలు, సుగంధపాలవేళ్ళు, ఆరెపువ్వు, అతిమధురము, మద్దిచెక్క, వీనిని పుష్యమీ నక్షత్రమున సమభాగములుగ గ్రహించి మెత్తగా చూర్ణముచేయవలయును. దీని నుచిత ప్రమాణము తేనె మఱియు బియ్యపు కడుగుతో సేవించిన, అర్శస్సు, రక్తార్శస్సు, రక్తాతిసారము, చిన్నపిల్లల కృమిదోషము, స్త్రీలరజోదోషము, యోనిదోషము, శ్వేత రక్త కృష్ణస్రావ వ్యాధులును శమించును. దీనికి పుష్యానుగచూర్ణమని పేరు. ఇది ఆత్రేయునిచేజెప్పబడినది.

## నారాచక చూర్ణమ్.

శ్లో॥ యవానీ హపుషా ధాన్యం శతపుష్పోప కుంచికా
కారవీ పిప్పలీమూల మజగంధా శఠీవచా॥ 64.

శ్లో॥ చిత్రకం జీరకం వ్యోషం *స్వర్ణక్షీరీ (స్వర్ణకామి) ఫలత్రయమ్
ద్వౌ క్షారౌ పౌష్కరం మూలం కుష్ఠం లవణపంచకమ్॥ 65.
విడంగంచ సమాంశాని దంత్యా భాగత్రయం తథా
త్రివృద్విశాలే ద్విగుణే సాతలాచ చతుర్గుణా॥ 66.
ఏషా నారాచకోనామ చూర్ణో రోగ గణాపహః
నైతంప్రాప్య నివర్తంతే రోగా విష్ణుమివాసురాః॥ 67.

తా :— ఓమ, బోడతరము, ధనియాలు, సోయకూరగింజలు (బద్దసోపు), నల్లజీలకర్ర, పాజీర, మోడి, పెన్నేరుగడ్డ, కచోరాలు, వస, చిత్రమూలము, జీలకర్ర, త్రికటుకములు, స్వర్ణక్షీరి లేక స్వర్ణకామి త్రిధారి (మూడుపలకల జముడు) లేక సునాముఖి, త్రిఫలములు, యవాక్షారము, సర్జాక్షారము, పుష్కరమూలము, చెంగల్వకోష్ఠు, పంచలవణములు, వాయువిడంగములు, ఇవి ప్రత్యేకమొక భాగము, దంతీమూలము 3 భాగములు, తేగడ 2 భాగములు, ఇంద్రవారుణి, (ఏటిపుచ్చ) 2 భాగములు, శీకాయతీగె 4 భాగములు, వీనినన్నిటిని మెత్తగాదంచి చూర్ణము చేయవలయును. దీనినే నారాచక చూర్ణమందురు. ఈ చూర్ణము సకలరోగనివారకము, విష్ణుసాన్నిధ్యమును పొందిన రాక్షసులు తిరిగి జన్మమెట్లు పొందరో ఆ విధముగనే దీనిచే పోయినరోగములు తిరిగికనపడవు.

## నారాచకచూర్ణ సేవనాక్రమమ్.

శ్లో॥ తక్రేణోదరిభిః పేయం గుల్మిభిర్బదరాంభసా
ఆనద్ధవాతే సురయా వాతరోగే ప్రసన్నయా॥ 68.
దధిమండేన విట్సంగే దాడిమాంభోభిరర్శసి
పరికర్తేచ వృక్షామ్లే హ్యుష్ణాంబుభిరజీర్ణకే॥ 69.
భగందరే పాండురోగే కాసే శ్వాసే గళగ్రహే
హృద్రోగే గ్రహణీ దోషే కుష్ఠే మందేనలే జ్వరే॥ 70.
దంష్ట్రావిషే చ సగరే యథార్హ్వం కృత్రిమే విషే
స్నిగ్ధకోష్ఠే న హ్యుచితం పేయమేతద్విరేచనమ్॥ 71.

తా :— నారాచక చూర్ణము ఉదర వ్యాధులకు చల్లతోను, గుల్మలకు రేగుకషాయముతోను, ఆనద్ధవాతములకు మద్యముతోను, వాతవ్యాధులకు ప్రసన్నా అనే మద్యము

---

* స్వర్ణకామి అని కొన్ని సహస్రయోగగ్రంథములలో వ్రాయబడినవి. స్వర్ణక్షీరి—త్రిధారి—మూడుపలకల జముడు. స్వర్ణకామిః—సునాముఖి, అంబష్ఠా, వేలుత్త, అంబళం అని మలయాళభాషలో వ్యవహరించెదరు.

తోను, మలబద్ధమునకు పెరుగుమీది నీటితోను, అర్శోరోగములకు దానిమ్మచెక్క కషాయముతోను, కడుపులోని నులినొప్పులకు వృక్షామ్ల కషాయముతోను (కోకనీ ఆమ్‌చూర్ లేక కోకం), అజీర్ణరోగములకు వేడినీళ్లతో నుపయోగించవలయును. ఇది భగందరము, పాండురోగము, కాస, శ్వాస, గళగ్రహ, హృద్రోగ, గ్రహణి, కుష్ఠ, మందాగ్ని, జ్వర, సర్పాది విషములను గరవిషములను మఱియు కృత్రిమ విషరోగములను హరించును. తొలుత రేచన కర్మచేసి, అనగా కోష్ఠమును స్నిగ్ధముచేసి యుచితానుపానముతో సేవించిన పైవ్యాధు లుపశమించును.

## హపుషాది చూర్ణమ్.

శ్లో॥ హపుషాం *కాంచన క్షీరం త్రిఫలాం నీలినీఫలమ్
త్రాయంతీం రోహిణీం తిక్తాం సాతలాం త్రివృతాం వచామ్॥ 72
సైంధవం కాలలవణం పిప్పలీంచేతి చూర్ణయేత్
దాడిమ త్రిఫలా మాంస రసమూత్ర సుఖోదకైః॥ 73.
పేయోయం సర్వగుల్మేషు ప్లీహ్ని సర్వోదరేషుచ
శ్విత్రే కుష్ఠేషు జ్వరకే సదనే విషమేనలే॥ 74.
శోఫార్శ పాండురోగేషు కామలాయాం హలీమకే
వాతపిత్త కఫాంశ్చాపి విరేకేణ ప్రసాదయేత్॥ 75.

తా :— బోడతరము, కాంచనక్షీరము, (కొండకసివింద?) (త్రిఫలములు) నీలిబీజములు, కలుకాత్రినుగ, కటుకరోహిణి, నేలవేము, శీకాయతీగె, తెగడ, వస, సైంధవలవణము, నల్లఉప్పు, పిప్పళ్ళు, ఇవి సమభాగములు, వీనిని మెత్తగా చూర్ణము చేయవలయును. ఈ చూర్ణమును దానిమ్మ కషాయముతోగాని త్రిఫలకషాయముతోగాని మాంసరసముతోగాని, గోమూత్రముతోగాని లేక వేడినీళ్ళతో గావి సేవించిన సకల గుల్మవ్యాధులు, ఉదరరోగములు, మఱియు ప్లీహరోగములును పోవును. దీనిచే శ్విత్ర (బొల్లి) కుష్ఠ, జ్వర, అగ్నిమాంద్య, శోఫ, అర్శ, పాండు, కామల, హలీమక, వాత, పిత్త, కఫ వ్యాధులును నశించును. మఱియు సుఖముగా విరేచనమగును.

## నీలినీ చూర్ణమ్.

శ్లో॥ నీలినీం నిచులం వ్యోషం క్షారా లవణపంచకమ్
చిత్రకంచ పిబేచ్చూర్ణం సర్పిషోదర గుల్మనుత్॥ 76.

తా :— నీలిచెట్టు, హిజ్జల, (సముద్రఫలము) శుంఠి, మిరియాలు, పిప్పళ్ళు, సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు (ఉప్పు, సైంధవ లవణము, సౌవర్చ లవణము,

* కాంచనక్షీరం = ఎఱుమకళ్ళివేరు (మలయాళ భాషలో).

బిడాలవణము, కాచలవణము), చిత్రమూలము, వీనిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణముచేసి ఆవునేతితో సేవించిన ఉదరములును మఱియు గుల్మరోగములును హరించును.

## పటోలాది చూర్ణమ్.

శ్లో॥ పటోల నింబ త్రాయంతీ తిక్తా తిక్తక పర్పటమ్
కుటజ త్వక్ఫలం దూర్వా మధుశిగ్రు ఫలం వచా॥ 77.
దార్వీత్వక్ పద్మకోశీర యవానీ ముస్త చందనమ్
సౌరాష్ట్ర్యతివిషా వ్యోషం త్వగేలా పత్ర దారుచ॥ 78.
చూర్ణితం మధునా లేహ్యాం పేయం మద్యజలేనవా
హృత్పాండు గ్రహణీరోగ గుల్మ శూలారుచి జ్వరాన్॥ 79.
కామలాం సన్నిపాతంచ ముఖరోగాంశ్చ నాశయేత్॥ 80.

తా:— చేదుపొట్ల, వేపచెక్క, కటుత్రానుగ, కటుకరోహిణి, నేలవేము, పర్పాటకము, కొడిశపాలచెక్క, కొడిశపాలగింజలు, గరికె, మునగగింజలు, వస, మానిపసుపు, ఆకుపత్రి, పద్మకం, వట్టివేళ్లు, ఓమ, భద్రముస్తలు, మంచిగంధము, గోపీచందనము, అతివస, త్రికటుకములు, దాళ్ణిచెక్క, ఏలకులు, ఆకుపత్రి, దేవదారు, అనునవి సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణముచేసి తగుమాత్రము తేనెతోగాని మద్యముతోగాని లేక నీటితోగాని సేవించిన హృద్రోగ, పాండు, గ్రహణి, గుల్మ, శూల, అరుచి, జ్వర, కామల। సన్నిపాత రోగములును మఱియు ముఖరోగములును నశించును.

## నింబాది చూర్ణమ్.

శ్లో॥ భూనింబ కటుకా ముస్తా త్ర్యూషణేంద్రయవాన్ సమాన్
ద్వా చిత్రకాద్వత్సకత్వగ్భాగాన్ షోడశ చూర్ణయేత్॥ 81.
గుడ శీతాంబునా పీతం తద్గ్రహణీ దోష గుల్మనుత్
కామలా జ్వర పాండుత్వ మేహారుచ్యతిసారనుత్॥ 82.

తా:— నేలవేము, కటుకరోహిణి, భద్రముస్తలు, మిరియాలు, శుంఠి, పిప్పళ్లు, కొడిశపాలగింజలు, ఇని ప్రత్యేక మొక భాగము చిత్రమూలము, రెండు భాగములు, కొడిశపాలచెక్క, 16 భాగములు, వీని నన్నిటిని మెత్తగా చూర్ణము చేయవలయును. ఈ చూర్ణమును చన్నీళ్లలో బెల్లమును గలిపి సేవించిన గ్రహణి, గుల్మ, కామల, జ్వర, పాండు, మేహ అరుచి, అతిసార రోగములు హరించును.

## నాగరాది చూర్ణమ్.

శ్లో॥ నాగరాతివిషా ముస్తా పాఠా బిల్వం రసాంజనమ్
కుటజత్వక్ఫలం తిక్తం ధాతకీచ కృతంరజః॥ 83.
క్షౌద్ర తండులవారిభ్యాం పైత్తికే గ్రహణీగదే
ప్రవాహికార్శో గుదరుగ్రక్తో త్థానేషపేష్యతే॥ 84.

తా:— శుంఠి, అతివస, తుంగముస్తలు, చిరుబొద్ది, మారేడుకాయ గుజ్జు, రసాంజనము, కొడిశపాలచెక్క, మఱియు దాని గింజలు, నేలవేము, ఆరెపువ్వు, అనువానిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణముచేసి తగుమాత్రను తేనె, బియ్యపు కడుగుతో సేవించిన పిత్తరోగములు, గ్రహణి, ప్రవాహిక, అతిసారములు, అర్శ, గుద రోగములను మఱియు రక్తప్రకోప రోగములును శమించును.

## సితోపలాది చూర్ణమ్.

శ్లో॥ సితోపలా వంశ భవోప కుల్యా
త్రుటిత్వ చా మాజ్య మధు ప్రయుక్తమ్
అద్యాత్తదూర్ధ్వ ద్విగుణం నిహంతి
చూర్ణం సమస్తాన్ క్షయజాత రోగాన్॥ 85.

సశ్వాస కాసానల మాంద్య సుప్తి
జిహ్వారుచి శ్లేష్మ కఫార్శ శూలాన్
జ్వరోర్ధ్వ రక్తం సకరాంఘ్రి దాహ
ముక్తాన్ యథా పాప గణాన్ మురారిః॥ 86.

ఆయుర్వ్యదిస్యా ద్బలవ న్నరాణాం
సురక్తపిత్త శ్వసన క్షయాణామ్॥ 87.

తా:— ఖండశర్కర 16 భాగములు, వంశలోచనము 8 భాగములు, పిప్పళ్లు 4 భాగములు, ఏలకులు 2 భాగములు, లవంగపట్ట ఒక భాగము. వీని నన్నిటిని వస్త్రగాళిత చూర్ణమును చేసి తేనె మఱియు ఆవు నేతితో సేవించిన, క్షయవలన నుత్పన్నము లగు ఉపద్రవము లన్నియును శమించును. శ్వాస, కాస, అగ్నిమాంద్యములు, నోరెండుట, అరుచి, కఫ, పార్శ్వశూల, జ్వర, ఊర్ధ్వరక్త, హస్తపాదదాహ మొదలగు రోగములను పాపసమూహములు విష్ణుమూర్తిని విడిచి ఎట్లు దూరముగ పోవునో ఆ విధముగనే యీ చూర్ణమును సేవించుటచే పై రోగములన్నియు దూరములగును. ఆయుర్బలానుసారము రక్తపిత్త శ్వాస క్షయ రోగులకిది దివ్యమైన ఔషధము.

## కచూరాది చూర్ణము.

తా:— కచోరములు, చెంగల్వకోష్టు, యష్టిమధుకము, కురువేరు, తుంగముస్తలు, బలామూలము, ఉసిరికాయ, కుంకుమపువ్వు, సహస్రవేధి, మంచిగంధము, రక్తచందనము, వట్టివేరు, చింతయీనెలు, మంజిష్ఠ, దేవదారు, వరిపేలాలు, శిలాజిత్తు, బాలింతబోలు, కటుకరోహిణి, పచ్చకర్పూరము. ఇవి సమభాగములుగ గ్రహించి చనుపాలతో నూరి తలకు పట్టువేసిన జ్వరములు, నేత్రరోగములు, శిరశ్శూలలు మఱియు బుద్ధిభ్రమలు హరించును.

## రాస్నాది చూర్ణము.

సన్నరాస్నము, పెన్నేరుగడ్డ, దేవదారు, కటుకరోహిణి, రక్తబోళము, గుగ్గిలము, చెంగల్వకోష్టు, వస, గైరికము, పసుపు, అతిమధురము, ముత్తవపులగము వేళ్లు, భద్రముస్తలు, శుంఠి, మిరియాలు, పిప్పళ్లు, మురికితుమ్మ, వట్టివేళ్లు, నల్లమందు, మంచిగంధము, అగరు, సహస్రవేధి, కురువేరు, చింతయీనెలు. ఇవి సమభాగములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి చనుపాలతో గలిపి తలకు పట్టువేసినయెడల సర్వవిధ సన్నిపాతములును మఱియు శిరశ్శూలలును హరించును.

## మహా కచ్చూరాది చూర్ణము.

కచోరములు, ఉసిరికవరుగు, మంజిష్ఠ, యష్టిమధుకము, దేవదారు, మంచిగంధము, రక్తచందనము, రాతినార, శిలాజిత్తు, సహస్రవేధి, కటుకరోహిణి, నల్లజీలకర్ర, సన్నరాస్నము, చింతయీనెలు, సుగంధపాలవేళ్లు, కుంకుమపువ్వు, గుగ్గిలము, భద్రముస్తలు, బాలింతబోలు, నల్లమందు, ముత్తవపులగమువేరు, వరిపేలాలు, కుందురుష్కము, కురువేరు, చెంగల్వకోష్టు, రక్తబోళము, గైరికము, జాజికాయ, ఇవి సమభాగములుగ గ్రహించి మెత్తగాచూర్ణించి చనుపాలలోగలిపి తలకు పట్టువేసినయెడల వాత, పిత్త, శిరశ్శూలలు జ్వరములు, బుద్ధిభ్రమ, నేత్రరోగములు, పీనస, కఫరోగములు, కర్ణరోగములు మఱియు సన్నిపాత రోగములు నశించును.

## బృహత్ కర్పూరాది చూర్ణము.

పచ్చకర్పూరము, జాపత్రి, చలవమిరియాలు, కస్తూరి, మంచిగంధము, అక్కలకర్ర, కురువేరు, వసనాభి, వరిపేలాలు, జాజికాయ, సుర్మారాయి, విషబొద్ది, జీలకర్ర నల్లజీలకర్ర, త్రికటుకములు, నల్లమందు, సన్నరాస్నము, చెంగల్వకోష్టు, లొద్దుగచెక్క తేగడ, నాగకేసరములు, తుంగముస్తలు, పెద్దతుంగముస్తలు, వట్టివేళ్లు, వస, చంద్రసూరగింజలు, దేవదారు, యష్టిమధుకము, చిరాయితా కచోరములు, కటుకరోహిణి, ఆకుపత్రి, బ్రాహ్మి, కొండపిండి, అగరు, రక్తచందనము, ఏలకులు, లవంగములు, దాల్చిణిచెక్క, సైంధవలవణము, సోయికూరగింజలు(బద్దసోపు), మెంతులు, తక్కోలములు, రుద్రాక్షు, గజపిప్పళ్లు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణించవలయును. ఈ చూర్ణమునకు సమానము ఖండశర్కరను జేర్చి మెత్తగా వస్త్రగాళితముచేసి రోజుకు అర్ధతులము చొప్పున తేనెతో సేవించిన వాయుశోభ, ఛర్ది, హిక్క, కాస, హృచ్ఛూల, పిత్తగుల్మ, కఫశూల, మఱియు పాండురోగములును శమించును.

## కుక్కుట లవణము.

అడవిమిరియాలవేరు, అడవిపిప్పళ్లవేరు, చిత్రమూలమువేరు, శుంఠి, పిప్పళ్లు, తేగడ, ఇవి ప్రత్యేకము 9 తులములు. వీనిని చూర్ణించి 1720 తులముల నీళ్లలో వేసి చతుర్థాంశ కషాయముగా కాచి వడియగట్టి అందు 48 తులముల కోడిమాంసము, 48 తులముల సైంధవలవణము, 48 తులముల కొబ్బరిపాలు, 48 తులముల నువ్వులనూనె, 48 తులముల నెయ్యి అనువానిని వేసి పాకము చేయవలయును. పాకమునకు వచ్చిన తరువాత అందు త్రికటుకములు, ఇంగువ, జీలకర్ర, ఏలకులు, అనునవి ప్రత్యేక మొక తులము చొప్పున చూర్ణించి కలిపి పాకము చేయవలయును. దీనిని ప్రతిరోజు ప్రాత స్సమయమున ఒకతులమును మజ్జిగతో సేవించిన వాతగుల్మలు, శూలలు, ఆవాహము తూని, ప్రతితూని, అష్ఠీలా, మఱియు వస్తిగత రోగములును హరించును. ఈ కుక్కుటలవణము ఉపర్యుక్త వ్యాధులకు దివ్యౌషధము.

## మదనకామేశ్వరీ చూర్ణము.

అభ్రకభస్మ, పెద్దద్రాక్ష, శుంఠి,మిరియాలు, పిప్పళ్లు, చెంగల్వకోష్ఠు, పెన్నేరు గడ్డ, తిప్పసత్తు, మెంతులు, మఱ్ఱిబంక, నేలగుమ్ముడుసత్తు, నేలతాడిగడ్డల సత్తు, పల్లేరు, అరటిదుంప, శతావరిసత్తు, ఓమ, మినుములు, నువ్వులు, ధనియాలు, అతిమధురము, పెద్దముత్తవపులగమువేరు, భద్రముస్తలు, కచోరములు, మంగకాయ,జాజికాయ, సైంధవలవణము, సీకాయవేరు, కర్కాటకశృంగి, భృంగరాజము వేళ్లు, పసుపు,జీలకర్ర, నల్లజీలకర్ర, చిత్రమూలము, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, తెల్ల గలిజేరు, గజపిప్పళ్లు, ద్రాక్ష, వంశలోచనము, దూలగొండి గింజలు, చింతబంక, త్రిఫలములు. వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి, చూర్ణమునకు సమము శుద్ధ గంజాయి ఆకుచూర్ణమును (భంగు ఆకును) గలిపి పిదప దీనికి సమానము ఖండశర్కరయును జేర్చి కొంచెము నెయ్యికూడ గలిపి అర్థ తులముచొప్పున మాత్రలు కట్టవలయును. ప్రతిరోజు ఉదయమున ఒక మాత్ర తేనెలో గలిపి సేవించి వెంటనే శర్కర కలిపిన వేడి ఆవుపాలు త్రాగిన శుక్రవృద్ధియును, శుక్రస్తంభనయును, శుక్రసామర్థ్యమును, సంభోగ సుఖమును, బలదార్ఢ్యమును, మనశ్శాంతియు, గలుగ జేయును. దీనిచే కాసశ్వాస, అతిసార, అర్శ, గ్రహణి, ప్రమేహ, కఫాతిసార, రక్తాతిసారాది రోగములను శమించును. ఇవిగాక దీని సేవనచేత నిత్యానందమును కవితాశక్తియును, ఆధ్యాత్మిక విచారమును కలుగును. వార్ధక్యమును దూరముచేసి ఆయుర్వృద్ధిని గలిగించును. ఈ యౌషధమును ఒక వత్సరము సేవించినచో వృద్ధునకు కూడ యౌవనత్వము మఱియు సంభోగశక్తియు గలుగును.

# నాసికా చూర్ణము.

ఉసిరికవరుగు, జీలకర్ర, నెమిలి పింఛమునకుండు తెల్లని కాడలు లేక వాని లోపలిభాగము, శుంఠి, పిప్పళ్లు, మిరియాలు. జాజికాయ, లవంగాలు, జాపత్రి, కురు వేరు, చలువమిరియాలు, చెంగల్వకోష్టు, పసుపు, మానిపసుపు, ఖర్జూరపుకాయలు, వట్టి వేళ్లు, ఏలకులు, దాక్షిణచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు. ఇవి సమభాగములు. వీనిని మెత్తగా చూర్ణముచేసి, దీనికి సమము మంచిగంధపు చూర్ణమును మఱియు పొగాకు చూర్ణమును గలిపి, నిమ్మకాయ రసముతో బాగుగా మర్దించవలెను. పిదప దీనిని ఆర బెట్టి లేత కొబ్బరి బోండము నీటిచేత మర్దించి ఆరిన పిదప అందు కర్పూరము మఱియు పచ్చకర్పూరమును తగుమాత్రము కలిపి గులాబీ అర్కముతో మర్దించి తిరిగి ఆరబెట్ట వలెను. తరువాత పునుగు సాంబ్రాణిసత్తు వీనిని తగుమాత్రము గ్రహించి చూర్ణముచేసి పైదానిలో గలిపి నస్యకర్మలయం దుపయోగించిన శిరశ్శూలలు, పీనస, దుర్గంధము, సూర్యావర్తము మఱియు ఊర్ధ్వ, జత్రురోగములన్నియు శమించును.

సహస్రయోగ ప్రకాశిక యందలి

చూర్ణ ప్రకరణము

సంపూర్ణము.

---

ఓం శ్రీ ధన్వంతరయే నమః

# సహస్రయోగ ప్రకాశిక

## 5. అథ గుటికా ప్రకరణమ్.

### నీలీమూలాది గుటికా.

శ్లో॥ నీలీమూలంచ పిష్ట్వాతు తత్పత్రి స్వరసేనచ
పిప్పలీరోహిణీ యుక్తం సామాన్య జ్వరశాంతయే॥ 1.

తా :— నీలివేరు, పిప్పళ్ళు, కటుకరోహిణి, ఈ మూడింటిని సమభాగములుగా చూర్ణముచేసి నీలియాకుల స్వరసముతో మర్దించి మాత్రలు కట్టవలెను. దీనిని సేవించిన సామాన్య జ్వరములు శాంతించును.

### జ్వరాంకుశ గుటికా.

శ్లో॥ సమైశ్చతుర్జాత సుగంధ సూత
వ్యోషైః కుమారీరస సంప్రపిష్టైః
మాషార్ధమాత్రాం గుటికాం కృతాంహి
జ్వరాంకుశం నామవదంతి వైద్యాః॥ 2.

తా :— ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, శుద్ధిచేసిన గంధకము శుద్ధ పాదరసము మఱియు త్రికటుకములు వీనిని సమభాగములుగ చూర్ణించి, కుమారీ రసముతో బాగుగా నూగవలెను. మాత్రకట్టుకురాగానే ఆవాలవలె మాత్రలు కట్టవలెను. వీనిని జ్వరాంకుశ గుటికలని వైద్యులు చెప్పుదురు. ఇవి జ్వరములను హరించును.

### రామబాణ గుటికా.

శ్లో॥ సూతం గంధం విషం తుల్యం ధూర్తబీజం త్రిభిః సమమ్
చతుర్ణాం ద్విగుణాం వ్యోషం గుంజాపత్ర రసేన తు॥
రామబాణ మితిఖ్యాతం సర్వజ్వర వినాశనమ్॥ 3.

తా :— శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, శుద్ధవసనాభి, ఇవి సమభాగములు, శుద్ధ నల్లఉమ్మెత్తగింజలు మూడుభాగములు, త్రికటుకములు 12 భాగములు, వీని నన్నిటిని కల్వములో వేసి, గురిగింజాకు రసముతో మర్దించి పై ప్రకారము మాత్రలు కట్టవలయును. ఇది సర్వజ్వరములను నశింపజేయును.

## సూర్యప్రభావటీ.

శ్లో॥ సూతం గంధక రామఠం వరకటుం కృత్వా యవానీం సమమ్
సర్వం షోడశభాగ మత్రచ విషం జంబారసే మర్దయేత్॥
గుంజామాత్రి నిబద్ధ శుష్క గుటికా శూలాపహన్త్రి పరమ్
కాసశ్వాస హారీ మహాజ్వరహారీ నామ్నాతు సూర్యప్రభా॥ 4.

తా :— శుద్ధపాదరసము, శుద్ధగంధకము, శుద్ధ ఇంగువ, కరక్కాయ బెరడు, ఉసిరిక వరుగు, తాడికాయ బెరడు, కటుకరోహిణి, జీలకర్ర, ఇవి సమభాగములు, వీని మొత్తములో $\frac{1}{16}$వ వంతు శుద్ధ వసనాభి, వీని నన్నిటిని కల్వమందు వైచి నిమ్మపండ్ల రసముతో బాగుగా మర్దించి గుంజా ప్రమాణము మాత్రలు కట్టవలెను. ఈ మాత్రిలు సేవించిన శూల, కాస, శ్వాస మఱియు జ్వరములును హరించును.

## పాండురోగహర గుటికా.

శ్లో॥ తేకరాజ రసేనుభావితం లోహ కూఢ వరా రజ
స్తుల్యభాగ వట చ్ఛదోద్భవ భస్మచాప్యుభయం పునః॥
షట్పదోత్థరసేన పేషిత మక్షమాత్ర వినిర్మితమ్
పిండమప్యతి పాండురోగ ముదశ్వితా సహసేవితమ్॥ 5.

తా:—భృంగరాజరసములో శుద్ధిచేయబడిన పురాతన లోహకిట్టచూర్ణము, త్రిఫలా చూర్ణము మఱియు మఱ్ఱిచెక్క భస్మ, ఇవి సమభాగములు. వీని నన్నిటిని భృంగరాజ రసములో నూరి అక్షప్రమాణముగ మాత్రిలు కట్టవలయును. వీనిని మజ్జిగలో గలిపి సేవించిన పాండురోగములు శమించును.

## జ్వరాంకుశ గుటికా.

శ్లో॥ రసస్య ద్విగుణం గంధం గంధతుల్యంతు టంకణమ్
రసతుల్యం విషం యోజ్యం మరిచం పంచధావిషమ్॥ 6.
కట్ఫలం దంతిబీజంచ ప్రత్యేకం మరిచాన్వితమ్
జ్వరాంకుశో రసాహ్యేష చూర్ణయేద్యామ మాత్రకమ్
మాషైకేన నిహంత్యాశు జ్వరముగ్రం త్రిదోషజమ్॥ 7.

తా :— శుద్ధరసము ఒకభాగము, శుద్ధగంధకము రెండుభాగములు, పేల్చిన వెలిగారము రెండుభాగములు, శుద్ధ వసనాభి ఒకభాగము, మిరియాలు 5 భాగములు, కట్ఫలము 5 భాగములు మఱియు శుద్ధనేపాళములు 5 భాగములు, వీనినన్నిటిని మూడు గంటలసేపునూరిచూర్ణము చేయవలెను. ఇదిఉగ్రమైన త్రిదోషజజ్వరములను హరించును.

## మహా జ్వరాంకుశ గుటికా.

శ్లో॥ శుద్ధసూతం విషం గంధం ధూర్తబీజం త్రిభిః సమమ్
చతుర్ణాం ద్విగుణం వ్యోషం చూర్ణం గుంజా ప్రమాణకమ్॥ 8.
జంబీరకస్య స్వరసే ఆర్ద్రకస్య చ త్రైర్యుతమ్
మహా జ్వరాంకుశో నామ జ్వరాణామంతకో భవేత్॥ 9.

తా :— శుద్ధపాదరసము, శుద్ధవసనాభి, శుద్ధగంధకము, ఇది ప్రత్యేక మొక భాగము, శుద్ధ నల్లఉమ్మెత్తగింజలు 3 భాగములు, త్రికటుకములు 2భాగములు, వీనినన్నిటిని కల్వములో వేసి నిమ్మపళ్ళ రసముతోను, అల్లపురసముతోను బాగుగామర్దించి గుంజ ప్రమాణముగ మాత్రలు చేయవలయును. దీనిని సేవించిన సర్వజ్వరములు నశించును.

## రామబాణ గుటికా.

శ్లో॥ హింగుళం గంధకాశ్మానం చతుష్కం మానతః క్రమాత్
మర్దయిత్వాతు సుశ్లక్ష్ణం స్వర్ణపత్ర రసేనతు॥ 10.
గుంజామాత్రం ప్రయుంజీత శర్కరాయాం విశేషతః
రామబాణమితిఖ్యాతం సర్వశీతజ్వరాపహమ్॥ 11.

తా :—శుద్ధ ఇంగిలీకము ఒక భాగము, శుద్ధగంధకము 4 భాగములు పైవానిని ఒక కల్వములో వేసి నల్లఉమ్మెత్తాకురసముతో నూరి గుంజప్రమాణముగ మాత్రలు కట్టవలయును. ఖ్యాతిపొందిన యీ రామబాణ మాత్రలను శర్కరతో సేవించిన యెడల సర్వశీతజ్వరములు హరించును.

## సర్వరోగకులాంతక వటీ.

శ్లో॥ అమృతంచైక నిష్కంచ తత్సమం కణచూర్ణితమ్
తయోర్హింగుళ మాత్రేణ వటజంబీర-నీరజైః॥ 12.
శీతోదకం వార్ద్రకంవా పిబేన్మాష ప్రమాణకమ్
రాజయక్ష్మానిల శ్వాస జ్వర మందానలానపి
సన్నిపాతం మహావాతం సర్వరోగాన్ నిహంతిచ॥ 13.

తా :— శుద్ధవసనాభి ఒకభాగము, పిప్పళ్ళ చూర్ణము ఒక భాగము, హింగుళ భస్మ రెండుభాగములు, వీనిని మఱ్ఱిచెక్క కషాయముతోను, నిమ్మపళ్ళ రసముతోను మర్దించి మాషపరిమాణముగ మాత్రలు కట్టవలయును. ఈ మాత్రలను వేపకషాయముతో గాని, అల్లపురసముతోగాని సేవించిన క్షయ, వాతరోగ, శ్వాస, జ్వర, అగ్నిమాంద్యము లున్ను, సన్నిపాతరోగములును హరించును.

## రోగత్రియారి గుటికా.

శ్లో॥ పారదంచామృతం గంధం సర్వం శుద్ధంచ కారయేత్
వరా వ్యోషేణ సంమిశ్రం సమంతుల్యం విమర్దయేత్॥ 14.
జ్వాలాముఖీచ నిర్యాసం సూరణం చిత్రికార్ద్రికమ్
శిగ్రుః పునర్నవాచైవ ప్రత్యేకం భావనాత్రియమ్॥ 15.
తత్రసంస్థిత మాదాయ దీయతే గుంజమాత్రికమ్
నవజ్వర వినాశాయ చార్ద్రికస్య రసేనతు॥ 16.
కిరాతం మరిచం దేయం సన్నిపాతే త్రియోదశే
రోగత్రియారి విఖ్యాతం రాజరాజేన నిర్మితమ్॥ 17.

తా :— శుద్ధపాదరసము, శుద్ధవసనాభి, శుద్ధగంధకము, ఇవి ప్రత్యేక మొక భాగము, కరక్కాయ బెరడు, ఉసింకవరుగు, తాడికాయబెరడు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, ఇవి ప్రత్యేక మొక భాగము, వీనినన్నిటిని కల్వములోవేసి జ్వాలాముఖి, (ఘాత్తిదుంపరసముతోను) అడవికందరసముతోను, చిత్రమూల కషాయముతోను, అల్లపు రసముతోను, మునగచెక్క కషాయముతోను మఱియు తెల్లగలిజేరు రసముతోను, వరుసగా ఒక్కొక్క దానితో మూడుసార్లు చొప్పున మర్దించి గుంజాప్రమాణము మాత్రలు కట్టవలయును. దీనిని కిరాతతిక్తము (చిరాయితా) మఱియు మిరియాల కషాయ ముతోను సేవించిన యెడల 13 సన్నిపాతములు నశించును. ఈ రోగత్రయారి గుటికలు ఖ్యాతికెక్కిన మందు. మఱియు నీయోగము కుబేరునిచే నిర్మింపబడినది.

## చండభాస్కర రసమ్.

శ్లో॥ హరబీజామృత బలిం ప్రత్యేకం నిష్క సంయుతమ్
టంకణం దశనిష్కంచ జేపాలం వింశతిస్తథా॥ 18.
శుద్ధం ఖల్వతలే క్షిప్య నిర్గుండీ రసమర్దితమ్
ముద్గ ప్రమాణాం గుటికాం గుడేన సహ భక్షయేత్॥ 19.
పాండు శోఫోదరావర్త గుల్మ ప్లీహ గుదకృమీన్
అజీర్ణమామశూలంచ దీపనం పాచనం పరమ్॥ 20.

శ్లో॥ పురాణజ్వర మేహంచ మూత్ర కృచ్ఛ్రాశ్మరీ వ్రణాన్
సర్వవ్యాధి హరం శీఘ్రం రసోయం చండభాస్కరః॥ 21.

తా :— శుద్ధరసము, శుద్ధవసనాభి మఱియు శుద్ధగంధకము, అనునవి ప్రత్యేక మొక భాగము పేల్చిన వెలిగారము పదిభాగములు, శుద్ధనేపాళములు 20 భాగములు వీనినన్నిటిని కల్వములోవేసి వావిలాకు రసముతో మర్దించి పెసలవలె మాత్రలు చేయవలయును. ఈ మాత్రలను బెల్లముతో నుపయోగించిన, పాండు, శోఫ, ఉదర, ఉదావర్త, గుల్మ ప్లీహ, గుదకృమి, అజీర్ణరోగములను మఱియు ఆమశూలరోగములను హరించును. ఇది అత్యంత దీపనపాచనౌషధము. ఇదిగాక పురాణజ్వర, మేహ, మూత్రకృచ్ఛ్ర, అశ్మరీ, వ్రణరోగములను మఱియు సర్వవ్యాధులను శీఘ్రముగా హరించును.

## లఘుమాలినీ వసంత గుటికా.

శ్లో॥ ఏకాంశో మరిచాదుభౌ గరలతో హైయంగవీనం సమమ్
పశ్చాన్నింబురసేన మర్దన విధిర్యావద్ధృతం గచ్ఛతి
పథ్యం దుగ్ధయుతం కణా మధుయుతో వల్లప్రమాణేభవేత్
ప్రాచీన జ్వరహా తథా విషమహా ధాతుస్థిత ధ్వంసనః॥ 22.
రక్తాతి సృతిపాయుజ ప్రదరహా నేత్రామయ ధ్వంసినో
రోగానీక గళగ్రహం విజయతే శ్రీమాలినీ ప్రాణయమ్
వైద్యానాం మతిశాలినాం బహుతరం శ్రీదో వసంతాభిధః॥ 23.

తా :— మిరియాలు ఒకభాగము, గోమూత్రముతో శుద్ధిచేయబడిన వసనాభి రెండుభాగములు మఱియు ఆవువెన్న రెండుభాగములు, వీనిని బాగుగా నూరి పిమ్మట నిమ్మపళ్ళ రసముతో మర్దించి గుంజ ప్రమాణముగ మాత్రలుచేసి, తేనె, మఱియు పిప్పలి చూర్ణముతో సేవించవలయును. దీని వలన ప్రాచీన జ్వరములు విషమజ్వరములు, ధాతుగతజ్వరములు, రక్తాతిసారములు, మూలవ్యాధులు, మఱియు ప్రదర నేత్ర, కాలజ రోగములును హరించును. వీనికి పథ్యముపాలు, అన్నము. ఈ మందు బుద్ధిశాలియగు వైద్యునికి సంపత్తిని మఱియు కీర్తిని దెచ్చును.

## చంద్రప్రభా వటీ.

శ్లో॥ చంద్రప్రభా వచా ముస్తం భూనింబామృత దారుకమ్
హరిద్రాతివిషా దార్వీ పిప్పలీమూల చిత్రకా॥ 24.
ధాన్యకం త్రిఫలా చవ్యం విడంగం గజపిప్పలీ
వ్యోషం మాక్షిక ధాతుశ్చ ద్వౌక్షారౌ లవణత్రయమ్॥ 25.

శ్లో॥ ఏతాని శాణమాత్రాణి ప్రత్యేకం కారయేద్బుధః
త్రివృద్దంతీ పత్రకంచ త్వగేలా వంశరోచనా॥ 26.
ప్రత్యేకం కర్షమాత్రాణి కుర్యాదేతాని బుద్ధిమాన్
ద్వికర్షం హతలోహస్యా చ్చతుష్కర్షా సితాభవేత్॥ 27.
శిలాజిత్వష్ట కర్షంస్యాదష్టౌ కర్షాశ్చ గుగ్గులోః
ఏభిరేకత్ర సంక్షుణ్ణైః కర్తవ్యా గుటికా శుభా॥ 28.

చంద్రప్రభేతి విఖ్యాతా సర్వరోగ ప్రణాశినీ
ప్రమేహాన్ వింశతిం కృచ్ఛ్రం మూత్రాఘాతం తథాశ్మరీమ్॥ 29.
విబంధానాహ శూలాని మేహన గ్రంధి మర్బుదమ్
అండవృద్ధిం తథాపాండుం కామలాంచ హాలీమకమ్॥ 30.
అంత్రవృద్ధిం కటీశూలం శ్వాసం కాసం విచర్చికామ్
కుష్ఠాన్యర్శాంసి కండూంచ ప్లీహోదర భగందరమ్॥ 31.
దంతరోగం నేత్రరోగం స్త్రీణామార్తవజాం రుజమ్
పుంసాం శుక్రగతాన్ దోషాన్ మందాగ్నిమరుచిం తథా
వాయుం పిత్తం కఫం హన్యాద్బల్యా వృష్యా రసాయనీ
చంద్రప్రభాయాం కర్షస్తు చతుః శాణోవిధీయతే॥ 32.

తా:— బావంచాలు, వస, భద్రముస్తలు, భూనింబ (నేలవేము) తిప్పతీగె, దేవదారు, పసుపు, అతివస, మానిపసుపు, మోడి, చిత్రమూలము, ధనియాలు, కరక్కాయ బెరడు, ఉసిరికవరుగు, తానికాయ బెరడు, చవ్యము, వాయువిడంగములు, గజపిప్పళ్లు, త్రికటుకములు, స్వర్ణమాక్షికభస్మ, యవక్షారము, సర్జాక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము. ఇవి ప్రత్యేకము అర్థతులము, తెగడ, దంతీమూలము, ఆకుపత్రి, దాక్షిణిచెక్క, ఏలకులు, వంశలోచనము అనునవి ప్రత్యేక మొక తులము. లోహభస్మ రెండు తులములు, శర్కర 4 తులములు, గోమూత్ర శిలాజిత్తు 8 తులములు, శుద్ధ మహిసాక్షి గుగ్గులు 8 తులములు వీని నన్నిటిని గలిపి నూరి శనగలవలె మాత్రలు చేయవలయును. దీనితో వింశతి మేహములు, మూత్రకృచ్ఛ్ర, మూత్రాఘాత, అశ్మరి, మలబద్ధ, అనాహ, శూల, మేహగ్రంధి, అర్బుద, అండవృద్ధి, పాండు, కామలా, హాలీమక, అంత్రవృద్ధి, కటిశూల, శ్వాస, కాస, విచర్చికా, కుష్ఠ, అర్శ, కండూ, ప్లీహ, ఉదర, భగందర, దంతరోగ, నేత్రరోగ, ఆర్తవరోగ, మందాగ్ని, అరుచి, వాయు, పిత్త, కఫరోగములును మఱియు శుక్రగత రోగములన్నియును హరించును. ఇది సర్వరోగ వినాశకమైన చంద్రప్రభావటకములని ఖ్యాతికెక్కిన ఔషధము. ఇది వృష్యము, రసాయనము మఱియుశక్తివర్ధకము. (ఈ చంద్రప్రభారసాయన యోగమందు కర్షమనగా నాలుగు శాణములని తెలియనగును.

## కాంకాయన గుటికా.

శ్లో॥ యవానీం జీరకం ధాన్యం మరిచం గిరికర్ణికా॥ 33.
అజమోదోపకుంచీచ చతుః శాణాః పృథక్ పృథక్
హింగు షట్ శాణికం కార్యం క్షారౌ లవణపంచకమ్॥ 34.
త్రివృచ్చాష్టమితైః శాణైః ప్రత్యేకం కల్పయేత్సుధీః
దంతీ శఠీ పౌష్కరంచ విడంగం దాడిమం శివా॥ 35.
చిత్రోమ్లవేతసః శుంఠీ శాణైః షోడశభిః పృథక్
బీజపూర రసేనైషాం గుటికాం కారయేద్బుధః॥ 36.
ఘృతేన పయసా మద్యైరమ్లైరుష్ణోదకేనవా
పిబేత్ కాంకాయన ప్రోక్తాం గుటికాం గుల్మనాశినీమ్॥ 37.
మద్యేన వాతికం గుల్మం గోక్షీరేణచ పైత్తికమ్
మూత్రేణ కఫగుల్మంచ దశమూలైస్త్రిదోషజమ్॥ 38.
ఉష్ట్రీదుగ్ధేన నారీణాం రక్తగుల్మం నివారయేత్
హృద్రోగం గ్రహణీం శూలం కృమీనర్శాంసి నాశయేత్॥ 39.

తా:—ఖురాసానిఓమ, జీలకర్ర, ధనియాలు, మిరియాలు, విష్ణుక్రాంతము, అజామోద, ఓమ, ఏలకులు, ఇవి ప్రత్యేకము 2 తులములు, వేయించిన యింగువ $1\frac{1}{2}$ తులము సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు, తెగడ, ఇవి ప్రత్యేకము 2 తులములు, దంతీమూలము, కచోరములు, పుష్కరమూలము, వాయువిడంగములు, దానిమ్మచెక్క, కరక్కాయ, చిత్రమూలము, అమ్లవేతసము, శుంఠి, అనునవి ప్రత్యేకము 4 తులములు, వీనిని మాదీఫలరసముతో నూరి యుచిత ప్రమాణముగ మాత్రలు చేయవలయును. వీనిని నెయ్యి, పాలు, లేక మద్యములతో గాని లేక శుక్తము లేక వేడినీళ్ళతో గాని సేవించిన యెడల గుల్మలు హరించును. మఱియు మద్యముతో సేవించిన వాతగుల్మలును ఆవుపాలతో తీసికొనిన పిత్తగుల్మలును, గోమూత్రముతో పుచ్చుకొనిన కఫగుల్మలును, దశమూలకషాయముతో సేవించిన త్రిదోషజనిత గుల్మలును, ఒంటెపాలతో గ్రహించిన స్త్రీల రక్తగుల్మలును నివారించును. ఇదిగాక దీనిచేత హృద్రోగ, గ్రహణి, శూల, కృమి మఱియు అర్శోవ్యాధులు కూడ నశించును.

## సంజీవనీ గుటికా.

శ్లో॥ విడంగం నాగరం కృష్ణా పథ్యామల బిభీతకా
వచా గుడూచీ భల్లాతం సవిషంచాత్ర యోజయేత్॥ 40.

శ్లో॥ ఏతాని సమభాగాని గోమూత్రేణైవ పేషయేత్
గుంజాభా వటికా కార్యా దద్యాదార్ద్రకజై రసైః॥ 41.
ఏకామజీర్ణ గుల్మేషు ద్వేవిషూచ్యాంచ దాపయేత్
తిస్రశ్చ సర్పదష్టేచ చతుశ్చ సన్నిపాతకే
వటీ సంజీవనీ నామ్నా సంజీవయతి మానవమ్॥ 42.

తా:— వాయువిడంగములు, శుంఠి, పిప్పళ్లు, కరక్కాయబెరడు, ఉసిరికవరుగు, తానికాయబెరడు, వస, తిప్పతీగె, శుద్ధ జీడిగింజలు, శుద్ధ వసనాభి. ఇవి సమభాగములు, వీనిని గోమూత్రముతో మర్దించి గుంజాప్రమాణముగ మాత్రలు కట్టవలయును. దీనిలోనుండి ఒక మాత్రను అల్లపురసముతో సేవించిన అజీర్ణము, మఱియు గుల్మరోగములు హరించును. రెండు మాత్రలు సేవించిన విషూచీవ్యాధి శమించును. మూడు మాత్రలుపయోగించిన సర్పదష్టము నివృత్తించును. నాల్గుమాత్రలు తీసుకొనిన సన్నిపాతములు హరించును. ఈ సంజీవనీ గుటికలు మానవులను సంజీవివంటిది.

సూచన:— దీని యుపయోగమును గురించి స్వర్గీయ పండిత గోవర్ధనశర్మగారు చాంగాణి నాగపూర్, ఈ క్రింది విధముగ నొక పత్రికలో వ్రాసినారు. విషూచీ వ్యాధి యందు (కలరా) వీనిలో ఒక మాత్రను సత్తుతీసి వేసిన అల్లపురసములో రెండు రెట్లు ఖండ శర్కరను గలిపి ఇచ్చిన కొంచెముసేపులోనే వాంతులు మఱియు భేదులు నిలిచిపోవును. నాలుగు గంటల తరువాత అదే అనుపానముతో ఇంకొక మాత్రను గలిపి ఇచ్చిన మూత్రము ధారాళముగా వచ్చును. రోగికి ఆకలి పుట్టి తినుటకు ఆహారమును గోరును. అప్పుడు కేవలము ముద్గయూషము (పెసరపప్పు నుడికించిన కట్టు) మాత్ర మివ్వవలయును. మరి యేదియు నివ్వరాదు.

## పథ్యాది గుటికా.

శ్లో॥ పథ్యా పునర్నవ మహౌషధ భృంగరాజ
శర్కుందు పత్రి తిల దీప్య బలానలైశ్చ
సర్వైః సమం సకలభావిత కిట్టచూర్ణం
తక్రే పిబేదఖిల పాండు గదే రహస్యమ్॥ 43.

తా:— కరక్కాయ, తెల్లగలిజేరు, శుంఠి, భృంగరాజము, రేగాకులు, నువ్వులు, ఓమము, ముత్తవపులగముపేరు, చిత్రమూలము. అనునవి సమభాగములు. వీనికి సమము మండూరభస్మము, ఈ మొత్తమును నీటితోనూరి మాత్రలు చేయవలయును. దీనిని చల్లతో సేవించిన సమస్త పాండువ్యాధులును హరించును. ఇది చాలా రహస్యమైన యోగము.

## విరేచన గుటికా.

శ్లో॥ త్రికటు త్రిఫలా మాంసీ కారవీ కటుకా త్రివృత్
విడంగంచ సమాంశాని జేపాలం సకలాంశకమ్॥ 44.

త్రిఫలా క్వాథ సంపిష్టం గుడేనోష్ణోదకేనవా
ఆర్ద్రికస్య రసేనాపి పేయం సమ్యగ్విరేచయేత్॥ 45.

తా:— త్రికటుకములు, త్రిఫలములు, జటామాంసి, నల్లజీలకర్ర, కటుకరోహిణి, తేగడ, వాయువిడంగములు. ఇవి సమభాగములు. వీనికి సమము శుద్ధ నేపాళములు, వీని నన్నిటిని త్రిఫలా కషాయముతో మర్దించి మాత్రలు కట్టవలయును. ఈ మాత్రలను బెల్లముతోగాని వేడినీళ్లతోగాని లేక అల్లపు రసముతోగాని సేవించిన బాగుగా విరేచనములగును.

## దురాలభాది గుటికా.

శ్లో॥ దురాలభాచ ముస్తాచ సాజమోదా హరీతకీ
పిప్పలీ పిప్పలీమూలం చిత్రకం హస్తిపిప్పలీ॥ 46.
ఏతేషాం కార్షికాన్ భాగాన్ త్రివృతాచ సమం ధృతాన్
శృంగబేర పలంచైవ వింశద్గుడపలం తథా॥ 47.
అక్షమాత్రేణ గుటికాం భక్షయేత్ ప్రాతరుద్ధితః
పార్శ్వ శూలే ఘ్యుదావర్తే దుర్నామే సుహితం పరమ్॥ 48.

తా:— దూలగొండివేరు, భద్రముస్తలు, ఓమ, కరక్కాయ, పిప్పళ్లు, మోడి, చిత్రమూలము, గజపిప్పళ్లు. ఇవి ప్రత్యేక మొకతులము, తేగడ 8 తులములు, శుంఠి, 3 తులములు, బెల్లము 20 పలములు, మొదట మూలికలను మెత్తగా చూర్ణించి పిదప బెల్లమును గలిపి నూరి అక్షప్రమాణముగ గుటికలు చేయవలయును. వీనిని దినమునకు ఒక్కొక్క మాత్రచొప్పున ఉదయమున సేవించిన పార్శ్వశూల, ఉదావర్తము మఱియు అర్శోరోగములు శమించును.

## బిల్వాది వటీ.

శ్లో॥ బిల్వస్యమూలం సురసస్యపుష్పం
ఫలంకరంజస్య నతం సురాహ్వామ్
ఫలత్రికం వ్యోష నిశాద్వయంచ
వస్తస్య మూత్రేణ సుసూక్ష్మ పిష్టమ్॥ 49.

శ్లో॥ భుజంగ లూతోందురవృశ్చికాద్యై
ర్విషూచికాజీర్ణ గరజ్వరైశ్చ
ఆర్తా న్నరాన్ భూత విమార్దితాంశ్చ
స్వస్థీ కరోత్యంజన పాన నస్యైః॥ 50.

తా:— మారేడువేరు, తులసిపుష్పములు, కానుగగింజలు, గ్రంధితగరము, దేవదారు, త్రిఫలములు, త్రికటుకములు, పసుపు, మానిపసుపు. ఇవి సమభాగములు. వీనిని మేకమూత్రముతో నూరి మాత్రలు చేయవలయును. దీనిచే పామువిషము, మూషికవిషము, తేలువిషము, 16 విధముల సాలెపురుగులు మొదలైనవానివిషములను హరించును. మఱియు విషూచీ, అజీర్ణము, గరవిషము, జ్వరము, భూతబాధలు, అంజన, పాన, నశ్యకర్మలచే నివృత్తించి స్వాస్థ్యము కలుగును.

ఖదిరాది వటకములు.

శ్లో॥ ద్వేతులే ఖదిరాత్ సారాదరిమేద త్వచ స్తులామ్
ప్రక్షాళ్య జర్జరీకృత్య చతుర్ద్రోణే జలేపచేత్॥ 51.
పాదశిష్టం కషాయేతు సంక్షాళ్య విపచేచ్ఛనైః
తతస్తస్మిన్ ఘనీ భూతే చూర్ణం కృత్వాక్షు భాగికమ్॥ 52.
చందనం పద్మకోశీరం మంజిష్ఠా ధాతకీ ఘనమ్
ప్రపౌండరీకం యష్ట్యాహ్వాం వచైలా పద్మకేసరమ్॥ 53.
లాక్షా రసాంజనం మాంసీ త్రిఫలా రోధ్ర వాలకమ్
రజనీ ద్వయ శైలేయం సమంగా కట్ఫలం వటమ్॥ 54.
యవాసాగురు పత్తంగ గైరికాంజన మావపేత్
లవంగ జాతీ తక్కోలం జాతీకోశాన్ పలోన్మితాన్॥ 55.
కర్పూరం కుడవంచాపి పునః శీతేవతారితే
తతశ్చ గుటికాం కుర్యాత్ శుష్కాంచాస్యేన ధారయేత్॥ 56.
తైలం చానేన కల్కేన కషాయేణచ సాధయేత్
దంతాస్య గళరోగేషు సర్వేష్వేతత్ పరాయణమ్॥ 57.

తా:— చంద్రచేవ 800 తులములు, మురికితుమ్మ 400 తులములు. వీనిని బాగుగా దంచి నాలుగు ద్రోణముల నీటిలో వేసి చతుర్థాంశ కషాయముగ కాచి వడియగట్టి పిమ్మట మంచిగంధము, పద్మకము, వట్టివేళ్లు, మంజిష్ఠ, ఆరెప్పువ్వు, భద్రముస్తలు, తెల్లపద్మము, అతిమధురము, వస, ఏలకులు, పద్మకేసరములు, లక్క, రసాంజనము, జటా

మాంసి, త్రిఫలములు, లొద్దుగచెక్క, కురువేరు, పసుపు, మానిపసుపు, రాతిపువ్వు, అత్తపత్తి, కాయఫలముచెక్క, మఱ్ఱిచెక్క, దూలగొండివేరు, అగరు, చలవ మిరియాలు, గైరికము, పత్తంగము (కుచందనము లేక బొక్కుపుచెట్టు చెక్క) సుర్మారాయి, జాజిమల్లి, లవంగాలు, జాపత్రి, తక్కోలములు. అనునవి ప్రత్యేక మొకతులము, జాపత్రి 4 తులములు. వీనిని గ్రహించి మెత్తగా చూర్ణించి పై కషాయ మందు వేసి లేహ్యమువలె వండి పిదప కర్పూరము 16 తులములుకూడ జేర్చి మాత్రలు చేయవలయును. దీనిని నోటిలో వేసికొని ఆ రసమును మ్రింగిన ముఖరోగములు, దంతరోగములు మఱియు గళరోగములును శమించును. ఇదిగాక పై కషాయములో పై వస్తువుల కల్కమును వేసి అందు తగుమాత్రము నువ్వులనూనె చేర్చి సిద్ధముచేసిన తైలము పైగుణములను గలుగజేయును.

## సేతుబంధన మాత్రలు.

జాజికాయ, అతివస, నూరేడుకాయ గుజ్జు, ఓమ, మామిడిజీడి, దానిమ్మ చెక్క, జీలకఱ్ఱ, లవంగాలు, పిప్పళ్లు, నేరేడుగింజలు. ఇవి సమభాగములు. వీనిని మెత్తగా చూర్ణించి వెల్లుల్లిరసముతో నూరి రేగు గింజంత మాత్రలు కట్టవలయును. దీనిని పెరుగుమీది నీరు లేక మజ్జిగ, లేక తేనెతో గలిపి సేవించిన అతిసారములు మఱియు ఉదరశూలలును హరించును.

## గోరోచనాది మాత్రలు.

గోరోజనము, దుప్పికొమ్ము, రుద్రాక్షు, మంచిగంధము, వస, కొబ్బరి కురిడి, (చెన్నంగి, కొబ్బరికురిడి), వట్టివేళ్ళు, భద్రముస్తలు, పునుగు, ఎర్రిలు(భూనాగము) మేకకొమ్ము, ఏనుగు దంతము, ఖడ్గమృగముకొమ్ము, నల్లజింకకొమ్ము, చిరాయిత (కిరాతతిక్తము), స్వర్ణభస్మ, ప్రవాళభస్మ, సుర్మారాయి, పచ్చకర్పూరము, జీలకఱ్ఱ, తుమ్మిపువ్వు, పత్తిగింజలు, చిన్నఉత్తరేణివేరు, వెల్లుల్లి, మురికి తుమ్మ, శుంఠి, మిరి యాలు, పిప్పళ్ళు, ఉలిమిరిచెక్క, ఈశ్వరివేరు, చిరుబొద్ది, శంఖపుష్పి, నీలివేరు, త్రిఫలములు, జాజికాయ, పేల్చినవెలిగారము, మాచికాయ, సాయికూరగింజలు (బద్ద సోపు) చంద్రనూరగింజలు, భద్రముస్తలు, నల్లజీలకఱ్ఱ, అంబరు, ఇవి సమభాగములు. వీని నన్నిటిని అల్లపురసముతో నూరి గుంజప్రమాణముగ మాత్రలు చేయవలయును. వీనిని చనుపాలతో రేపుమాపు ఉపయోగించిన సర్వవిధ సన్నిపాత జ్వరములు హరిం చును. ఇంద్రియ జ్ఞానము అనగా కర్ణేంద్రియ, నేత్రేంద్రియాదివిజ్ఞానము మఱియు స్మృతియు లేని వారికి యీ మందువల్ల తిరిగి పై జ్ఞానములు ప్రాప్తించును. భూతగ్రహాద్యుపద్రవ ములు కూడ తొలగును.

## ధాన్వంతరి మాత్రలు (1)

శుంఠి, కరక్కాయ బెరడు, జీలకఱ్ఱ, కిరాతతిక్తము (చిరాయితా), ఏలకులు చంద్రనూరగింజలు, తక్కోలములు, వాకుడు, చలవమిరియాలు, రుద్రాక్షు, దేవదారు,

పచ్చకర్పూరము, బాలింతబోలు, పునుగు. వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణము చేసి, జీలకర్ర కషాయముతోను మఱియు గులాబీ నీటితోను నూరి మాత్రలు కట్టవలయును. బాగుగా ఆరిన తరువాత ఒక సీసాలో భద్రపరచవలయును. వీనిని అల్లపు రసము లేక అరటిబెండు రసముతో లేక జీలకర్ర కషాయముతో సేవించిన శ్వాస, కాస, క్షయ, హిక్క, ఛర్ది, మఱియు కఫరోగములును శమించును. ఈ ధాన్వంతరిమాత్రలు వాతప్రకోపమునుపశమింప జేయుటలో చాలాఖ్యాతి కెక్కినది.

## ధాన్వంతరీ మాత్రిలు (2)

శుంఠి, మిరియాలు, పిప్పళ్లు, కరక్కాయబెరడు, తాడికాయ బెరడు, ఉసిరిక వరుగు, చందనూరగింజలు (ఆదిత్యాలు), నేలవేము, ఏలకులు, లవంగాలు, జాజికాయ జాపత్రి, తక్కోలములు, చలవమిరియాలు, దేవదారు, పెన్నేరుగడ్డ, రుద్రాక్షు, జింక కొమ్ము భస్మ, బాలింతబోలు, పునుగు, పచ్చకర్పూరము, వాకుడు, వీనిని సమభాగములుగా గ్రహించి, చూర్ణముచేసి మొదట జీలకర్ర కషాయముతోను పిదప గులాబీ అర్కముతోను మర్దించి మాత్రలు చేసి రోగమున కుచితానుపానముతో సేవించిన సకల రోగములు హరించును.

## పొంగారాది వటకములు.

చిత్రిమూలము, వస, శుంఠి, మిరియాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, పిప్పళ్ళు, ఏలకులు, సన్నరాష్ట్రము, జాజికాయ, కాంతభస్మ, పేల్చినవెలిగారము, సైంధవలవణము, సర్జాక్షారము, యవక్షారము, ఇంగువ, బిడాలవణము, ఏటిపుచ్చ, (ఇంద్రవల్లి) మునగచెక్క, వావిలివేరు, వెల్లుల్లి, నల్లమందు, ఇవి సమభాగములు, గచ్చకాయ పలుకులు రెండు భాగములు. వీనినన్నిటిని అల్లపురసముతో మర్దించి గుంజప్రమాణముగ మాత్రిలు చేసి రోగమునకు తగిన అనుపానముతో నిచ్చిన శూల, శూలవాయువు, వాత క్షోభ, గుల్మ, మహోదరరోగములును మఱియు వాతరోగములును హరించును.

## కస్తూర్యాది మాత్రిలు.

కస్తూరి, కిరాతతిక్తము (చిరాయిత), సన్నరాష్ట్రము, పునుగు, శుంఠి, కాంత భస్మ, పచ్చకర్పూరము, జాజికాయ, సర్జాక్షారము, యవక్షారము, కరక్కాయ బెరడు, తానికాయబెరడు, ఉసిరిక వరుగు, ఏలకులు, లవంగ పట్ట. ఆకుపత్రి, రేవల్ చిన్ని, చలవమిరియాలు, శుంఠి, మిరియాలు, పిప్పళ్ళు, చిరుబొద్ది, జాపత్రి. మంచిగంధము వస, జీలకర్ర, నల్లజీలకర్ర, ఓమ, ఖురాసానిఓమ, అక్కలకర్ర, సాయికూరగింజలు (బద్ధసోపు), అతిమధురము, లవంగాలు, గైరికము, శుద్ధపాదరసము, పేల్చిన వెలిగారము, సుర్మారాయి, వసనాభి, మనశ్శిలా, చందనూరగింజలు, ఇంగిలీకము, వీనిని సమభాగములుగా గ్రహించి గులాబీ అర్కముతోను, గుంటగలగర రసముతోను బాగుగా మర్దించి గుంజప్రమాణముగ మాత్రలు కట్టవలయును. వీనిని జీలకర్ర కషాయముతో సేవించిన వాయుక్షోభ మఱియు హిక్కా రోగములును శమించును.

## బృహద్యోగరాజ గుగ్గులు.

శుంఠి, పిప్పళ్లు, మోడి, అడవి మిరియాలవేరు, చిత్రమూలము, ఇంగువ, ఓమ, కరక్కాయ బెరడు, జీలకర్ర, నల్లజీలకర్ర, రేణుకలు, కొడిశపాల గింజలు, చిరుబొద్ది, వాయువిడంగములు, గజపిప్పళ్లు, కటుకరోహిణి, అతివస, గంటుభారంగి, వస, చాగవేరు. ఇవి ప్రత్యేకమొక తులము త్రిఫలచూర్ణము 10 తులములు. వీనినన్నిటిని వస్త్రగాళిత చూర్ణముచేసి, పిదప శుద్ధ మహిసాక్షి, గుగ్గులు 60 తులములు, వంగ భస్మ, రజితభస్మ, నాగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, మండూరభస్మ మఱియు రససింధూరము, అనునవి ప్రత్యేకము 4 తులములు చొప్పున పైవానిలో జేర్చి ఒక నెయ్యితో మాగిన కుండలో వేసి బెల్లపు పాకము వచ్చు వరకు కాచవలయును. తరువాత దానిని దించి కందిగింజలంత మాత్రలు కట్టవలయును. ఈ బృహద్యోగరాజ గుగ్గులు త్రిదోష ఘ్నము, మఱియు రసాయనము. దీనిని విశేష పథ్యాహారములు లేకనే సేవించవచ్చును. ఈ మందుచేత సకల వాతరోగములు, అర్శ, గ్రహణి, ప్రమేహ, వాతరక్త, నాభిశూల, భగందర, ఉదావర్త, క్షయ, గుల్మ, అపస్మార, ఉరఃక్షత, అగ్నిమాంద్య, శ్వాస, కాస, అరుచి, మొదలగు రోగములన్నియు హరించును. పురుషులు దీనిని సేవించిన సమస్త శుక్ల దోషములు పోవును. స్త్రీలు సేవించిన ఆర్తవదోషము పోయి సంతానవతులగుదురు. ఈ మందును మహా రాస్నాది కషాయముతో సేవించిన సమస్త వాతరోగములును, కాకోల్యాది కషాయముతో సేవించిన సమస్త పిత్తరోగములును, ఆరగ్వధాది కషాయముతో నుపయోగించిన కఫరోగములును, దార్వ్యాదికషాయముతో తీసుకొనిన మేహరోగములును, గోమూత్రముతో పుచ్చుకొనిన పాండురోగములును, తేనెతో నాకిన మేదోవృద్ధియును, వేపచెక్క కషాయములో గలిపి తీసికొనిన కుష్ఠములును, తిప్పతీగెతో వాతరక్తమును, పిప్పలి కషాయముతో శోఫలును, త్రిఫల కషాయముతో నేత్రరోగములును మఱియు పునర్నవాది కషాయముతో సేవించిన ఉదర రోగములును శమించి ఆరోగ్యసుఖము లభించును.

## ముక్కాది మాత్రలు.

కరక్కాయ బెరడు, ఉసిరిక వరుగు, తానికాయ బెరడు, మిరియాలు, పిప్పళ్ళు, శుంఠి, జీలకర్ర, నల్లజీలకర్ర, వస, భూనింబ (చిరాయితా), పచ్చకర్పూరము, జాజికాయ, సైంధవ లవణము, రక్తబోళము, లవంగాలు, వెల్లుల్లి, చలవమిరియాలు, తక్కోలాలు, చెంగల్వ కోష్ఠు, లవంగచెక్క, వేయించిన యింగువ, ఓమ, వీటిని సమభాగములుగ గ్రహించి చూర్ణించి వావిలాకురసముతో మర్దించి మాత్రలు కట్టవలయును. వీనిని తల్లిపాలుత్రాగు పసిపిల్లలకు చనుపాలతోను, అన్నమును భుజించు పిల్లలకు వేడినీళ్ళతో నుపయోగించిన సమస్తజ్వరములు మఱియు సన్నిపాతములును శమించును.

## వస్త్యామయాంతక మాత్రలు.

తృణపంచమూలములు, హ్రస్వపంచమూలములు, జీవనపంచమూలములు, మధ్యమ పంచమూలములు, కూష్మాండము, దోసకాయ, కొండపిండి, సన్నమల్లె పువ్వులు

నేలఉసిరిక, రాతిపువ్వు, చిల్లగింజలు, శుంఠి, ఏలకులు, అతిమధురము, పొన్నగంటి, పిప్పళ్ళు, ధనియాలు, వావిలివేరు, ప్రిసారణి, ద్రాక్ష, బోడతరము, మంచిగంధము, పత్తిగింజలలోని పలుకులు, వట్టివేళ్ళు, కురువేరు, దూలగొండి గింజలలోని పలుకులు, మారేడుగుజ్జు, లొద్దుగచెక్క, రేగుగింజలు, ఆముదపు గింజలలోని పలుకులు, పెన్నేరు గడ్డ, ఉలవలు, మానిపసుపు, పసుపు, యవలు, నీటుగొబ్బిగింజలు, వెంపలి, నల్లముళ్ళ గోరింటవేళ్ళు, దుష్టపువేరు, అరటిదుంప, పత్తివేరు, శిలాజిత్తు, గజపిప్పళ్ళు, నువ్వులు సహాస్రివేధి, చిన్న ఉత్తరేణిగింజలు, సుగంధపాలవేళ్ళు, పద్మకేసరములు, నీరుల్లి, చిట్టీత లేక పేరీత, (పాలసా), మంజిష్ఠ, దేవదారు, జీలకర్ర, కర్కాటకశృంగి, తెల్ల కలువగడ్డ, గైరికము, పద్మకము, అడ్డసరమువేరు, తిప్పసత్తు, పాలగుండ, భద్రముస్తల సత్తు, నేలతాడిగడ్డలసత్తు, ఉసిరికాయల సత్తు,పల్లేరు, వీనినిసమభాగములుగా గ్రహించి మొత్తముగా చూర్ణముచేసి పిదప కల్వములో వేసి కొబ్బరి బొండము నీటితోను, శతావరి రసముతోను, చెఱుకు రసముతోను, కూష్మాండ రసముతోను, దోసకాయరసముతోను, గుంటగలగర రసముతోను, తాటిపండు రసముతోను, త్రిఫల, గచ్చకాయ మఱియు ఉలవ కషాయములతోను, ఒక్కొక్క దానితో మూడేసి గంటల చొప్పున మర్దించి మాత్రలు కట్టవలయును. ఈ యౌషధము నుచితమగు కషాయముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, మూత్రదాహము, రక్తమూత్రము, అస్థిస్రావము, రక్త స్రావము, శ్వేతప్రదరము, మఱియు సోమరోగములును హరించును. ఉసిరిక కషాయముతో బుచ్చుకొనిన ప్రమేహములు హరించును. ఆవుపాలతో నుపయోగించిన శుక్రవృద్ధి కలుగును.

## మర్మగుటికలు (1).

ఉసిరికాయలసత్తు, శతావరిసత్తు, జీవంతిగడ్డలసత్తు, భద్రముస్తల సత్తు, నేల తాడిగడ్డల సత్వము, మంచిగంధము, (పాలగుండ) కాకిదొండగడ్డ సత్వము, రక్తచందనము, యష్టిమధుకము. ఇవి ప్రత్యేకము 4 భాగములు, రాతినార, శిలాజిత్తు, ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క భాగము. వీని నన్నిటిని గలిపి చూర్ణము చేయవలయును. పిదప మేడి, రావి, మఱ్ఱి, జువ్వి, చెక్కల కషాయము, గరిక, కొండపిండి, ప్రిసారణి, మఱియు తృణపంచమూలములు, ఇవి ఒక్కొక్కటి 4 పలముల చొప్పున గ్రహించి అష్ట మాంశముగ సిద్ధముచేసిన కషాయము, అడవి మినుములు, అడవి పెసర, ఇవి ఒక్కొక్క ప్రస్థము చొప్పున తీసికొని అష్టమాంశముగ సిద్ధము చేసిన కషాయము, కురువేరు, వట్టి వేరు, పల్లేరు, చిల్లగింజలు, ఇవి సమభాగములుగ గ్రహించి నాల్గవభాగముగ కాచిన కషాయము, పై కషాయములన్నియు జేర్చి, అష్టమాంశావశేషముగ తిరిగికాచి పైచూర్ణములు వేసి బాగుగా గలిపి ఉసిరికాయలవలె మాత్రలు చేయవలయును. దీనిలో నొక మాత్రను వెన్నతో గలిపి మర్మస్థానములపై రాచిన పక్షమున వానిమీద జనించిన వ్రణములు, వాపులు, మఱియు నొప్పులును పోవును. తలపై పట్టువేసినచో కండ్లకు వచ్చు ఎరుపువ్యాధి తగ్గును. దీనినే వేడినీటితో సేవించిన అస్థిస్రావము మూత్ర కృచ్ఛ్రము, సకల ఉష్ణ వికారములును మఱియు పిత్తవికారములును హరించును.

## మర్మగుటికలు 2.

నేలగుమ్మడు గడ్డల సత్వము, జీవంతిగడ్డల సత్వము, శతావరి సత్వము భద్రిముస్తల సత్త్వము, నేలతాడిగడ్డల సత్వము, సుగంధపాలవేళ్ళ సత్వము, ఉసిరికాయల సత్వము, నల్లసుగంధపాలసత్వము, తిప్పసత్తు, గరికెసత్వము. ఇవి ప్రత్యేకము 16 తులములు, అతిమధురము, మంచిగంధము, రక్తచందనము. ఇవి ప్రత్యేకము 4 తులములు, సహస్రవేధి, రాతినార, శిలాజిత్తు, నిర్విషము, గరుడపచ్చ, అనునవి ఒక్కొక్కటి 2 తులములు. వీనినన్నింటిని దంచి వస్త్రగాళిత చూర్ణమును చేయవలెను. ఈ చూర్ణమును కల్వములో వేసి, ప్రసారిణి, సముద్రఫేనము, చాగ, నాల్గు క్షీరివృక్షముల మొగ్గలు, చిల్లగింజలు, పల్లేరు, కురువేరు, వట్టివేళ్ళు, ఇవి ప్రత్యేకము 2 పలములు. వీనిని 12 ప్రస్థముల జలములో వేసి చతుర్థాంశముగ కషాయముకాచి వడియగట్టి పై కల్వములో వేసి బాగుగా మర్దనచేసి, పిదప పైనజెప్పిన క్షీరివృక్షముల చెక్కలు, లొద్దుగ చెక్క, చింతచెక్క, వేపచెక్క, మానిపసుపు, రాతిపువ్వు, అనునవి ఇవి ప్రత్యేకము 24 తులములు చొప్పున గ్రహించి, దంచి 16 ప్రస్థముల నీటిలో వేసి, నాల్గవభాగము మిగులునట్లు కషాయముకాచి, పై మందులో వేసి, బాగుగా నూరి, ఉసిరికాయలంత మాత్రలు చేయవలెను. వీనిని యథోచితానుపానముతో నుపయోగించిన సర్వమర్మవికారములు హరించును.

## శిరస్తోద గుటికలు.

ఫిరంగి సాంబ్రాణి 12 తులములు, రక్తబోళము 12 తులములు, రాతినార 12 తులములు, బాలింతబోలు 12 తులములు, సహస్రవేధి 12 తులములు. వీనినన్నింటిని గలిపి చూర్ణించి కలబంద స్వరసముతో బాగుగా మర్దించి మాత్రలు కట్టవలెను. వీనిని వాతాధిక్యములో నువ్వులనూనెతోను, పిత్తాధిక్యములో నెయ్యితోను, కఫాధిక్యములో కొబ్బరిపాలతోను అరగదీసి తలకు పట్టువేసిన సకల శిరశ్శూలలు హరించును.

## మానసమిత్ర వటకములు.

చిన్న ముత్తవ పులగమువేళ్ళు, పెద్దముత్తవ పులగము వేళ్ళు, మారేడు వేళ్ళు, ముయ్యాకుపొన్న, ప్రవాళభస్మ, శంఖపుష్పి, అడవిరాగుల వేరు, స్వర్ణభస్మ, పుష్కరమూలము, ఖడ్గమృగముకొమ్ము, వస, స్వర్ణమాక్షికము, మంచిగంధము, రక్తచందనము, ముక్తాభస్మ, లోహభస్మ, ఇప్పచెక్క, పిప్పళ్ళు, పచ్చకర్పూరము, దాసరి బుడుమసి (ముక్కాపీరవేరు), అడవిదోస, చెన్నంగి కొబ్బరి, వావిలి, తుంగముస్తలు, సన్నరాస్నము, రజితభస్మ, శిలాజిత్తు, మానిపసుపు, తామరకేసరములు, జీవకము, ఋషభకము, కాకోళీ, క్షీరకాకోళీ, ములక, వాకుడు, చిన్నబోడతరము, పెద్దబోడతరము, చిరాయితా (కిరాతతిక్త) త్రిఫలములు, తిప్పతీగె, సుగంధపాలవేళ్ళు, నల్లసుగంధపాలవేళ్ళు, జీవంతిగడ్డ, సోమలత, పాలసా, (చిట్టీత లేక పేరీత) పెన్నేరుగడ్డ, పసుపు, వట్టివేళ్ళు, ద్రాక్ష, అతిమధురము, అడవిఉలవలు, భృంగరాజమువేరు, నేలపరండెవేరు, కొండపిండి, దాక్షిణి

చెక్క, తులసియాకులు, కస్తూరి, కుంకుమపువ్వు, ఇవి సమభాగములు. వీనిని మెత్తగా చూర్ణించి కల్వములో వేసి బ్రాహ్మీరసము, గరికెరసము, మారేడాకు రసము, సోమలతాకురసము, శంఖపుష్పివేరు కషాయము, వసకషాయము, నల్లతుమ్మచెక్క కషాయము, బలామూలకషాయము, ఆవుపాలు, జీలకర్ర కషాయము, అనువాని కషాయములు మఱియు చనుపాలు, వీనితో వేరువేరుగా మర్దించి శనగలవలె మాత్రలు కట్టవలెను. ఈ వటకముల నుచితానుపానముతో సేవించిన ప్రజ్ఞ, మేధ, వాక్ శక్తులను వృద్ధిపరచి మనోదౌర్బల్యమును బోగొట్టును. ఇదిగాక ఉన్మాదము, విషూచి, అపస్మారము, మద, మూర్ఛ, సన్యాసము, భూతబాధ, విషసర్పముల కాటులను హరించును మఱియు నిది ఆయురారోగ్యముల నిచ్చుటకు విఖ్యాతమైన ఔషధము.

## మహా మంజిష్ఠాది వటకములు.

మంజిష్ఠ, కచోరములు, చెంగల్వకోష్ఠు, స్వర్ణగైరికము, సహస్రవేధి, పిప్పళ్లు, సన్నరాష్నము, కటుకరోహిణి, మంచిగంధము, రక్తచందనము, యష్టిమధుకము, ముత్తవపులగము వేరుకట్టె, భద్రముస్తలు, ఉసిరికవరుగులు, నల్లజీలకర్ర. వీనిని సమభాగములుగ గ్రహించి దంచి వస్త్రగాళిత చూర్ణముచేసి, కల్వములో వేసి కలబందరసముతో మూడు గంటలును, బ్రాహ్మీరసముతో మూడుగంటలును మఱియు ఆవుపాలతో మూడు గంటలును మర్ధించి గుటికాపాకము వచ్చుటకు ముందు ¼ తులము పచ్చకర్పూరము ¼ తులము కుంకుమపువ్వు వేసి బాగుగానూరి ఉసిరికాయలవలె మాత్రలు కట్టవలయును. దీనిలోనుండి ఒక మాత్రను గ్రహించి ఆవుపాలతో నూరి, నాలుగు గంటల కొకసారి తలకు పట్టువేయుచు ప్రతిసారి ఉసిరిక కషాయముతో కడిగివేయుచుండవలెను. దీనిచే ఉన్మాదములు, తలత్రిప్పుట మఱియు తదితర పైత్య వికారములును శాంతించును.

## గుటికా ప్రకరణము.

గుటికా యోగములలో రసగంధకములు చెప్పబడినయెడల, తొలుత వీనిని గలిపి బాగుగా నూరి (కజ్జలి చేసి) పిదప మిగిలిన వస్తువులను జేర్చి నూరవలెను. వస నాభి లేక యితర విష వస్తువులు చెప్పబడినప్పుడు టంకణక్షారమును వానితో గలిపిన వానివాని విషగుణములు హరించును.

భావన :—

వస్తువులను, వానికి భావనగురించి చెప్పబడిన రసములు లేక కషాయములతో మూడు గంటల కాలపరిమితివరకు నూరిన భావన యనబడును. గుటికలు చేయవలసినప్పుడు పై భావనలు మూడు సార్లు చేయవలయును.

రసము, గంధకము, హింగుళము, నాభి మఱియు భల్లాతకము మొదలగు విష వస్తువులను శాస్త్రమందు వానికి జెప్పబడిన శుద్ధులు చేసి యుపయోగించవలెను.

సహస్రయోగ ప్రకాశిక యందలి గుటికాయోగ ప్రకరణము సంపూర్ణం.

ఓం శ్రీ ధన్వంతరయే నమః

# సహస్రయోగ ప్రకాశిక

## 6. అథ అవలేహ ప్రకరణమ్.

---

### కంటకార్యాద్యవలేహః.

శ్లో॥ కంటకారీ తులాం నీర ద్రోణే పక్త్వా కషాయకమ్
పాదశేషం గృహీత్వాచ తస్మింశ్చూర్ణాని దాపయేత్॥ 1.
పృథక్ పలాని చైతాని గుడూచీ చవ్య చిత్రకాః
ముస్తాం కర్కటశృంగీచ త్ర్యూషణం 'ధన్వయాసకః॥ 2.
భార్గీ రాస్నా శఠీచైవ శర్కరాపలవింశతిః
ప్రత్యేకంచ పలాన్యష్టౌ ప్రదద్యాత్ ఘృత తైలయోః॥ 3.
పక్త్వా లేహత్వమానీయ శీతే మధు పలాష్టకమ్
చతుష్పలం తుగాక్షీర్యాః పిప్పలీనాం చతుష్పలమ్॥ 4.
క్షిప్త్వా నిదధ్యాత్ సుదృఢే మృణ్మయే భాజనే శుభే
లేహోఽయం హంతి హిక్కార్తి శ్వాస కాసా నశేషతః॥ 5.

తా:— వాకుడు నూరు పలములను గ్రహించి దంచి ఒక ద్రోణము జలములో వేసి చతుర్భాగావశిష్టముగ కషాయమును గాచి వడియగట్టి అందు తిప్పసత్తు, చవ్యము, చిత్రమూలము, భద్రముస్తలు, కర్కాటకశృంగీ, త్రికటుకములు, దురదగొండి, గంటుభారంగి, సన్నరాస్నము, కచోరములు అనునవి ప్రత్యేక మొక పలముచొప్పున గ్రహించి, దంచి వస్త్రగాళిత చూర్ణముచేసి చేర్చవలెను. పిదప అందులో శర్కర 20 పలములు, నల్లనువ్వులనూనె 8 పలములు, ఆవునెయ్యి 8 పలములును జేర్చి యథావిధి లేహపాకము చేయవలెను. ఇది చల్లారిన తరువాత తేనె 8 పలములు, తవాక్షీరి చూర్ణము 4 పలములు మఱియు పిప్పలిచూర్ణము 4 పలములును వేసి, కలిపి భద్రపరచవలెను. దీనిని యథాప్రమాణము సేవించిన హిక్కా, శ్వాస, కాస రోగములు హరించును.

## చ్యవనప్రాశావలేహః.

శ్లో॥ పాటలా రణికా శ్మర్య బిల్వారళుక గోక్షురాః
పర్ణ్యౌ బృహత్యౌ పిప్పల్యః శృంగీ ద్రాక్షామృతాభయాః॥ 6.
బలా భూమ్యామలీ వాసా ఋద్ధిర్జీవంతికా శఠీ
జీవకర్షభకా ముస్తా పౌష్కరం కాకనాశికా॥ 7.
ముద్గపర్ణీ మాషపర్ణీ విదారీచ పునర్నవా
కాకోల్యౌ కమలం మేదే సూక్ష్మైలాగురు చందనమ్॥ 8.
ఏకైకం పలమాధృత్య సూక్ష్మ చూర్ణితమౌషధమ్
ఏకీకృత్య బృహత్పాత్రే పంచామల శతానిచ॥ 9.
పచేద్ద్రోణజలేక్షిప్త్వా గ్రాహ్యమష్టాంశ శేషితమ్
తతస్తు తాన్యామలాని నిష్కులీ కృత్య వాససా॥ 10.
దృఢ వస్త్రేణ సంపీడ్య క్షిప్త్వా తత్ర తతోఘృతమ్
పలసప్తమితం తాని కించిద్భృష్ట్వాల్ప వహ్నినా॥ 11.
తతస్తత్ర క్షిపేత్ క్వాథం ఖండంచార్ధ తులోన్మితమ్
లేహవత్ సాధయిత్వాచ చూర్ణానీమాని దాపయేత్॥ 12.
పిప్పలీ ద్విపలా దేయా తుగాక్షీరీ చతుష్పలా
ప్రత్యేకంచ త్రిశాణం స్యాత్ త్వగేలా పత్రకేసరాః॥ 13.
తతస్త్వేకీ కృతే తస్మిన్ క్షిపేత్ క్షౌద్రంచ షట్పలమ్
ఇత్యేతచ్చ్యవన ప్రోక్తం చ్యవన ప్రాశ సంజ్ఞితమ్॥ 14.
లేహం వహ్నిబలం దృష్ట్వా ఖాదేత్ క్షీణో రసాయనమ్
బాల వృద్ధ క్షత క్షీణా నారీ క్షీణాశ్చ శోషిణః॥ 15.
హృద్రోగిణః స్వరక్షీణా యేనరాస్తేషు యుజ్యతే
శ్వాసం కాసం పిపాసాంచ వాతాస్ర మురసోగ్రహమ్॥ 16.
వాతపిత్తం శుక్రదోషం మూత్రదోషంచ నాశయేత్
మేధాం స్మృతిం స్త్రీషు హర్షం కాంతిం వర్ణప్రసన్నతామ్
అస్య ప్రయోగాదాప్నోతి నరోజీర్ణ వివర్జితః॥ 17.

తా:— దశమూలములు (మారేడువేరు, పెద్దగుమ్మడు, తక్కలివేరు, పెద్దమాను, దుందిలము, వాకుడు, ములక, కోలపొన్న, ముయ్యాకుపొన్న, (పల్లేరు) పిప్పళ్లు, కర్కాటకశృంగి, ద్రాక్ష, తిప్పతీగె, కరక్కాయ, మత్తవపులగమువేరు, నేలఉసిరిక, అడ్డసరమువేరు, బుద్ధి, జీవంతి, ఋషభకము, జీవకము, కాకోళీ, క్షీర కాకోళీ, అడవిపెసర, అడవి మినుములు, కచోరములు, తుంగముస్తలు, పుష్కరమూలము, కాకిదొండ, నేల గుమ్మడు, తెల్లగలిజేరు, తామరతూండ్లు, మేద, మహామేద, సన్నఏలకులు, అగరు, మంచిగంధము, వీనిని ప్రత్యేక మొక పలము చొప్పున గ్రహించి దంచి ఒక పాత్రలో వేసి అందు ఒక ద్రోణము జలము పోసి పిదప 500 పెద్ద ఉసిరికాయలను మూటగట్టి వేసి అష్టమాంశావశేషముగ కషాయము కాచవలెను. చల్లారిన తరువాత ఉసిరికాయల మూటను వేరుచేసి, కషాయమును వడియగట్టి భద్రపరచవలెను. ఉసిరికాయలలోని గింజలను నారను తొలగించి, దీనిని ఏడు పలముల నేతితో ఎరుపురంగు వచ్చేవరకు వేయించి పిదప పై కషాయములో వేసి బాగుగా కలిసిపోవువరకు పిసుకవలెను. ఇందులో 50 పలముల ఖండ శర్కర చూర్ణమును గలిపి లేహపాక విధి ప్రకారము వండవలెను. లేహపాకము వచ్చినతోడనే అందు పిప్పలీ చూర్ణము 2 పలములు, వంశలోచన చూర్ణము 4 పలములు, దాల్చిని చూర్ణము ½ తులము, ఏలకుల చూర్ణము ½ తులము, ఆకుపత్రి చూర్ణము ½ తులము, మఱియు నాగకేసరముల చూర్ణము ½ తులము చొప్పున జేర్చి కలుపవలెను. అనంతరము లేహ పాత్రను క్రిందికి దింపి చల్లార్చిన తరువాత అందులో 6 పలముల తేనె గలిపి భద్రపరచవలెను. దీనిని అగ్నిబలానుసారము తగు మాత్రము క్షీణులు, కృశులు, క్షత రోగులు క్షీణశ్రుక్రులు, బాలురు, వృద్ధులు, శోష రోగులు ఉపయోగించినయెడల వారియొక్క రసాది సప్తధాతువులను వృద్ధి పఱచి బలమును గలుగజేయును. మఱియు దీనిచే హృద్రోగము, స్వరక్షీణము, శ్వాస, కాస, తృష, వాతరక్త, ఉరోగ్రహ, వాతపిత్త రోగములు, శుక్రదోషములును హరించును. ఇదిగాక చ్యవన మహామునిచే జెప్పబడిన యీ చ్యవనప్రాశావలేహము అజీర్ణమును హరించి, మేధా, స్మృతిశక్తులను గలిగించి సంభోగశక్తి మఱియు శరీరకాంతుల నిచ్చును.

## కూష్మాండావలేహః.

శ్లో॥ నిష్కులీ కృత్య కూష్మాండం పీడయేత్ దృఢ వాససా
ఆతపే శోషయేత్ కించిచ్ఛూలాగ్రైర్బహుశో వ్యధేత్॥ 18.

క్షిప్త్వా తామ్రకటాహేచ దద్యాదష్టపలం ఘృతమ్
తేన కించి ద్భర్జయిత్వా పూర్వోక్తంచ జలం క్షిపేత్॥ 19.

ఖండం పలశతం దత్వా సర్వమేకత్ర పాచయేత్
సుపక్వే పిప్పలీ శుంఠీ జీరకం ద్విపలం పృథక్॥ 20.

శ్లో॥ పృథక్ పలార్థం ధాన్యాకం పత్రైలా మరిచం త్వచమ్
చూర్ణీకృత్య క్షిపేత్తత్ర ఘృతార్ధం క్షౌద్రమావహేత్॥ 21.
ఖాదే దగ్నిబలం దృష్ట్వా రక్తపిత్తి క్షయిజ్వరీ
శోష తృష్ణా భ్రమ చ్ఛర్ధి శ్వాసకాస క్షతాతురః॥ 22.
కూశ్మాండాద్యవ లేహోయం బాల వృద్ధేషు యుజ్యతే
ఉరఃసంధాన కృద్వృష్యో బృంహణో బలకృన్మతః॥ 23.
యుక్త్యా కూష్మాండ ఖండస్య సూరణం విపచేత్సుధీః
అర్శసాం మూఢవాతానాం మందాగ్నీనాంచ శస్యతే॥ 24.

తా :— ముదురు బూడిద గుమ్మడుకాయను తెచ్చి పై చెక్కును మఱియు దాని గింజలను తీసివేసి ఖండములుగ జేసి బట్టలో గట్టి బాగుగా పిండవలెను. ఈ నీటిని జాగ్రత్త పఱచి ఖండములను ఎండలో నెండించవలెను. అనంతరము ఈ ముక్కలను దబ్బనముతో బాగుగా పొడిచి ఒక తామ్రపాత్రయందువైచి 8 పలముల నెయ్యివేసి వేయించవలెను. తరువాత అందులో గుమ్మడినీటిని 100 పలముల ఖండశర్కరయును వేసి యథావిధి పక్వము చేయవలెను. ఇందులో పిప్పళ్ళు, శుంఠీ, జీలకర్ర, అనువాని చూర్ణము ప్రత్యేకము రెండు పలములును, ధనియాలు, ఆకుపత్రి, ఏలకులు, మిరియాలు దాల్చిణిచెక్క, అనువానిచూర్ణము ప్రత్యేకమొక పలమున్ను చేర్చి కలియబెట్టి దించవలెను. చల్లారిన తరువాత అందులో 4 పలముల తేనె కలిపి భద్రపరచవలెను. దీనిని సేవించిన రక్తపిత్త, క్షయ, జ్వర, శోష, తృష్ణ, భ్రమ, ఛర్ది, శ్వాస, కాస, మఱియు క్షత వ్యాధులను హరించును. ఈ లేహము బాలురకు మఱియు వృద్ధుల కుపయుక్తమైనది. ఇది ఉరస్సంధానకరము, మఱియు బృంహణము, పై యోగములో కూష్మాండమునకు మారుగా సూరణము (కంద) వేసి పై ప్రకారముచేసి యుపయోగించిన, సర్వఅర్శస్సులు, మూఢవాతములను మఱియు మందాగ్నియు హరించును.

## అగస్త్య హరీతకీ లేహః.

శ్లో॥ హరీతకీ శతం భద్రం యవానామాఢకం తథా
పలాని దశమూలస్య వింశతించ నియోజయేత్॥ 25.
చిత్రకః పిప్పలీమూల మపామార్గః శఠీ తథా
కపికచ్ఛుః శంఖపుష్పీ భార్గీచ గజపిప్పలీ॥ 26.
బలా పుష్కరమూలంచ పృథగ్ద్విపల మాత్రయా
పచేత్పంచాఢకే నీరే యవైః స్విన్నైః శృతం జయేత్॥ 27.

శ్లో॥ తచ్చాభయా శతం దద్యాత్ క్వాథే తస్మిన్ విచక్షణః
సర్పిస్తైలాష్టపలకం క్షిపే ద్గుడతులాం తథా॥ 28.

పక్త్వా లేహత్వ మానీయ సిద్ధే శీతే పృథక్ పృథక్
క్షౌద్రించ పిప్పలీ చూర్ణం దద్యాత్ కుడవ మాత్రయా॥ 29.

హరీతకీ ద్వయం ఖాదేత్ తేన లేహేన నిత్యశః
క్షయం కాసం జ్వరం శ్వాసం హిక్కార్శోరుచి పీనసాన్॥ 30.

గ్రహణీం నాశయే దేష వలీపలిత నాశనః
బలవర్ణకరః పుంసా మవలేహో రసాయనమ్॥
విహితో గస్త్య మునినా సర్వరోగ ప్రణాశనః॥ 31.

తా :— పెద్దవియు పుష్టిగలవియునగు కరక్కాయలు 100, యవలు నాలుగుప్రస్థములు, దశమూలములు 20 పలములు, చిత్రమూలము, మోడి, ఉత్తరేణివేరు, కచోరములు, దూలగొండివేరు, శంఖపుష్పివేరు, గంటుభారంగి, గజపిప్పళ్ళు, బలామూలము, పుష్కరమూలము, ఇవి ప్రత్యేకము రెండుపలములు. కరక్కాయ తప్ప మిగిలినవానినన్నిటిని నలగగొట్టి 5 ఆఢకముల నీటిలోవేసి చతుర్థాంశ కషాయముగకాచి వడియగట్టి అందు పై100కరక్కాయలనువేసి బాగుగాకాచి పిదప ఆవునెయ్యి 8 పలములు, నువ్వుల నూనె 8 పలములు, పాతబెల్లము 100 పలములు వేసి లేహపాకము చేయవలెను. చల్లారిన తరువాత తేనె నాలుగుపలములు, పిప్పళ్ళ చూర్ణము4పలములు, అందులోవేసికలిపి భద్రపఱచవలెను. ప్రతిరోజు ఇందులో నుండి 2 కరక్కాయలను లేహముతో సహా సేవించిన, క్షయ, కాస, జ్వర, శ్వాస, హిక్క, అర్శ, అరుచి, పీనస, గ్రహణి, వలీపలిత రోగములు హరించును. ఈ యగస్త్యప్రోక్త హరీతకీ లేహము బలవర్ణకరము, రసాయనము మఱియు సర్వరోగనాశకము.

## కుటజాద్యవలేహః.

శ్లో॥ కుటజత్వక్తులాం ద్రోణే జలస్య విపచేత్సుధీః
కషాయం పాదశేషంచ గృహ్ణీయాద్వస్త్ర గాళితమ్॥ 32.

త్రింశత్పలం గుడస్యాత్ర దత్వాచ విపచేత్పునః
సాంద్రత్వ మాగతం జ్ఞాత్వా చూర్ణానీమాని దాపయేత్॥ 33.

రసాంజనం మోచరసం త్రికటు త్రిఫలాం తథా
లజ్జాలుం చిత్రకం పాఠాం బిల్వమింద్ర యవం వచామ్॥ 34.

శ్లో॥ భల్లాతకం ప్రతివిషాం విడంగానిచ వాలకమ్
ప్రత్యేకం పలమానంచ ఘృతస్య కుడవం తథా॥ 35.
జయే దేషోవలేహస్తు సర్వాణ్యర్శాంసి వేగతః
దుర్నామ ప్రభవాన్ రోగానతీసార మరోచకమ్॥ 36.
గ్రహణీం పాండురోగంచ రక్తపిత్తంచ కామలామ్
అమ్ల పిత్తం తథా శోథం కార్శ్యంచైవ ప్రవాహికామ్॥ 37.
అనుపానే ప్రయోక్తవ్య మాజం తక్రం పయోదధి
ఘృతం జలం వాజీర్ణేచ పథ్యభోజీ భవేన్నరః॥ 38.

తా :— కొడిశపాలచెక్క 100 పలములు, దీనినిదంచి ఒక ద్రోణము జలములో వేసి నాల్గవభాగము మిగులునట్లుగ కాచి వడియగట్టి అందు 30 పలముల బెల్లమునువైచి పాకముచేసి పిదప రసాంజనము, బూరుగుబంక, త్రికటుకములు, త్రిఫలములు, అత్తిపత్తి, చిత్రమూలము, విషబొద్ది, మారేడువేరు, కొడిశపాలగింజలు, శుద్ధిచేసినజీడిగింజలు అతివస, వాయువిడంగములు, కురువేరు, ఇవి ప్రత్యేకమొకపలము, వీనిని మెత్తగా చూర్ణించి పై పాకములోవేసి, తరువాత ఆవునెయ్యి 4 పలములు చేర్చి యథావిధి లేహపాకము చేయవలెను. దీనిని సేవించిన సకల అర్శస్సులు, అతిసారములు, అరోచకము, గ్రహణి, పాండు, రక్తపిత్తము. కామల, అమ్లపిత్తము, శోథ, కృశత్వము, ప్రవాహికరోగములు హరించును. దీనిని మేక మజ్జిగతోగాని లేక మేక పాలతోగాని, లేక మేక పెరుగుతోగాని, లేక మేకనెయ్యితో గాని. లేక కేవలము నీళ్ళతోగాని సేవించవచ్చును. అజీర్ణవ్యాధియందు చెప్పబడిన పథ్యమునే చేయవలెను.

## కామేశ్వరీ లేహః.

శ్లో॥ వారాహీ మధుకం ద్రాక్షా వాజిగంధా సురద్రుమమ్
అలర్కం మర్కటీమూలం బలామూలం పునర్నవా॥ 39.
ఉసీరం చందనం భార్గీ భిక్షురై న్మలేయ గోక్షురమ్
విదారీ తిలమాషంచ ప్రత్యేకంచ పలద్వయమ్॥ 40.
ద్విద్రోణే సలిలే క్వాథే శృతే పాదావశేషితే
త్రింశత్పలం గుడం తస్మాత్ సితా దశపలం పునః॥ 41.
ఇక్షు ధాత్రీ వరీరంభా కూష్మాండ స్వరసాన్వితమ్
దర్వ్యాచ ఘట్టయన్ భూయో లేహవత్సాధు సాధయేత్॥ 42.

శ్లో॥ ఏలా లవంగ పత్రంచ నాగకేసర ధాన్యకైః
తాళీసం మధుకం సేవ్యం చందనాగురు కుంకుమైః॥ 43.
జాతీఫలం శిలాభూతం సురదారు ఫలత్రయైః
అపామార్గఫలం వ్యోషం మర్కటీబీజ గోక్షురైః॥ 44.
జాతీపత్రిం వరాలంచ వాంశీచేక్షుర బీజకైః
సైంధవం మోచనిర్యాసం విడంగం దీప్యకద్వయమ్॥ 45.
తురంగకుసుమం రాస్నా మరాష్ట్రి ముకుళాన్వితమ్
శిగ్రిసారం ధూర్తబీజం భూశర్కర సమన్వితమ్॥ 46.
హస్తికర్ణాబ్ద భృంగంచ కృష్ణజీర సమన్వితమ్
ప్రత్యేకం పంచనిష్కంచ గాంధారీ నిష్కవింశతిమ్॥ 47.
ధాత్రీ విదారీ వారాహీ సారివామృత శర్కరా
ప్రత్యేకం కుడవార్ధంచ లేహం పాకేన యోజయేత్॥ 48.
గోఘృతం మధుసంయోజ్య కస్తూరీ చంద్రిసంయుతమ్
కర్షమాత్రం లిహేత్ప్రాతః రాత్రికాలే విశేషతః॥ 49.
వాతపిత్త కఫోత్పన్నం రక్తపిత్తం వినాశయేత్
కాసం శ్వాసం క్షయం పాండుం ఛర్దిం దోషనిబర్హణమ్॥ 50.
ఆధ్మాన గుల్మ శూలఘ్నం హిద్మా హృద్రోగ నాశనమ్
అర్శాంసి గ్రహణీదోషం అస్థిస్రావంచ దారుణమ్॥ 51.
మూత్రాఘాతాశ్మరీ కృచ్ఛ్రిం ప్రమేహం నాశయే ధ్రువమ్
సర్వరోగహరంచైవ బల పుష్టికరం త్విదమ్॥ 52.
మన్మథోద్రేక ధాతుంచ మహామద గజేంద్రియమ్
ముహుర్ముహు రతిగుహ్యాం సంయోగంచ విశేషతః॥ 53.
నారీణాం రమతే స్నేహం మోహానం వీర్యవర్ధనమ్
సుందరీణాంచ సంయోగే చిత్తాహ్లాదం దినే దినే॥ 54.
ఆయుష్యం వృద్ధికామత్వం మాంస శుక్ల వివర్ధనమ్
రసాయనమిదం శ్రేష్ఠం పూజ్యపాదేన భాషితమ్॥ 55.

తా :— పందెమూతిగడ్డ? అతిమధురము, దాశ్రిక్షు, పెన్నేరుగడ్డ, దేవదారు, తెల్లజిల్లేడువేరు, దూలగొండివేరు, ముత్తవపులగమువేరు, తెల్లగలిజేరువేళ్లు, వట్టివేళ్ళు, మంచిగంధము, గంటుభారంగి, నీటిగొబ్బిమిడిగింజలు, నీలిచెట్టువేరు, పల్లేరు, నేలగుమ్మడు గడ్డ, నువ్వులు, మినుములు. ఇవి ప్రత్యేకము రెండుపలములు, వీనిని బాగుగా దంచి రెండు ద్రోణముల నీటిలోవేసి చతుర్థాంశ కషాయముగ కాచి వడియగట్టి అందుబెల్లము 30 పలములు, శర్కర 10 పలములు వేసి తిరిగిపాకము చేసిపిమ్మట దానిలో చెఱకురసము రెండుప్రస్థములు. శతావరి రసము 2 ప్రస్థములు, అరటిదుంపరసము 2 ప్రస్థములు. బూడిదగుమ్మడుకాయ రసము 2 ప్రస్థములు చేర్చి లేహపాకము చేయవలెను. పాకము చేయునప్పుడు కరశ్రితెడ్డు నుపయోగించవలెను. లేహపాకమురాగానే ఏలకులు, లవంగ పట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, ధనియాలు, తాళీసపత్రి, అతిమధురము, వట్టివేళ్లు, మంచిగంధము, అగరు, కుంకుమపువ్వు, జాజికాయ, శిలాజిత్తు, దేవదారు, త్రిఫలములు, ఉత్తరేణిగింజలు, త్రికటుకములు, దూలగొండి గింజలు, పల్లేరు, జాపత్రి లవంగాలు, వంశలోచనము, నీటిగొబ్బిగింజలు, సైంధవలవణము, బూరుగుబంక, వాయువిడంగములు, ఓమ, ఖురాసానిఓమ, పున్నాగ (సురపొన్న) పుష్పములు, సన్న రాష్ట్రము, మరాటీమొగ్గలు, మునగబంక, శుద్ధిచేసిన ఉమ్మెత్తగింజలు, భూశర్కరగడ్డ, గజపిప్పళ్ళు, భృంగరాజమువేళ్ళు, భద్రముస్తలు, నల్లజీలకర్ర, ఇవి ప్రత్యేకము రెండు తులములు. శుద్ధిచేసిన గంజాయి ఆకు 10 తులములు, ఉసిరికాయ, నేలగుమ్మడు, పంది మూతిగడ్డ, సుగంధపాలవేళ్ళు, తిప్పసత్తు. ఇవి ప్రత్యేకము 16 తులములు. ఈదినుసు లను దంచి వస్త్రగాళితచూర్ణముచేసి పై పాకములోవేసి యథావిధి పాకముచేయవలెను. అనంతరము ఆవునెయ్యి మఱియు తేనె ఉచితప్రమాణమువేసి, కస్తూరి మఱియు పచ్చ కర్పూరము బహుస్వల్పముగ పై లేహములోవేసి బాగుగా కలిపి జాగ్రత్త పరచవలెను. దీనిని సామాన్యముగ ఉదయమునను, విశేషముగా రాత్రియందును అర్ధతులము సేవించిన కఫోత్పన్న రక్తపిత్తము, కాస, శ్వాస, క్షయ, పాండు, ఛర్ది, ఆధ్మాన, గుల్మ, శూల హిధ్మ, హృద్రోగ, అర్శ, గ్రహణి, దారుణ అస్థిస్రావ, మూత్రాఘాత, అశ్మరి, మూత్రకృచ్ఛ, ప్రమేహరోగములుహరించి బలమును పుష్టిని గలుగజేయును. ఈలేహము సప్తధాతువులను వృద్ధిపఱచి మదించిన గజేంద్రమువలె మన్మథోద్రేకమును గలిగించును. స్త్రీలతో స్నేహమును, కామేచ్ఛయును, ఉభయులకు చిత్తాహ్లాదమును గలిగించును. ఇవిగాక ఆయువును, కామశక్తి మఱియు మాంసశుక్రములను వృద్ధిపఱచును. ఇది పూజ్య పాదునిచే జెప్పబడిన శ్రేష్ఠరసాయనము.

## బిల్వాదిలేహః.

శ్లో॥ బిల్వాగ్నిమంథక మంభసోర్థ కలశే పక్త్వా పదస్థేరసే
తస్మిన్ జీర్ణగుడస్య షోడశపలం చూర్ణీకృతైః సర్వతః॥
కర్షాంశైర్ఘన ధాన్య జీరక హిమా త్వక్కేసర త్ర్యూషణై
ర్లీఢశ్ఛర్ది రోచకాగ్నిసదన శ్వాసప్రసేకాపహః॥ 56.

తా :— మారేడువేళ్లు 32 పలములను బాగుగా నలగగొట్టి అర్ధద్రోణజలములో వేసి చతుర్థాంశ కషాయముగ కాచి వడియగట్టి, అందు పాతబెల్లము 16 తులములు వేసి కాచి లేహపాకము రాగానే దానిలో ధనియాలు, జీలకర్ర, భద్రముస్తలు, ఏలకులు, దాల్చినిచెక్క, నాగకేసరములు, త్రికటుకములు అనునవి ప్రత్యేకమొక తులము చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి చేర్చి దించవలెను. పిదప బాగుగా కలిపి భద్రపరచవలెను. దీనిని సేవించిన ఛర్ది, అరోచకము, అగ్నిమాంద్యము, శ్వాస మరియు ప్రసేక రోగములను (నోట నీరుకారుట) హరించును.

## పిప్పల్యాది రసాయనమ్.

శ్లో॥ పిప్పల్యాశ్చ్ఛ ర్ణజః ప్రస్థం శర్కరాయా స్తదర్ధకమ్
విడంగం నాగరం భార్ఙ్గీ జీరకం మరిచం పృథక్॥ 57.

చతుష్పలం తదర్ధం స్యాత్ పిప్పలీమూలమేవచ
చవ్యాచ ద్విగుణీచైవ చిత్రకం ద్విపలం తథా॥ 58.

అయోరజశ్చ ద్విపలం భృంగస్యచ రజ స్తథా
త్రిజాతకం త్రిఫలికా జాతీ తక్కోలజం ఫలమ్॥ 59.

సర్వమేకత్ర సంచూర్ణ్య మధుప్రస్థ ద్వయం క్షిపేత్
ధాన్యే పక్షస్థితం లిహ్యాత్ కాసశ్వాసంచ దారుణమ్॥ 60.

ఏకాదశాత్మకం శోఫం ఛర్దిం గుల్మమరోచకమ్
అర్శాంసి పాండురోగంచ విషమజ్వర మేవచ॥ 61.

పీనసం స్వరసాదంచ సర్వమేవ వినాశయేత్
అశ్విభ్యాం విహితో యోగః పిప్పల్యాది రసాయనమ్॥ 62.

తా :— పిప్పళ్లచూర్ణము 16 పలములు, శర్కర 8 పలములు, వాయువిడంగములు, శుంఠి, గంటుభారంగి, జీలకర్ర, మిరియాలు, ఇవి ప్రత్యేకము 4 పలములు. మోడి, చవ్యము, చిత్రమూలము, లోహభస్మ, భృంగరాజచూర్ణము, ఇవి ప్రత్యేకము 2 పలములు, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, త్రిఫలములు, జాజికాయ, తక్కోలములు, అనునవి ప్రత్యేకము ఒక పలము. వీనినన్నిటిని మెత్తగా వస్త్రగాళిత చూర్ణము చేసి అందు 2 ప్రస్థముల తేనె గలిపి ధాన్యరాశిలో 15 రోజులుంచి పిదప తగుమాత్రము సేవించిన కఠినమైన కాస, శ్వాస, శోఫ, ఛర్ది, గుల్మ, విషమజ్వర, అరోచక, అర్శ, పాండు, పీనస రోగములు మరియు స్వరభంగరోగములను హరించును. ఈ రసాయనము అశ్వినీదేవతలచే జెప్పబడినది.

## శతావరీ గుడమ్.

శ్లో॥ గుడాఢకేన సంసృజ్య శతావర్యా రసాఢకమ్
ఘృత ప్రస్థం సమావాప్య శనైర్మృద్వగ్నినా పచేత్॥ 63.
విశ్వైలా ముసలీ పాఠా శ్వదంష్ట్రా సారిబాద్వయైః
వత్సా ఝటా విదారీభిర్మాగధీ మధుకాద్రిజైః॥ 64.
అక్షాంశైశ్చూర్ణితైః సమ్యక్ లేహే సిద్ధే వతారితే
కుడవంచ తుగాక్షీర్యాః శర్కరాయాశ్చతుష్పలమ్॥ 65.
తల్లేహం స్వచ్ఛగుప్తంతు సప్తరాత్రం నిధాపయేత్
ప్రలిహ్యాత్ ప్రాతరుద్ధాయ యథాగ్ని బలమాతురః॥ 66.
వింశతిం మూత్రకృచ్ఛ్రాణాం ప్రమేహాణాంచ వింశతిమ్
వాతపిత్తమసృక్ పిత్తం మూఢవాతం హలీమకమ్॥ 67.
క్షతక్షయం పాదదాహం కామలామూర్ధ్వతామపి
యోనిదోషం రజోదోష మస్థిస్రావ మసృక్దరమ్॥ 68.
వాతపిత్తకృతాన్ రోగానన్యానపి వినాశయేత్
శతావరీ గుడాఖ్యం తు రసాయనమనుత్తమమ్॥ 69.

తా :— బెల్లము 64 పలములు, శతావరీరసము 4 ప్రస్థములు, ఆవునెయ్యి ఒక ప్రస్థము. వీనిని ఒక కుండలోపోసి మృద్వగ్నిచే పాకముచేసి అందు శుంఠి, ఏలకులు, నేలతాటిగడ్డలు, పాఠవేరు, పల్లేరు, నల్లసుగంధపాలవేళ్లు, తెల్లసుగంధపాలవేళ్ళు, వావిలివేళ్లు నేలయుసిరిక, నేలగుమ్ముడుగడ్డ, పిప్పళ్ళు, అతిమధురము, శిలాజిత్తు, ఇవి ప్రత్యేకమొక తులముచొప్పున గ్రహించి వస్త్రగాళిత చూర్ణముచేసి చేర్చి పిదప వంశలోచనచూర్ణము 16 తులములు, శర్కర 4 పలములు కూడ కలిపి లేహపాకము చేయవలెను. సాంగ శీతలమైన తరువాత ధాన్యరాశియందు ఏడుదినము లుంచవలెను. దీని నగ్నిబలానుసారము నుచితప్రమాణము ప్రాతఃకాలమున సేవించిన మూత్రకృచ్ఛ్ర, ప్రమేహ, వాతపిత్త, రక్తపిత్త, మూఢవాత, హలీమక, క్షత, క్షయ, పాదదాహ, కామల, యోనిదోష, రజోదోష, అస్థిస్రావ, రక్తప్రదర రోగములును మఱియు వాతపిత్త ప్రధాన రోగములును నశించును. ఈ శతావరీగుడ మత్యుత్తమ రసాయనము.

## ఇక్షురాది లేహః.

శ్లో॥ ఇక్షుర గోక్షుర మర్కటబీజం ముసలి శతావరి మాష తిలైశ్చ
గోఘృత శర్కర మధుసంయుక్తం నారీగద గజకేసరియోగమ్॥70.

తా :— నీటుగొబ్బిగింజలు, పల్లేరు, దూలగొండిగింజలు, నేలతాడిగడ్డలు, శతావరి, మినుములు, నువ్వులు, అనువానిని సమభాగములుగా గ్రహించి మెత్తగా చూర్ణించి తగినంత శర్కర పాకములో జేర్చి అందు నెయ్యి మఱియు తేనెగలిపి, దించి భద్రపరచవలెను. సింహమ్ము గజమును వేటాడుచందమున యీ ఇక్షురాది లేహము స్త్రీలసమస్త వ్యాధులను హరించును.

## మధుస్నుహీ రసాయనమ్.

శ్లో॥ త్రికటు త్రిఫలా త్రిజాత జాతీఫల ప్రత్యగ్ని వరాల ధాన్యకాని
త్రియవాని విడంగ చవ్య కుష్ఠ త్రివృతా గ్రంధిక వాజిగంధకాని॥71
సభార్గి తేజోవతి కేసరాణి నిమ్క ద్వయోస్స్మాన విచూర్ణితాని
సంశుద్ధ గంధోపల మాహిషాక్ష మధుస్నుహీనాంచ చతుష్పలాని॥
ద్విషట్పలోన్మానఘృతే విపక్వే సితోపల ద్వాదశకం క్షిపేచ్ఛ
తథోన్మధిత్వాతు ఖజేన తస్మిన్ సుపాకమాయాతి తతోవతార్య॥
పూర్వోక్త చూర్ణాని వికీర్య శీతే గంధోపలస్యాపి రజాంసి దత్వా
సంయోజ్యసమ్యక్చ సుశీతలేస్మిన్ప్రస్థం ప్రదద్యాన్మధునః సుపాత్రే॥
విన్యస్య గుప్తంతు రసాయనం తత్ప్రాతర్లిహేత్కర్ష యుతంహితాశీ
కుష్ఠంకిలాసం పిటకాన్ప్రమేహాన్ భగందరార్శోస్కృధగండమాలాః॥
నిహంతి కండ్వామయ వాతరక్త
పిత్తోద్భవాన్ గుహ్యాభవాన్ వ్రణాంశ్చ
రసాయనోయం మునినా కృతశ్చ
మధుస్నుహీ నామక ఏషముఖ్యః. 76.

తా:—మిరియాలు, శుంఠి, పిప్పళ్ళు, త్రిఫలములు, చాతుర్జాతములు, (ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, జాజికాయ), చిత్రమూలము, లవంగాలు, ధనియాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, సాయికూరగింజలు (బర్దసోపు), వాయువిడంగములు, చవ్యము, చెంగల్వకోష్ఠు, తెగడ, మోడి, పెన్నేరుగడ్డ, గంటుభారంగి, మాల్కంగిని, నాగకేసరములు, ఇవి ప్రత్యేకము అర్ధతులము. వీనిని మెత్తగా చూర్ణించి, పిదప శుద్ధగంధకము, మహిసాక్షిగుగ్గులు, ఫిరంగిచెక్క, అనువానిని ప్రత్యేకము 4 పలములు చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి తరువాత 12 పలముల ఖండశర్కరను పాకముచేసి అందులో పై రెండుచూర్ణములను మఱియు 12 పలముల ఆవునెయ్యి వేసి లేహ్యపాకము చేయవలెను. చల్లారిన [illegible] తేనెవేసికలిపి దానిని ధాన్యరాశియందొక వారముంచవలెను

దీనిని ప్రతిరోజూదయమున అర్ధతులము చొప్పున సేవించిన కుష్ఠ, క్షుద్రకుష్ఠ, పిటక, ప్రమేహ, భగందర, అర్శ, అర్బుద, గండమాల, కండు, వాతరక్త, పిత్తజరోగము లను మఱియు గుహ్యవ్రణములను హరించును. ఇది మునిచేత జెప్పబడిన ప్రసిద్ధమైన మధుస్నుహీ రసాయనము.

## మధుస్నుహీ రసాయనమ్ (2).

శ్లో॥ ద్వికుండలీ ఫలత్రియం కటుత్రయం త్రిజాతకమ్
యవాని సైంధవాన్వితం విడంగ సారరాస్నకమ్
సభార్గి చవ్య గ్రంధికం ధాన్యయుగ్మ జీరకంచ మాంసి కుష్ఠ చిత్రకమ్
సారిబా వరాహికాశ్వగంధ సంయుతం పృథక్కర్ష చూర్ణితమ్
మధుస్నుహీతు తత్సమం సశర్కరం సమాంశకమ్
సగోఘృతం సమాక్షికం సుపాచితం రసాయనమ్
ప్రభాతకాల సేవితం సుదీపనం రుచిప్రదమ్
వాతపిత్త రూక్షజంచ శ్లేష్మకం క్షయఘ్నకం
ప్రమేహహారి గుల్మశూల కంఠజం నృణాం పరమ్
సర్వధాతువర్ధనం బలప్రదం సుఖప్రదం
పూజ్యపాద భాషితం మధుస్నుహీ రసాయనమ్॥ 77.

తా :— తిప్పతీగె, దేవకాంచనము, కరక్కాయబెరడు, తానికాయబెరడు, ఉసిరికాయ, శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, సైంధవ లవణము, వాయువిడంగములు, సన్నరాస్నము, గంటుభారంగి, చవ్యము, మోడి, ధనియాలు, తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, జటామాంసి, చెంగల్వకోష్ఠు, చిత్రమూలము సుగంధపాలవేళ్ళు, పందిమూతిగడ్డ, పెన్నేరుగడ్డ, ఇవి ప్రత్యేక మొక తులము. వీనిని మెత్తగా చూర్ణించి దీనికి సమానము శుద్ధఫిరంగిచెక్క చూర్ణమును జేర్చి, మొత్తమునకు సమానము చక్కెరను గ్రహించి పాకము చేయవలెను. పిదప అందు పైచూర్ణమును మఱియు ఉచితప్రమాణము నెయ్యివేసి లేహపాకముచేసి అనంతరమందు తగుమాత్రము తేనెకూడచేర్చి జాగ్రత్తగా నుంచవలెను. దీనినుచిత ప్రమాణము (అర్ధతులము) ప్రాతః కాలమందు సేవించిన వాతపిత్త, కఫ, క్షయ, ప్రమేహ, గుల్మ, శూల, కుష్ఠ మొదలగురోగ ములను హరించును. ఈ రసాయనము దీపనము, రుచిప్రదము, మఱియు రూక్షఘ్నము. ఇది ధాతువృద్ధిని బలమును కలుగజేసి సుఖము నిచ్చును. ఈమందు పూజ్యపాదునిచే చెప్పబడిన మధుస్నుహీ రసాయనము.

## దశమూలావలేహః.

శ్లో॥ దశమూల బలై రండ భార్గీ తామలకీ వృషైః
రాస్నా చవ్యాశ్మభిద్దారు సైర్యక గ్రంథికాగ్నిభిః॥ 78.
శృంగీ ఫల త్రికా లోహ శఠీ కూలక పౌష్కరైః
తుల్యైరేభిర్జలద్రోణే సాధయేత్సు సమాహితః॥ 79.
పాదావశేషితే తస్మిన్నర్థం గుడతులాం భవేత్
దర్వీప్రలేపితే జ్ఞాతే చూర్ణాన్యేతాని నిక్షిపేత్॥ 80.
చాతుర్జాత ఘన వ్యోష జీరకద్వయ దీప్యకమ్
ధాన్యకం చాక్ష్మయుగ్మాని తత్తుల్యా సితశర్కరా॥ 81.
శీతే తస్మిన్ ప్రదాతవ్యం గుడపాదాంశికం మధు
ప్రలిహేత్ ప్రాతరుత్థాయ శుద్ధకాయః సుమంత్రితః॥ 82.
కాసం శ్వాసం ప్రతిశ్యాయ మరోచక గళగ్రహా
వాతరోగాన శేషాంశ్చ క్షయం గుల్మంచ నాశయేత్॥
లేహోయం దశమూలాఖ్యో నిమినా పరినిర్మితః॥ 83.

తా :— దశమూలములు, ముత్తవపులగము వేళ్ళు, ఆముదపు వేళ్లు, గంటుభారంగి, నేలఉసిరిక, అడ్డసరము వేళ్ళు, సన్నరాస్నము, చవ్యము, కొండపిండి, దేవదారు, ముళ్ళగోరింట వేళ్ళు, మోడి, చిత్రమూలము, కర్కాటకశృంగి, త్రిఫలములు, శుద్ధ లోహపురజను, కచోరములు, చేదుపొట్ల, పుష్కరమూలము, ఇవి ప్రత్యేక మొక పలము. వీనిని దంచి ఒక ద్రోణము జలములోనైచి, చతుర్థాంశ కసాయముగ కాచి, వడియ గట్టి, అందు 50 పలముల బెల్లమును జేర్చి పాకము చేయవలెను. పాకము వచ్చిన పిదప ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, భద్రముస్తలు, త్రికటుకములు, తెల్ల జీలకర్ర, నల్లజీలకర్ర, ఓము, ధనియాలు, అనువానిని ప్రత్యేకముగా 2 తులములు చొప్పున గ్రహించి దంచి చేసిన మెత్తనిపొడి మఱియు 24 తులముల శర్కర, వీనిని పైపాకములోజేర్చి లేహపాకము చేయవలెను. చల్లారగానే 12½ పలముల తేనెవేసి కలిపి జాగ్రత్తగా నుంచవలెను. దీనిని ప్రాతఃకాలమందు శుచిర్భూతముగ మంత్రోచ్చారణచేసి ఉచితప్రమాణముగ సేవించిన కాస, శ్వాస, ప్రతిశ్యాయ, అరోచక, గళగ్రహ, క్షయ, గుల్మరోగములును మఱియు సకల వాతరోగములును నశించును. ఈ దశమూలావలేహము నిమిఋషిచే నిర్మింపబడినది.

## అభయామోదకః.

శ్లో॥ అభయా మరిచం శుంఠీ విడంగామలకాని చ
పిప్పలీ పిప్పలీమూలం త్వక్పత్రం ముస్తమేవచ॥ 84.
ఏతాని సమభాగాని దంతీచ ద్విగుణా భవేత్
త్రివృదష్టగుణా జ్ఞేయా షడ్గుణాచాత్ర శర్కరా॥ 85.
మధునా మోదకాన్ కృత్వా కర్షమాత్ర ప్రమాణతః
ఏకైకం భక్షయేత్ ప్రాతః శీతంచానుపిబేజ్జలమ్॥ 86.
యావద్విరిచ్యతే జంతుర్యావదుష్ణం నసేవతే
పానాహార విహారేషు భవేన్నిర్యంత్రిణః సదా॥ 87.
విషమజ్వర మందాగ్ని పాండు కాస భగందరాన్
దుర్నామ కుష్ఠ గుల్మార్శో గలగండ భ్రమోదరాన్॥ 88.
విదాహ ప్లీహ మేహాంశ్చ యక్ష్మాణం నయనామయాన్
వాతరోగాంస్తథాధ్మానం మూత్రకృచ్ఛ్రాణిచాశ్మరీమ్॥ 89.
హృత్పార్శ్వోర్వంఘ్రి జఘన జంఘోదర రుజంజయేత్
సతతం శీలనాదేషాం పలితాని ప్రణాశయేత్
అభయా మోదకాహ్యేతే రసాయన వరాః పరమ్॥ 90.

తా:— కరక్కాయలు, మిరియాలు, శుంఠి, వాయువిడంగాలు, ఉసిరికాయలు, పిప్పళ్లు, మోడి, దాల్చినిచెక్క, ఆకుపత్రి, భద్రముస్తలు, ఇవి ప్రత్యేకము ఒక భాగము. దంతీమూలము రెండు భాగములు, తెగడ 8 భాగములు, శర్కర 6 భాగములు, వీని నన్నిటిని మెత్తగా చూర్ణించి తగినంత తేనె వేసి మోదకము సిద్ధముచేయవలెను. ఈ మోదకమును ఒక్కొక్క తులము చొప్పున మాత్రలుగ కట్టవలెను. ఇందులో ఒక మాత్రను ఉదయమున సేవించి చన్నీళ్లు త్రాగినచో విరేచనమగును. బాగుగా విరేచనములగువరకు వేడినీళ్లుగాని వేడి వస్తువులుగాని తీసుకొనగూడదు. ఆహార విహారములలో పథ్యముగానుండవలెను. దీనిచేత విషమజ్వర, మందాగ్ని, పాండు, కాస, భగందర, అర్శ, కుష్ఠ, గుల్మ, గలగండ, భ్రమ, ఉదర, దాహ, ప్లీహ, మేహ, క్షయ, నయన, వాత, ఆధ్మాన, మూత్రకృచ్ఛ్ర, అశ్మరీ, హృదయ, పార్శ్వ, ఊరు, ముఖ, జంఘరోగసముదాయములు నశించును. మఱియు ప్రతినిత్యము దీనిని సేవించిన వలీపలిత రోగములు పోవును. ఇది శ్రేష్ఠమైన రసాయనము.

## చాతుర్జాత రసాయనమ్ (మదనకామేశ్వరీ లేహః)

శ్లో॥ చాతుర్జాత కచోర చందన జల ద్రాక్షా తుగా రేణుకమ్
కస్తూరీ తగరేందు కుంకుమ జటా కుష్ఠాశ్వగంధా బ్దకమ్
కాకోలీ సురదారు చిత్రక వచా ద్వాజీరకా సైంధవమ్
భార్గీ గోక్షుర దేవపుష్ప ముసలీ యష్టీ బలా ఫేనకమ్॥ 91.
రంభాకంద ఫలత్రియం త్రికటుకం జాతీఫలం వాలకమ్
తాళీశం కటుకీఫలం గజకణా మాషామృతా శర్కరా
గుప్తా భృంగ విదారికా మదనజం బీజంచ కుంభ్యుద్భవమ్
శాల్మల్యంఘ్రి పునర్నవాగురు శతావర్యోప్యథో దీప్యకమ్॥ 92.
పాదాంశం ఘృతమభ్రకంచ విజయా తుల్యామధానాం సమమ్
సర్వేషాం సదృశీ సితాచ మధునాచాజ్యేన సంపేషితమ్
జాతీచంపక కేతకాదికుసుమైః సంవేతసం వాసితమ్
కర్షార్థం నిశి దేహ సిద్ధిద మహాకామేశ్వరః కామదః॥ 93.
పుంసాం శుక్ల వివృద్ధి దార్ఢ్యకరణః క్షీరానుపానో హితః
శాల్మల్యంఘ్రి జలానుపాన మధునాప్యన్యచ్చ యచ్ఛుక్లదమ్
ప్రౌఢానాం సుదృశాం సుఖాతిసుఖదో వశ్యావహో ద్రావకః
సంగే భంగుర కామకౌతుక రసక్రీడా కలా సమ్మతః॥ 94.
సంభోగే స్థవిరాన్ నియోక్ష్యతి యథా యూనాం స్మరోదర్పితే
నిత్యానంద నిదాన మాదిపురుషే రప్యాహితా స్వాదనః
వాచాం సిద్ధికరః ప్రసిద్ధకవితా సందర్భ సంవాదనః
సౌఖ్యారోగ్య విశేష యౌవనకళా సామర్థ్య సంపాదకః॥ 95.
వృద్ధత్వం హరతే బలంచ కురుతే మృత్యుం నిరస్యత్వలమ్
వ్యాధి వ్రాతమపాకరోతి కురుతే కాంతించ మత్యార్జవమ్
యోగాభ్యాస విధావతీవ సుఖదాం సిద్ధిం విధత్తేతరా
మంహః సంహాతి సంవృతిం కలయతే స్త్రీణామపత్య ప్రదః॥ 96.
రోగాణాం నిచయ క్షయం క్షపయతే క్షిప్రం మహారుగ్గణమ్
వ్యాహంతి శ్వసనం క్షయం గమయతి ఛిందన్ హి కాసోదయమ్

శ్లో॥ చూర్ణానిమాని షడ్భాభినత్తి హరతే సర్వాతిసారోల్బణమ్
మేహౌఘంచ రుణద్ధి శోణితగదం విధ్వంసతే సేవనాత్ ॥ 97.

తా:— ఏలకులు, దాల్చినిచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు, కచోరములు, మంచిగంధము, వట్టివేళ్లు, దాక్షి, వంశలోచనము, రేణుకలు, కస్తూరి, గ్రంధితగరము, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, జటామాంసి, చెంగల్వకోష్ఠు, పెన్నేరుగడ్డ, భద్రముస్తలు, కాకోళి, దేవదారు, చిత్రమూలము, వస, జీలకర్ర, నల్లజీలకర్ర, సైంధవలవణము, గంటుభారంగి, పల్లేరు, లవంగాలు, నేలతాడిగడ్డలు, యష్టిమధుకము, ముత్తవపులగమువేళ్లు, నల్లమందు, అరటిదుంప, త్రిఫలములు, త్రికటుకములు, జాజికాయ కురువేరు, తాళీసపత్రి, చేదు ఆనబు, గజపిప్పళ్లు, మినుములు, తిప్పతీగె, శర్కర, దూలగొండివేళ్లు, భృంగరాజమువేళ్లు, నేలగుమ్మడు, శుద్ధ ఉమ్మెత్తగింజలు, శుద్ధ నేపాళములు, ఎర్రబూరుగువేరు, తెల్లగలిజేరువేళ్లు, అగరు, శతావరి, ఓమ. ఇవి ప్రత్యేక మొకతులము. అభ్రకభస్మ 14 తులములు, శుద్ధ భంగు ఆకు 56 తులములు, శర్కర 126 తులములు. వీటినన్నిటిని వస్త్రగాళిత చూర్ణము చేసి అందు తగినంత నెయ్యి మఱియు తేనెవైచి బాగుగా గలిపి పిదప దీనిని జాజిపువ్వులు, సంపెంగపువ్వులు, మఱియు మొగలిపువ్వుల మధ్యను వాని సువాసన పట్టువరకుంచవలెను. ఈ లేహమును రాత్రి భాగమందు అర్ధతులము మాత్రి, సేవించి పైనుంచి ఆవుపాలు త్రాగిన, శుక్రవృద్ధియును, శరీరదార్ఢ్యమును గలిగించును. మఱియు తేనె, బూరుగువేళ్ల రసముతో వయస్సుగడిచినస్త్రీలు పుచ్చుకొనిన సుఖాతిసుఖమును వశీకరణమును గలిగించును. ఇంకను అన్యయుక్త ద్రవానుపానములతో సేవించిన సంభోగసుఖమును కామకౌతుక రసక్రీడలయందు ఆసక్తియును గలిగియుందురు. ఇదిగాక ఈ లేహమును వృద్ధులుకూడ సేవించిన యువకులవలె శక్తివంతులై సంభోగసుఖము ననుభవించునట్లు చేయును. ఇది నిత్యానందకరము, అత్యంత పౌరుషదాయకము, వాక్పుష్టిదాయకము, కవితాశక్తిప్రదము, సందర్భ సంవాదసిద్ధిప్రదము, సౌఖ్యారోగ్యప్రదము, మఱియు యౌవన కళాసామర్థ్యమును గలిగించును. ఈ రసాయనము వార్ధక్యావస్థను బోగొట్టి యువకులకుండు బలమును గలుగజేసి మృత్యువునుసహా జయించును. వేయేల! దీనిచే వ్యాధి సముదాయములు హరించి కాంతి ప్రతిభల నిచ్చును. మఱియు యోగాభ్యాసపరులు దీని నుపయోగించిన సంకల్పసిద్ధిని గలిగించును. అనగా లక్ష్యప్రాప్తికి సహాయకారిగనుండును. ఇదియునుంగాక స్త్రీలు సేవించిన పుత్రులుగలుగుదురు. దీనిచే శ్వాస, క్షయ, కాస, అర్శ, సగలాతిసార, మేహములు మఱియు రక్తసంబంధ రోగములతో బీడింపబడు రోగుల బాధలును నివృత్తించును.

## అకరాకరభాది రసాయనమ్.

శ్లో॥ అకరాకరభః శుంఠీ కంకోలం కుంకుమం కణా
జాతీఫలం లవంగంచ చందనంచేతి కార్షికాన్ ॥ 98.
చూర్ణానిమానతః కుర్యాదహిఫేనం పలోన్మితమ్
సర్వమేకీకృతం చూర్ణం మాషైకం మధునాలిహేత్ ॥ 99.

శ్లో॥ శుక్రస్తంభకరం చూర్ణం పుంసామానంద కారకమ్
నారీణాం ప్రీతిజననం సేవేత నిశికాముకః॥ 100.

తా:—అక్కలకర్ర, శుంఠి, తక్కోలములు, కుంకుమపువ్వు, పిప్పళ్లు, జాజికాయ, లవంగాలు, మంచిగంధము, ఇవి ప్రత్యేక మొకతులము. వీనిని మెత్తగా చూర్ణించి పిదప శుద్ధ నల్లమందు ఒక పలమును, అందు గలిపి చూర్ణించి తగినంత తేనెచేర్చి, లేహ్యమువలె చేయవలయును. దీని నుచిత ప్రమాణము పురుషులు ఒక మాసమువరకు సేవించిన శుక్రస్తంభన గలిగించి ఆనందము నిచ్చును. స్త్రీలకు కామప్రీతిని గలిగించును. కాముకు లీ లేహమును రాత్రి భాగమందు సేవించవచ్చును.

## ఖదిరాది రసాయనము.

తా:— చండ్రచేవ 16 పలములు, ముత్తవపులగము వేళ్లు 4 పలములు, మారేడు వేరు 4 పలములు, మానిపసుపు 4 పలములు, పెన్నేరుగడ్డ 4 పలములు. వీనిని దంచి 12 ప్రస్థముల జలములో వైచి అష్టమాంశముగ కాచి వడియగట్టిన కషాయమును, ఉసిరి కాయలు 4 పలములను జలములోవేసి నాల్గవ భాగము కాచిన కషాయము, 6 పలముల దాక్షపండ్లను ఆరు ప్రస్థముల నీళ్లలో వేసి, చతుర్థాంశముగ కాచిన కషాయము పై మూడు కషాయములను వడియగట్టి ఏకము చేసి అందు 16 పలముల బెల్లమును మఱియు 4 పలముల శర్కరయును, జేర్చి పాకముచేసి పిదప త్రికటుకములు, చాతుర్జాతకములు. లవంగపట్ట, జాపత్రి, చలవమిరియాలు, తాళీసపత్రి, మాధీఫలములోని కేసరములు, అతిమధురము, తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర,ఓమ, ధనియాలు, తేజఫలము(జమ్మి?), బావంచాలు, వాయువిడంగములు, పెన్నేరుగడ్డ, తక్కోలాలు, చిత్రమూలము, నేలగుమ్ముడు గడ్డ, నేలతాటిగడ్డ,సుగంధపాలవేళ్లు, కొడిశపాలగింజలు,తామరపువ్వు, అనువానిని ప్రత్యేకము 2 తులముల చొప్పున గ్రహించి దంచి వస్త్రగాళితముచేసిన చూర్ణమును మఱియు 16 తులముల ఆవు నేతిని పై పాకమందు వేసి బాగుగా కలియబెట్టి దించవలెను. సాంగ శీతలమైనపిదప దానిలో 16 తులముల తేనెను జేర్చి జాగ్రత్త పఱచవలెను. దీనిని సేవించినచో కాస, శ్వాస, వాతక్షోభ, క్షయ, ఉదరశూల, కృమి మొదలగు రోగములు శమించి, రక్తశుద్ధి మఱియు రక్తవృద్ధిని గలిగించి ఆరోగ్యమునిచ్చును.

## అవలేహ కల్పన.

కషాయాదులను పునః పాకముచేసి గట్టిపఱచినయెడల అవలేహమనబడును. దీనినే రసక్రియనియును మఱియు లేహమనియును అందురు. అవలేహముల ప్రమాణమును చెప్పనియెడల చూర్ణద్రవ్యములకు నాల్గురెట్లు చక్కెరయును, రెండురెట్లు బెల్లమును, నాల్గురెట్లు ద్రవద్రవ్యమును జేర్చవలెను. అనుపానము యోగ్యమైనవి అనగా పాలు, చెఱుకురసము, యూషము లేక పంచమూల కషాయము, అడ్డసరకషాయము అను వానిలో నేదానితోనైన నుపయోగించవచ్చును.

**సహస్రయోగ ప్రకాశిక యందలి అవలేహ ప్రకరణము సంపూర్ణము.**

## 8. అథ మానపరిభాషా ప్రకరణమ్.

శ్లో॥ నమానేన వినాయుక్తి ర్ద్రవ్యాణాం జాయతే క్వచిత్
అతః ప్రయోగ కార్యార్థే మానమత్రోచ్యతే మయా॥ 1.
యవోష్టసర్షపైః ప్రోక్తో గుంజాస్యాచ్చతుష్టయమ్
షడ్భిస్తు రక్తికాభిః స్యాన్మాషకో హేమధాన్యకా॥ 2.
మాషైశ్చతుర్భిః శాణః స్యాద్ధరణం తన్నిగద్యతే
టంకః సఏవ కథిత స్తద్ద్వయం కోలఉచ్యతే॥ 3.
క్షుద్రకో వటకశ్చైవ ద్రంక్షణః సనిగద్యతే
కోలద్వయంచ కర్షః స్యాత్సప్రోక్తః పాణిమానికా॥ 4.
అక్షః పిచుః పాణితలం కించిత్పాణిశ్చ తిందుకమ్
బిడాలపదకంచైవ తథా షోడశికా మతా॥ 5.
కరమధ్యం హంసపదం సువర్ణం కవలగ్రహః
ఉదుంబరంచ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే॥ 6.
స్యాత్కర్షాభ్యామర్థపలం శుక్తిరష్టమికా తథా
శుక్తిభ్యాంచ పలంజ్ఞేయం ముష్టిరామ్రం చతుర్థికా॥ 7.
ప్రకుంచః షోడశీ బిల్వం పలమేవాత్ర కీర్త్యతే
పలాభ్యాం ప్రసృతిర్జ్ఞేయా ప్రసృతశ్చ నిగద్యతే॥ 8.
ప్రసృతిభ్యామంజలిః స్యాత్కుడవోర్థ శరావకః
అష్టమానంచ సజ్ఞేయః కుడవాభ్యాంచ మానికా॥ 9.
శరావోష్టపలం తద్వత్ జ్ఞేయమత్ర విచక్షణైః
శరావాభ్యాం భవేత్ప్రస్థ శ్చతుఃప్రస్థై స్తథాఢకమ్॥ 10.
భాజనం కంసపాత్రంచ చతుః షష్టిపలం స్మృతమ్
చతుర్భిరాఢకై ర్ద్రోణః కలశో నల్వణోర్మణః॥ 11.
ఉన్మానంచ ఘటోరాశి ర్ద్రోణ పర్యాయ సంజ్ఞకాః
ద్రోణాభ్యాం సూర్పకుంభశ్చ చతుః షష్టిశరావకః॥ 12.
సూర్పాభ్యాంచ భవేద్ద్రోణీ వహాగోణీచ సాస్మృతా
ద్రోణీ చతుష్టయం ఖారీ కథితా సూక్ష్మ బుద్ధిభిః॥ 13.

చతుఃసహస్రి పలికా షణ్ణవత్యధికాచసా
పలానాం ద్విసహస్రించ భార ఏకః ప్రకీర్తితః॥ 14.
తులాపలశతం జ్ఞేయం సర్వత్రైష వినిశ్చయః
మాష టంకాక్ష బిల్వాని కుడవః ప్రస్థమాఢకమ్
రాశిర్ద్రోణః ఖారికేతి యథోత్తర చతుర్గుణాః॥ 15.

తా :— ఔషధ ద్రవ్యముల మేళనకు వానివాని పరిమాణమును తెలుసుకొనుట ఆవశ్యకము. అందుచేత మానపరిభాష ఈ క్రింది సూచింపబడుచున్నది. ఔషధాదులను మానపరిభాష ప్రకారము గ్రహించుట యుక్తము.

8 సర్షపములు (తెల్లఆవాలు) = 1 యవ యనియు, నాలుగు యవలు ఒక గుంజయనియు, 6 గుంజలు = 1 మాషమనియు, సువర్ణమాషకమనియు, 4 మాషములు = 1 శాణమనియు, ధరణమనియు, టంకమనియు చెప్పబడును. 2 శాణములు = 1 కోలమనియు, క్షుద్రికమనియు, వటకమనియు, ద్రంక్షణమనియు, 2 కోలములు = 1 కర్షమనియు, పాణిమానికయనియు, అక్షమనియు, పిచుయనియు, పాణితలమనియు, కించిత్పాణితమనియు, తిందుకమనియు, బిడాలపదకమనియు, షోడశికయనియు, కరమధ్యమనియు, హంసపదమనియు, సువర్ణమనియు, కబళగ్రహమనియు, ఉదుంబరమనియు చెప్పబడును.

2 కర్షములు = 1 అర్ధపలమనియు, శుక్తియనియు, అష్టమికాయనియు, 2 శుక్తులు = 1 పలమనియు, ముష్టియనియు, ఆమ్రమనియు, చతుర్థిక యనియు, ప్రకుంచమనియు, షోడశీయనియు, బిల్వమనియు, చెప్పబడును. 2 పలములు 1 ప్రసృతి లేక ప్రసృతమనియు, 2 ప్రసృతీలు = 1 అంజలి యనియు, కుడవమనియు, అర్ధశరావకమనియు, అష్టమానమనియు, 2 కుడవములు = 1 మానికయనియు, శరావమనియు, అష్టపలమనియు చెప్పబడును. 2 శరావములు = 1 ప్రస్థమనియు, 4 ప్రస్థములు = 1 ఆఢకమనియు, భాజనమనియు, కంసపాత్రమనియు, 64 పలములనియు, 4 ఆఢకములు = 1 ద్రోణమనియు, కలశమనియు, నల్వణమనియు, అర్మణమనియు, ఉన్మానమనియు, ఘటమనియు, రాశియనియు, చెప్పబడును. 2 ద్రోణములు = 1 సూర్పకుంభమనియు, 64 శరావకములనియు, 2 శూర్పకుంభములు = 1 ద్రోణీయనియు, వహాయనియు, గోణియనియు చెప్పబడును. 4 ద్రోణీలు = 1 ఖారియనియు, 4096 పలములనియు, 2000 పలములు = 1 భారమనియు, 100 పలములు = 1 తులాయనియు చెప్పబడును.

మాషము, శాణము, కర్షము, పలము, కుడవము, ప్రస్థము, ఆఢకము, ద్రోణము, ద్రోణి, ఖారి. ఇవి క్రమముగా నొకదానికంటె నొకటి నాల్గురెట్లు హెచ్చుగా నుండును. ఒక కర్షము ఒక తులమునకు సమానము. ఒక మాషము ఒక అణా తూకమునకు సమానము. ఒక శాణము నాల్గు అణాలతూకమునకు సమానము, ఒక కోలము ఒక అర్ధతులమునకు సమానము. ఒక శరావము 24 తులముల సేరుకు సమానము.

1 ద్రోణము = ఒక మణుగునకు సమానము.

శ్లో॥ శుష్కాణాం స్యాదిదం మానం ద్విగుణం తద్వద్రివార్ద్రయోః
నద్వైగుణ్యం తులామానే పలోల్లేఖాగతే తథా॥ 16.
శుష్కద్రవ్యేషు యన్మాన మార్ద్రస్య ద్విగుణం హితత్
శుష్కస్య గురుతీక్ష్ణత్వం తస్మాదర్థం ప్రయోజయేత్॥ 17.
శుష్కం నవీనం యద్ద్రవ్యం యోజ్యం సకల కర్మసు
ఆర్ద్రంచ ద్విగుణం దద్యా దేష సర్వత్ర నిశ్చయః॥ 18.

తా :— ఔషధయోగములందు శుష్కద్రవ్యములను ఉక్తప్రమాణముగ గ్రహించవలయును. పచ్చివి రెండురెట్లు చేర్చుకొనవలెను. కాని తులామానము నందున్నట్లు పలమానమందు పచ్చిద్రవ్యములను రెండురెట్లు చేర్చగూడదని కొందరి యభిప్రాయము. శుష్కద్రవ్యము గురువుగా నుండుటచేతను మఱియు తీక్ష్ణముగా నుండుటచేతను అర్ధభాగమునే యుపయోగించ వలయును. నూతనమైన శుష్కద్రవ్యములను అన్ని కర్మలందు ఉక్తప్రకార ముపయోగించు టుచితము. పచ్చి ద్రవ్యములను రెండురెట్లు చేర్చుకొనుట సర్వత్ర నిశ్చయింపబడినది.

శ్లో॥ గుడూచీ కుటజో వాసా కూష్మాండంచ శతావరీ॥ 19.
అశ్వగంధా సహచరా శతపుష్పా ప్రసారిణీ
ప్రయోక్తవ్యా సదైవార్ద్రా ద్విగుణం నైవకారయేత్॥ 20.

తా :— తిప్పతీగె, కొడిశపాలచెక్క, అడ్డసరము, బూడిదగుమ్మడు కాయ, శతావరి, అశ్వగంధ (పెన్నేరుగడ్డ), ముళ్ళగోరింట, సోయాగింజలు (బద్దసోపు) మఱియు ప్రసారిణి అనువానిని పచ్చిద్రవ్యములుగానే ఉక్తపరిమాణము చేర్చుకొనవలెను. పచ్చివి అయినప్పటికి రెండురెట్లు చేర్చగూడదు.

శ్లో॥ వాసా నింబ పటోల కేతకి బలా కూష్మాండ కేందీవరీ
వర్షాభూ కుటజాశ్వగంధ సహితాస్తాః పూతిగంధామృతాః॥
మాంసీ నాగబలా సహాచర పురా హింగ్వార్ద్రకే నిత్యశో
గ్రాహ్యస్తత్క్షణమేవ నద్విగుణితా యేచేక్షు జాతాఘనాః॥

తా :— అడ్డసరము వేరు, వేపచెక్క, చేదుపొట్ల, కేతకి (మొగిలి), ముత్తవపులగము వేళ్ళు, బూడిదగుమ్మడుకాయ, శతావరి, తెల్లగలిజేరు వేళ్ళు, కొడిశపాలచెక్క, అశ్వగంధ, (పెన్నేరుగడ్డ), కలుంగ్రానుగ, తిప్పతీగె, జటామాంసి, నాగబల, ముళ్ళగోరింట, గుగ్గిలము, ఇంగువ, అల్లము, బెల్లము, శర్కర, ఖండశర్కర, ఇత్యాది ఘనద్రవ్యములను రెండురెట్లు గ్రహించక పచ్చివి అయినను ఉక్తపరిమాణమునే చేర్చుకొనవలయును.

## 9. అథ భేషజాదిగ్రహణ ప్రకరణమ్.

శ్లో॥ లవణం సైంధవం ప్రోక్తం చందనం రక్తచందనమ్
చూర్ణలేహాసవాః సాధ్యాః ప్రాజ్ఞైర్ధవళచందనైః॥ 22.
కషాయలేపయోః ప్రాయో యుజ్యతే రక్తచందనమ్
పయః సర్పిః ప్రయోగేషు గవ్యమేవహి గృహ్యతే॥ 23.
శకృద్రసో గోమయకం మూత్రం గోమూత్ర ముచ్యతే
సిద్ధార్థః సర్షపేగ్రాహ్యాః ఉత్పలే నీలముత్పలమ్॥ 24.
కాలేనుక్తే ప్రభాతం స్యాదంగేనుక్తే జటాభవేత్
భాగేనుక్తేచ సామ్యంస్యాత్పాత్రేనుక్తేచ మృణ్మయమ్॥ 25.
ద్రవేనుక్తే జలం గ్రాహ్యం తైలేనుక్తే తిలోద్భవమ్
ఏకమప్యౌషధం యోగే యస్మిన్యత్పునరుచ్యతే॥ 26.
మానతో ద్విగుణం గ్రాహ్యం తద్ద్రవ్యం తత్త్వదర్శిభిః
వ్యాధేరయుక్తం యద్ద్రవ్యం గణోక్తమపి తత్ త్యజేత్॥ 27.
అనుక్తమపియుక్తం యద్యోజయేత్తత్ర తద్బుధః
కదాచిత్ ద్రవ్యమేకంహి యదియోగేన లభ్యతే॥ 28.
తత్తద్గుణయుతం ద్రవ్యం పరివర్తేన గృహ్యతే
ద్రవ్యాభావేత్తు తత్తుల్యం ద్రవ్యమేవ ప్రదీయతే॥ 29.
న్యగ్రోధాదేస్త్వచో గ్రాహ్యాః సారః స్యాద్బీజకాదితః
తాలీసాదేశ్చ పత్రాణి ఫలంస్యాత్ త్రిఫలాదితః॥ 30.
ధాతక్యా దేవపుష్పాణి స్నుహ్యాదేః క్షీరమాహరేత్
మహాంతి యానిమూలాని కాష్ఠగర్భాణి యాని చ॥ 31.
తేషాంతు వల్కలం గ్రాహ్యం సూక్ష్మమూలాని కృత్స్నతః
జాంగలానాం వయస్థానాం చర్మరోమ నఖాదికమ్॥ 32.
క్షీరమూత్ర పురీషాణి జీర్ణాహారేతు గ్రాహయేత్
చతుష్పత్సు స్త్రియః శ్రేష్ఠాః పుమాంసో విహగేషుచ॥ 33.
వల్మీక కుత్సితానూప శ్మశానో పరమార్గజాః
జంతువహ్ని హిమవ్యాప్తా నౌషధ్యః కార్యసాధికాః॥ 34.

శ్లో॥ శరద్యఖిల కార్యార్థం గ్రాహ్యాం సరసమౌషధమ్
విరేకవమనార్థంచ వసంతాంతే సమాహరేత్॥ 35.

తా:— ఔషధయోగములందు లవణమును చెప్పినప్పుడు సైంధవలవణమును చందనమని చెప్పినప్పుడు రక్తచందనమును, జేర్చుకొనవలయును. కాని చూర్ణ, ఆసవ, లేహములందు మంచిగంధమునే జేర్చుకొనవలయును. కషాయలేపములందు రక్తచందనము నుపయోగించుకొనవలయును. పాలు, నెయ్యి చెప్పినప్పుడు, ఆవుపాలు, ఆవునెయ్యి అనియును, శకృద్రసమునకు ఆవుపేడరసమనియును, మూత్రమునకు గోమూత్రమనియును, సిద్ధార్థములకు తెల్లఆవాలనియును, ఉత్పలమునకు నల్లకలువయనియును, తెలుసుకొనవలయును. ఔషధసేవనకాలము సూచించనప్పుడు, ఉదయమనియును, అంగమని జెప్పినప్పుడు ఉత్తమాంగమనియును, భాగమును నిరూపించనప్పుడు సమభాగమనియును, పాత్రి సూచించనప్పుడు మృణ్మయపాత్రి యనియును, ద్రవమును జెప్పనప్పుడు జలమనియును, తైలమును జెప్పనప్పుడు నువ్వులనూనెయనియును, తెలుసుకొనిచేర్చవలయును ఒక వస్తువును రెండుసార్లు చెప్పినప్పుడు ఆ వస్తువును రెండురెట్లు చేర్చవలయును. రోగమునకు విరుద్ధమైన వస్తువును యోగమందుచెప్పినచో అట్టిదానినివర్జించుటయును ఉపయుక్తమగు ద్రవ్యము లేనియెడల బుద్ధిమంతుడగు వైద్యుడు యుక్తమగు దానిని జేర్చవలయును. ఎన్నడైనను యోగమందుజెప్పబడిన ద్రవ్యము లభించనప్పుడు దాని రస, గుణ వీర్య విపాక ప్రభావములకు తుల్యమగు, వేరే ద్రవ్యమును జేర్చుకొనవలయును. కాని విడిచిపెట్టకూడదు. మర్రి మొదలగు మహావృక్షముల చెక్కలను, చంద్రిమొదలగు వాని చేవను, తాళీసాదుల పత్రములను, త్రిఫలములయొక్క బెరడును, ఆరెచెట్టుయొక్క పువ్వును, జముడుమొదలగువాని పాలను, పెద్దవృక్షములయొక్క వేళ్ళచెక్కను, చిన్నచెట్లయొక్క వేళ్ళను చేర్చుటయుక్తము. వయస్సులో సున్న అడవిజంతువులయొక్క చర్మ, రోమ, నఖములును, వానిమూత్రమును, మలమును మఱియు వాని క్షీరమును జేర్చుకొనవలసినప్పుడు వానికిచ్చిన యాహారము జీర్ణమైనపిదప గ్రహించవలయును. చతుష్పాద జంతువులలో ఆడువియున్ను, పక్షులలో మగవియును శ్రేష్ఠమైనవి. పుట్టలు, అపరిశుద్ధ ప్రదేశము, అనూప ప్రదేశము, శ్మశానము, చౌడుభూమి, మార్గస్థలము, నిప్పు, మంచుగల భూములు, ఇట్టి ప్రదేశములందలి ఓషధులు నిషిద్ధములు. శరదృతువునందు సంగ్రహించిన ఓషధులు ప్రయోజనకారులు. విరేచన, వమన కర్మలకు వలయు ఓషధులు వసంత ఋతువుయొక్క అంతమందు సంగ్రహించవలయును.

శ్లో॥ ధన్వ సాధారణే దేశే సమే సన్మృత్తికే శుచౌ
శ్మశాన చైత్యాయతన శ్వభ్ర వల్మీక వర్జితే॥ 36.
మృదౌ ప్రదక్షిణ జలే కుశరోహిష సంస్తృతే
అఫాల కృష్టే నాక్రాంతే పాదపై ర్బలవత్తరైః॥ 37.

శ్లో॥ అస్యాతే భేషజం జాతం యుక్తం వర్ణ రసాదిభిః
జంత్వజగ్ధం దవా దగ్ధమవిదగ్ధంచ వైకృతైః॥ 38.
భూతైశ్చాయాతపాంబ్వాద్యైర్యథా కాలంచ సేవితమ్
అవగాఢ మహామూల ముదీచీం దిశమాశ్రితమ్॥ 39.

తా :— నిర్జలప్రదేశము, సాధారణ ప్రదేశము, సమతలప్రదేశము, శుభ్రమైన ప్రదేశము, చైత్యములు, రంధ్రములు, పుట్టలు అనునవి లేని ప్రదేశము మృదువైనట్టిదియును, కుడిప్రక్కన నీరుగలదియును, కుశకాశగడ్డి గలదియును, కృములు, వృక్షములు, ఉచ్ఛిష్టము, ఇట్టివి లేనిదియును జంతువులను పూడ్చనటువంటిదియును, అగ్నిచే దగ్ధము కానట్టిదియును, కంటికింపుగా నున్నట్టిదియును, భూతములచే వాసము కానట్టిదియును, మఱియు అతినీడ, అతిసూర్యరశ్మి లేనట్టిదియును అగు ప్రదేశమందు ఉత్తర దిక్కునకు వ్యాపించినట్టివియును, చేతితో లాగిన శులభముగా పైకివచ్చునట్టివియునగు ఓషధులను యథోక్తకాలమందు గ్రహించిన యుపయోగకారులు.

శ్లో॥ అథ కల్యాణచరితః శ్రాద్ధః శుచిరుపోషితః
గృహ్ణీయాదౌషధం సుస్థం స్థితం కాలేచ కల్పయేత్॥ 40.
సక్షీరం తదసంపత్తౌ వనతిక్రాంత వత్సరమ్
ఋతేగుడ ఘృతక్షౌద్ర ధాన్యకృష్ణా విడంగతః॥ 41.

తా :— సకాలమున శుచిర్భూతుడైన వైద్యుడు శ్రద్ధగా ఉపవాసముచేసి లోకహితార్థము మంచి స్థితిలో నుండు వనస్పతులను కల్పమందుపయోగించవలయును. ఒక సంవత్సరముకంటె పైబడని వనస్పతులను సేకరించవలయును. బెల్లము, నెయ్యి, తేనె, ధాన్యము, పిప్పళ్ళు, వాయువిడంగములు, అనునవి ప్రాతవిగను, మిగిలినవి ఒక వత్సరమునకు పైబడనవిగను గ్రహించవలయును. కొన్ని ఓషధులను పాలతో నియ్యవలెను.

శ్లో॥ పయో వాత్సాయనం గ్రావ్యాం విణ్మూత్రం తచ్చ నీరుజమ్
వయో బలవతాం ధాతు పిచ్ఛ శృంగ ఖురాదికమ్॥ 42.

తా :— దూడగలదియును, దినమునకు రెండుసార్లు పాలు తీయబడునదియును, వయస్సులో నున్నదియును, రోగరహితమైనదియును, ఇట్టి లక్షణములుగల ఆవుయొక్క పాలు, పేడ, మూత్రము, గోరోజనము, కొమ్ములు మఱియు డెక్కలు ఔషధములలో జేర్చదగినవి.

శ్లో॥ సద్యః సముద్ధృత క్షుణ్ణాద్యః స్రవేత్ పటపీడనాత్
స్వరసః ససముద్దిష్టః కల్కః పిష్టో ద్రవాప్లుతః॥ 43.

శ్లో॥ చూర్ణోత్సృతః శృతః క్వాథః శీతో రాత్రౌ ద్రివేస్థితః
సద్యో భిషంగ పూతస్తు ఫాంట ఇత్యుచ్యతే బుధైః॥ 44.

తా :— సకాలములో గ్రహించిన ఓషధిని దంచి బట్టలోవేసి పిండగా వచ్చు ద్రవము స్వరసమనబడును. ద్రవ్యమును చూర్ణించి ద్రవముతో నూరి చేసిన ముద్దకు కల్కమని పేరు. సంగ్రహించిన ద్రవ్యములనుదంచి వస్త్రగాళితము చేసినదానికి చూర్ణమని పేరు. యోగములందు జెప్పబడిన ఔషధ ద్రవ్యములను ఉక్త ప్రమాణముగా గ్రహించి బాగుగా దంచి తగినంత నీటిలోవేసి కాచి వడియగట్టిన దానికి కషాయమనియును మఱియు శృతమనియును పేర్లు. ద్రవ్యములను చూర్ణించి మరుగుచున్న నీటిలోవేసి వెంటనే వడియగట్టిన దానికి ఫాంటమని పండితులు వ్యవహరించెదరు.

శ్లో॥ పాకస్తు త్రివిధో మందశ్చిక్కణః ఖరచిక్కణః
మందః కల్క సమే కించి చ్చిక్కణో మదనోపమః॥ 45.

కించిత్సీదతి కృష్టేచ వర్తమానేచ పశ్చిమః
దగ్ధోత ఊర్ధ్వం నిష్కార్యః స్యాదామస్త్వగ్నిసాదకృత్॥ 46.

మృదుర్నస్యే ఖరోభ్యంగే పానే వస్తౌచ చిక్కణః॥ 47.

తా :— పాకము, మంద, చిక్కణ, ఖరచిక్కణములని మూడువిధములు. కల్కముతో యథావిధి పాకము చేయబడినది మందపాకమనియును, రమ్యముగానుండి జిగటగానున్న యెడల చిక్కణ పాకమనియును, జిగటతగ్గిపోయి క్రిందవేసిన పడునదియును, నలుపైనదియును ఖరచిక్కణ పాకమనబడును. హెచ్చుపాకమై, కాలిపోయినది దగ్ధ పాకమనబడును. ఇది పనికిరాదు. తక్కువపాకమైనది అనగా లేతపాకము అగ్నిమాంద్యమును గల్గించును. మృదుపాకము నస్యకర్మకును, ఖరపాకము అభ్యంగమునకును, చిక్కణ పాకము పానవస్తి ఇత్యాది కర్మలకు నుపయుక్తమైనది.

## పాకలక్షణమ్.

శ్లో॥ నాంగులి గ్రాహితా కల్కేన స్నేహగ్నౌ సశబ్దతా
వర్ణాది సంపచ్చ యదా తదైనం శీఘ్రమావహేత్॥ 48.

తా :— కల్కము వ్రేలుకు అంటనప్పుడును, నిప్పులో వేసిన చిటపట శబ్దము రానప్పుడును, వర్ణ, గంధ, రసములతో కూడియుండినప్పుడును, సరియైనపాకము వచ్చినదని గ్రహించి పాత్రను పొయ్యిమీదినుంచి క్రిందకు దింపవలయును.

శ్లో॥ తైలస్య కల్కం సంచూర్ణ్య బుధః సంమర్ద్య యోజయేత్
ఘృతస్య కల్కం మతిమాన్ జర్జరీకృత్య యోజయేత్॥

తా :— తైలములో కల్కద్రవ్యములను చూర్ణించి పిదప నీటితోనూరి జేర్చ వలయును. ఘృతములోజేర్చవలసిన కల్కద్రవ్యములను చూర్ణించి పిదపనీటిలో నానబెట్టి వేయవలయును.

శ్లో॥ అమర్దితం తైలకల్కం నచక్షుష్యం భవేన్నృణామ్
మర్దితం ఘృతకల్కంచ తేజోధాతు క్షయంభవేత్॥ 50.

తా :— అమర్దితమైన కల్కముచే సిద్ధముచేయబడిన తైలము నేత్రములకు హితము కాదు మఱియు ద్రవముచే మర్దితమైన కల్కముచే సిద్ధమైన ఘృతము తేజస్సును మఱియు ధాతువులక్షయమును గలుగజేయును.

శ్లో॥ మృద్వగ్నినా పచేత్తస్య పునః పాకం శనైః శనైః
ఏతత్తైలం మహావీర్యం త్రిదోష శమనం పరమ్॥ 51.

తా :— తైలమును మఱియు ఘృతము మందాగ్నిచే పక్వము చేయవలయును. అట్టి తైలము లేక ఘృతము మహావీర్యవంతమై త్రిదోషముల నుపశమింప జేయుటకు శ్రేష్ఠమైనది.

శ్లో॥ ఘృతంవా తిలతైలంవా లేహ్యంవా విపచేద్భిషక్
నేత్రౌషధార్థ విశేషేణ విషవృక్షేంధనం త్యజేత్॥ 52.

తా :— ఘృతము, తైలము, లేక లేహ్యము, అనునవి పాకము చేయునప్పుడు వైద్యుడు విషవృక్షములయొక్క కఱ్ఱలనుపయోగించ గూడదు. అందులో ముఖ్యముగా కంటికి సంబంధించిన మందులు నిర్మించునప్పుడు విషవృక్షముల యొక్క కఱ్ఱలను త్యజించ వలెను. సుతరాం పనికిరావు.

శ్లో॥ ధన్వంతరిం గరుత్మంతం పావకం సూర్యమశ్వినౌ
అచ్యుతం చామృతం చైవ స్మరేదౌషధ కర్మణి॥ 53.

తా :— ఔషధములను నిర్మించునప్పుడు, ధన్వంతరిని, గరుత్మంతుని, అగ్నిదేవుని సూర్యుని, అశ్వినీదేవతలను, విష్ణుమూర్తిని మఱియు అమృతమును స్మరించవలయును.

శ్లో॥ పంచషడ్దివసైః క్వాథే ద్రవ్యాద్వీర్యం విముంచతి
కల్కద్రవ్యయుతం స్నేహాం పీడయేత్ పంచభిర్దినైః॥ 54.

తా :— ద్రవ్యములను క్వాథముగ కాచి అట్లనే 5 లేక 6 దినములుంచి 6వ దినమునగాని 7 దినమునగాని వడియగట్టినచో వాటి శక్తిలేక వీర్యము క్వాథములోనికి విడుదలయగును. మఱియు స్నేహమందు ద్రవ్యములయొక్క కల్కమునుజేర్చి 5 దినము లుంచి పిదప పాకముచేసి వడియగట్టిన కల్కములోని వీర్యము స్నేహములోనికి విడుదల యగును.

శ్లో॥ లాజా మాష కులత్థ ముద్గ లశునా శుంఠీ యవా క్వాథయేత్
సద్యోహ్నైవ కషాయ పాకవిధినా స్నేహేన సంయోజయేత్॥
కుర్యాత్పీడన మేకరాత్ర పరతః సౌవీరతక్రాన్వితే
స్నేహే మస్తు పయోరసైశ్చ సహితే ద్వాభ్యాం దినాభ్యాంపరమ్॥

తా :— వరిపేలాలు, మినుములు, ఉలవలు, పెసలు, వెల్లుల్లి, శుంఠి, యవలు, అనువానికాథము సిద్ధముచేసి అదేదినమున స్నేహముతో జేర్చి యథావిధి పాకముజేయవలెను. సౌవీరగంజి మఱియు మజ్జిగ, జేర్చిన స్నేహము ఒకరాత్రి యుంచి పరదినమందు పాకముజేసి వడియగట్టి యుపయోగించవలెను. పెరుగునీళ్లు (మస్తు) పాలు, మాంసరసము అనువానిని స్నేహముతో జేర్చి రెండుదినములుంచి పిదప యథావిధి పాకముచేయవలయును.

---

## 10. అథ స్నేహపాక పరిభాషా ప్రకరణమ్.

శ్లో॥ స్నేహాచ్చతుర్గుణో ద్రవః స్నేహాచతుర్థాంశో భేషజ కల్కః
తద్వైకథ్యం సంసృజ్య విపచే దిత్యేష స్నేహపాక కల్పః॥ 1.
స్నేహ భేషజ తోయానాం ప్రమాణం యత్ర నేరితమ్
తత్రాయం విధిరాస్థేయో నిర్దిష్టే తత్తదేవతు॥ 2.

తా :— స్నేహమునకు నాలుగురెట్లు ద్రవపదార్థమున్ను, నాల్గవభాగము కల్కమును జేర్చి పాకము చేయవలయును. ఇదియే స్నేహపాకవిధి. స్నేహము, కల్కము, ద్రవము అనువాని పరిమాణములు జెప్పనప్పుడు పైన జెప్పబడిన ప్రకారము చేర్చుకొని యథావిధి పాకము జేయవలయును.

శ్లో॥ యత్ర ద్రవాంతరం నోక్తం తత్రక్షీరం చతుర్గుణమ్
ద్రవాంతరప్రయోగేతు క్షీరం స్నేహసమం మతమ్॥ 3.

తా :— ఎచ్చట స్వరస, కషాయాది ద్రవ ద్రవ్యములు చెప్పబడలేదో అచ్చట పాలు నాలుగురెట్లుచేర్చి పాకము చేయవలయును. ద్రవద్రవ్యములు చెప్పి, కల్కద్రవ్యములు చెప్పనప్పుడు స్నేహమునకు సమము పాలు చేర్చి పాకము చేయవలయును. ఇది ఒక మతము.

శ్లో॥ అకల్కః ఖలు యః స్నేహః ససాధ్యః కేవలే ద్రవే

తా :— యోగమందు ఔషధ ద్రవ్యములను జెప్పి కల్కద్రవ్యములను జెప్పనప్పుడు పై ఔషధ ద్రవ్యములనే ఉచితప్రమాణముగా గ్రహించి కల్కముచేసి స్నేహపాకము చేయవలెను.

శ్లో॥ మృదౌ చతుర్గుణం దేయం కఠినేష్టగుణం జలమ్
కఠినాత్యఠినం యత్ర తత్ర షోడశికం జలమ్॥ 4.

మృద్వాదౌ ద్రవసంఘూతే మానానుక్తౌ చికిత్సకాః
మధ్యస్యోభయ భాగిత్వాదిచ్ఛం త్యష్టగుణం జలమ్॥ 5.

తా :— మృదువైన పదార్థములలో నాలుగురెట్లు జలమున్ను, కఠినమైన వస్తువులలో ఎనిమిదిరెట్లు జలమున్ను, చాలా కఠినమైన ద్రవ్యములలో 16 రెట్లు జలముపోసి ఒక భాగము మిగులునట్లు కాచవలయును. ఒకప్పుడు పై మూడున్ను అనగా మృదు, కఠిన మఱియు కఠినాత్యఠిన ద్రవ్యములను యోగములందు జెప్పబడిన యెడల వైద్యులు మధ్యమ తరగతిభాగము అనగా వీనిని 8 రెట్లు జలములోపోసి ఒకభాగము మిగులునట్లుగ కాచవలయును.

శ్లో॥ క్వాథాదష్టగుణం వారి పాదస్థం స్యాచ్చతుర్గుణమ్
స్నేహాత్ స్నేహసమం క్షీరం కల్కస్తు స్నేహపాదికః
చతుర్గుణం త్వష్టగుణం ద్రవద్వైగుణ్యతో భవేత్॥ 6.

తా :— కషాయద్రవ్యములకు 8 రెట్లు నీరున్ను, స్నేహమునకు నాలుగురెట్లు కషాయమున్ను, స్నేహమునకు సమము పాలున్ను, కల్కము స్నేహములో నాల్గవభాగమున్ను, జేర్చవలయును. కషాయవస్తువులలో ద్రవదద్రవ్యములను నాలుగు రెట్లుగాని, 8 రెట్లుగాని చేర్చవలయునని రెండువిధములుగా జెప్పబడినది.

శ్లో॥ క్వాథే తోయనాత్ ప్రాయః ప్రమాదాత్ పరిశేషితే
ఆక్షిప్య పూర్వతోయార్ధం త్రిభాగం విపచేత్తతః॥
మహావీర్య మిదం విద్యాత్ పశ్చాచ్ఛుష్కం విషోపమమ్॥ 7.

తా :— ఒకవేళ ప్రమాదముచే క్వాథములోని ద్రవము పూర్తిగా యింకిపోయినచో తిరిగి మొదట చేర్చిన ద్రవమును అర్ధభాగముచేర్చి మూడవభాగమునకు కాచవలయును. ఈ ప్రకారము చేసిన యెడల మిక్కిలి శక్తివంతమగును. మూడవసారి కూడ ఇంకిపోయి తిరిగి పైప్రకారము చేసినచో విషతుల్యమగును. కావున పారవేయవలయును.

## కషాయ సేవన కాలః.

శ్లో॥ రాత్రౌ భుక్త్వా పిబేత్ క్వాథ మభుక్త్వాచ దివా పిబేత్
భోజనాదౌ తదంత్యేచ క్వాథకాలం ప్రశస్యతే॥ 8.

తా :— రాత్రి భోజనానంతరమునను, పగలు పూర్వమందును, క్వాథమును త్రాగవలయును. భోజనమునకు పూర్వమందున్ను దాని అంతమందును క్వాథమును సేవించుటకు ప్రశస్తమైన కాలములు.

శ్లో॥ కషాయేషు యవాగూషు పానీయేషు యథాక్రిమమ్
పలం తదర్థం తస్యార్థం ద్రవ్యమాహుర్మనీషిణః॥ 9.
ప్రస్థార్థం ద్విగుణం తస్మాత్ ద్విగుణంచ జలం స్మృతమ్
అష్టభాగం చతుర్భాగ మర్థభాగంచ శేషయేత్॥ 10.

తా :— కషాయము యవాగు మఱియు పానీయము వీనిని సిద్ధముచేయునప్పుడు ఈ క్రిందవ్రాసిన ప్రకారము చేయవలయును :—

ఒక ప్రస్థము నీటిలో ఒక పలము ఔషధ ద్రవ్యములనువేసి అష్టమాంశముగ కాచబడినది 'కషాయమనబడును. అర్థపలము ఓషధులను అర్థప్రస్థము నీటిలోవేసి చతుర్థాంశముగ కాచబడినది గంజి లేక యవాగూ అనబడును. ఒక పావుపలము ఓషధులను అర్థప్రస్థము జలములో వేసి అర్థభాగమునకు కాచబడినది పానీయమనబడును.

శ్లో॥ క్షీరే ద్విరాత్రిం స్వరసే త్రిరాత్రం
స్నేహే కషాయేషుచ పంచరాత్రిమ్
గుడేన యుక్తేషు యథాఖిలేషు
వింశద్దినం పాకవిధిః క్రిమాత్ స్యాత్॥ 11.

తా :— ఘృత తైలాదులలో పాలు చేర్చినచో 2 రాత్రులును, స్వరసము చేర్చినచో 3 రాత్రులును, కషాయము చేర్చినచో 5 రాత్రులును క్రమముగానుంచి పాకము చేయవలెను. కషాయాదులలో బెల్లము చేర్చినచో 20 దినములుంచవలయును.

శ్లో॥ పత్ర కంద లతా చర్మ మూలం వీర్యం విముంచతి
ఏకద్విత్రిచతుః పంచదినాత్ పాకక్రిమేణతు॥ 12.
ఘృత తైల గుడాదీంశ్చ నైకాహాదవతారయేత్
వ్యుషితాస్తు ప్రకుర్వంతి విశేషేణ గుణాన్ యతః॥ 13.

తా :— ఆకులు, గడ్డలు, తీగె, చెక్క మఱియు మూలములు అనువాని వీర్యములు క్రమముగా 1, 2, 3, 4 మఱియు 5 దినములలో స్నేహములోనికి విడుదలయగును. ఘృత, తైల, లేహాదులు, ఒకేదినమున సిద్ధముచేసి పొయ్యిమీదనుంచి క్రిందకు దింపకూడదు. ఆలస్యముగా పాకము చేసినచో విశేష గుణకారులగును.

శ్లో॥ ఘృతస్య ఫేనో పరమ స్తైలస్యచ తదుద్భవః
లేహస్య తంతు మత్తాప్సు మజ్జనం రణనం నచ॥ 14.

తా :— తైలము మఱియు ఘృతము పాకము చేయునప్పుడు పైకి నురుగు వచ్చినచో పాకము సిద్ధమైనట్టు తెలుసుకొనవలయును. లేహమునకు తీగపాకము వచ్చినను మఱియు నీటిలో వేసిన మునిగినను సరియైన పాకము వచ్చినట్లు గ్రహించవలెను.

## 11. అథ చూర్ణపరిభాషా ప్రకరణమ్.

శ్లో॥ అత్యంత శుష్కం యద్ద్రవ్యం సుపిష్టం వస్త్రగాళితమ్
తత్ స్యాచ్చూర్ణం రజః క్షోదస్తన్మాత్రా కర్షసమ్మితా॥
చూర్ణే గుడః సమో దేయః శర్కరా ద్విగుణా భవేత్
చూర్ణేషు భర్జితం హింగు దేయం నోత్క్లేద కృద్భవేత్॥
లిహేచ్చూర్ణం ద్రవైః సర్వైః ఘృతాద్యైర్ద్విగుణోన్మితైః
పిబేచ్చతుర్గుణై రేవ చూర్ణమాలోడితం ద్రవైః॥

తా :— యోగమందు జెప్పబడిన ద్రవ్యములు బాగుగా నెండిన తరువాత దంచి వస్త్రగాళితముచేయబడినది చూర్ణమనియును, రజమనియును, మఱియు క్షోదమనియును వ్యవహరించ బడుచున్నది. దీని మాత్ర ఒకకర్షము. చూర్ణమునకు సమము చక్కెరగాని బెల్లముగాని జేర్చి సేవించవచ్చును. ఇంగువను జెప్పినప్పుడు దానిని నేతితో వేయించి యుపయోగించ వలయును. లేనియెడల ఉత్క్లేశా ద్యుపద్రవములను గలిగించును. చూర్ణములో నెయ్యి మొదలగువానిని జేర్చవలసినప్పుడు రెండురెట్లు చేర్చి సేవించవలయును. స్వరసములను జేర్చవలసినప్పుడు చూర్ణమునకు నాలుగురెట్లుండ వలెను.

### భావనా విధిః.

శ్లో॥ భావ్య ద్రవ్య సమం క్వాథం క్వాథాదష్టగుణం జలమ్
అష్టాంశ శేషితః క్వాథో భావ్యానాం తేన భావనమ్॥
ద్రవేణ యావతా సమ్యక్ చూర్ణం సర్వం ప్లుతం భవేత్
భావనాయాః ప్రమాణంతు చూర్ణే ప్రోక్తం భిషగ్వరైః॥
దివా దివాతపే శుష్కం రాత్రౌ రాత్రౌ నివాసయేత్
శుష్కం చూర్ణీకృతం ద్రవ్యం యథోక్తం భావనావిధిః॥

తా :— భావనకు జెప్పబడిన ద్రవ్యములనుండి స్వరసముగాని-చో అట్టి ద్రవ్యములందు 8 రెట్లు జలముపోసి అష్టమాంశ కషాయముగ కాచి వడియగట్టి దానితో భావన చేయవలయును. భావనకు జెప్పబడిన స్వరసమునుగాని కషాయమునుగాని చూర్ణము మునుగు వరకు దానిలో పోయవలయునని వైద్యులచే జెప్పబడినది. ఆ ప్రకారము భావనచేయబడిన చూర్ణమును పగలు ఎండలో శుష్కముచేసి రాత్రిభాగమందు భావనకు జెప్పబడిన ద్రవమును బోసి యుంచవలయును. ఈ క్రమము రేడుదినముల పర్యంతము చేసి ఎండిన తరువాత చూర్ణము చేయవలయును. దీనినే భావన యందురు.

---

## 12. అథ గుటికా పరిభాషా ప్రకరణమ్.

శ్లో॥ వటకాశ్చాథ కథ్యంతే తన్నామ గుటికా వటీ
మోదకో వటకః పిండీ గుండీ వర్తిస్తథోచ్యతే॥ 1.
లేహవత్సాధ్యతే వహ్నౌ గుడో వా శర్కరాథవా
గుగ్గులుర్వా క్షిపేత్తత్ర చూర్ణితం నిర్మితావటీ॥ 2.
కుర్యాదవహ్నిసిద్ధేన క్వచిద్గుగ్గులునా వటీమ్
ద్రవేణ మధునా వాపి గుటికాం కారయేద్బుధః॥ 3.
గుడవద్గుగ్గులో పాకః సంబంధస్తు విశేషతః
మండూరాణాంచ సర్వేషాం పాకోయం పరికీర్తితః॥ 4.
సితా చతుర్గుణా దేయా వటీషు ద్విగుణో గుడః
చూర్ణాచ్చూర్ణసమః కార్యో గుగ్గులుర్మధుతత్సమమ్
ద్రవంచ ద్విగుణం ప్రోక్తం మోదకేషు భిషగ్వరైః॥ 5.

తా:—వటక, వటి, మోదక, పిండి,గుండి,వటక, వర్తి అనునవి గుటికలనుపర్యాయపదములు. లేహమునకు వలెనే బెల్లము, శర్కర, గుగ్గులు, వీటిలో దేనినైనా పాకముచేసి అందు చూర్ణమును వైచి గుటకలు నిర్మించవలయును. ఒకప్పుడు వైవానిని పాకము చేయకనే కేవలము చూర్ణములో గుగ్గులు, లేక ద్రవద్రవ్యము లేక తేనెచేర్చి వైద్యులు గుటికలు చేయుదురు. బెల్లమును పాకము చేసినట్లు గుగ్గిలమును, పాకముచేయవలయును. ఇది విశేషముగా మండూరాదులను పాకముజేయుటకు పనికివచ్చును. సమస్తవటుకముల నీక్రింది విధముగ పాకము చేయవలెను.

చూర్ణమునకు నాలుగురెట్లు శర్కరయును, లేక రెండురెట్లు బెల్లమున్ను, చూర్ణమునకు సమము గుగ్గులున్ను వీనికి సమము తేనెయును జేర్చి వటకములు చేయవలయును. మోదకములు నిర్మించునప్పుడు చూర్ణములలో రెండురెట్లు ద్రవద్రవ్యములను జేర్చవలయునని వైద్యులచేత జెప్పబడినది.

---

## 13. అథ అవలేహ పరిభాషా ప్రకరణమ్.

శ్లో॥ క్వాథాదీనాం పునః పాకాద్ఘనత్వం సా రసక్రియా
సోవలేహశ్చ తన్మాత్రా స్యాత్పలోన్మితా॥ 1.
సితా చతుర్గుణా దేయా చూర్ణాచ్చ ద్విగుణో గుడః
ద్రవం చతుర్గుణం దద్యాదితి సర్వత్ర నిశ్చయః॥ 2.

తా :— క్వాథాదులను వడియగట్టి తిరిగి గట్టిపడువరకు పాకముచేసిన రసక్రియ యనబడును. అట్టి రసక్రియ యొక్కయు మఱియు అవలేహము యొక్కయు ప్రమాణ మొకపలము. కషాయమందు శర్కర నాలుగురెట్లున్ను బెల్లము చూర్ణమునకు రెండు రెట్లున్ను వేయవలెను. లేక ద్రవద్రవ్యమును నాలుగుపాళ్ళు చేర్చి తిరిగి కాచి చూర్ణము లను మఱియు కల్కములను చేర్చి వండవలయును. ఇది సర్వత్రి ప్రమాణముగ నిశ్చ యింపబడినది.

శ్లో॥ గృహీత్వా క్వాథ కల్కేన క్వాథం పూతం పునః పునః
క్వాథయేత్ ఫాణితాకారం ఏషా ప్రోక్తా రసక్రియా॥ 3.

తా :— కల్పమందు జెప్పబడిన క్వాథమును గ్రహించి వడియగట్టి తిరిగి గట్టిపడు వరకు పాకము చేసిన రసక్రియయని వ్యవహరించెదరు.

శ్లో॥ ప్రాయేణ పాకాశ్చూర్ణానాం భూరిచూర్ణస్య తస్యచ
ఆసన్నపాకే ప్రక్షేపః స్వల్పస్య పాకమాగతే॥ 4.

తా :— చూర్ణము హెచ్చుగానున్నప్పుడు, హెచ్చుపాకము చేయకూడదు. చూర్ణము స్వల్పముగా నున్నను ఆసన్నపాకమందు జేర్చవలయును.

శ్లో॥ సుపక్వే తంతు మత్త్వం స్యా దవలేహోప్సు మజ్జనమ్
స్థిరత్వం పీడితే ముద్రా గంధ వర్ణ రసోద్భవః
రసోగంధః శుభః పాకేవర్తిః స్యాద్గాఢ మర్దనాత్॥ 5.

తా :— సరియైన లేహపాకము వచ్చినప్పుడు అట్టిపాకము చేతికి తీగెవలె అంటు కొనుటయును, నీటిలో వేసిన మునుగుటయును, కదలకుండా యుండుటయును, చేతితో నదిమిన చేతిరేఖలు పడుట యును మఱియు గంధరసవర్ణము లుండుటయును, అనునీ లక్షణములుండిన శుభకరము. మఱియు దీనిని గాఢముగా చేతిలో నలిపిన వత్తివలె నగును.

---

## 14. అథ ఆసవారిష్ట పరిభాషా ప్రకరణమ్.

శ్లో॥ ద్రవేషు చిరకాలస్థం ద్రవ్యం యత్సంధితం భవేత్
ఆసవారిష్ట భేదైస్తత్ప్రోచ్యతే భేషజోచితమ్॥ 1.
యదపక్వౌషధాంబుభ్యాం సిద్ధం మద్యంస ఆసవః
అరిష్టక్వాథసిద్ధః స్యాత్తన్మానం ద్విపలోన్మితమ్॥ 2.
అనుక్త మానారిష్టేషు ద్రవద్రోణే గుడాత్తులామ్
క్షౌద్రం దద్యాద్గుడాదర్ధం ప్రక్షేపం దశమాంశకమ్॥ 3.

తా :— ద్రవ్యములను ఉక్తప్రమాణముగ గ్రహించి చూర్ణించి నీళ్లలోవేసిఅందు బెల్లము, ఆరెపువ్వువేసి ఒకమాసము వరకుంచి పిదప వడియగట్టి యుపయోగించవలెను. దీనినే ఆసవమనియును అరిష్టమనియును వ్యవహరించెదరు. కాని ద్రవ్యము నీటితో పక్వము కాక సిద్ధమైనది ఆసవమనియును, ద్రవ్యములను నీటిలోవేసి కషాయముగ కాచి అందు బెల్లము లేక తేనె లేక శర్కర చేర్చి ఉక్తకాల పర్యంతముంచి వడియగట్టి సిద్ధముచేయ బడినది అరిష్టమనియును వ్యవహరించబడును. దీని ప్రమాణము రెండుపలములు, ఈ యాస వారిష్టములు సిద్ధముచేయునప్పుడు వానివాని ప్రమాణములు చెప్పనప్పుడు ఒకద్రోణము జలమునకు 100 పలములు బెల్లమున్ను, బెల్లమున కర్ధభాగము తేనెయున్ను మఱియు కల్కద్రవ్యములు దశాంశ భాగమున్ను జేర్చవలయును.

---

## 15. అథ సంకేత ప్రకరణమ్.

శ్లో॥ పంచమూలం మహద్విశ్వా రసోనంచ శతావరీ
గుడూచీ మార్ద్రకం చైవ త్వక్ఛేద్యాః పరికీర్తితాః॥ 1.

తా:— మహాపంచమూలములు, శుంఠి, వెల్లుల్లి, శతావరి, తిప్పతీగె, మఱియు అల్లము అను వానిపై పొర తీసివేసి యుపయోగించవలయును.

శ్లో॥ పాఠాచ చవికానంతా లోహితా పుష్పికాపిచ
పిప్పలీ మూల మిత్యేషాం మూలమేవ ప్రయోజయేత్॥ 2.

తా:— విషబొద్ది, చవ్యము, నల్లసుగంధపాల మఃలుమోదుగు (రక్తపుష్ప పిప్పలీ మూలము (మోడి) అనువాని మూలములను పొట్టు తీయకనే ఉపయోగించవలెను.

శ్లో॥ జంబూ కరంజ యుగ్మ వత్స కసేరు లోధ్ర
భూర్జారి మేద ధవ తింతిడి చూత నింబాత్
క్షీరిద్రుమారఖు వరాంగ కదంబ పార్థాత్
గ్రాహ్యాస్త్వచో వరుణ పీలు పలాశ వృక్షాత్॥ 3.

తా:— నేరేడు, రెండు విధముల క్రానుగ, కొడిశపాల, కసేరు, లొద్దుగ, భూర్జపత్రము, మురికితుమ్మ, బకవృక్షము (మోదెన) చింత, మామిడి, వేప, క్షీరివృక్షములు, పెద్దమాని, దాక్షిణి, కదంబము, తెల్లమద్ది, ఉలిమిరి, గోగు, లేక వరగోగు, మోదుగు అను వాని చెక్కలనే గ్రహించవలయును.

శ్లో॥ అలర్కశ్చామృతా బ్రాహ్మీ కూష్మాండోలాఖురేవచ
శారవల్లీ పటోలీచ తన్మూలం నప్రయోజయేత్॥ 4.

తా:— తెల్లజిల్లెడు, తిప్పతీగె, బ్రాహ్మి, బూడిదగుమ్మడు, చేదు ఆనబ, కాకర, చేదుపొట్ల, అనువాని మూలముల నుపయోగించకూడదు. అనగా వేళ్లు పనికిరావు.

శ్లో॥ చందనం ఖదిరో దారుర్మధూకః శింశుపాతరుః
శిరీషాసన మేతాషాం సారం గృహ్ణాతి శాస్త్రవిత్॥ 5.

తా:— శ్రీగంధము, చండ్రి, దేవదారు, ఇప్ప, ఇరుగుడు, దిరిశనము, వేగిస అనువాని చేవలను లేక అంతఃసారములను శాస్త్రవేత్తలు గ్రహించెదరు.

శ్లో॥ పుష్పసారస్తు చాంపేయ కేతక్యాశోక పాటలాః
పున్నాగ భూర్జ బకుల మాధవీ జాతిమల్లికాః॥ 6.
శేఫాలీ యూధికా శిగ్రు శతపత్రా నృపద్రుమాః
వరాల ధాతకీ పుష్ప నంద్యావర్తో త్పలాదయః॥ 7.

తా:— సంపెంగ, కేతకీ (మొగిలి), అశోక, పున్నాగము, భూర్జపత్రము, పొగడ మల్లె, జాజిమల్లె, చేమంతి, పారిజాతము లేక సన్నమల్లె, మునగ, పద్మము, రేలపువ్వు, లవంగము, ఆరె, నందివర్ధనము, నల్లకలువపువ్వు, తామర అనువాని పుష్పములుగాని, కేసరములుగాని గ్రహించవలయును.

శ్లో॥ బిల్వ కాశ్మర్య తర్కారీ పాటలా టుంటుకైర్మహాత్
జయేత్కషాయ తిక్తోష్ణం పంచమూలం కఫానిలౌ॥ 8.
హ్రస్వం బృహత్యంశుమతీ ద్వయగోక్షురకైః స్మృతమ్
స్వాదు పాకరసం నాతిశీతోష్ణం సర్వదోషజిత్॥ 9.

తా:— మారేడువేరు, పెద్దగుమ్ముడు, తక్కలి, పాదిరిచెట్టు, పెద్దమాని, ఇవి మహాపంచమూలములు. వీని కషాయములు తిక్తోష్ణగుణములు కలవి. కఫవాతములను జయించును. ములక, వాకుడు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, పల్లేరు, అనునవి లఘుపంచమూలములు. ఇవి పాకమందు మధుర రసము గలవియున్ను, అతిశీత, అత్యుష్ణ గుణములు లేనివియున్న మఱియు సర్వదోషములను హరించునవిగా నుండును.

శ్లో॥ హ్రస్వం మహత్పంచమూలం దశమూలం సమీరజిత్
కాసహిక్కా వమిశ్వాస శోషపార్శ్వ రుజాపహమ్॥ 10.

తా:— లఘుపంచమూలములు మఱియు మహాపంచమూలములు చేరి దశమూలము లగును. ఇవి వాతమును జయించును. మఱియు కాస, హిక్క, వమి, శ్వాస, శోష, పార్శ్వ, శూలలను హరించును.

శ్లో॥ బలా పునర్నవైరండ శూర్పపర్ణీ ద్వయేనతు
మధ్యమంకఫవాతఘ్నం నాతిపిత్తకరం సరమ్॥ 11.

తా:— ముత్తవపులగము వేరు, తెల్లగలిజేరు వేరు, ఆముదపువేరు, మాషపర్ణి, ముద్గపర్ణి, అనునవి కలిసి మధ్యమపంచమూలములనబడును. ఇవి కఫవాతములను పోగొట్టును. పిత్తమును వృద్ధిచేయవు. మఱియు సారకములు.

శ్లో॥ అభీరు వీరా జీవంతీ జీవకర్షభకైః స్మృతమ్
జీవనాఖ్యంచ చక్షుష్యం వృష్యం పిత్తానిలాపహమ్॥ 12.

తా:— శతావరి, కాకోళి, జీవంతి, జీవకము, ఋషభకము, అనునవి జీవన పంచమూలములనబడును. ఇవి నేత్రములకు హితకరములు వృష్యములు మఱియు పిత్తనాశకములు.

శ్లో॥ తృణాఖ్యం పిత్తజిద్దర్భ కాశేక్షు శరశాలిభిః॥ 13.

తా:— దర్భవేళ్లు, కాశవేళ్లు, చెఱుకువేళ్లు, రెల్లువేళ్లు, శాలిధాన్యమువేళ్లు, అనునవి తృణపంచమూలములనబడును. ఇవి పిత్తమును జయించును.

శ్లో॥ పిప్పలీ పిప్పలీమూలం చవ్య చిత్రక నాగరమ్
పంచకోలకమేతద్వా సైంధవేనచ షట్ఫలమ్॥ 14.

తా:— పిప్పళ్లు, మోడి, చవ్యము, శొంఠి, చిత్రమూలము అనునవి పంచకోలము లనబడును. వీనిలో సైంధవలవణమును జేర్చినచో షట్ఫలములనబడును.

శ్లో॥ సైంధవం రోమకం చైవ సాముద్రి లవణం తథా
బిడం సౌవర్చలాఖ్యంచ యుక్తం లవణ పంచకమ్॥ 15.
లవణానాం పంచకంతు శోషణంచ రుచిప్రదమ్
మలానులోమకం దాహ నేత్ర్యం వాతకఫం హరేత్
శూలంచ నాశయత్యేవ ముక్తం పూర్వైర్మనీషిభిః॥ 16.

తా:— సైంధవలవణము, గాజులవణము, సముద్రలవణము, బిడాలవణము, సౌవర్చలవణము అనునవి పంచలవణములనబడును. ఇవి శోషకము, రుచిప్రదము, మలానులోమకము, దాహకరము, నేత్రహితము, వాతకఫహరము మఱియు శూలనాశక మని పూర్వవైద్యులు చెప్పిరి.

శ్లో॥ కర్పూర కస్తూరిక చందనీయా కాశ్మీరజన్మాసిత చందనాఖ్యాః
సమాంశభాగేనచ యోజితేన మనోహరంపంచసుగంధికంస్యాత్॥

తా:— పచ్చకర్పూరము, కస్తూరి, గోరోజనము, కుంకుమపువ్వు, మంచిగంధము అనునవి పంచసుగంధము లనబడును. వీనిని సమభాగములుగ జేర్చి యుపయోగించిన మనోహరముగా[?]నుండును.

శ్లో॥ ఆమ్ర జంబూ కపిత్థానాం బీజపూరక బిల్వయోః
గంధ కర్మాణి సర్వత్ర పత్రాణి పంచపల్లవమ్॥ 18.

తా:— మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలము, మారేడు, అనువాని లేతయాకులు పంచపల్లవములనబడును. సర్వగంధ కర్మలకివి పనికివచ్చును.

శ్లో॥ ముసలీ సారిబా పాఠా విదారీందీవరీ తథా
జీవంతీ కఫదం బల్యాం కందషట్కం రసాయనమ్॥ 19.

తా:— నేలతాడిగడ్డలు, సుగంధపాలవేళ్లు, విషబొద్ది, నేలగుమ్మడుగడ్డ, శతావరి, మఱియు జీవంతి. ఈ యారున్ను కందషట్కములనబడును. ఇవి కఫహరములు, బలకరములు మఱియు రసాయనములు.

## ఎనిమిది విధముల ఆకులు.

భృంగరాజము, మారేడు, వావుడు, సంబరేణి, చేదుపొట్ల, కసివింద, కూతురుబుడమ, అడ్డసరము అనువాని యాకులు.

## దశవిధ పుష్పములు.

సహదేవి, గరికె, భృంగరాజము, నేలతాడి, విష్ణుక్రాంతము, పాషాణభేది (పిండిచెట్టు), ఏటిపుచ్చ (ఇంద్రవల్లి), పురుషగడ్డలు, ముసల్కటీని పొన్నగంటి ఈపది పుష్పములను గ్రహించవలయును.

## గణేశాష్టగంధః.

శ్లో॥ చందనాగురు కర్పూర రోచనా కుంకుమ
మృగమద చందన హ్రీబేరాణి॥

తా:— మంచిగంధము, అగరు, పచ్చకర్పూరము, గోరోజనము, కుంకుమపువ్వు, కస్తూరి లేక పునుగు, రక్తచందనము, కురువేరు, ఈ ఎనిమిది సుగంధ ద్రవ్యములు గణపతికి ప్రీతియైనవి ఇవి గణేశాష్ట గంధములనబడును.

## శివాష్ట గంధః.

శ్లో॥ చందనాగురు కర్పూర తమాల హ్రీబేర కుంకుమ
కుశోద కుష్ఠాని శివస్య॥

తా:— మంచిగంధము, అగరుగంధము, పచ్చకర్పూరము, ఆకుపత్రి, కురువేరు, కుంకుమపువ్వు, రక్తచందనము, మఱియు చెంగల్వకోష్ఠు అనునవి శివాష్టగంధములు.

## శక్తి గంధాష్టకమ్.

శ్లో॥ చందనాగురు కర్పూర చోరకుంకుమ రోచనాః
జటామాంసీ కపియుతా శక్తేర్గంధాష్టకంవిదుః॥ 20.

తా:— మంచిగంధము, అగురు, పచ్చకర్పూరము, కచోరములు, కుంకుమపువ్వు, గోరోజనము, జటామాంఛి మఱియు శిలారసము అనునవి శక్తిగంధాష్టములని తెలుసు కొనవలయును.

## విష్ణు గంధాష్టకమ్.

శ్లో॥ చందనాగురు హ్రీబేర కుష్ఠ కుంకుమ సేవ్యకాః
జటామాంసీ మురాచేతి విష్ణోర్గంధాష్టకం విదుః॥ 21.

తా:— మంచిగంధము, అగరు, కురువేరు, చెంగల్వకోష్ఠు, కుంకుమపువ్వు, వట్టివేళ్ళు, జటామాంసి మఱియు మురామాంసి అనువానిని విష్ణుగంధాష్టకములని తెలుసు కొనవలయును.

## దేవతా గంధాష్టకమ్.

శ్లో॥ చందన కర్పూర నాగకేసర వాలక నాగర
ముస్తా దేవదారు గోరోచనా కుసుమాని॥

తా:— మంచిగంధము, పచ్చకర్పూరము, నాగకేసరములు, కురువేరు, తుంగ ముస్తలు, దేవదారు, గోరోజనము మఱియు కుంకుమపువ్వు, అనునవి దేవతా గంధాష్ట కములు,

## మాంసాయూష సుగంధీకరణార్థమ్.

శ్లో॥ జాతీపత్ర లవంగ త్వగేలా నాగకేసర మరిచ మృగనాభయః॥

తా:— జాపత్రి, జాజికాయ, లవంగములు, దాల్చిణిచెక్క, ఏలకులు, నాగ కేసరములు, మిరియాలు, మఱియు కస్తూరి. వీనిని మాంసయూషమును సుగంధ పఱచుట కుపయోగించవలయును.

## భూతాష్ట గంధములు.

పత్తిగింజలు, వెల్లుల్లిపొట్టు, గుగ్గిలము, అడవిబాదము, జటామాంసి, చెంగల్వకోష్ఠు, అగరు, వట్టివేళ్ళు. అనునవి భూతాష్ట గంధములని వ్యవహరింప బడుచున్నవి.

## భూత చికిత్సకు కావలసిన కొమ్ములు.

అడవిదున్నపోతు కొమ్ము, ఏనుగు దంతము, ఆవు కొమ్ము, ఎద్దు కొమ్ము, మఱియు జింక కొమ్ము.

## కంద సత్వములు.

నేలతాడిగడ్డల సత్వము, పాలవేళ్ల సత్వము, శతావరి సత్వము, సుగంధపాల సత్వము, నేలగుమ్మడుగడ్డల సత్వము, మఱియు జీవంతిగడ్డల సత్వము.

---

## 16. అథ ప్రత్యౌషధ విధి ప్రకరణమ్.

శ్లో॥ మత్స్యా జీర్ణేషు సర్వేషు నిర్గుండీ స్వరసం పిబేత్
నరాహా మాంసా జీర్ణేతు ప్రపిబేదమ్లవేతసమ్॥ 1.
ఏలాజీర్ణే పటోలస్య కల్కశ్చాగ్రే ప్రశస్యతే
మద్యాజీర్ణే పునర్మద్యం జంబీర స్వరసేనవా॥ 2.
తైలాజీర్ణేతు పిణ్యాకం దధ్యా జీర్ణేతు శర్కరా
జలాజీర్ణేచ ధాన్యాకం క్షీరాజీర్ణేచ శర్కరా॥ 3.
శుద్ధశుంఠీ కషాయం వా క్షౌద్రాజీర్ణే జలం పిబేత్
సితాజీర్ణే తథా కృష్ణా గుడాజీర్ణేచ తక్రకమ్॥ 4.
పిష్టాజీర్ణేచోష్ణజలం తక్రాజీర్ణే మహౌషధమ్
పృథుకానామజీర్ణేతు నారికేళోద్భవం జలమ్॥ 5.
మోచాజీర్ణేతు లవణం చోచాజీర్ణే మహౌషధమ్
వృశ్చికాల్యాశ్చ మూలంవా శుంఠీక్వాథం ససైంధవమ్॥ 6
యవక్షారపరాగం వా పనసస్య వికారజిత్
ఆమ్రపక్వాద్యజీర్ణేతు నాలికేరం ససైంధవమ్॥ 7.
కులుత్థస్య వికారఘ్న మభయామలకీరసమ్
గృహధూమ వికారఘ్నం తక్రం సైంధవ నాగరమ్॥ 8.
నిష్పావస్య వికారఘ్నం కణాసైంధవ నాగరమ్
చణకస్య వికారఘ్నం శుంఠీ సైంధవ జీరకమ్॥ 9.

శ్లో॥ మాంస మద్యస్థ వికారఘ్నం శుంఠీక్వాథంతు సైంధవమ్
సర్వధాన్య వికారఘ్నం పటుసైంధవనాగరమ్॥ 10.

తా :— సర్వవిధ మత్స్యాజీర్ణములు అనగా చేపలు తినుటచే కలిగిన అజీర్ణములు వావిలాకు రసమును ద్రాగించుట చేతను, పందిమాంసమును భక్షించుటచే గలిగిన అజీర్ణములు అగ్నిశిఖరసమును (ఘృతకుమారి) ద్రాగించుట చేతను, మేకమాంసాజీర్ణము ఏలకులు మఱియు చేదుపొట్ల తినువానిని దంచి సేవించుటచేతను, మద్యాజీర్ణము తిరిగి మద్యమును ద్రాగించుటచేతను మఱియు నిమ్మపండు రసమును ద్రాగించుటచేతను, నువ్వులనూనెచే నేర్పడిన అజీర్ణము కొలకి సందినిభక్షించుటచేతను, పెరుగువల్ల కలిగిన అజీర్ణము పంచదార పాకము నాకుట చేతను, పిత్తద్రాగుటచేతగలిగిన అజీర్ణము ధనియాల చూర్ణమును దినుట చేతను, పాలవలన నేర్పడిన అజీర్ణము శుంఠీ కషాయములో శర్కర కలిపి త్రాగించుట చేతను, నేతిచేత గలిగిన అజీర్ణము, శుద్ధజలమును త్రాగుటచేతను, శర్కరచేత నేర్పడిన అజీర్ణము పిప్పలీ చూర్ణమును సేవించుట చేతను, బెల్లమువల్ల నేర్పడిన అజీర్ణము, మజ్జిగను ద్రాగుటచేతను, పిష్టపదార్థములవల్ల కలిగిన అజీర్ణము వేడినీళ్ళు తీసుకొనుటచేతను, మజ్జిగ వల్ల నేర్పడిన అజీర్ణము శుంఠీరసమును సేవించుటచేతను, అటుకులవల్ల బాధలు కొబ్బరి బోండము నీటిచేతను, అరటిదుంప, మునగకాయ, మొదలైనవానివల్ల కలుగు అజీర్ణము లవణమును సేవించుటచేతను, తాటిపండు, అరటిపండు, కొబ్బరికాయ, అనువానివల్ల జనించినవికారములు శుంఠిగాని, వేరు కషాయములో సైంధవలవణమును గలిపిగాని సేవించుటచేతను, పనసపండ్లవల్ల బుట్టిన వికారములు యవక్షారమిచ్చుటచేతను, మామిడిపండ్ల వలన కలిగిన వికారములందు కొబ్బరి బోండమునీటిలో సైంధవలవణము చేర్చి ఇచ్చుట చేతను, ఉలవలవలన గలిగిన వికారములు, ఉసిరికాయ, తానికాయ అనువాని కషాయము సేవించుటచేతను, పెరుగుపనువల్ల జనించినబాధ సైంధవలవణము మఱియు శుంఠి చేర్చిన మజ్జిగ త్రాగుట చేతను, షష్టికధాన్యముల వలన కలుగు వికారములందు పిప్పళ్ళు శొంఠి, సైంధవలవణము, అనువానిని చేర్చి భక్షించుటచేతను, పెసలు మఱియు మినుముల వలన కలిగిన అజీర్ణము శుంఠీకషాయముతో సైంధవలవణము జేర్చి తీసుకొనుటచేతను, సకల ధాన్యములవల్ల నేర్పడిన వికారములు చేదుపొట్లరసములో సైంధవలవణము, మఱియు శుంఠీ చూర్ణములను జేర్చి తీసుకొనుటచేతను హరించును.

శ్లో॥ శరపుంఖం సమూలేన శుంఠీక్వాథం పిబేత్తథా
పత్రా పుష్ప వికారస్య శుంఠీ కైడర్య సైంధవైః॥ 11.
అష్టచూర్ణం విశేషేణ యవక్షారోదకేనవా
సర్వకంద వికారఘ్నం హింగు త్రికటుకాంబునా॥ 12.
పాయసాన్న వికారస్య పత్రౌషధ మపూర్వవత్
ఇక్షోరస వికారస్య మరిచం నాగరాంబువా॥ 13.

శ్లో॥ అమ్లాహార వికారస్య త్రుటీ శుర్యాంబుశర్కరాః
కటుకాహార దోషస్య నవనీతం ఘృతం గుడమ్ ॥ 14.
తిక్తద్రవ్య వికారస్య మధుర ద్రవ్యసేవనమ్
క్షారద్రవ్య వికారస్య క్షీ రాజ్య దధిశర్కరాః॥ 15.
మధురాహార దోషస్య కటుకాహార సేవనమ్
కషాయ ద్రవ్యదోషస్య క్షారద్రవ్యం విధీయతే॥ 16.
పాత్రిదోష వికారఘ్న ముశీరం చందనోదకమ్
ఫలశాకాది దోషాణాం హింగు సైంధవ నాగరమ్॥ 17.
సాజమోదోదకేనైవ తక్రిం వా సకణాంబువా
పరూషక వికారఘ్నం శుంఠీక్వాథం ససైంధవమ్॥ 18.
తాలచూర్ణ వికారఘ్నం క్వాథం సైంధవ నాగరమ్
జీరకస్యోదకేనైవ యునక్షార ఘృతాన్వితమ్॥ 19.
లశునస్య వికారఘ్నం లామజ్జం చందనం ఘృతమ్
సర్షపస్య వికారఘ్నం నవనీతం ఘృతంచ తత్ ॥ 20.

తా :— కొడిశపాల వికారము వెంపలివేళ్ళు మఱియు శుంఠి కషాయముచేతను గాని, శుంఠి సైంధవలవణములను శేపచెక్క కషాయమందుచేర్చి త్రాగించుట చేతనుగాని, అష్టచూర్ణము చేతనుగాని శమించును. సర్వకండ వికారములు యవక్షారము నీటిలోవేసి త్రాగినను, లేక నీటిలో ఇంగువ, త్రికటుకములు చేర్చి త్రాగినను, పాయసాన్న వికారములపై ప్రకారము చేసినను, చెఱకు వికారములు మిరియాల కషాయము లేక శుంఠికషాయము త్రాగినను, అమ్లపదార్థ వికారములు ఏలకులు, శుంఠి వీని కషాయములో శర్కరచేర్చి సేవించినను, కారముయొక్క వికారము వెన్న, నెయ్యి, మఱియు బెల్లము అనువాని నుపయోగించినను, చేదుపదార్థములవికారము మధురపదార్థములను సేవించినను, లవణపదార్థములను వికారము పెరుగు లేక పాలు, లేక శర్కర భక్షించినను, మధురాహారము యొక్క వికారము కటుపదార్థములు తీసుకొన్నను, వగరు పదార్థములయొక్క వికారము క్షారద్రవ్యములు భక్షించినను, పాత్రదోషముల యొక్క వికారము వట్టివేళ్ళు మఱియు మంచిగంధము అనువాని కషాయమును త్రాగినను, ఫలశాకాది వికారములు ఇంగువ, శుంఠి మఱియు సైంధవలవణము అనువాని నుపయోగించినను, పరూషకము (చిట్టీత, పేరీత, లేక పాల్సా) యొక్క వికారము ఓమ, లేక పిప్పళ్ళు, లేక శుంఠి, అనువాని కషాయములు త్రాగినను, లేక మజ్జిగలో సైంధవలవణముచేర్చి త్రాగినను, తాలచూర్ణవికారము శుంఠీ కషాయమందు సైంధవలవణమునుచేర్చి సేవించినను, లేక జీలకర్ర

కషాయమందు నెయ్యి, యవక్షారములను వేసి త్రాగినను, వెల్లుల్లి వికారము పట్టినవాళ్ళు, మంచిగంధమును అనువానిని నూరి సేవించినను, ఆవాల వికారము నెయ్యి లేక వెన్న తీసుకొనినను హరించును.

శ్లో॥ రామఠస్య వికారఘ్న మాజ్య మామలకీ రసమ్
సర్వాజీర్ణేషు యోజ్యం స్యాల్లంఘనం పరమౌషధమ్॥ 21.
సూతదోష వికారఘ్నీ కూష్మాండ స్వరసాన్వితమ్
జంబీర స్వరసే తద్వత్తక్రేషు హరితాభయా॥ 22.
కార్పాస పత్రస్వరసే కాంజికైః సహితం పిబేత్
గంధకస్య విషం తీవ్రం హరతే తక్ర చందనమ్॥ 23.
ధాత్రీరసముశీరం వా మాహిషం దధిసంయుతమ్
వత్సనాభవిషం హంతి వరాసారం పిబేత్ క్షణాత్॥ 24.
ఆజ్యం మరిచ చూర్ణంవా తండులీ జలగోపయః
అర్కక్షీరవిషం హంతి సతిలం గుడసంయుతమ్॥ 25.
స్నుహీక్షీరవిషం హంతి హ్యేకులా తిలశర్కరాః
బిల్వకస్య వికారఘ్నం సతిలం మధుర త్రయమ్॥ 26.
అన్యోన్యం యోజయేద్ధీమాన్ మాహిష స్నుగ్విషేధవా
కంకుష్ఠస్య విషం హంతి తుగాక్షీరం సశర్కరామ్॥ 27.
జ్యోతిష్మతీ విషం హంతి మృణాల రససర్పిషా
తిలతైల వికారఘ్నం పిణ్యాకం మధురత్రయమ్॥ 28.
సర్వతైల వికారఘ్నం చిత్రమూల కషాయకమ్
క్రముకస్య వికారఘ్నం రజనీపటు సంయుతమ్॥ 29.
కారస్కరవిషం హంతి జంబూ పత్రరసం పరమ్
గుంజా ఫలవిషం హంతి మేఘనాదీ రసేనవా॥ 30.
చందనం మధుక క్వాథే మత్స్యాక్షీ స్వరసేన వా
భిన్నోద్భవా రసైనైవ రంభాయాః స్వరసే పరమ్॥ 31.
కన్యారస వికారఘ్నం స్నుహీక్షారం ససైంధవమ్
భల్లాతకవిషం హంతి సతిలం గుడసంయుతమ్॥ 32.

మాహిషం నవనీతం వా హ్యాక్షమూల త్వచాపిచ
చిత్రకస్య విషం తీవ్రం గుడం కృష్ణతిలేనవా॥ 33.

తా :— ఇంగువయొక్క వికారము ఉసిరికరసములో నెయ్యి చేర్చి సేవించినను హరించును. అన్ని విధముల అజీర్ణములకు లంఘనము పరమౌషధము, పాదరస వికారములు బూడిద గుమ్మడు రసములో నిమ్మపండురసము చేర్చి సేవించినను లేక మజ్జిగలో కరక్కాయ మఱియు పసుపును నూరి త్రాగినను లేక పత్తియాకు రసములో ధాన్యపు గంజి కలిపి త్రాగినను, గంధక వికారము మజ్జిగలో మంచిగంధము కలిపి వెంటనే సేవించినను, అథవా ఉసిరికాయ రసములో పట్టివేళ్ళు నూరి భక్షించినను, లేక పెరుగులో వట్టివేళ్ళను నూరినాకినను, వత్సనాభివిషము వెంటనే త్రిఫలకషాయము త్రాగినను లేక బియ్యపు కడుగును ఆవుపాలలో జేర్చి త్రాగినను, లేక నేతిలో మిరియాల చూర్ణమును గలిపి సేవించినను, జిల్లేడుపాలవిషము బెల్లముతో జేర్చిన నువ్వులుతినుటచేతను, కాడజముడు పాల విషము వేయించిన గోధుమలు మఱియు నువ్వులు వీనిలో చక్కెర జేర్చి భక్షించినను, లొద్దుగ వికారము నువ్వులలో నెయ్యి, తేనె, శర్కర, అనువానిని జేర్చి నాకినను పోవును. మిగిలిన జముడుచెట్ల వికారములు పైన కాడజముడు వికారమునకు జెప్పినవి యుపయోగించవలెను. కంపిష్ఠ వికారము తవాక్షీరిని మజ్జిగలో వేసి త్రాగినను మాల్కంగినీ (జ్యోతిష్మతి) వికారము తామరతూండ్ల రసములో నెయ్యి చేర్చి సేవించినను, నువ్వులనూనె వికారము తెలకపిండి, నెయ్యి, తేనె, శర్కర అనువానిని గలిపి భక్షించినను, అన్ని తైలవికారములు చిత్రమూల కషాయము చేతను, పోకలవికారము, పసుపులో సైంధవ లవణమును జేర్చి భక్షించినను, ముషిణి గింజల వికారము నేరేడుఆకు రసముపుచ్చుకొనినను, గురివిందవికారము, చిర్రికూర రసమును త్రాగినను, లేక అతిమధుర కషాయములో మంచిగంధమును గలిపి ఇచ్చినను లేక పొన్నగంటి, తిప్పతీగె, అరటి అనువాని రసములో మంచి గంధమును గలిపి సేవించినను, కలబందవికారము కాడ జముడు క్షారము, మఱియు సైంధవలవణము భక్షించినను, నేడిగింజల వికారము నువ్వులు మఱియు బెల్లము కలిపి సేవించినను లేక తానికాయ పెట్టుపేరు చూర్ణమును గేదెవెన్నలో గలిపి నాకినను, చిత్రమూల వికారము నల్లనువ్వులు, బెల్లము వీనిని గలిపి నూరి భక్షించినను శాంతించును.

శ్లో॥ లవణస్య విషం హంతి తులసీ కేతకీ రసమ్
ధుత్తూరస్య విషం హంతి మృణాళ స్వరసం పరమ్॥ 34.
ఔదుంబర జలేనైవ తన్మూలేన జలేన వా
కార్పాసపత్ర స్వరసే హరిద్రా కాంజికేన వా॥ 35.
కర్పూరస్య విషం హంతి కుటజత్వగ్రసం పరమ్
శాలిమూల విషం హంతి లామంచం తండులోదకమ్॥ 36.

శ్లో॥ సూరణస్య విషం తద్వత్తాంబూలీ పత్రసారతః
వనసూరణ దోషఘ్నం చించా పత్రిరసం పరమ్॥ 37.
కాకమాచీవిషం హంతి సతక్రం చందనోదకమ్
సగుడం నవనీతం వా సితాసారేణ సర్పిషా॥ 38.
జాతీఫల వికారస్య లకుచామ్లేణ శర్కరా
బకులస్య వికారంతు హరతే త్రిఫలోదకమ్॥ 39.
కాంజికం లకుచామ్లం వా నారికేళోదకేనవా
ఆఢకీ ఫల దోషఘ్నం తక్రం నాగర సైంధవమ్॥ 40.
ద్రోణిమూలం తు సమ్మర్ద్య నాగవల్లీ జలైః పిబేత్
సేవితం ఘుణదోషఘ్నం శుష్కదారు మివాశనిః 41.
ఘుణదోష వికారస్య లవణం పాణిపల్లవమ్
ఉష్ణాంబువా పిబేత్తేన గరుడేనేవ పన్నగః॥
నారికేళస్య బాలస్య క్వాథం సర్పిర్విమిశ్రితమ్
ఘుణదోషహరం శీఘ్రం పటూత్తమయుతం పిబేత్॥
గృహగౌళి విషం హంతి నిశాచ పయసా సితా
పూగపక్వ త్వచః సారైః స్వర్ణం చందన సర్పిషం
ఆత్మగుప్తా వికారస్య శీఘ్రం గోమయ లేపనమ్
సంమర్ద్య కదలీపక్వం భారద్వాజీచ సర్పిషా॥
ఉద్వర్తనం పునః స్నానం పునః శ్రీగంధ లేపనమ్
దుఃస్పర్శాయా వికారస్య చక్రిమర్ద త్రుషాంబునా॥
కాకతుండీ విషం హంతి నీలీ చందన సర్పిషా

తా:—లవణముయొక్క వికారము, తులసి మఱియు మొగిలికషాయముచేతను ఉమ్మెత్త వికారము, తామరతూండ్ల రసముచేతను; లేక మేడిపాలు లేక దాని చెక్కయొక్క కషాయముచేతను లేక పత్తియాకురసములో పసుపును జేర్చి సేవించుటచేతను; లేక ధాన్యామ్లములో పసుపు కలిపి పుచ్చుకొనుట చేతను శాంతించును. కర్పూరవికారము, కొడిశపాలచెక్క రసముత్రాగినను; వరివేళ్ళ వికారము, బియ్యపు కడుగులో వట్టివేళ్ళను నూరి యిచ్చినను; అడవికందవికారము చింతాకు రసముపుచ్చుకొనినను; కందవికారము, తమలపాకు రసముతీసికొనినను; కాకిదొండ విషము, మజ్జిగలో మంచిగంధము నూరి ఇచ్చినను; తేనె వెన్నలో బెల్లమును జేర్చి భక్షించినను; లేక పసుపు కషాయములో నెయ్యిచేర్చి ఇచ్చి

నను; జాజికాయ వికారము, చిరిపనసరసములో శర్కర కలిపి ఇచ్చినను; పొగడ వికారము త్రిఫలకషాయము సేవించినను లేక కాంజికములో చిరిపనసరసము చేర్చి సేవించినను, లేక కొబ్బరి నీళ్ళు త్రాగినను; కందుల వికారము, మజ్జిగలో శుంఠి, సైంధవ లవణములను జేర్చి సేవించినను, లేక తమలపాకు రసములో తుమ్మివేరు నూరి వాకినను; తప్పక శాంతించును.

కర్రలలోనుండు కృములు మఱియు భ్రమరములు ఇత్యాదులు కరచుటచే గలుగు వికారములు, తెల్లమద్ది బంక చేతను; లేక నీలశంఖపుష్పిచిగుళ్ళను వేడినీళ్ళలోనూరి అందు సైంధవలవణము చేర్చి సేవించుటచేతను; లేక కొబ్బరిబొండమునీరు లేక లేతకొబ్బరికాయ మందు నెయ్యి సైంధవలవణములనుజేర్చి వెంటనే సేవించుటచేతను, గరుత్మంతుడు పామును హరించునట్లు మీదచెప్పిన వికారములు హరించును. బల్లి వికారము పాలలో చక్కెర పసుపు కలిపి త్రాగినను; లేక పండుబారిన పోకలయొక్క పై చెక్కరసములో బంగారును నూరి, అందు మంచిగంధము కూడ నూరి నెయ్యినిజేర్చి ఇచ్చినను శమించును. దురదగొండిని తాకుటచే గలుగు వికారములు, వెంటనే ఆవుపేడ శరీరమునకుపూసి పిదప అరటిపండును అడవి పత్తియాకు రసములో కలిపి అందు నెయ్యి చేర్చి శరీరమునకు నలుగుపెట్టి స్నానముచేసి తిరిగి మంచిగంధమును శరీరమునకు లేపము చేసినను శాంతించును. రామములక లేక నాకుడు అనువాని వికారములు తంగేడు లేక తంటెపు తగిరస చెక్క కషాయమును సేవించినను; కాకిదొండవికారము, నీలిచెట్టు రసములో మంచిగంధమును నూరి, అందు నెయ్యి కలిపి త్రాగినను హరించును.

---

## 17. అథ అరిష్టయోగ ప్రకరణమ్.

### దశమూలారిష్టమ్.

శ్లో॥ దశమూలాని కుర్వీత భాగైః పంచపలైః పృథక్
పంచవింశత్పలం కుర్యాచ్చిత్రకం పౌష్కరం తథా॥ 1.
కుర్యాద్వింశత్పలం లోధ్రం గుడూచీ తత్సమా భవేత్
పలైః షోడశభిర్ధాత్రీ రవిసంఖ్యైర్దురాలభా॥ 2.
ఖదిరో బీజసారశ్చ పథ్యా చేతి పృథక్పలైః
అష్టాభిర్గుణితైః కుష్ఠ మంజిష్టా దేవదారు చ 3.
విడంగం మధుకం భార్గీ కపిత్థోక్షః పునర్నవా
చవ్యం మాంసీ ప్రియంగుశ్చ శారిబా కృష్ణజీరకం॥ 4.

శ్లో॥ త్రివృతా రేణుకా రాస్నా పిప్పలీ క్రముకశ్శటీ
హరిద్రా శతపుష్పాచ పద్మకం నాగకేసరం॥ 5.
ముస్తమింద్ర యవాశ్శృంగీ జీవకర్షభకౌ తథా
మేదాచాన్యా మహామేదా కాకోల్యా ఋద్ధివృద్ధికే॥ 6.
కుర్యాత్ప్రత్యగ్ద్విపలికాన్పచే దష్టగుణే జలే
చతుర్థాంశం శృతం నీత్వా మృద్భాండే సన్నిధాపయేత్॥ 7.
తతః షష్టిపలాం ద్రాక్షాం పచేన్నీరే చతుర్గుణే
త్రిపాదశేషం శీతంచ పూర్వక్వాథే శృతం క్షిపేత్॥ 8.
ద్వాత్రింశత్పలికం క్షౌద్రం దద్యాత్ గుడచతుశ్శతం
త్రింశత్పలాని ధాతక్యాః తక్కోలం జల చందనం॥ 9.
జాతీఫలం లవంగం చ త్వగేలా పత్రకేసరమ్
పిప్పలీచేతి సంచూర్ణ్య భాగైర్ద్విపలికైః పృథక్॥ 10.
శాణమాత్రాచ కస్తూరీ సర్వమేకత్ర నిక్షిపేత్
భూమౌ నిఖనయేత్ భాండం తతోజాత రసం పిబేత్॥ 11.
కతకస్య ఫలం క్షిప్త్వా రసంనిర్మలతాం నయేత్
గ్రహణీమరుచిం శ్వాసం కాసం గుల్మం భగందరమ్॥ 12.
వాతవ్యాధిం క్షయం ఛర్దిం పాండురోగంచ కామలామ్
కుష్ఠాన్యర్శాంసి మేహాంశ్చ మందాగ్ని ముదరాణిచ॥ 13.
శర్కరా మశ్మరీం మూత్రకృచ్ఛ్రం ధాతుక్షయం జయేత్
కృశానాం పుష్టిజననో వంధ్యానాం పుత్రదః పరమ్
అరిష్టో దశమూలాఖ్యస్తేజ శ్శుక్రబల ప్రదః॥ 14.

తా :— దశమూలములు (కోలపొన్న, మయ్యాకుపొన్న, తక్కలి, పెద్దగుమ్ముడు పల్లేరు, మారేడువేళ్ళు, దుందిలము, పెద్దమానిచెక్క, ములక, వాకుడు, ప్రత్యేకము అయిదు పలములు. చిత్రమూలము 25 పలములు, పుష్కరమూలము 25 పలములు. లొద్దుగచెక్క 20 పలములు. తిప్పతీగె 20 పలములు, ఉసిరికాయలు 16 పలములు. దురదగొండివేరు 12 పలములు, చండ్రచేవ 8 పలములు, కరక్కాయలు 8 పలములు, చెంగల్వకోష్టు, మంజిష్ఠ, దేవదారు, వాయువిడంగములు, యష్టిమధుకము, గంటుభారంగి వెలగచెక్క, తానికాయలు, తెల్లగలిజేరు, చవ్యము, జటామాంసి, ప్రేంకణము, సుగంధ పాలవేళ్ళు,నల్లజీలకర్ర, పాలతేగడ, రేణుకలు,సన్నరాస్నము, పిప్పళ్ళు, గంగరావిచెక్క,

కచోరములు, పసుపు, సోగగింజలు (బద్దసోపు), పద్మకము, నాగకేసరములు, తుంగముస్తలు, కొండిశపాలగింజలు, కర్కాటకశృంగి, జీవకము, ఋషభకము, మేద, మహామేద, కాకోళి, క్షీరకాకోళి, ఋద్ధి, వృద్ధి, అనునవి ప్రత్యేకము రెండుపలములు. పైవానినన్నిటిని దంచి ఎనిమిదిరెట్లు జలములోవేసి చతుర్థాంశముగ కషాయముకాచి వడియగట్టి తరువాత 60పలములు ద్రాక్షపండ్లను తీసుకొని నాల్గురెట్లు నీళ్ళనుపైచి, మూడుభాగములు మిగులునట్లు కషాయముగ కాచి ఒకకుండలో వడియగట్టి పైకషాయమునుకూడ జేర్చి అందు తేనె 32 పలములు, బెల్లము 400 పలములు, ఆరెపువ్వు 30 పలములు, తక్కోలములు, వట్టివేళ్ళు, మంచిగంధము, జాజికాయ, లవంగములు, ద్రాక్షిణిచెక్క, ఏలకులు, ఆకుపత్రి నాగకేసరములు, పిప్పళ్ళు, అనువానిని ప్రత్యేకము 2 పలములు చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి చేర్చి ఒక శాణపరిమాణము కస్తూరి కూడ కలిపి ఆకుండ మూతిని మూసి చీలమన్ను లేపముచేసి భూమిలో ఒకమాసము వరకు పాతిపెట్టవలయును. తదుపరి దాని మూతిని విప్పి అందులో చిల్లగింజలనునూరి శంఖములను వేసి జేర్చవలయును. ఈ దశమూలారిష్టమును భద్రపరచి సేవించిన, గ్రహణి, అరుచి, శ్వాస, కాస, గుల్మ, భగందరము, వాతవ్యాధి, క్షయ, ఛర్ది, పాండు. కామలా, కుష్ఠ, అర్శస్సు, మేహ, మందాగ్ని ఉదర, అశ్మరి, మూత్రకృచ్ఛ్ర, రోగములను మఱియు ధాతుక్షయమును బోగొట్టును. ఇదియునుంగాక కృశులకు శరీరపుష్టిని, తేజస్సును, శుక్రవృద్ధిని, బలమును గలిగించును. మఱియు వంధ్యాస్త్రీలు దీనిని సేవించిన సంతానవతులగుదురు.

## ఉశీరాసవమ్.

శ్లో॥ ఉశీరం వాలకం పద్మం కాశ్మర్యం నీలముత్పలమ్
ప్రియంగు పద్మకం లోధ్రం మంజిష్ఠాం ధన్వయాసకమ్॥ 15
పాఠాం కిరాత తిక్తంచ న్యగ్రోధో దుంబరం శఠీమ్
పర్పటం పుండరీకంచ పటోలం కాంచనారకమ్॥ 16.
జంబూ శాల్మలి నిర్యాసం ప్రత్యేకం పలసమ్మితమ్
సర్వం సుచూర్ణితం కృత్వా ద్రాక్షాయాః పలవింశతిమ్॥ 17.
ధాతకీం షోడశపలాం జలద్రోణద్వయే క్షిపేత్
శర్కరాయాస్తులాం దత్వా క్షౌద్రస్యార్ధ తులాం తథా॥ 18.
మాసం సంస్థాపయేద్భాండే మాంసీ మరిచ ధూపితే
ఉశీరాసవ ఇత్యేష రక్తపిత్త వినాశనః
పాండు కుష్ఠ ప్రమేహార్శః కృమిశోధ హరస్తథా॥ 19.

తా :— వట్టివేళ్ళు, కూతురు బుడమ, తామరదుంప, పెద్దగుమ్మడు పండ్లు, నల్లకలువ దుంప, పిరియంగు (ప్రేంకణ), పద్మకాష్ఠము, లొద్దుగ చెక్క, మంజిష్ఠ, దురద

గొండివేళ్ళు, చిరుబొద్ది, కిరాతతిక్తము (చిరాయితా), మఱ్ఱిచెక్క, మేడిచెక్క, కచోరములు, పర్పాటకము, తెల్లతామర, చేదుపొట్ల, దేవకాంచనముచెక్క, నేరేడుచెక్క, బూరుగుబంక, ఇవి ప్రత్యేకము ఒక పలము చొప్పున గ్రహించి మెత్తగాచూర్ణించి, జటామాంసి మఱియు మిరియాలతో ధూపమువేయబడిన మృత్పాత్రలో బోసి అందు ద్రాక్ష 20 పలములు, ఆరెపువ్వు 16 పలములు, జలము రెండుద్రోణములు, ఖండ శర్కర నూరుపలములు మఱియు తేనె 50 పలములు చేర్చి దాని ముఖమును బంధించి చీలమన్నురాచి ఒక నెలవఱకుంచవలయును. అనంతరము దానిలోని యాసవమును వడియగట్టి జాగ్రత్త చేయవలయును. దీనినుచితప్రమాణ ముపయోగించిన రక్తపిత్తము, పాండు, కుష్ఠము, ప్రమేహము, మూలవ్యాధి, క్రిమిరోగములును నంజురోగములను హరించును.

## అమృతారిష్టమ్.

శ్లో॥ అమృతాయాః పలశతం దశమూలీ శతం తథా
చతుర్ద్రోణే జలేపక్త్వా కుర్యాత్పాదావశేషితేః 20.
శీతే తస్మిన్ రసే పూతే గుడస్య ద్వితులాం క్షిపేత్
అజాజీ షోడశపలం పర్పటస్య పలద్వయమ్॥ 21.
సప్తపర్ణం త్రికటుకం ముస్తకం నాగకేసరమ్
కటుకాతివిషా చేంద్రయవంచ పలసమ్మితమ్॥ 22.
ఏకీకృత్య క్షిపేద్భాండె నిధద్యాన్మాస మాత్రికమ్
అమృతారిష్ట ఇత్యేష సర్వజ్వర కులాంతకః॥ 23.

తా :— తిప్పతీగె 100 పలములు. దశమూలములు ప్రత్యేకము 10 పలములు వీనిని బాగుగానలియగొట్టి నాల్గుద్రోణముల నీళ్ళలోవేసి చతుర్థాంశముగ కషాయముకాచి వడియగట్టి ఒక కుండలోబోసి అందు 200 పలముల బెల్లమునువేసి పిదప జీలకర్ర 16 పలములు. పర్పాటకము రెండుపలములు, సప్తపర్ణి (ఏడాకులఅరటి), త్రికటుకములు, తుంగముస్తలు, నాగకేసరములు, కటుకరోహిణి, అతివస, కొడిశపాలగింజలు ఇవి ప్రత్యేకమొకపలము చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించి పై కుండలో వేసి, దాని మూతిని బంధించి చీలమన్నిచ్చి ఒక మాసపర్యంత ముంచవలయును. ఇది అమృతారిష్టము. దీనిని సేవించిన సర్వజ్వరములు నశించును.

## కుటజారిష్టమ్.

శ్లో॥ తులాం కుటజ మూలస్య మృద్వీకార్థ తులాం తథా
మధూక పుష్ప కాశ్మర్యో భాగాన్ దశ పలోన్మితాన్॥ 24.
చతుర్ద్రోణేంభసః పక్త్వా క్వాథే ద్రోణావశేషితే

శ్లో॥ ధాతక్యా వింశతి పలం గుడస్యాచ తులాంక్షి పేత్॥ 25.

మాసమాత్రం స్థితో భాండే కుటజారిష్ట సంజ్ఞితః

జ్వరాన్ ప్రశమయేత్సర్వాన్ కుర్యాత్తీక్ష్ణం ధనంజయమ్॥ 26.

దుర్వారాం గ్రహణీం హన్తి రక్తాతీసార ముల్బణమ్॥

తా :— కొడిశపాల వేరు చెక్క 100 పలములు. ద్రాక్షపండ్లు 50 పలములు, ఇప్పపువ్వు, పెద్దగుమ్మడు, ఇవి ఒక్కొక్కటి 10 పలములు, వీనిని బాగుగా నలియగొట్టి నాల్గుద్రోణముల నీళ్ళలోవేసి నాల్గవభాగము మిగులునట్లుగ కషాయముకాచి వడియగట్టి ఒక కుండలో పోసి అందు ఆరెపువ్వు 20 పలములును, బెల్లము 100 పలములను వేసి దాని మూతిని బంధించి ఒక మాసముంచ వలయును. పిదప దానిని వడియగట్టి భద్రపరచవలెను. ఇది కుటజారిష్టము. దీనిని సేవించిన సర్వజ్వరములు రక్తాతిసారములు, అసాధ్యగ్రహణీ వ్యాధులు నుపశమించి అగ్నిదీప్తిని గలుగజేయును.

## 5. దాడిమారిష్టమ్.

శ్లో॥ దాడిమా తులార్ధం ద్విద్రోణే జలస్య విపచేత్సుధీః

పాదశేషే కషాయేచ పూతే శీతే వినిక్షిపేత్॥ 27.

గుడస్య ద్వితులాం తత్ర త్వగేలా పత్ర కేసరమ్

ప్రియంగు మరిచం కృష్ణా విడంగం చేతి చూర్ణయేత్॥ 28.

పృథక్ పలోన్మితై ర్భాగైః ఘృతభాండే వినిక్షిపేత్

సమం తతోఘట్టయిత్వా తతోజాత రసంపిబేత్॥ 29.

ఉరఃక్షతం క్షయం హంతి కాసశ్వాస గళామయాన్

దాడిమారిష్టనామాయః ప్రోక్తో బలకృన్మలశోధనః॥ 30.

తా :— దాడిమపండ్లు 50 పలములు గ్రహించి రెండు ద్రోణముల నీళ్ళలో వేసి చతుర్థాంశముగ కషాయము కాచి, చల్లారిన తరువాత బాగుగా పిసికి ఒక కుండలో వడియగట్టవలెను. దానిలో 200 పలములు పాతబెల్లము, పిదప దాల్చినిచెక్క, సన్న ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, ప్రేంకణము, మిరియాలు, పిప్పళ్లు, వాయువిడంగములు. అనునవి ఒక్కొక్క పలము చొప్పున గ్రహించి చూర్ణించివేసి దాని ముఖమును బంధించి చీలమన్ను రాచి ఒకమాస ముంచవలయును. అటుతరువాత దాని ముఖమును విప్పి అందులోని ద్రవమును వడియగట్టి భద్రపరచవలయును. ఈ ద్రాక్షారిష్టమును సేవించుటచేత ఉరఃక్షతము, క్షయ, కాస, శ్వాస, గళరోగములు హరించి బలమును వృద్ధిచేసి మలమును శోధనము చేయును.

## 6. అభయారిష్టమ్.

శ్లో॥ అభయాయాస్తులామేకాం మృద్వీకార్థ తులాం తథా
విడంగస్య దశపలం మధూక కుసుమస్యచ॥ 31.
చతుర్ద్రోణే జలే పక్త్వా ద్రోణమేవావశేషయేత్
శీతీభూతే రసే తస్మిన్ పూతే గుడతులాం క్షిపేత్॥ 32.
శ్వదంష్ట్రాం త్రివృతాం ధాన్యం ధాతకీ మింద్ర వారుణీం
చవ్యాం మధూరికాం శుంఠీం దంతీం మోచరసం తథా॥ 33.
పలయుగ్మమితం సర్వం పాత్రే మహతి మృణ్మయే
క్షిప్త్వా సంరుధ్య తత్పాత్రం మాసమాత్రం నిధాపయేత్॥ 34.
తతో జాతీరసం జ్ఞాత్వా పరిస్రావ్య రసం నయేత్
బలం కోష్ఠంచ వహ్నించ వీక్ష్య మాత్రాం ప్రయోజయేత్॥35.
అర్శాంసి నాశయేచ్ఛీఘ్రం తథాష్టా వుదరాణిచ
వర్చో మూత్ర విబంధఘ్నో వహ్నిం సందీపయేత్పరమ్॥ 36.

తా :— కరక్కాయలు 100 పలములు, ద్రాక్షపండ్లు 50 పలములు, వాయు విడంగములు 10 పలములు, ఇప్పపువ్వు 10 పలములు, వీనిని దంచి నాల్గుద్రోణముల నీళ్ళలో వేసి నాల్గవభాగము మిగులునట్లు కషాయము కాచి వడియగట్టి ఒక కుండలో బోసి అందు 100 పలములు బెల్లమునువేసి పిదప పల్లేరు, పాలతేగడ, ధనియాలు, ఆరె పువ్వు, ఏటిపుచ్చ, చవ్యము, సోపు, శొంఠి, దంతీమూలము మఱియు బూరుగుబంక, అనునవి ప్రత్యేకము రెండుపలములు చొప్పున గ్రహించి చూర్ణించి పై కుండలో బోసి దాని మూతినిమూసి చీలమన్ను ఇచ్చి ఒక మాసముంచవలెను. అటుపిమ్మట దానిని తెరచి వడియగట్టి భద్రపరచవలెను. దీనిని రోగియొక్క అగ్నిబలానుసారము ఉపయుక్త మాత్ర సేవించిన, అర్శస్సులు, (విశేషముగా రక్తార్శస్సులు) ఎనిమిది విధముల ఉదర రోగములు, మలబద్ధము, మఱియు మూత్ర బంధరోగములు, శీఘ్రముగా హరించును. మఱియు దీనిచే జఠరాగ్ని విశేషముగా దీప్తమగును.

## 7. బలారిష్టమ్.

శ్లో॥ బలాశ్వగంధయో ర్ద్వాభ్యాం పృథక్ పలశతం శుభమ్
చతుర్ద్రోణే జలే పక్త్వా ద్రోణమేవావ శేషయేత్॥ 37.
శీతే తస్మిన్ రసే పూతే క్షిపేద్గుడ తులాత్రయమ్
ధాతకీ షోడశపలాం పయస్యాం ద్విపలాంశికాన్॥ 38.

శ్లో॥ పంచాంగుళ పల ద్వంద్వం రాస్నా మేలాం ప్రసారణీమ్
దేవపుష్ప ముశీరంచ శ్వదంష్ట్రించ పలాంశికాన్॥ 39.
మాసం భాండే స్థితస్త్వేషః బలారిష్టో మహాఫలః
హన్త్యుగ్రాన్ వాతజాన్ రోగాన్ బలపుష్ట్యగ్ని వర్ధనః॥ 40.

తా :— బలామూలము నూరుపలములు, అశ్వగంధ (పెన్నేరుగడ్డ), నూరుపలములు, వీనిని దంచి నాలుగు ద్రోణముల నీళ్ళలోవేసి ఒకద్రోణము మిగులునట్లు కషాయముగ కాచి ఒక కుంభలో వడియగట్టి, అందు 300 పలములు బెల్లమును వేసి బాగుగా కలియబెట్టవలెను. తదనంతరము దానిలో ఆరెపువ్వు 16 పలములు, క్షీరకాకోళి 2 పలములు, ఆముదపువేళ్లు 2 పలములు, సన్నరాస్నము, చిన్నఏలకులు, ప్రసారిణి, లవంగములు, పట్టివేళ్లు, పల్లేరు, అనునవి ప్రత్యేకమొకపలము చొప్పునవేసి దాని ముఖమును బంధించి ఒక మాసముంచవలయును తదుపరి దానిని తెఱచి వడియగట్టి భద్రపరచవలయును. దీనిని సేవించిన ఉగ్రమైన వాతరోగములు హరించి బలమును, పుష్టిని వృద్ధిచేసి అగ్నిదీప్తిని కలుగజేయును.

## 8. దేవదార్వారిష్టమ్.

శ్లో॥ దేవదారు తులార్ధంచ వాసాయాః పలవింశతిమ్
మంజిష్ఠేంద్రయవా దంతీ తగరం రజనీ ద్వయమ్॥ 41
రాస్నా కృమిఘ్నం ముస్తంచ శిరీషం ఖదిరార్జునౌ
భాగాన్ దశపలాన్ దద్యాద్యవాన్యా వత్సకస్యచ॥ 42.
చందనస్య గుడూచ్యాశ్చ రోహిణ్యాశ్చిత్రకస్యచ
భాగానష్ట పలానేతా నష్టద్రోణేంభసః పచేత్॥ 43.
ద్రోణశేష కషాయేచ పూతే శీతే ప్రదాపయేత్
ధాతక్యా షోడశపలం మాక్షికస్య తులాత్రయమ్॥ 44.
వ్యోషస్య ద్విపలం దద్యాత్ త్రిజాతంచ చతుఃపలమ్
చతుఃపలం ప్రియంగుశ్చ ద్విపలం నాగకేసరమ్॥ 45.
సర్వాణ్యేతాని సంచూర్ణ్య ఘృతభాండే నిధాపయేత్
మాసాదూర్ధ్వం పిబేదేతం ప్రమేహం హన్తి దుస్తరమ్॥ 46.
వాతరోగాన్ గ్రహణ్యర్శో మూత్రకృచ్ఛ్రాణి నాశయేత్
దేవదార్వాదికోరిష్టః కండూ కుష్ఠ వినాశనః॥ 47

తా :— దేవదారు 50 పలములు, అడ్డసరము 20 పలములు, మంజిష్ఠ, కొడిశ పాలగింజలు, దంతిమూలము, గ్రంధి తగరము, పసుపు, మానిపసుపు, సన్నరాష్ట్రము, వాయువిడంగములు, తుంగముస్తలు, దిరిశనపుచెక్క, చంద్రచేప, తెల్లమద్దిచెక్క, అనునవి ప్రత్యేకము పదిపలములు. ఓమ, కొడిశ పాలచెక్క, మంచిగంధము, తిప్పతీగె, కటుకరోహిణి, చిత్రమూలము, అనునవి ప్రత్యేకము 8 పలములు. వీని నన్నిటిని దంచి 8 ద్రోణముల నీళ్లలో వైచి అష్టమాంశముగ కషాయము కాచి ఒక కుండలో వడియ గట్టి అందు ఆరెపువ్వు చూర్ణము 16 పలములు. తేనె 300 పలములు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు ఇవి ఒక్కొక్కటి రెండుపలములు, దాల్చినిచెక్క, ఏలకులు, ఆకుపత్రి అనునవి ప్రత్యేకము నాలుగు పలములు, ప్రేంకణము నాలుగుపలములు, నాగకేసరములు రెండు పలములు. వీని నన్నిటిని చూర్ణించివేసి, దాని ముఖమును బంధించి ఒక మాసముంచవలయును. అనంతరము దానిమూతిని విప్పి అందులోని దేవదార్వారిష్టమును భద్రపరచి సేవించిన దుస్తరమగు ప్రమేహములు, వాతరోగములు, గ్రహణివ్యాధులు, అర్శస్సులు, మూత్రకృచ్ఛ్రము, దురదలు మఱియు కుష్ఠవ్యాధులు నశించును.

## 9. అశోకారిష్టమ్.

శ్లో॥ అశోకస్య తులామేకాం చతుర్ద్రోణే జలే పచేత్
పాదశేషే రసేపూతే శీతే పలశత ద్వయమ్॥ 48.

దద్యాత్ గుడస్య ధాతక్యాః పలషోడశికం మతమ్
అజాజీం ముస్తకం శుంఠీం దార్వ్యుత్పల ఫలత్రికమ్॥ 49.

ఆమ్రాస్థి జీరకం వాసాం చందనంచ వినిషిపేత్
చూర్ణయిత్వా పలాంశేన మతో భాండే నిధాపయేత్॥ 50.

మాసాదూర్ధ్వంచ పీత్వైవ మసృగ్దర రుజాం జయేత్
జ్వరంచ రక్తపిత్తార్శో మందాగ్నిత్వమరోచకమ్
మేహశోథారుచిహర స్త్వశోకారిష్టసంజ్ఞితః॥ 51.

తా:— అశోక చెక్క 100 పలములు గ్రహించి దంచి నాలుగు ద్రోణముల నీళ్లలో వైచి చతుర్థాంశముగ కషాయము కాచి ఒకకుండలో వడియగట్టి చల్లార్చి అందు 200 పలముల బెల్లమును వైచి బాగుగా కలియబెట్టవలయును. పిదప దానిలో ఆరెపువ్వు చూర్ణము 16 పలములు, అజామోదము, తుంగముస్తలు, శొంఠి, మానిపసుపు, కలువదుంప, కరక్కాయ పెచ్చులు, తానికాయ పెచ్చులు, ఉసిరికాయ పెచ్చులు, మామిడి జీడి, జీలకఱ్ఱ, అడ్డసరము, మంచిగంధము అనునవి ప్రత్యేకము ఒక పలము చొప్పున చూర్ణించి చేర్చి విధిప్రకారము దాని ముఖమును బద్ధముచేసి ఒక మాస ముంచవలయును. అనంతరము దీనిని తెఱచి అందులోని అరిష్టమును వడియగట్టి జాగ్రత్త చేయవలయును.

దీనిని సేవించిన అసృగ్దరము, ఋతుశూలలు, జ్వరములు, రక్తపిత్తములు, అర్శస్సులు, మందాగ్ని, అరోచకము, మేహము, మఱియు అరుచి రోగములు హరించును.

## 10. జీరకాద్యరిష్టమ్.

శ్లో॥ జీరకస్య తులా ద్వంద్వం చతుర్ద్రోణ జలే పచేత్
ద్రోణశేషే క్షిపేత్తత్ర తులా త్రయమితం గుడమ్॥ 52.
ధాతకీం షోడశపలాం శుంఠీంచ ద్విపలోన్మితామ్
జాతీఫలం ముస్తకంచ చాతుర్జాతం యవానికామ్॥ 53.
కంకోలం దేవపుష్పంచ పలమానేన నిక్షిపేత్
మాసం సంస్థాపయేద్భాండే మృత్తికా పరినిర్మితే॥ 54.
తతః కల్కాన్ వినిర్పూత్య పాయయేత్కర్ష మాత్రయా
అరిష్టో జీరకాఖ్యోయం నిహన్యాత్ సూతికా గదాన్
గ్రహణీమతిసారంచ తథా వహ్నేశ్చ వైకృతిమ్॥ 55.

తా:— బాగుచేసిన జీలకర్ర 200 పలములు గ్రహించి దంచి నాలుగు ద్రోణముల నీళ్లలో వైచి చతుర్థాంశముగ కషాయము కాచి ఒక మృణ్మయ పాత్రలో వడియబోసి అందు పాతబెల్లము 300 పలములు వేసి బాగుగా కలియబెట్టి పిదప ఆరెపువ్వు 16 పలములు, శొంఠి 2 పలములు, జాజికాయ, తుంగముస్తలు, ఏలకులు, దాల్చినిచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు, ఓమ, తక్కోలములు, లవంగములు, అనునవి ప్రత్యేక మొక పలము వీని నన్నిటిని కొద్దిగా దంచి పై కుండలో బోసి, దాని ముఖమును బంధించి, చీలమన్ను రాచి ఒక మాస ముంచవలయును. ఆటుపిమ్మట దానిని తెఱచి అందులోని జీరకాద్యరిష్టమును వడియగట్టి భద్రము చేయవలయును. దీనిని ఒక కర్ష ప్రమాణము చొప్పున సేవించిన సూతికలు, గ్రహణీ, మఱియు అతిసారరోగములను హరించి అగ్ని దీపనమును గలుగజేయును.

## 11. ఖదిరారిష్టమ్.

శ్లో॥ ఖదిరస్య తులార్థంతు దేవదారు చ తత్సమమ్
వాకుచీ ద్వాదశపలం దార్వీస్యాత్పల వింశతిః॥ 56.
త్రిఫలా వింశతిపలా న్యష్టద్రోణేమ్భసః పచేత్
కషాయే ద్రోణశేషేచ పూతే శీతే వినిక్షిపేత్॥ 57.
తులాద్వయం మాక్షికస్య తులైకా శర్కరామతా
ధాతక్యా వింశతిపలం కంకోలం నాగకేసరమ్॥ 58.

శ్లో॥ జాతీఫల లవంగైలా త్వక్పత్రాణి పృథక్ పృథక్
పలోన్మితాని కృష్ణాయా దద్యాత్పల చతుష్టయమ్॥ 59.
ఘృతభాండే వినిక్షిప్య మాసాదూర్ధ్వం పిబేత్తతః
మహాకుష్ఠాని హృద్రోగం పాండు రోగార్బుదం తథా॥ 60.
గుల్మం గ్రంథి కృమీన్ శ్వాసం కాసం ప్లీహోదరం తథా
ఏష వై ఖదిరారిష్టస్సర్వకుష్ఠ నివారణః॥ 61.

తా:—చంద్రచేవ 50 పలములు, దేవదారు 50 పలములు బావంచాలు 12 పలములు మ్రానిపసుపు 20 పలములు త్రిఫలములు 20 పలములు వీనినన్నిటిని బాగుగా దంచి 8 ద్రోణముల నీళ్లలోవైచి అష్టమాంశముగ కషాయము కాచి ఒక నేతితో మాగిన కుండలో వడియగట్టి చల్లారిన తరువాత అందు తేనె 200 పలములు, శర్కర 100 పలములు ఆరెపువ్వు చూర్ణము 20 పలములు, తక్కోలములు, నాగకేసరములు, జాజికాయ, లవంగములు, ఏలకులు, దాల్చినిచెక్క, ఆకుపత్రి అనువానిని ప్రత్యేక మొక పలము చొప్పున గ్రహించి చూర్ణము చేసి చేర్చి మఱియు పిప్పళ్ల చూర్ణమును 4 పలములు వేసి దాని మూతిని బంధించి చీలమన్ను ఇచ్చి ఒక మాసమువర కుంచవలయును. దీని నుపయోగించిన మహాకుష్ఠరోగములు, హృద్రోగము, పాండు, అర్బుదము, గుల్మము, గ్రంథులు, కృములు, శ్వాస, కాస, ప్లీహ, ఉదర రోగములు, మఱియు నీఖదిరారిష్టము సర్వకుష్ఠములను నివారించును.

## 12. అర్జునారిష్టమ్ (పార్థాద్యరిష్టము).

శ్లో॥ పార్థత్వచ స్తులామేకాం మృద్వీకార్ధ తులాం తథా
భాగం మధూక పుష్పస్య పలవింశతి సమ్మితమ్॥ 62.
చతుర్ద్రోణేఽమ్భసః పక్త్వా ద్రోణమేవావశేషయేత్
ధాతక్యా వింశతిపలం గుడస్యచ తులాం క్షిపేత్॥ 63.
మాసమాత్రం స్థితో భాణ్డే భవేత్పార్థాద్యరిష్టకః
హృత్పుప్పుస గదాన్ సర్వాన్ హన్త్యయం బలవీర్య కృత్॥ 64.

తా:— తెల్లమద్ది చెక్క 100 పలములు, ద్రాక్షపండ్లు 50 పలములు, ఇప్పపువ్వు 20 పలములు పై చెక్కను దంచి మిగిలిన రెండు ద్రవ్యములను చేర్చి నాలుగు ద్రోణముల నీళ్లలోవేసి చతుర్థాంశావశేషముగ కషాయము కాచి ఒక కుండలో వడియగట్టి అందు ఆరెపువ్వు చూర్ణము 20 పలములు, పాతబడిన బెల్లము 100 పలములు వేసి బాగుగా కలిపి దాని ముఖమును బంధించి చీలమన్ను ఇచ్చి ఒక మాస ముంచవలయును. తదనంతరము దానిని తెఱచి అందులోని అరిష్టమును వడియగట్టి భద్రపరచవలయును. దీనిని సేవించిన సమస్త హృదయ పుప్పుస రోగములు హరించి బలవీర్యములను వృద్ధి జేయును.

## 13. అశ్వగంధాద్యరిష్టమ్.

శ్లో॥ తులార్ధంచాశ్వగంధాయాః ముసల్యాః పలవింశతిః
మంజిష్ఠాయాః హరీతక్యాః రజన్యో మధుకస్య చ॥ 65.
రాస్నా విదారీ పార్థానాం ముస్తక త్రివృతోరపి
భాగాన్ దశపలాన్ దద్యా దనంతా శ్యామయో స్తథా॥ 66.
చందన ద్వితయస్యాపి వచాయాః చిత్రకస్య చ
భాగానష్టపలాన్ క్షుణ్ణా నష్టద్రోణేంభసః పచేత్॥ 67.
ద్రోణశేషే కషాయేస్మిన్ పూతే శీతే ప్రదాపయేత్
ధాతక్యాః షోడశపలం మాక్షికస్య తులాత్రయమ్॥ 68.
వ్యోషంతు ద్విపలం గ్రాహ్యం త్రిజాతక చతుః పలమ్
చతుః పలం ప్రియంగోశ్చ ద్విపలం నాగకేసరమ్॥ 69.
మాసాదూర్ధ్వం పిబేదేనం కర్షైక పరిమాణతః
మూర్ఛా మపస్మృతిం శోషం ఉన్మాదమపి దారుణమ్॥ 70.
కార్శ్య మర్శాంసి మందత్వ మగ్నేర్వాత భవాన్ గదాన్
అశ్వగంధాద్యరిష్టోయం పీతోహన్యా దసంశయమ్॥ 71.

తా :— అశ్వగంధ (పెన్నేరుగడ్డ) 50 పలములు, నేలతాడిగడ్డలు 20 పలములు, మంజిష్ఠ, కరక్కాయపెచ్చులు, పసుపు, మ్రానిపసుపు, ఇప్పపువ్వు, సన్నరాస్నము, నేలగుమ్ముడుగడ్డ, తెల్లమద్దిచెక్క, తుంగముస్తలు, పాలతేగడ, అనునవి ప్రత్యేకము 10 పలములు, తెల్లసుగంధపాలవేళ్ళు, నల్లసుగంధపాలవేళ్ళు, మంచిగంధము, రక్తచందనము, వస, చిత్రమూలము. ఇవి ప్రత్యేకము 8 పలములు, పైవాని నన్నిటిని బాగుగా దంచి 8 ద్రోణముల నీళ్ళలో వేసి అష్టమాంశముగ కషాయము కాచి ఒక కుండలో వడియగట్టి చల్లారిన పిదప అందు ఆరెపువ్వు 16 పలములు, తేనె 200 పలములు, త్రికటుకములు, 2 పలములు, త్రిజాతకములు 4 పలములు, ప్రేంకణము 4 పలములు, నాగకేసరములు 2 పలములు, వీనిని కొంచెము దంచివైచి దాని మూతిని బంధించి చీలమన్ను ఇచ్చి ఒక మాసము వగకు ఉంచవలయును. అనంతరము దాని మూతిని తెఱచి అందులోని అరిష్టము వడియగట్టి జాగ్రత్త చేయవలయును. ఈ యశ్వగంధాద్యరిష్టమును ఒక కర్ష పరిమాణము సేవించిన మూర్ఛలు, అపస్మారములు, శోష, దారుణమైన ఉన్మాదరోగము, కృశత్వము, మూల వ్యాధులు, అగ్నిమాంద్యము మఱియు వాతరోగములు హరించును.

## 14. బబ్బులారిష్టమ్.

శ్లో॥ తులా ద్వయంచ బబ్బుల్యాశ్చతుర్ద్రోణే జలే పచేత్
దోణశేషే రసే శీతే గుడస్య త్రితులాం క్షిపేత్॥ 72.
ధాతకీం షోడశపలాం కృష్ణాంచ ద్విపలాం తథా
జాతీఫలాని కంకోల మేలాత్వక్పత్రకేసరమ్॥ 73.
లవంగం మరిచం చైవ పలికాన్యుప కల్పయేత్
మాసం భాణ్డే స్థితస్త్వేష బబ్బులారిష్టకో జయేత్
క్షయం కుష్ఠ మతీసారం ప్రమేహ శ్వాస కాస నుత్॥ 74.

తా :— నల్లతుమ్మచెక్క 200 పలములు, దీనిని దంచి నాలుగు ద్రోణముల నీళ్లలో వైచి నాలుగవభాగము మిగులునట్లుగ కషాయముకాచి ఒక కుండలో వడియగట్టి చల్లారిన పిదప దానిలో 300 పలములు పాతబెల్లమునువేసి బాగుగా గలిపి పిమ్మట అందు ఆరెపువ్వు 16 పలములు, పిప్పళ్లు 2 పలములు, జాజికాయ, తక్కోలములు, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, లవంగాలు, మిరియాలు అనునవి ఒక్కొక్క పలము చొప్పున దంచివేసి దాని మూతిని బంధించి, చీలమన్నురాచి ఒక మాసముంచవలయును. తదనంతరము దానిలోని అరిష్టమును వడియగట్టి భద్రపరచవలయును. ఈ బబ్బులారిష్టమును సేవించిన క్షయ, కుష్ఠము, అతిసారము, ప్రమేహము, శ్వాస, కాస, రోగములు హరించును.

## 15. రోహితకారిష్టమ్.

శ్లో॥ రోహీతక తులామేకాం చతుర్ద్రోణే జలే పచేత్
పాదశేషే రసే పూతే శీతే పలశత ద్వయమ్॥ 75.
దద్యాత్ గుడస్య ధాతక్యాః పలషోడశికా మతా
పంచకోలం త్రిజాతంచ త్రిఫలాంచ వినిక్షిపేత్॥ 76.
చూర్ణయిత్వా పలాంశేన తతో భాణ్డే వినిక్షిపేత్
మాసాదూర్ధ్వంచ పిబతాం సర్వోదర రుజాం జయేత్॥ 77.
ప్లీహ గుల్మోదరా ష్ఠీలా గ్రహణ్యర్శాంసి కామిలామ్
కుష్ఠ శోఫారుచి హరో రోహీతారిష్ట సంజ్ఞితః॥ 78.

తా :— ములుమోదుగుచెక్క 100 పలములు. దీనిని దంచి నాలుగు ద్రోణముల జలములో వైచి చతుర్థాంశముగ కషాయము గాచి ఒక కుండలో వడియగట్టి చల్లారిన పిదప అందు 200 పలముల బెల్లమునువేసి బాగుగా కలిపి దానిలో ఆరెపువ్వు 16 పల

ములు, పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రిమూలము, శొంఠి, ఏలకులు, లవంగపట్ట, ఆకు పత్రి, కరక్కాయపెచ్చులు, తానికాయపెచ్చులు, ఉసిరికపరుగులు అనునవి ఒక్కొక్క పలము చొప్పున గ్రహించి చూర్ణముచేసివేసి దాని ముఖమును బంధించి చీల మన్ను ఇచ్చి ఒకమాసమువర కుంచవలెను. తదనంతరము దాని ముఖమును దెఱచి అందు లోని రోహితకారిష్టమును వడియగట్టి భద్రపరచవలెను. దీనిని సేవించిన సమస్త ఉదర వ్యాధులు, ప్లీహ, గుల్మ, అష్ఠీలా, గ్రహణి, అర్శ, కామలా, కుష్ఠ, శోఫ మఱియు అరుచిరోగములను హరించును.

## 16. సారస్వతారిష్టమ్

శ్లో॥ సమూల పత్రి శాఖాయాః బ్రాహ్మ్యాః బ్రాహ్మ ముహూర్తకే
గృహీత్వా వింశతిపలం పుష్యయోగే శతావరీ॥ 79.
విదారికాభయోశీరాణ్యార్ద్రకంచ తథా మిశిః
పంచపంచ పలాన్యేషాం జలద్రోణే పచేద్భిషక్॥ 80.
పాదావశేషే విశ్రావ్య రసం వస్త్రేణ గాలయేత్
మాక్షికస్య దశపలం సితాయాః పంచవింశతిః॥ 81.
ధాతకీ పంచపలికా రేణుకా త్రివృతా కణా
దేవపుష్పం వచా కుష్ఠం వాజిగంధా విభీతకీ॥ 82.
అమృతైలా విడంగ త్వక్ ప్రత్యేకం కర్ష సమ్మితమ్
క్వాథే తస్మిన్ సమస్తాని సమాక్షిప్య ప్రయత్నతః॥ 83.
స్వర్ణకుంభే నిదధ్యాద్వా నవే మృద్భాజనేపివా
స్వర్ణస్య తనుపత్రంచ క్షిప్త్వాస్మిన్ కర్ష సమ్మితమ్॥ 84.
మాసాజ్జాతరసం దృష్ట్వా హేమపత్రే క్షయంగతే
వాససాచ పరిస్రావ్య స్థాపయేత్ ఘృతభాజనే॥ 85.
సారస్వతాభిధోరిష్టః ఏషోమృత సమః పురా
శిష్యాణాముపకారార్థం ధన్వంతరి వినిర్మితః॥ 86.
ఆయుర్వీర్యం స్మృతిం మేధాం బలం కాంతిం వివర్ధయేత్
వాగ్విశుద్ధి కరోహృద్యో రసాయనవరః స్మృతః॥ 87.
బాలకానాంచ యూనాంచ వృద్ధానాంచ సదాహితః
నరనారీ హితో నిత్యం పరమోజస్కరో మతః॥ 88.

శ్లో॥ వారయో త్స్వర కార్కశ్యం తథాచా స్పష్టభాషణమ్
స్వరం పరభృతస్యేవ జనయే త్సేవనా త్సదా॥ 89.
రజోదోషేణ దుష్టానాం యోషితాం శుక్ర దోషిణామ్
పుంసాంచాపి శుభకరః సర్వదోష హరోమతః॥ 90.
అత్యధ్యయన గీతాది క్షీణస్మృతిబలా నరాః
లభంతే చిత్తసంతోషం స్మృతించాస్య నిషేవణాత్॥ 91.
పయసా సహాపాతవ్యో రిష్టోయం శాణమానతః
మాసాభ్యాం రోగహృచ్చాపి శరదా సర్వసిద్ధిదః॥ 92.
అకాలమృత్యో ర్హరణే యదీచ్ఛా
నారీప్రియత్వం యదివాంఛితం స్యాత్॥ 93.
వాక్శుద్ధి ధైర్యం స్మృతి లబ్ధిరిష్టా
నిషేవ్యతాంతర్హ్యమృతం భవద్భిః॥ 94.

తా :— పుష్యమీనక్షత్రియుక్త బ్రహ్మముహూర్తమున సంగ్రహించిన సమూల బ్రాహ్మి 20 పలములు, శతావరి, నేలగుమ్మడుగడ్డ, కరక్కాయ, వట్టివేళ్ళు, అల్లము, బద్దసోపు(సోయాగింజలు) అనునవి ప్రత్యేకము 5 పలములు, వీనిని 2 ద్రోణముల జలములో వేసి చతుర్థాంశముగ కషాయముగ కాచి వడియగట్టి అందు తేనె 10 పలములు, ఖండశర్కర 20 పలములు, ఆరెపువ్వు 5 పలములు, రేణుకలు, తెల్లతేగడ, పిప్పళ్ళు, లవంగములు, వస, చంగల్వకోష్టు, పెన్నేరుగడ్డ, తానికాయ, తిప్పతీగె, సన్నఏలకులు, వాయువిడంగములు, దాక్షిణిచెక్క, ఇవి ప్రత్యేకము ఒక కర్షము చొప్పున చూర్ణించి వేయవలయును. పై మొత్తమును ఒక స్వర్ణపాత్రలోగాని, మృణ్మయ పాత్రలోగాని పోసి స్వర్ణపత్రములను ఒక కర్షప్రమాణము వేసి దాని ముఖమును బంధించి, చీలమన్నురాచి అంసు ఒకబంగారు తునకను ఒకమాసపర్యంతము ఉంచవలయును. అనంతరము దానిని తెరచి అందులోని తునకను జాగ్రత్తచేసి దానిలోని అరిష్టమును నేతితో మాగిన కుండలో వడియగట్టవలెను. పూర్వమున ఈ సారస్వతారిష్టమును భగవానుడగు ధన్వంతరి అతని శిష్యుల యుపయోగార్థము నిర్మించిరి. దీనిని ఒక శాణప్రమాణము సేవించిన, ఆయుః, వీర్య, స్మృతి, మేధ, బలకాంతులు వృద్ధియగును. వాక్శుద్ధి కలుగును. హృదయమునకు హితకరము మఱియు రసాయనము. బాలురకు, యౌవనులకు, వృద్ధులకు మఱియు స్త్రీలకుమిక్కిలి హితకరమైనది. ఓజస్సును వృద్ధిపఱచును. ఈ సారస్వతారిష్టము సదా సేవించిన స్వరభంగమును, అస్పష్టభాషణమును నశింపజేసి కోకిలస్వరమును కలిగించును. స్త్రీలరజోదోషమును మఱియు పురుషుల శుక్రదోషమును బోగొట్టును. పాఠకులు, గాయకులు, వారివారి స్మరణ శక్తిని గోల్పోయినచో దీనిచే నభివృద్ధిచెంది వారి చిత్తమును సంతోషముగా నుంచును. దీనిని రెండు

మాసములు వరకుపయోగించిన రోగములు నష్టమగును. మఱియు ఒక సంవత్సరము వరకు సేవించినచో సంపూర్ణసిద్ధి నొసంగును. ఎవరైనను అకాలమృత్యువునుంచి రక్షింపబడ వలయు నన్నచో మఱియు స్మరణశక్తి వృద్ధిబొందవలయు నన్నచో యీ యమృతము వంటి యౌషధమును సేవించవలయును.

సూచన :— ఈ యోగములో స్వర్ణపత్రములు వేయవలయునని వ్రాయబడినది. కాని స్వర్ణపత్రము లందు జీర్ణముకావు. అందుచేత ఒక బంగారు తునకను వేసి అరిష్టము సిద్ధముచేసి తరువాత యీ బంగారు తునకను తీసుకొని జాగ్రత చేసుకొనవలెను. ఈ సారస్వతారిష్టము ఉన్మాద, అపస్మారము లందు మిక్కిలి ఫలదాయకము మఱియు మస్తిష్క వికారముల పైని ప్రయోగించ వచ్చును.

## 17. వాసారిష్టమ్.

శ్లో॥ వాసా స్వరస మాదాయ మృతసంజీవనీ సమమ్
సమ్మిశ్ర్య భిష గన్యోన్యం వాసరే శుభతారకే॥ 95.
మృద్భాండే కాచభాండేవా నిరుధ్య తన్ముఖం దృఢమ్
సప్తాహం స్థాపయేత్తస్మాత్ పూతీ కుర్యాచ్చ వాససా॥ 96.
వాసారిష్టః సుసేవ్యోయం మాషమాత్రో దినేదినే
ఏతత్సేవీ సుపథ్యాశీ దేవ భూదేవ భక్తిమాన్॥ 97.
కాసం శ్వాసం రక్తపిత్తం కంఠరోగ మురః క్షతమ్
అన్యాంశ్చ వివిధాన్ రోగాన్ జయే దాశు నసంశయః॥ 98.

తా :— శుభనక్షత్ర శుభదివసమందు అడ్డసరపు ఆకుల స్వరసమును దీసి దీనికి సమము మృతసంజీవనీ సురాను గ్రహించి వీనిని ఒక మంచి కుండలోగాని గాజుగిన్నెలో గానివేసి దానిముఖమును బంధించి ఏడుదినముల వరకుంచవలయును. అనంతరము దానిని తెరచి అందులోనిద్రవమును బట్టలోవడియగట్టి సీసాలో భద్రపరచవలయును. దీనిని ప్రతి దినము ఒక మాషప్రమాణము దేవబ్రాహ్మణభక్తితో పథ్యభోజనము చేయుచు సేవించిన శ్వాస, కాస, రక్తపిత్త, కంఠరోగ, ఉరఃక్షత మఱియు అన్య వివిధరోగములు నష్టమగును.

## 18. కర్పూరాసవమ్.

శ్లో॥ తులాం ప్రసన్నాం పరిగృహ్య శుద్ధామ్
పలాష్టకం చోడుపతేః క్షిపేచ్చ॥ 99.

శ్లో॥ ఏలాచ సూక్ష్మా ఘనచ శృంగబేరే
యమానికా వేల్లజమున్రి సర్వమ్॥ 100.
పలప్రమాణం పిహితేచ భాండే
మాసం నిదధ్యా ద్భిషగత్ర యత్నాత్॥ 101.
విసూచికాయాః పరమౌషధం తత్
నిహంతి చాన్యాన్ వివిధాన్ వికారాన్॥ 102.

తా :— విశుద్ధమైన సురా (సారా) 100 పలములు, కర్పూరము 8 పలములు, సన్నఏలకులు, తుంగముస్తలు, శొంఠి, ఓమ, మిరియాలు ఇవి ప్రత్యేక మొకపలము చొప్పున గ్రహించి చూర్ణించి వీని నన్నిటిని ఒక పాత్రలోబోసి దాని ముఖమును బంధించి ఒకనెలపర్యంత ముంచవలయును. పిదప దానిమూతిని తెఱచి అందులోని ఆసవమును వడియగట్టి జాగ్రత్తగా సీసాలలోనుంచవలయును. ఈకర్పూరాసవము విసూచికా వ్యాధి పైని మిక్కిలి ప్రశస్తమైనది. దీనినుపయోగించిన అన్యవివిధ రోగములు నివర్తించును. మాత్ర :— 5 నుంచి 20 చుక్కల వరకు.

## 19. పిప్పల్యాసవమ్.

శ్లో॥ పిప్పలీ మరిచం చవ్యం హరిద్రా చిత్రకో ఘనః
విడంగం క్రముకో లోధ్రః పాఠా ధాత్ర్యేలవాలుకమ్॥ 103.
ఉశీరం చందనం కుష్ఠం లవంగం తగరం తథా
మాంసీ త్వగేలా పత్రంచ ప్రియంగు ర్నాగకేసరమ్॥ 104.
ఏషా మర్ధ పలాన్ భాగాన్ సూక్ష్మచూర్ణీకృతాన్ శుభాన్
జలద్రోణ ద్వయే క్షిప్త్వా దద్యాత్ గుడ తులాత్రయమ్॥ 105.
పలాని దశధాతక్యాః ద్రాక్షా షష్టిపలా భవేత్
ఏతాన్యేకత్ర సంయోజ్య మృద్భాండే వినిక్షిపేత్॥ 106.
జ్ఞాత్వా గతరసం సర్వం పాయయే దగ్న్యపేక్షయా
క్షయం గుల్మోదరం కార్శ్యం గ్రహణీం పాండుతాన్ తథా
అర్శాంసి నాశయే చ్ఛీఘ్రం పిప్పల్యాద్యాసవ స్త్వయమ్॥ 107.

తా :— పిప్పళ్లు, మిరియాలు, చవ్యము, పసుపు, చిత్రమూలము, తుంగముస్తలు, వాయువిడంగాలు, పోకలు, లొద్దుగ, చిరుబొద్ది, ఉసిరికవరుగు, కూతురు బుడమ, వట్టివేళ్ళు, రక్తచందనము, చంగల్వకోష్టు, లవంగాలు, గ్రంధితగరము, జటామాంసి,

లవంగపట్ట, చిన్న ఏలకులు, ఆకుపత్రి, ప్రేంకణము, నాగకేసరములు అనువానిని ప్రత్యేకము అర్ధపలము చొప్పున గ్రహించి మెత్తగాచూర్ణించి ఒక మట్టికుండలో బోసి అందు 4 ద్రోణముల నీళ్ళు, 300 పలముల బెల్లము, 10 పలములు ఆరెపువ్వు, 60 పలములు ద్రాక్షపండ్లు, చేర్చి దాని ముఖమును బంధించి చీలమన్నురాచి, ఒకమాసమువరకు ఉంచవలయును. అనంతరము దానిని తెఱచి ద్రవ్యములయొక్క సత్వము అరిష్టములోనికి వచ్చునట్లు గ్రహించి వడియగట్టవలెను. దీనిని అగ్నిబలానుసారము సేవించిన క్షయ, గుల్మ, ఉదర, కృశత, గ్రహణి, పాండు, అర్శ, ఇత్యాది రోగములు శీఘ్రముగా హరించును.

## 20. పునర్నవాసవమ్.

శ్లో॥ త్రికటు త్రిఫలాం దార్వీం శ్వదంష్ట్రాం బృహతీద్వయమ్
వాసామేరండమూలం చ కటుకీం గజపిప్పలీమ్॥ 108.
శోథఘ్నీం పిచుమందంచ గుడూచీం శుష్కమూలకమ్
దురాలభాం పటోలంచ పలాంశేన విచూర్ణయేత్॥ 109.
ధాతకీం షోడశపలాం ద్రాక్షాయాః పలవింశతిమ్
తులామానాం సితాం దత్వా మాక్షికార్ధతులాం తథా॥ 110.
జలద్రోణద్వయం పిష్ట్వా మాసం భాండే నిధాపయేత్
పునర్నవా సవోహ్యేష శోథోదర వినాశనః॥ 111.
ప్లీహానామ్లపిత్తం చ యకృద్గుల్మ జ్వరాదికాన్
కృచ్ఛ్రసాధ్యామయాన్ సర్వాన్ నాశయేన్నాత్ర సంశయః॥ 112.

తా :— త్రికటుకములు, త్రిఫలములు, మానిపసుపు, పల్లేరు, వాకుడు, ములక, అడ్డసరము, ఆముదపువేరు, కటుకరోహిణి, గజపిప్పళ్ళు, తెల్లగలిజేరు, వేపచెక్క, తిప్పతీగె, ఎండిన ముల్లంగిదుంప, దురదగొండివేళ్ళు, చేదుపొట్ల, వీని ప్రత్యేక చూర్ణమొకపలము, ఆరెపువ్వు 16 పలములు, ద్రాక్ష 20 పలములు, ఖండశర్కర 100 పలములు, తేనె 50 పలములు, వీనిని ఒక కుండలోబోసి అందు రెండుద్రోణముల నీళ్ళు జేర్చి దాని ముఖమును బంధించి చీలమన్నిచ్చి ఒక మాసము పర్యంత ముంచవలెను. అనంతరము దానినితీసి వడియగట్టి జాగ్రత్తచేయవలెను. దీనిని సేవించిన శోథ, ఉదర రోగము, ప్లీహ, ఆమ్లపిత్తము, యకృద్రోగము, గుల్మ మఱియు జ్వరములు మొదలగు కృచ్ఛ్రసాధ్యరోగములను నశింపజేయును.

## 21. అరవిందాసవమ్.

శ్లో॥ అరవిందముశీరం చ కాశ్మరీం నీలముత్పలమ్
మంజిష్ఠైలా బలామాంసీ రంబుదం శారిబాం శివామ్॥ 113.

శ్లో॥ విభీతకీ వచా ధాత్రీః శఠీం శ్యామాం ససీలినీమ్
పటోలం పర్పటం పార్థం మధూకం మధుకం మురామ్॥ 114.
పలమానేన సంగృహ్యా ద్రాక్షాయాః పలవింశతిమ్
ధాతకీం షోడశపలాం జలద్రోణ ద్వయే క్షిపేత్॥ 115.
శర్కరాయాస్తులాం తత్ర తులార్ధం మాక్షికస్యచ
మాసం సంస్థాపయేద్భాండే మృత్తికా పరినిర్మితే॥ 116.
బాలానాం సర్వరోగఘ్నో బలపుష్ట్యగ్నివర్ధనః
అరవిందాసవః ప్రోక్త ఆయుష్యో గ్రహదోషహృత్॥ 117.

తా:— తామరపువ్వు, వట్టివేళ్లు, పెద్దగుమ్మడుఫలము. నల్లకలువగడ్డ, మంజిష్ఠ, న్నఏలకులు, బలామూలము, జటామాంసి, తుంగముస్తలు, సుగంధపాలవేళ్లు, కరక్కాయ రెరడు, వస, ఉసిరికవరుగు, కచోరములు, నల్లసుగంధపాలవేళ్లు, నీలివేళ్లు, చేదుపొట్ల, ర్పాటకము, తెల్లమద్దిచెక్క, ఇప్పపువ్వు, యష్టిమధుకము, మురామాంసి, వీని ప్రత్యేక ూర్ణము ఒక పలము, ద్రాక్ష 20 పలములు, ఆరెపువ్వు 16 పలములు, వీని నన్నిటిని క కుండలో బోసి అందు జలము 4 ద్రోణములు ఖండశర్కర 100 పలములు తేనె 50 లములుకూడ పోసి దాని ముఖమును బంధించి చీలమన్నురాచి ఒక మాసమువరకుంచ లయును. అనంతరము దానిని వడియగట్టి జాగ్రత్త చేయవలయును. ఈ యరవిం ాసవ ముచితప్రమాణము సేవించిన దీపన పాచనములను కలిగించి బలమునువృద్ధిజేయును. ది బాల రోగములకు శ్రేష్ఠమైనది.

## 22. పత్రాంగాసవమ్.

శ్లో॥ పత్రాంగం ఖదిరం వాసా శాల్మలీ కుసుమం బలా
భల్లాతకం శారిబే ద్వే జపాకుసుమ మస్ఫుటమ్॥ 118.
ఆమ్రాస్థి దార్వీ భూనింబ మాషేన ఫల జీరకమ్
లోహం రసాంజనం బిల్వం కేసరాజస్త్వచం తథా॥ 119.
కుంకుమం దేవకుసుమం ప్రత్యేకం పలసమ్మితమ్
సర్వం సుచూర్ణితం కృత్వా ద్రాక్షాయాః పలవింశతిః 120.
ధాతకీం షోడశపలాం జలద్రోణ ద్వయే క్షిపేత్
శర్కరాయాస్తులాం దత్వా క్షౌద్రస్యార్ధ తులాం తథా॥ 121.
ఏకీ కృత్య క్షిపేత్ భాండే నిధధ్యాన్మాస మాత్రకం

శ్లో॥ హన్త్యుగ్రం ప్రదరం శ్వేత మరుణంచ సవేదనమ్
జ్వరం పాండుం తథాశోఫం మందాగ్నిత్వమరోచకమ్॥ 122.

తా:— రక్తచందనము, చంద్రచేవ, అడ్డసరంచెక్క, బూరుగుపువ్వులు, ముత్తవ పులగముచెక్కలు, జీడిగింజలు, తెల్లసుగంధపాలవేళ్లు, నల్లసుగంధపాలవేళ్లు, దాసాని మొగ్గలు, (మందారపు మొగ్గలు), మామిడిజీడి, మానిపసుపు, భూనింబ, పోస్తుకాయలు, జీలకర్ర, లోహభస్మ, రసాంజనము, మారేడుగుజ్జు, భృంగరాజము, దాక్షిణిచెక్క, కుంకుమపువ్వు, లవంగములు అనువాని ప్రత్యేక చూర్ణము ఒక పలము, ద్రాక్ష 20 పలములు, ఆరెపువ్వు 16 పలములు. పైవాని చూర్ణములను ఒక కుండలో బోసి అందు శర్కర 1 తులా ప్రమాణము, తేనె అర్థతులాప్రమాణము, జలము 4 ద్రోణములును వేసి దాని మూతిని బంధించి చీలమన్ను రాచి ఒక మాసమువరకు ఉంచవలెను. పిమ్మట దానిని తెరచి వడియగట్టి భద్రము చేయవలయును. ఈ పత్రాంగాసవ ముచిత ప్రమాణము సేవించిన శ్వేతప్రదరములు, రక్తప్రదరములు, జ్వరములు, పాండు, శోథ, మందాగ్ని, మఱియు అరుచిరోగములు హరించును.

సహస్రయోగ ప్రకాశిక యందలి
ఆసవారిష్ట నామకానుబంధము సంపూర్ణము.

---

## 18. అథ ధారాకల్ప ప్రకరణమ్.

శ్లో॥ అనంత కల్యాణ గుణైకభాజనం నిరంతరానంద చిదేక విగ్రహమ్
అనంతరాయేప్సితసిద్ధయేవయం తమేకదంతం సతతంభజామహే॥ 1.

తా:—అనంత కల్యాణములకు ఏకమాత్రనిధియును, నిరంతరానంద చిన్మయ స్వరూపుడును అగు నేకదంతుని అనంత సంపత్తులు సిద్ధించుటకుగాను నిరంతరము భజించెదము.

శ్లో॥ ధాతూనాం దృఢతాం కరోతి వృషతాం దేహాగ్ని వర్ణౌజసామ్
స్థైర్యం పాటవమింద్రియస్య జరసో మాంద్యం చిరం జీవితమ్
అస్థ్నాం భంగమపాకరోతి నితరాం దోషాన్ సమీరాదికాన్
సర్వస్నేహకృతా సుఖోష్ణసుభగా సర్వాంగధారా నృణామ్॥ 2.

తా:—సప్తధాతువులను అనగా రస, రక్త, మాంస, మేద, అస్థి, మజ్జ, శుక్రములను దృఢము చేయునదియును, వృష్యమును (వాజీకరణము) గలుగజేయునదియును, దేహాగ్ని, వర్ణ, ఓజస్సులను బ్రసాదించునదియును, మనస్థైర్య, ఇంద్రియ పటుత్వములను కలిగించునదియును, వృద్ధావస్థను బోగొట్టి దీర్ఘాయువును బ్రసాదించునదియును, అస్థి భంగమును సరిచేయునదియును త్రిదోషములను సమము చేయునదియును, సర్వస్నేహములతో నివ్వబడునదియును, సుఖోష్ణమైనదియును మఱియు సర్వాంగముల కివ్వబడునదియునగు నీ ధారావిధానము మనుష్యులకు ఆరోగ్యము నిచ్చును.

శ్లో॥ ప్లక్షోదుంబర గంధసార వరణన్యగ్రోధ దేవద్రుమాః
పున్నాగామ్రౌ కపిత్థ చోచబకులాశోకాసనా మ్రాస్తథా
డోలా చంపక బిల్వ నింబ ఖదిరా మోఘాగ్నిమంథార్జునా
ఇత్యాద్యన్యత మేనసేచన విధౌ ద్రోణీం ప్రకుర్యాత్పృథః॥ 3.

తా:—జువ్వి, మేడి, మంచిగంధము, వావిలి, ఊడిమిరి, మఱ్ఱి, దేవదారు, పున్నాగము, వెలగ, లనంగచెట్టు, పొగడ, అశోక, వేగిస, మామిడి, డోలావృక్షము, సంపెంగ, మారేడు, వేప, చంద్ర, కలిగొట్టు లేక పాదిరిచెట్టు, తక్కాలి, తెల్లమద్ది, మొదలైనవాని చెక్కలతో ద్రోణిని నిర్మించవలయును. (సూచన :— చరకమందు మోదుగ కఱ్ఱతో ద్రోణిని నిర్మించవలసినదని చెప్పబడినది.)

శ్లో॥ ద్రోణీ హస్త చతుష్క దీర్ఘకరమాత్ర వ్యాస తత్పాదమా
త్రోద్యద్భిత్తియుతా దృఢా సమతలా పాదాంత రంధ్రా బహిః
శీర్షస్థాన ఇహోన్నతైక కరమాత్రాత్తాన విస్తారకా
నిమ్నా కించన మధ్యతశ్చ చరణైర్హస్తైశ్చ యుక్తా దృఢైః॥ 4.

తా:—నాలుగు మూరలు (మూర అనగా 24 అంగుళములు) పొడవును, ఒక మూర వెడల్పును, 6 అంగుళముల ఎత్తును, హెచ్చు తక్కువలు లేకను దృఢముగాను, సమతలముగాను, పాద తలమున రంధ్రములు కలదియును, శీర్ష స్థానమున ఒక మూర వెడల్పును, కొంచెము ఎత్తుకలదియును మఱియు మధ్యభాగమున కొంచెము నిమ్నముగా నుండునదియును నగు ద్రోణిని అనగా తొట్టిని నిర్మించవలయును. ఇదిగాక చేతుల వద్దను మఱియు కాళ్లవద్దను ద్రోణి కిరుప్రక్కలను చెవులవంటివి ఏర్పాటు చేయవలయును. వీనిచేత తొట్టిని తీయుటకును, మఱియు వేయుటకు నుపకరించును.

శ్లో॥ ఏవం మారుత హారిభిశ్చ తరుభి ర్ద్రోణీం విధాయాదరా
ద్దేవం చేభముఖం ద్విజానపి భిషగ్వృద్ధాన్ ప్రపూజ్యాతిథీన్
పూర్వాహ్ణే దివసే శుభేశి మహితే లగ్నే శయానస్య తద్
ద్రోణ్యాంసేచన మాచరేత్ పటుమతి ర్ద్రవ్యై ర్యథోక్తైర్భిషక్॥

తా :— పైన జెప్పబడిన ప్రకారము అనగా వాతహర వృక్షముల యొక్క కఱ్ఱలచే ద్రోణిని నిర్మించి మొదట గణపతిపూజను, పిదప బ్రాహ్మణులను, వైద్యులను, వృద్ధులను మఱియు అతిథులను పూజించి, ఒక శుభదిన పూర్వాహ్ణమున శుభనక్షత్ర శుభలగ్నమందు రోగిని ద్రోణియందు పరుండజెట్టి ఉచితమగు స్నేహద్రవ్యములచే ధారాచికిత్స అనగా సేచనము ప్రారంభించవలయును.

శ్లో॥ స్వర్ణా ద్యుత్తమ లోహజస్తు కరకో మృత్సంభవో పాత్రిత
న్నాళాగ్రింతు కనిష్ఠికాంగుళి పరీణాహోన్మితం రోగిణః
ద్విప్రస్థప్రమితో విధేయ ఇతివా మధ్యస్థ రంధ్రాదధో
గచ్ఛద్వర్తి రధోర్ధ్వలంబ్యపి ఘటః కార్యః శిరస్సేచనే॥ 6.

తా:— బంగారు, వెండి మొదలగు ఉత్తమ లోహములచేగాని, లేక కేవలము మట్టితోగాని ధారాపాత్రను (శివుని కభిషేకముచేయు పాత్రవంటిది) చేయించి, దాని యడుగున రోగియొక్క చిటికెన వ్రేలు దూరునంత రంధ్రము నేర్పాటు చేయించవలెను. ఈ ధారాపాత్రి రెండు ప్రస్థముల ద్రవపదార్థము పట్టునదిగా నుండవలెను. ఆ ప్రకార మేర్పాటుచేసిన రంధ్రములో బయటనుంచి ఒక వస్త్రఖండమును వత్తిగాజేసి దూర్చి అది జారిపోకుండు లాగున ఒక పుల్లను చుట్టవలెను. ఈ ప్రకారము చేయుటచేత ధార హెచ్చుతక్కువలు లేక సమముగా రోగియొక్క లలాటమందు పడును.

శ్లో॥ గ్రాహ్యాస్తే పరిచారకాః స్యురనురక్తాః సావధానాః శుభా
యేతద్ధస్త దృఢావలంబన వశాత్తత్పాత్రి పాతాదితః
భీతిర్జాతుచిదాతురస్యతు యథానస్యాత్తథాకారయేత్
ధారాం మూర్ధనిహస్తయోరపి పృథగ్వక్షః స్థలేపాదయోః॥ 7.

తా:— ఈ ధారాచికిత్సకు పరిచారకు లవసరము. అట్టివారు అనురక్తులును, సావధానులును, రోగియొక్క సుఖమును గోరువారును, పవిత్రమైన అంతఃకరణకల వారును, మఱియు రోగికి ధారాపాత్రి తనమీద పడునను భయములేకుండా చేయగలిగిన వారును, ఇట్టి లక్షణములు గలవారిని నియమించవలెను. ధారాసేచము రోగియొక్క నుదిటిపైనను (మూర్ధము) హస్తములమీదను, వక్షస్థలమందును, మఱియు పాదముల మీదను వేరువేరుగా చేయించవలెను.

శ్లో॥ యద్వా హస్తతల, ప్రపూర్ణపిచునా సేకం క్వచిత్ కారయే
ద్యోజ్యం స్నేహచతుష్టయంచ తిలజంవా, తత్రిశుద్ధేనిలే
పిత్తే సేచ ఘృతం కఫేతు తిలజంవాతాస్ర పిత్తాన్వితే
తైలాజ్యంతు సమంకఫేన సహితే తైలార్ధభాగం ఘృతమ్॥ 8.

తా:— అథవా ఉత్తమాంగమునకు ధారాసేచముచేసి, మిగిలిన అంగములు అనగా హస్త, పాదాద్యంగములపై ధారకుజెప్పబడిన ద్రవమును చేతితో పోయుటగాని, బట్టముక్కను స్నేహములో ముంచి పిండుటగాని చేయవలెను. కేవలము వాతరోగు లకు నాలుగు స్నేహద్రవ్యములచే సిద్ధమైన స్నేహమునుగాని లేక నువ్వులనూనెచే సిద్ధ మయినదిగాని ధారాసేచమున కుపయోగించవలెను. పిత్తరోగులకున్ను, రక్తప్రధాన రోగులకున్ను లేక రక్తపిత్తరోగులకున్ను ఆవునెయ్యితోను, కఫరోగులకు నువ్వులనూనె

తోను, రక్తపిత్తముతో కూడిన వాతరోగములకు నెయ్యి నువ్వులనూనె సమానముగా జేర్చి సిద్ధము చేసిన స్నేహముతోను, కఫముతో గూడిన వాతరోగులకు ఒక భాగము నువ్వుల నూనె, అర్ధభాగము ఆవునెయ్యి వీనిని చేర్చి సిద్ధముచేసిన దానితో ధారాసేచనము చేయవలయును.

## అథ తక్రధారా.

శ్లో॥ అభ్యంగః పరిషేచనం పిచుశిరో వస్తిశ్చ విద్యాచ్చతు
ర్భేదం మూర్ధని తైలమప్యతిగుణం చైతత్ క్రమేణోత్తరమ్
అభ్యంగో వినిహన్తి రౌక్ష్యమపి కండూం దాహశోఫవ్రణ
క్లేదాదీన్ పరిషేచనం పిచు కచస్ఫోటాదిచాంత్యోఽఖిలమ్॥ 9.

తా:— యోగమందు చెప్పబడిన ప్రకారము సిద్ధముచేయబడిన తైలమును వివిధ అంగములపై నాలుగువిధములుగా నుపయోగించవలయునని తెలియవలెను. అనగా అభ్యంగము, పరిషేచము (ధారా) పిచు (బట్టను దిగ్రసములో ముంచి పిండుట) మఱియు శిరోవస్తి ఇవి క్రమముగా అనగా ఒకదానికంటె నింకొకటి గుణవత్తరమైనది. అభ్యంగము రూక్షత్వమును, కండూత్వమును హరించును. పరిషేచనము దాహ, శోఫ, వ్రణ, క్లేదములను బోగొట్టును. పిచు కేశస్ఫోటమును (వెంట్రుకలూడుటను) హరించును. శిరోవస్తి సమస్త వాతరోగములను నశింపజేయును.

## ధారా విధి.

శ్లో॥ ధారాయాస్త్వేకవర్షాతపహిమ పరిశోషాతిశుద్ధప్రకీర్ణమ్
ధాత్రీప్రస్థం సపాదం భిషగథ పటుధీః సంత్యజేద్బీజమస్యాః
ఉత్క్వాథ్యాష్టాదశాఖ్యామిత కుడవజలే షష్ఠభాగావశిష్టమ్
తత్తుల్యం చామ్లతక్రం విధిరితిమునిభిః ప్రోక్త ఆత్రేయముఖ్యైః॥

తా:— బాగుగా పండినవియును, ఒక సంవత్సరము వరకు ఎండలోను, రాత్రి మంచులోను ఉంచబడినవియును, మిగుల శుద్ధమైనవియున్ను, గింజలు తీయబడినవియునగు 80 తులముల ఉసిరికాయలను 28 తులముల నీటిలో వేసి, షష్ఠాంశ కషాయముగ కాచి వడియగట్టి, దీనికి సమము పులిసిన మజ్జిగను జేర్చి బాగుగా చికిత్స తెలిసిన వైద్యునిచే ఈ ధారా చికిత్స చేయించవలయునని ఆత్రేయాది మునులు చెప్పిరి.

శ్లో॥ ధారాయాః స్ఫటికసువర్ణ రజత ప్లతామ్రాది పూర్వోక్తపృ
త్పాయ స్తామ్ర వరాటికా ప్రథిత మృత్పాత్రం త్వతీవోత్తమమ్॥
కేచిద్రోగి కనిష్ఠికాంత వివరం శంసన్తి కేచిత్తు వా
తత్పర్వోపమ విస్తృతం తు సుషిరం పాత్రస్య మధ్యేకృతమ్॥ 11.

తా :— ధారాపాత్రను స్ఫటికముతో గాని, స్వర్ణముతో గాని, రజితముతో గాని లేక ద్రోణీనిర్మాణమునకు చెప్పబడిన వృక్షములయొక్క కఱ్ఱతో గాని, తామ్రముతో గాని లేక బంకమట్టితో గాని చేయించవలెను. వీనిలో మృత్పాత్ర శ్రేష్ఠమైనది. ఆ పాత్రయందు నేర్పాటుచేయు రంధ్రము రోగియొక్క చిటికెనవ్రేలు యొక్క అగ్రభాగము దూర్చదగినంత గాని లేక కొందటి కణుపుయొక్క పరిమితిగాని ఉండవలెనని కొందరి యభిప్రాయము.

శ్లో॥ ధారాయాశ్చావసానే నిజగద శమన ప్రోక్త సర్పిశ్చ సేవ్యమ్
తత్కాలే చాపసంస్థః కథమపి వసతు ప్రీతిమ్మౌనేవ రోగీ
కాయక్లేశావశేషాన్మనసి సుఖహరాన్ వక్త్రజిహ్వా సుఖాదీమ్
స్త్యక్త్వా పాటీర శుద్ధాంబర విధృతవపు ర్బ్రహ్మ విజ్ఞానితుల్యః॥

తా :— ధారాస్నానానంతరము రోగి తనరోగమున కుచిత ఘృతమును సేవించవలెను. ధారా సమయమందు మౌనశ్శాంతితో నుండి, కాయక్లేశాది పనులను విసర్జించి, మితభాషియై యుండి, జిహ్వాచాపల్యమును నిగ్రహించి మంచిగంధమును రాచుకొని, మఱియు శుభ్రమైన వస్త్రములను ధరించి బ్రహ్మజ్ఞానివలె నుండవలెను.

శ్లో॥ కేశాదీనాం చ శౌక్ల్యం క్లమమపి తనుతాం దోషకోపం శిరోరుక్
బాధామోజః క్షయం తత్కర చరణ పరిస్ఫోదనం మూత్రదోషమ్
సంధీనాం విశ్లథత్వం హృదయరుగరుచీ జాఠరాగ్నేశ్చ మాంద్యమ్
ధాత్రీ తక్రోత్థ ధారా హంతి శిరసి వా కర్ణ నేత్రామయౌఘమ్॥13

తా :— అకాలమందు వెంట్రుకలు తెల్లబడుట, అధిక శారీరకశ్రమ, త్రిదోష ప్రకోపము, శిరోవేదన, ఓజఃక్షయము, చేతులుకాళ్ళు వీనియందు పోట్లు, మూత్రదోషము, కీళ్ళయందు శిథిలత్వము, హృద్రోగము, అరుచి, అగ్నిమాంద్యము, ఇవన్నియు ఉసిరిక మఱియు మజ్జిగలతో ధారా సేచము చేసిన నివారించును. ఊర్ధ్వాంగమునకు పై చికిత్సలు చేసిన శిరోవ్యాధులును, కర్ణవ్యాధులును, మఱియు నేత్రవ్యాధులును హరించును.

శ్లో॥ స్థైర్యం వాఙ్మనసోః శరీర బల మప్యాహార కాంక్షాధృతీ
ర్మాధుర్యం వచనస్త్వచోపి మృదుతా నేత్రే ప్రకాశోగదః॥
శుక్లాసృక్పరిపోషణం రతరతి ర్దీర్ఘాయు రల్పోష్ణతా
దుస్స్వప్నం ఘృతతైల సేచన గుణేనా స్తీతి జాగ్రత్సుఖమ్॥ 14.

తా :— ఘృతము మఱియు తైలము ఈ రెండింటిని కలిపి ధారా సేచము చేసిన వాక్శక్తి, మనస్థైర్యము, దేహమందు బలము, ఆహారేచ్ఛ, ధైర్యము, వాఙ్మాధుర్యము

చర్మమునకు మృదుత్వము, నేత్రప్రకాశము, నేత్రములయొక్క ఆరోగ్యము, శుక్లవృద్ధి, రక్తప్రసారము, సంభోగేచ్ఛ, మఱియు సామర్థ్యము, దీర్ఘాయువు, శరీరమందు ఉచితోష్ణత మొదలగునవి కలుగును. ఇవియునుంగాక దుస్స్వప్నములను హరించును.

ధారా

శ్లో॥ తత్తద్వ్యాధి శమోదితౌషధిగణైః సిద్ధంచ వా యోజయేత్
స్వస్థేభ్యంజన సేచనాదిషు సదా తైలాజ్య సమ్మిశ్రితమ్
ఏకాహాంతరమేవ వా ప్రతిదినం పూర్ణే బలే మధ్యమే
త్యక్త్వా ద్వి్త్రిదినం చతుర్దిన మహోహ్యల్పేత్రి షట్పంచవా॥ 15.

తా :— ఆయారోగము లుపశమించుటకుగాను జెప్పబడిన ఔషధ ఘృతతైల మిశ్రణలచే సిద్ధముచేసిన తైలమును రోగికి అభ్యంజన సేచనాదులం దుపయోగించవలెను. స్వస్థునకు అనగా ఆరోగ్యవంతునకు, ఘృతతైల మిశ్రితమైనస్నేహముతో ధారాసేచనము చేయించవలెను. పూర్ణబలునకు ప్రతిదినమును లేక దినము విడిచి దినమున్ను, మధ్యమ బలునకు రెండులేక మూడుదినముల కొకపర్యాయమున్ను, హీనబలునకు నాల్గు లేక అయిదు లేక ఆరుదినముల కొకసారియున్ను ధారాసేచనము చేయించవలెను.

శ్లో॥ పిత్తేకోష్ణ మథోష్ణమేవ విహితం శుద్ధే సమీరామయే
తత్స్నేహం ద్రవమాత్రమేవ కఫయుక్తే రక్తపిత్తేపిచ
ఊర్ధ్వాంగేతు సుశీతమేవ విహితం సించేదవిచ్ఛిన్నమే
వాత్యర్థోచ్చ విలంబిత ద్రుతనతం కుత్రాపి నైవాచరేత్॥ 16.

తా :— పిత్తప్రకోపరోగములందు ధారాచికిత్స కుపయోగించవలసిన స్నేహద్రవ్యము కించిదుష్ణముగ నుండవలెను. శుద్ధవాతరోగములందు అట్టిస్నేహ మోర్చదగినంతవేడిగను మఱియు కఫోల్బణ రోగములందును, రక్తపిత్తమందు నాస్నేహము కరుగుటకావశ్యకమగునంత ఉష్ణముగ నుండవలెను. ఊర్ధ్వజత్రు రోగములందు అనగా సకల శిరోరోగములందు కేవలము సుశీతమైన స్నేహద్రవ్యము నుపయోగించవలెను. ఇది గాక ధార అవిచ్ఛిన్నముగను, అతివేగ, అతిమందము కాకుండగను హెచ్చుతక్కువల ఎత్తుపైనుంచి కాకుండగను విధిప్రకారముగను ధారాభిషేకము చేయించవలెను.

శ్లో॥ రూక్షే పిత్తయుతేనిలే చ పరమః కాలో ముహూర్తద్వయమ్
సార్ధం తత్ర తదర్థ మాత్ర ఉదితః స్నిగ్ధే కఫోన్మిశ్రితే॥
యావత్ స్వేద సముద్భవో భవతి తత్రావన్నివర్తేతవా
స్నేహాత్రిభిరేతి రోమవివరం మాత్రాశతైశ్చ శ్రమాత్॥

తా :— రూక్షత్వముతో గూడిన పిత్త వాత రోగమందు 3 గంటలకాలపర్యంతము ధారాసేచనము చేయుట యుక్తము. స్నిగ్ధయుక్త కఫవాతరోగమందు 1½ గంటల కాలపర్యంతము ధారా, చికిత్స ఉచితము. అనగా శరీరాద్యంతము చెమటపుట్టు వరకు చేయించవలయును. ధారగానివ్వబడిన స్నేహము సర్వరోమకూపములలో వ్యాపించుటకు 300 మాత్రల కాలము పట్టును. (నిమేషోమాత్రయాసమః అనగా ఒక నిమేషము ఒక మాత్రకు సమము) అని అమరసింహునిచే జెప్పఁబడినది.

శ్లో॥ సప్తాపి త్వచపతి స ప్తభి రథో మఢ్బి స్తథాసాదికాన్
పట్ధాతూనిషు సింధుదిగ్గ్రహమితా మాత్రాముహూర్తోభవేత్
ధారోచ్చం చతురంగులంతు శిరసః సేకే తదన్యత్ర తత్
ప్రోక్తం త త్త్రిగుణంచ మందపతనా త్తదోగ వృద్ధి ర్భవేత్॥

ఈ స్నేహద్రవ్యము ఏడురోజులలో క్రమముగా అవభాసినీ, లోహితా, శ్వేతా, తామ్రా, వేదినీ, రోహిణీ మరియు మాంసధార అనబడు సప్తత్వక్కులలో వ్యాపించును ఆరురోజులలో రక్త, మాంస, మేద, అస్థి, మజ్జ, శుక్ర ధాతువులలో క్రమముగా వ్యాపించును. 1½ గంటలకాలమునకు 5789 మాత్రలు సమమని సూచింపబడినది. ఉత్తమాంగమునకు నివ్వబడు ధార 4 అంగుళముల ఎత్తున నుండవలెను. అనగా రోగి యొక్క శిరస్సునకు ధారయొక్క పత్తికిని 4 అంగుళముల యెడముండవలయును. ఇతర అంగముల కివ్వబడు ధార 12 అంగుళము లుండవలయును. పైన జెప్పిన ధారలు మందముగా నున్నయెడల ఆరోగము వృద్ధిపొందును.

శ్లో॥ అత్యుచ్చ దుత భూరి కాల పరిషేకాద్దాహ వీసర్పరుజా
మూర్ఛాంగ స్వరసాద సంధి దళన చ్ఛర్ద్యస్రపిత్తజ్వరాః
క్రోతాద్యాశ్చ భవంత్యతః పరదినే గండూష నస్యాదికమ్
కృత్వాశుద్ధ మహాష ధేన సుశృతం తోయం పునః పాయయేత్॥

తా :— అతిఉన్నత, అతిశీఘ్ర. అతిదీర్ఘకాల ధారాసేచనము వలన దాహ, విసర్ప, మూర్ఛ, అంగసాద, స్వరసాద, సంధిశూల, వాంతి, రక్తపిత్త, జ్వర, క్రోత మొదలగు రోగములు పుట్టును.

ధారాస్నానమైన మరుసటి దినమున విధప్రకారము గండూష, నస్య, అంజన కర్మలను జేయించి పిదప శుంఠీ కషాయము నివ్వవలయును.

శ్లో॥ సాయాహ్నే లఘుభోజయేత్ కటుతరం యూషాన్వితం చాప్యథో
వస్తిం స్నేహకృతంచ సైంధవకృతం కుర్యాత్ తృతీయే హని॥
స్నేహవ్యాపది చోక్త కర్మనిఖిలం కుర్యా చ్చతు ర్థేహ్న్యతః
ప్రాగ్వత్ స్నేహ నిషేవణంచ విధివత్ కుర్యాద్దినే పంచమే॥ 20.

తా :— పిదప సాయంకాలమందు కటురసయుక్త యూషముతోగూడిన లఘు భోజనము చేయించవలయును. రెండవరోజున స్నేహవస్తి చేయించి, మూడవ రోజున వస్తిద్రవ్యములలో సైంధవలవణమును జేర్చి వస్తికర్మ చేయించవలెను. స్నేహవ్యాపత్తి అనగా స్నేహకర్మ యొక్క హెచ్చు తక్కువలచే గల్గు వ్యాధులకు జెప్పబడిన కర్మలు యాపత్తు నాల్గవరోజున చేయించవలెను. అయిదవ దినమందు మొదట చెప్పబడినట్లు స్నేహపానమును విధి ననుసరించి చేయించవలెను.

శ్లో॥ ఏకాహాదపరం నసేచన విధౌ క్షీరాధికం గృహ్యతే
ధాన్యామ్లం త్రిదినాత్పరం విధిరయా స్నేహస్యతు ప్రాయశః
ఏకేన త్రిదినం పరేణచ తథా సించేత్ర్యహం తత్ ద్వయమ్
మిశ్రీకృత్యచ సప్త మేహాని పున స్త్వ్యక్త్వైన మేవం చరేత్॥ 21.

తా :— ఆవుపాలు మొదలగునవి ఒకరోజుపయోగించిన తరువాత తిరిగితీసికొన గూడదు. ధాన్యామ్లము మూడుదినముల తరువాత పనికిరాదు, తరుచుగా స్నేహద్రవ్యములను మూడు రోజుల వరకుపయోగించ వచ్చును. తరువాత నీ స్నేహములో మొదట చెప్పిన ద్రవ్యములను జేర్చి స్నేహమును తిరిగి సిద్ధముచేసి ఏడుదినముల వరకుపయోగించవచ్చును. ఈ ప్రకారము చేసిన యెడల రోగి రోగనిముక్తుడగును. స్నేహము సరిపోయిన యెడల పూర్వోక్తప్రకారము సిద్ధముచేసికొనవలెను.

శ్లో॥ నూనం తేన నిషేచనం ప్రతిదినం తచ్చోత్త్వ్యత్తమం మధ్యమమ్
తేనైవ త్రిదినం తతోపిచ పరం మిశ్రీకృతంచాధమమ్॥
అత్యుష్ణేపిచ మందకోప సమయే మందాతపే శీతలే
కుర్యాన్నత్వ పరాహ్ణ కేపిచ భిషగ్రాత్రౌ తథా సేచనమ్॥ 22.

తా :— ప్రతిదినము క్రొత్తగా సిద్ధముచేసిన స్నేహమునుపయోగించు టుత్తమము. మూడురోజులవరకు అదేస్నేహ ముపయోగించుట మధ్యమము, మూడురోజుల తరువాత అదేస్నేహములో తిరిగి వేరేస్నేహమును గలిపి యుపయోగించు టధమము. ధారా స్నానము అత్యుష్ణ సమయమందును, త్రిదోష ప్రకోపము మందముగా నున్నప్పుడును, ఎండ తక్కువగా నుండి చల్లగా నున్నప్పుడును, అపరాహ్ణ సమయమందును మఱియు రాత్రి భాగమందును చేయింపంజనదు.

శ్లో॥ సేకానంతర మాతురస్తు శిశిరాంబు ప్రోక్షణైః ప్లీవనై
శ్చోక్షైపై ర్మృదు మారుతైరనుగుణం విశ్రమ్య తత్రోద్ధితః॥
మందం కించన మర్దితోనుచ రసైః స్నేహం కషాయై స్త్యజేత్
స్నాత్వా కోష్ణజలైః సుగంధ సుభగో ధాన్యామధాంభః పిబేత్॥

తా :— ధారాచికిత్సానంతరము కాచి చల్లార్చిన నీటితో ప్రోక్షణ, గండూషాదులను జేసికొని మందముగా గాలివీచు ప్రదేశమందు విశ్రమించవలయును. మేల్కాంచిన

పిదప అంగమర్దము మెల్లగా జేయించికొని స్నేహము మఱియు కషాయము లేకుండిన కేవలము వేడినీళ్లతో స్నానము చేసికొనవలెను. అనంతరము శుభ్రమైన వస్త్రములను ధరించి సుగంధ ద్రవ్యములను రాచుకొని ధనియాలు మఱియు శుంఠి వీనిచే సిద్ధమయిన కషాయమును త్రాగవలెను.

శ్లో॥ పేయం వా లఘుశోషణాజ్య కటు తక్రం యథాపయుక్తం మితమ్
భుక్తం కోష్ణమథాచరేద్విధిమతః స్నేహోక్త మాత్రాఖిలమ్
ఏవం సప్తదినం వ్యతీత్య పునరప్యేద్యుర్విరేకం తతో
వస్తిం తత్రతు కారయేదితి విధిర్నా సత్యసంభాషితః॥ 24.

తా :— అథవా గంజి (పేయము) చేసి అందు మజ్జిగ, కొంచెము నెయ్యి, మిరియాలు, శుంఠి, వీనిని చూర్ణించివేసి సేవించవలయును. పిమ్మట వేడిగానుండు ఆహారము అనగా అన్నమును పప్పుతో మితముగా భుజించవలయును. స్నేహవిధియందు జెప్పిన సకల క్రియలను జేయవలయును. ఈ ప్రకారము దీనిని ఏడుదినములుచేసి ఎనిమిదవ దినమున రేచనకర్మ చేసికొని, తొమ్మిదవదినమున వస్తికర్మ చేసికొనవలెనని అశ్వినీ దేవతలు చెప్పిరి.

శ్లో॥ యావంత్యౌషధ యోజితానిదివసాన్యేతాని తావంత్యహో
న్యన్యాన్యప్యథ సర్వకర్మసు బుధో నిత్యం జితాత్మానయేత్
స్త్రీణాం స్పర్శన దర్శన స్మృతివశాచ్ఛుక్లే స్రుతే సంతి తత్
సంపర్కేణ వినాపి తద్భవగదాస్తస్మాత్ త్యజేత్ సర్వదా॥ 25.

తా :— రోగి తన హితమునకుగాను, మఱియు ఆరోగ్య లాభమునకుగాను జికిత్సకుని యాదేశానుసారము, చికిత్సాకాల పరిమితివరకు చికిత్సను పొందుటయును, అట్టి చికిత్సానంతరము కూడా పూర్వమెంతకాలము చికిత్స జరిగినదో తరువాతకూడా అంతే కాల పర్యంతము ఆహార విహారాదులలో జాగ్రత్తగా నుండుటయును, స్త్రీలదర్శనము, వారిని తాకుట, మఱియు వారితో సంపర్కము, అనువానిని విసర్జించి శుక్రస్ఖలనము లేకుండగ జూచుకొనుచు నుండవలెను. ఇదియునుంగాక నిత్యము, నియమనిష్ఠాదులతోను జితాత్ముడుగను శుచిగా నుండు టుచితము.

శ్లో॥ గుల్మానాహ భగందర వ్రణ తూనీ శూలాభిఘాతాస్రవా
తోదావర్తక కోశ మూఢ మరుదష్ఠీలా విసర్పాదిషు
ప్లీహాధ్మానక విద్రధి ప్రతితూనీష్వేకాంగ సేకం తథా
కుర్యాద్ధస్తతల ప్రపూర్ణ పిచునా మందం సుఖోష్ణం భిషక్॥ 26.

తా :— గుల్మ, అనాహ, భగందర, వ్రణ, తూనీ, శూల, అభిఘాత, రక్తవాత, ఉదావర్త, కోశ, మూఢవాత, అష్ఠీలా, విసర్ప, ఆధ్మాన, విద్రధి, ప్రతితూనీ ఇత్యాది

వ్యాధులందు, ఒక బట్టను ఉండగాజేసి, స్నేహములో ముంచి సుఖోష్ణముగా నుండు దానిని వివిధాంగములపైని సేకము చేయవలయును. దీనినే ఏకాంగ సేకమందురు.

శ్లో॥ వ్యాయామాతపవేగ రోధ హిమ ధూమాత్యుచ్ఛ నీచోపధా
నాహాః స్వప్నరజః ప్రవాత చిరకాలాసీనతాః సంస్థితమ్
శోకం జాగరపాద యాన గమన క్రోధాతి భాష్యాదికామ్
స్త్యక్త్వా త్వోష్ణ జలోపచార్య నతిభుక్ స్యాద్బ్రహ్మచారీ సదా॥27.

తా :— ఈ ధారా చికిత్సా కాలమందు, అతివ్యాయామము, ఎండలో తిరుగుట, మలమూత్రాది నిరోధము, హిమ, ధూమ సేవనము, అతినిమ్నోన్నతములైన దిండ్లను తలక్రింద నుంచి శయనించుట, దివాశయనము, ధూళిలో నుండుట, హెచ్చుగాలిలో నుండుట, ఒకేస్థితిలో చాలాసేపు నిలబడుట లేక కూర్చుండుట, దుఃఖము, జాగరణ, చాలాదూరము నడచుట, కోపము, అతిసంభాషణము మఱియు అతిభక్షణము ఇత్యాది వ్యతిరిక్త కార్యములను త్యజించి, శౌచాది కార్యములందుష్ణజల మపయోగించుచు బ్రహ్మచర్య నిష్ఠతో నుండవలెను.

## శిరస్సేకము లేక ధారాకల్పముగురించి చరక సుశ్రుత వాగ్భటములందు వ్రాయబడిన విషయములు.

శ్లో॥ పద్మకం త్వక్సమధుకం శారిబాచేతితైర్ఘృతమ్
సిద్ధం సమధుశుక్తం స్యాత్ సేకాభ్యంగః కఫోత్తరే
క్షీరం తైలం గవాంమూత్రం జలంచ కటుకైః శృతమ్
పరిషేకః ప్రశస్యన్తే వాతరక్తే కఫోత్తరే॥

చరక చికిత్స 29 అ.

తా:— పద్మకాష్ఠము, లవంగపట్ట, యష్టిమధుకము, సుగంధపాలవేళ్లు అనువాని కల్కమును తేనె, శుక్తము మరియు నెయ్యి అనువానిలో వేసి పాకము చేసి పరిషేకము మఱియు అభ్యంగము చేసిన కఫాధిక్య వాతరక్తము శమించును. క్షీరము, తైలము, గోమూత్రము, జలము, వీనిలో ఒక్కొక్కదానితో సిద్ధమైన కషాయముతో పరిషేకము చేసిన కఫాధిక్య వాతరక్తము హరించును.

శ్లో॥ వాతికోత్తర వాతికానాం పునర్మూలాదీనాముత్క్వాథైః సుఖోష్ణైః
కుంభీర్వార్షలికాః ప్రనాడీర్వా పూరయిత్వా యథార్హ్వాసిద్ధ
స్నేహాభ్యక్తగాత్రం వస్త్రావచ్ఛన్నం పరిషేచయే దితి పరిషేకః॥

చరక సూ. 14 అ.

తా:— వాతహరమైన ఔషధ ద్రవ్యములచే లేక వాతప్రధాన త్రిదోషఘ్న ఫలమూల, పత్రాదులచే సిద్ధమైన కషాయమును సుఖోష్ణమైనది. ఒక కలశములో గాని లేక ధారాపాత్రలోగాని చిన్న వెదురుగొట్ట మమర్చబడిన దానిలో బోసి పరిషేచనము చేయవలెను. ఈ పరిషేచనమునకు ముందు ఆయా రోగములకు తగిన అనగా వాతాది దోషహర ఔషధ ద్రవ్యములచే సిద్ధమైన తైలాది స్నేహములను శరీరమునకు రాచి పిదప రోగిని వస్త్రఖండముచే ఆచ్ఛాదితుని జేయవలెను. ఇట్టి స్వేద క్రియకు పరిషేకస్వేద మందురు.

శ్లో॥ పైత్తే ఘృతం పయః సేకాః శీతాలేపాః సనావనాః
చందనోశీరయష్ట్యాహ్వా బలా వ్యాఘ్రి నఖోత్పలైః
క్షీరపిష్టైః ప్రదేహాఃస్యాత్ శృతైర్వా పరిషేచనమ్॥

చరక. చికి. 26 అ.

తా:— పైత్తిక శిరో రోగమందు పాలు నెయ్యి అనువాని శీతల పరిషేకము, శీతల ప్రలేపము, నస్యము, జీవనీయ ఘృతము, మరియు పిత్తనాశక అన్నపానములు ప్రశస్తములు.

శీతల పరిషేకము ఎట్లనగా:— చందనము, వట్టివేళ్లు, యష్టిమధుకము, ముత్తవపులగమువేళ్లు, నఖము చిప్పలు మఱియు నల్లకలువ అనువానిని కషాయముగ కాచి చల్లారిన పిమ్మట సేచనము చేయవలెను.

శ్లో॥ వాతఘ్న దశమూలాది సిద్ధ క్షీరేణ సేచనమ్॥

అష్టా. ఉత్తర. 25 అ.

తా:— వాతహరమగు దశమూలములచే సిద్ధమైన క్షీరమును పరిషేకముచేసినచో శిరోరోగములు హరించును.

శ్లో॥ వాతఘ్న సిద్ధైః క్షీరైశ్చ సుఖోష్ణైః సేకమాచరేత్॥

సుశ్రు. ఉత్త. 26 అధ్యా.

తా:— వాతహరములైన దార్వ్యాది ద్రవ్యములచే సిద్ధమైన సుఖోష్ణమైన క్షీరసేకము పిత్తవాత జనిత శిరోరోగము హరించును. పై ధారాకల్పము క్షీరము, కషాయము, తైలము, ఘృతము, ఘృతతైల మిశ్రణ గోమూత్రము, మఱియు మజ్జిగ అనువానిచే ఆయా రోగములకు దగినట్లు చేయించవచ్చును.

**అభ్యంగము:**—అనగా శరీరాభ్యంతము, ఆయా రోగములకు జెప్పబడిన ఔషధ ద్రవ్యములచే సిద్ధము చేయబడిన తైలాదులను రాచుకొనుట. ఈ తైలములు శిరస్సునకు రాచుటచేత శిరోపరిభాగమందలి రోమ కూపములలో నుండు రూక్షత్వమును బోగొట్టి అట్టి రూక్షత్వముచే గలుగు తలనొప్పి, కర్ణవ్యాధులు, నేత్రవ్యాధులు మఱియు నాసికా రోగములు హరించును.

శ్లో॥ అభ్యంగ మాచరే న్నిత్యం సజరాశ్రమవాతహా
దృష్టిప్రసాద పుష్ట్యాయుః స్వప్నసుత్వక్ ధార్ఢ్యకృత్॥

అష్టాంగహృదయము సూ. 2 అ.

తా:— ప్రతిరోజు అభ్యంగము జేసుకొనుటచే ముసలితనము, శ్రమ, మఱియు వాతమును బోగొట్టి కండ్లకు నిర్మలత్వము, శరీరపుష్టి, ఆయుర్వృద్ధి, శరీరకాంతి మఱియు దార్ఢ్యమును గలుగజేయును.

శ్లో॥ తత్రాభ్యంగః ప్రయోక్తవ్యో రౌక్ష్యకండూమలాదిషు॥

అష్టా. హృ. సూ. 22 అ.

తా:— అభ్యంగమునకు జెప్పబడిన తైలమును రూక్షత్వము, దురదలు మఱియు మలాదులను శాంతింప జేయుటకు ప్రయోగించుకొనవలెను.

— పిచు —

పిచు అనగా ఒక వస్త్రఖండమును తైలములో దడిపి శరీరముయొక్క వివిధ అంగములపై నుంచుట లేక పిండుట.

శ్లో॥ పిచుః కేశశాతస్ఫుటన ధూపనే నేత్ర స్తంభేచ॥

తా:— పిచు కర్మయం దుపయోగించు తైలమును, వెంట్రుక లూడుట, వెంట్రుకల కుదుళ్లు చీలుట ధూపనము, (ధూమనిర్గమ వత్ వేదన) నేత్రస్తంభనము, అనువానియం దుపయోగించవలయును.

— శిరోవస్తి —

శ్లో॥ విధిస్తస్య నిషణ్ణస్య పీఠేజానుసమే మృదా
శుద్ధాక్తాస్విన్న దేహస్య దినాంతే గవ్య మాహిషమ్॥
ద్వాదశాంగుల విస్తీర్ణం చర్మపట్టం శిరస్సమం
ఆకర్ణ బంధన స్థానం లలాటే వస్త్ర వేష్టితే॥
చైలవేణికయా బద్ధ్వా మాష కల్కేన లేపయేత్
తతో యథా వ్యాధి శృతం స్నేహం కోష్ణం నిషేచయేత్॥
ఊర్ధ్వం కేశభువోయావద్ధ్వ్యంగులం ధారయేచ్ఛృతమ్॥

అష్టా. హృ. సూ. 22 అ.

తా:— మొదట విధిప్రకారము వమనస్వేదాది కర్మలచే రోగిని స్విన్నునిగజేసి సాయంకాలమందుగాని, రాత్రియందుగాని, మోకాలంత పొడవుగల మెత్తని ఆసనము మీద కూర్చుండబెట్టి, అతని తలచుట్టు, చెవులకు పైనుంచి ఒక బట్టముక్కను జుట్టి ఆపైని

12 అంగుళముల ప్రమాణము గలదియును శిరస్సునకు సమానమైనదియును మరియు చెవుల వరకు వచ్చునట్టిదియునగు ఆవు చర్మము గాని, గేదె చర్మము గాని చుట్టి, దానిపై నుంచి ఒక బట్టపేలికను జుట్టి కట్టవలెను. పిమ్మట దానిపైన అనగా వేడి నీటిలో గలిపిన మినపపిండి ముద్దను టోపీవలె జుట్టిన దానికి సందులు లేకుండులాగున మెత్తి పైనుంచి తగిన స్నేహమును తలవెంట్రుకలపైన రెండు అంగుళముల ఎత్తువరకు సుఖోష్ణముగా నున్నది పోయవలెను. ఈ స్నేహమును ముక్కునుండి మరియు నోటినుండి నీరు స్రవించు వరకుంచవలెను. దీనిని వాతోల్బణ వ్యాధులందు 10000 మాత్రల కాలము వరకును, పిత్తజ వ్యాధులందు 8000 మాత్రల కాలమువరకును, కఫోల్బణ వ్యాధులందు 6000 మాత్రల కాలమువరకును ధరించవలయును. శిరోవస్తిచేత, ప్రసుప్తవాతము, అర్దితవాతము, జాగరణము, తిమిరము ముక్కురంధ్రములు, నోరు ఇవియెండుట మరియు దారుణమైన శిరోవ్యాధులు హరించును.

శ్లో॥ వస్తిస్తు ప్రసుప్త్యర్దిత జాగరే
నాసాస్య శోషే తిమిరే శిరోరోగ దారుణే॥

అని పైన వ్రాసిన ప్రకారము జెప్పబడినది.

## పిండ స్వేదము.

శ్లో॥ పిండోపనాహ స్వేదాశ్చ మాంస ధాన్యం కృతాహితాః॥

తా:— వాత శిరోరోగమందు శిరస్సునకు, మాంసము మరియు ధాన్యముతో సిద్ధముచేయబడి పిండముతో నివ్వబడిన ఉపనాహ స్వేదము హితము.

శ్లో॥ అథవా గవాది శకృతా పిండీ కృతే నోష్ణేన స్వేదః
సచపిండ స్వేదసంజ్ఞః॥

తా:— లేక ఆవు మొదలగు జంతువులయొక్క మలమును (పేడను) ఉండగా జేసి నిప్పులో నుడికించి దానితో స్వేదకర్మ చేసిన పిండస్వేద మనబడును.

శ్లో॥ తిల మాషకుల త్థామ్ల ఘృత తైలా మిషౌదనైః
పాయసైః కృశరై ర్మాంసైః పిండస్వేదం ప్రయోజయేత్॥

చరక. సూ.

తా:— నువ్వులు, మినుములు, ఉలవలు, ఆమ్లద్రవ్యము, ఘృతము, తైలము, మరియు మాంసము వీనితో గూడిన అన్నము, పాయసము, కృశరము (తిలమాష కృత యవాగు) మరియు కేవలము మాంసము అనువానిని పిండాకారముగ జేసి వేడిగానున్న దానితో పిండస్వేదము ప్రయోగించ వలయును.

శ్లో॥ వాతే సరక్తే సఘృతః ప్రదేహో
గోధూమ చూర్ణం ఛగలీ పయశ్చ॥

తా :—గోధుమ పిండి, మేకపాలు, మఱియు నెయ్యి వీనితో సిద్ధమైనదాప్రప లేపనము వాతరక్త వ్యాధిని శమింపజేయును.

వాతఘ్నైః సాధితః స్నిగ్ధః కృసరో ముద్గపాయసః

తా :—వాతహర ద్రవ్యములతో అనగా నువ్వులు మఱియు పెసలు అనువానితో చేయబడిన కృసరము (తిలమాషకృత యవాగు) శూలాదులను బోగొట్టును.

సహస్రయోగ ప్రకాశిక యందలి
ధారాకల్పనామ కానుబంధము

---

# ఉపసంహారము.

శ్లో॥ భిషజాం సాధువృత్తానాం భద్రమాగమశాలినాం
అభ్యస్త కర్మణాం భద్రం భద్రం భద్రాభిలాషిణాం॥

తా॥ శాస్త్రము యొక్క పరమార్థమును అవగతము చేసుకొని ఘృత తైలలేహాదులతోను, అనువాసననిరూహాదులతోను జికిత్సలను జేయు సర్వభూతహిత కాంక్షులును, సచ్చరితులును అగు సద్వైద్యులకు ఇహాపరములందును, మఱియు సర్వత్రయును మంగళలాభము కలుగును.

సంపూర్ణము.

# రోగములు, ఔషధములు.



నెం. పేర్లు పుటసంఖ్య.

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 20 | కట్వల | కట్ఫల |
| 3 | 10 | వాతపిత్తజ్వర | వాతపిత్తజ్వర, |
| 3 | 11 | మూర్చ | మూర్ఛ, |
| 5 | 22 | అధోగతరక్త | అధోగత |
| 9 | 23 | కటుత్రియోః | కటుత్రయైః |
| 11 | 2 | అగ్నిమంధా | అగ్నిమంథా |
| 11 | 8 | లశనైః | లశునైః |
| 12 | 15 | జోంగథో | జోంగ |
| 13 | 15 | కషాయమును | కషాయము |
| 13 | 27 | సాధితాః | సాధితా |
| 16 | 22 | దేవదార్వ్యాది | దేవదార్వాది |
| 17 | 14 | పూతికాది | పూతీకాది |
| 18 | 19 | మత్స్యాక్షి | మత్స్యాక్షీ |
| 18 | 20 | పాలక్రైః | వాలక్రైః |
| 20 | 24 | ఆద్యవాతం | ఆఢ్యవాతం |
| 22 | 8 | మిశంచును | శమించును |
| 22 | 26 | శూలలను | శూలలును |
| 23 | 4 | త్రికృత్స్నిద్దం | త్రివృత్స్నిద్ధం |
| 23 | 12 | ఉదావర్తము | ఉదావర్తమును |
| 23 | 15 | నించి | నింబ |
| 23 | 27 | వరుణ | తరుణ |
| 24 | 1 | చింతాకుల ఈనెలు | చింతాకుల లేత ఈనెలు |
| 24 | 20 | పధ్యాది | పథ్యాది |
| 24 | 23 | చ్ఛ్వయధు | చ్ఛ్వయథు |
| 25 | 7 | వృషాభయోద్దం | వృషాభయోద్ధం |
| 25 | 14 | సేవ్యాంబుధిః | సేవ్యాంబుభిః |
| 26 | 16 | గూడిన | గూడి |
| 27 | 5 | ఔదంబర | ఔదుంబర |
| 27 | 7 | కుటజి | కుటజ |
| 27 | 28 | పక్షాశూతము, | పక్షాఘాతము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 23 | 27 | సర్వతములను | సర్వవాతములను |
| 29 | 16 | శతాహ్వ | శతాహ్వ |
| 29 | 17 | మజాజీవ | మజాజీచ |
| 30 | 11 | పుష్ఠ | పృష్ఠ |
| 30 | 26 | గంథా | గంధా |
| 31 | 21 | అగోగత | అధోగత |
| 32 | 8 | రాస్నైరండ | రాస్నైరండ |
| 32 | 8 | సహాచర | సహాచర |
| 33 | 10 | క్వాధం | క్వాథం |
| 33 | 12 | తైలేరండ | తైలేనేరండ |
| 33 | 15 | తధా | తథా |
| 33 | 26 | గృథసీ | గృధ్రసీ |
| 33 | 28 | క్వాధము | క్వాథము |
| 34 | 23 | ప్రిత్యూనీ | ప్రితూనీ |
| 34 | 23 | కంపఖిల్లీ | కంపఖల్లీ |
| 35 | 14 | కుంజకైః | కుంభకైః |
| 35 | 21 | క్వాధ | క్వాథ |
| 35 | 23 | చెఱుకు | చెఱకు |
| 38 | 5 | క్వాధముతో | క్వాథముతో |
| 39 | 9 | క్వాధము | క్వాథము |
| 39 | 22 | చూర్ణదవ | చూర్ణద్రవ |
| 40 | 9 | పచేత్త తిక్తకం | పచేత్త్రి త్రిక్తకం |
| 41 | 24 | పృధగ్దశ | పృథగ్దశ |
| 41 | 26 | కల్కై | కల్కైః |
| 42 | 19 | మజ్జా, గత | మజ్జాగత |
| 44 | 15 | బొందం | బొండము |
| 44 | 15 | నాగకేశరములు | నాగకేసరములు |
| 44 | 24 | చ్ఛ్రుఘ | చ్ఛ్రుఘ |
| 45 | 21 | ప్రస్థం | ప్రిస్థం |
| 46 | 4 | కల్కము | కల్కమును, |
| 48 | 22 | ప్రిస్థం | ప్రిస్థం |
| 49 | 16 | నిష్కాథ్వచ | నిష్కాథ్యవ |
| 49 | 16 | తధా | తథా |
| 50 | 8 | ముక్తాక్వాధా | ముక్తాక్వాథా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 50 | 25 | క్షీరకాకోళీ | క్షీరకాకోళి |
| 51 | 19 | శరపుంభా | శరపుంఖా |
| 52 | 10 | పృధక్ | పృథక్ |
| 55 | 3 | కులర్థతః | కులత్థతః |
| 55 | 10 | దనివేరు | దంతివేరు |
| 55 | 17 | సమభాగములును | సమభాగములుగను |
| 56 | 4 | మధ్యో | మథ్యో |
| 56 | 4 | వృద్ధ్యాదరా | వృద్ధ్యాదరా |
| 63 | 4 | ఇది | ఇవి |
| 63 | 28 | స్తధా | స్తథా |
| 65 | 10 | వచేందులేభా | వచేందులేఖా |
| 65 | 13 | వాజ్మేధా | వాజ్మేధా |
| 65 | 14 | శంఖపుష్పి | శంఖపుష్పి |
| 66 | 4 | (మంకెనవేరు) రవిర్వల్లి | రవిర్వల్లి (మంకెనవేరు) |
| 66 | 16 | వాజ్మేధా | వాజ్మేధా |
| 69 | 16 | తధార్ది తే | తథార్ది తే |
| 69 | 27 | (ఖూన్ కారాట్) | (ఖూన్ ఖారాబ్) |
| 70 | 14 | అర్థితవాత | అర్దితవాత |
| 70 | 26 | వావిలాకులు | వావిలి ఆకులు |
| 70 | 32 | రవిః | హవిః |
| 71 | 8 | అనగా | — |
| 72 | 6 | అనునవీనిలో | అనువానిలో |
| 77 | 17 | క్వధితే | క్వథితే |
| 78 | 6 | కల్కము | కల్కము, |
| 80 | 24 | చేయవలయును. జేయవలయును. | జేయవలయును. |
| 81 | 31 | దాహమేదస్సులను | దాహములను |
| 82 | 13 | తత | తద |
| 83 | 3 | వృంద | బృంద |
| 84 | 9 | పుష్ట్యర్ధినామ్ | పుష్ట్యర్థినామ్ |
| 86 | 3 | వల్య | వల్ల్య |
| 86 | 3 | గధ | గద |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 86 | 12 | (సీమ, అవిసి) పెద్ద తంగేడు | పెద్ద తంగేడు (సీమ అవిసి) |
| 86 | 13 | (జిల్లేడు వేరు) దినేశవల్లి | జిల్లేడు వేరు (దినేశవల్లి) |
| 86 | 19 | కుష్టు | కుష్ఠ |
| 88 | 25 | సక్షిర | సక్షీరే |
| 91 | 10 | చాన్యాసి | చాన్యాపి |
| 91 | 15 | కుష్టు | కుష్ఠ |
| 91 | 19 | భీరతశ్చ | భీరుతశ్చ |
| 92 | 4 | వాతరోగములను | వాతరోగములును |
| 92 | 21 | నువ్వులనూనె, | నువ్వులనూనె |
| 92 | 26 | వర్ల్యాచ | వల్ల్యాచ |
| 94 | 2 | తదర్ధ | తదర్థ |
| 94 | 11 | పొములం | పలములం |
| 94 | 14 | చతుర్ధాంశ | చతుర్థాంశ |
| 94 | 18 | త్రిఫలము | త్రిఫలములు |
| 94 | 26 | మృగనాభిమా | మృగనాభిందూ |
| 95 | 7 | ముద | ముద్ద |
| 95 | 28 | చందతం | చందనం |
| 96 | 16 | విశేషణ | విశేషేణ |
| 98 | 11 | ఘ్యుతిం | చ్యుతిం |
| 99 | 16 | పైవానిలో | వీనిని పైవానిలో |
| 99 | 28 | చేర్పి | చేర్చి |
| 100 | 26 | శ్వద్థ | శ్వత్థ |
| 100 | 29 | యష్ఠి | యష్టి |
| 101 | 7 | కాలేయ | కాలీయ |
| 101 | 15 | నాలుగు | ఐదు |
| 101 | 20 | ఫిక్కచెక్క | పిక్కచెక్క |
| 101 | 20 | మోదుగ | మోదుగు |
| 105 | 10 | మోదుగ | మోదుగు |
| 106 | 10 | ంపెంగ | సంపెంగ |
| 107 | 9 | భార్గీ | భార్ఙ్గీ |
| 107 | 11 | పృష్టిపర్ని | పృష్ణిపర్ని |
| 108 | 12 | కాకోళీ | కాకోళి |
| 109 | 4 | అమ్రబీజం | ఆమ్రబీజం |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 113 | 19 | సర్వేభోర్ధ | సర్వేభోర్ధ |
| 117 | 25 | చూర్ణము | చూర్ణమును |
| 121 | 1 | — — | కచూరాదిచూర్ణము |
| ,, | 3 | వట్టువేరు | వట్టివేరు |
| ,, | 3 | యీనలు | యీనెలు |
| ,, | 33 | తోనెతో | తేనెతో |
| 125 | 1 | శుద్ద | శుద్ధ |
| ,, | 16 | రసేనుభావితం | రసేనభావితం |
| ,, | 27 | కప్పలం | కట్ఫలం |
| 126 | 10 | ఇది | ఇవి |
| 128 | 23 | వీనికి | దీనికి |
| 129 | 1 | కారయేద్బుదః | కారయేద్బుధః |
| 130 | 16 | అజామోద, ఓమ | అజామోదఓమ |
| 130 | 28 | బిభీతకా | విభీతకా |
| 132 | 16 | ప్రాతరుద్ధితః | ప్రాతరుత్థితః |
| 134 | 22 | తుమ్మిపువ్వు | తుమ్మిపువ్వులు |
| 136 | 6 | శుద్దమహిసాక్షి,గుగ్గులు | శుద్ధమహిసాక్షిగుగ్గులు |
| 137 | 12 | చెఱకు | చెఱకు |
| 137 | 22 | (పాలగుండ) | పాలగుండ |
| 137 | 28 | సిద్దము | సిద్ధము |
| 138 | 12 | అనునవి ఇవి | అనునవి |
| 138 | 14 | మిగులునట్లు | మిగులునట్లుగ |
| 138 | 25 | స్వర్ద భస్మ | స్వర్ణ భస్మ |
| 142 | 2 | (పల్లేరు) | పల్లేరు |
| 143 | 1 | పలార్థం | పలార్ధం |
| 145 | 12 | శుద్దిచేసిన | శుద్ధిచేసిన |
| 145 | 16 | శ్లోధ | శ్లోథ |
| 147 | 11 | జిలాజిత్తు | శిలాజిత్తు |
| 147 | 22 | అర్ద | అర్ధ |
| 147 | 34 | శ్చర్ది | శ్ఛర్ది |
| 148 | 1 | పలములును | పలములను |
| 149 | 22 | బలానుసారమును-చిత | బలానుసారము-చిత |
| 149 | 9 | రుద్రాయ | రుత్థాయ |
| 150 | 4 | యీ ఇత్తురాది | నీ యిత్తురాది |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 150 | 7 | ప్రిత్యగ్ని | ప్రత్యగ్ని |
| 150 | 15 | విన్వ స్య | విన్యస్య |
| ,, | 16 | ర్బుధ | ర్బుధ |
| ,, | 29 | చల్లారిన | చల్లారినపిదప |
| 152 | 4 | కూలక | కులక |
| ,, | 9 | చాత్మ్రీయుగ్మాని | చాత్మయుగ్మాని |
| 154 | 13 | కర్షార్థం | కర్షార్ధం |
| 154 | 22 | నిరస్యత్వలమ్ | నిరస్యత్యలమ్ |
| 155 | 1 | షడాభిన త్తి | షడాచ్ఛిన త్తి |
| 155 | 17 | రసముతో | రసముతో శుక్రవృద్ధియును, |
| 155 | 25 | ప్రీతిఫలనిచ్చును | ప్రీతిఫలం కలంగును. |
| 156 | 12 | కషాయమును | కషాయము |
| ,, | 13 | భాగము | భాగముగ |
| 157 | 4 | ప్రాక్తౌ | ప్రోక్తౌ |
| ,, | 5 | షద్భిస్తు | షడ్భిస్తు |
| ,, | 7 | కధిత | కథిత |
| 163 | 25 | నిప్పులో | స్నేహమును నిప్పులో |
| 164 | 11 | ఘృతము | ఘృతమును |
| 165 | 7 | మజ్జిగ, | మజ్జిగ |
| 165 | 22 | లేదో | లేపో |
| 166 | 8 | ద్రవ్యములను | ద్రివ్యములం |
| 167 | 2 | తదర్థం | తదర్ధం |
| 167 | 29 | తీగపాకము | తీగెపాకము |
| 169 | 13 | వటక | |
| ,, | 13 | గుటుకలను | గుటికలను |
| ,, | 19 | వటుకముల | వటకముల |
| 169 | 25 | క్వాధాదీనాం | క్వాథాదీనాం |
| 170 | 3 | కషాయమందు | కషాయమందు చూర్ణమునకు |
| 171 | 7 | చెప్పునప్పుడు | చెప్పునప్పుడు |
| ,, | 8 | కర్ధభాగము | కర్షభాగము |
| ,, | 14 | పొర | పొరలను |
| ,, | 17 | (రక్తపుష్ప) | రక్తపుష్ప |
| ,, | 27 | లాభురేవచ | లాబురేవచ |
| 172 | 17 | కఫానితా | కఫానిలా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 173 | 15 | సైథవేనచ | సైంధవేనచ |
| 177 | 24 | లవణము | లవణమును |
| 179 | 16 | స్నిగ్వ్యేషేథవా | స్నిగ్నిషేథవా |
| 181 | 9 | సమ్మర్థ్య | సమ్మర్ద్య |
| 182 | 26 | గుష్ఠ | కుష్ఠ |
| 183 | 1 | త్రిమృతా | త్రివృతా |
| 183 | 23 | వాకుడు, | వాకుడు |
| 184 | 5 | నీళ్లును | నీళ్లలో |
| 184 | 31 | ప్రేంకణ | ప్రేంకణము |
| 184 | 12 | చిల్లగింజలను నూరి శంఖములను వేసి జేర్చవలయును. | చిల్లగింజలను నూరివేసి తేర్చవలయును. |
| 185 | 3 | కుత్యాత్తీష్ణం | కుర్యాత్తీక్ష్ణం |
| 187 | 7 | తధా | తథా |
| 187 | 10 | జాతీ | జాత |
| 189 | 18 | అచ్వాజీం | అజాజీం |
| 189 | 19 | వినిషిపేత్ | వినిక్షిపేత్ |
| 189 | 20 | మతో | తతో |
| 189 | 23 | శ్లోధా | శ్లోథా |
| 191 | 4 | తధా | తథా |
| 191 | 5 | గ్రింథి | గ్రంధి |
| ,, | 15 | గ్రింధులు | గ్రింధులు |
| 195 | 1 | వారయో' | వారయే |
| 195 | 26 | ఆయుః | ఆయువు |
| 196 | 3 | మఱియు | మఱియు వారి |
| 196 | 17 | సుపధ్యాశీ | సుపథ్యాశీ |
| 198 | 15 | మాషికార్ధ | మాక్షికార్ధ |
| | 16 | షిప్వా | క్షిప్త్వా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 202 | 2 | కపిద్ధ | కపిత్థ |
| 202 | 18 | నగు | అగు |
| 203 | 12 | గాిహ్యాస్తే | గ్రాహ్యాస్తే |
| 203 | 15 | పృధ | పృథ |
| 208 | 28 | తత్రోద్ధితః | తత్రోత్థితః |
| 209 | 15 | తావంత్యహో | తావంత్యహం |
| 209 | 24 | నిష్ఠామలతోను | నిష్ఠాదులతో |
| 211 | 24 | సుఖోష్ణమైన | సుఖోష్ణమై |
| 211 | 25 | శిరోరోగము | శిరోరోగమును |

సూచన :— ఇంకను యిందు ద, ధ, న, వ, ప, స, ర, ఆ, ఈ మొదలగు అక్షరవ్యత్యయములున్నచో సరిదిద్దుకొని పఠింప ప్రార్థితులు.

గ్రంథకర్తలు.